# మార్పు

**(2వ కూర్పు, 2022)**

## ఉపోద్ఘాతం

ఈ నవల దేన్నిగురించి అంటే మార్పుగురించే ... మన భాషలో, విలువల్లో, ఆశల్లో, ఆశయాల్లో, సమాజంలో వచ్చిన మార్పు ఏమిటి, ఎలా వచ్చింది, ఎలా వస్తుంది, ఎందుకు వస్తుంది అన్న ప్రశ్నకి సమాధానం వెతుక్కుంటూ మొదలు పెట్టేను ఈ నవల.

సాధారణంగా ఏ నవల అయినా స్థూలంగా సంఘంలో పెనుమార్పులు గానీ ఒక వ్యక్తి జీవితచరిత్ర ఆధారంగా గానీ రాయడం జరుగుతుంది. ఈనవలలో ప్రధానాంశం మాత్రం ఒక వ్యక్తో ఒక సంఘటనో కాదు. మొత్తం మన భావజాలంలో వచ్చిన మార్పులే ప్రధానాంశం. మూడు తరాలు - నాతరం, నాపెనకటి తరం, ఇప్పటి తరం (కథలో పెద్దక్క, లీల, అరవింద స్త్రీపాత్రలు, ప్రభాస్రావు, సుందరం, విషి పురుషపాత్రలు) తీసుకుని చూస్తే క్రమంగా మనం ఎక్కడినుంచి ఎక్కడికి వచ్చేం, ఎలా వచ్చేం అన్నవిషయంలో కొంత అవగాహన కలగడానికి అవకాశం ఉంటుందన్న ఆలోచనతో మొదలుపెట్టేను.

ఇందులో మరోకోణం భిన్న సంస్కృతులు. పెద్దక్క ఇండియాలో పుట్టి పెరిగిన పెద్దావిడ. లీల ఇండియాలో పుట్టి పెరిగినా ఆధునిక విద్య, సంప్రదాయాలతో పరిచయం కలిగి, వివిధ కోణాలు పరిశీలించడమే ఆశయమైన యువతి. అరవింద అమెరికాలో పుట్టి పెరిగినా, తెలుగు సంస్కృతి సంప్రదాయాలలో ఆసక్తీ, అమెరికన్ సంప్రదాయాల అవగాహనా కలిగిన పడుచుపిల్ల. అలాగే ప్రభాస్రావు అమెరికా వచ్చినా ఆయన పుట్టి పెరిగిన భావాలే రక్తంలో ఇంకిపోయినవారు, సుందరం వెనకటి అభిప్రాయాలు, అమెరికాలో అవుసరమైన వ్యక్తివిజయం తాలూకు ఛాయలూ మేళవించి బ్రతకనేర్చిన తెలుగువాడు. అమెరికాలో పుట్టిపెరుగుతున్న విషి తండ్రి భావాలమూలంగా చిక్కుల్లో ఇరుక్కున్న ఇండియన్ అమెరికన్.

ఈ నవలలో పాఠకులని పట్టి ఊపేసే సంఘర్షణలూ, దౌష్ట్యాలూ లేవు. సందేశాలూ లేవు. వ్యంగ్యం, హాస్యం సందర్భాన్నిబట్టి నామమాత్రంగా ఉండొచ్చు. కేవలం భిన్నకాలాలలో భిన్న సంస్కృతులలో ఆలోచనాసరళి చిత్రించడానికి చేసిన ప్రయత్నం ఇది. ఇందులో వ్యక్తులు కేవలం

అభిప్రాయాలకి వాహికలు. ప్రాధాన్యం భావాలకే కానీ పాత్రలకి లేదు. అంచేత అసాధారణనవల అని కూడా అనొచ్చు.

నేను ఇండియానుంచి అమెరికా రాగానే సంస్కృతి సంప్రదాయాలవిషయంలో పెద్ద షాకే తిన్నాను. మళ్లీ విస్కాన్సిన్ నించి డలస్ వచ్చినప్పుడు కూడా దాదాపు అంత షాకు తగిలింది సంస్కృతి సంప్రదాయాలతోపాటు వాతావరణం కూడా గల వ్యత్యాసాలు నాకు ఆశ్చర్యం కలిగించేయి. ఈనేపథ్యంలో రూపు దిద్దుకున్న నవల ఇది.

నేను విస్కాన్సిన్ నుండి మారాలని నిర్ణయించుకున్నాక, ఎందుకు మారడం, అసలు ఎవరైనా ఎందుకు మారతారు, మారకపోతే ఏం, మారితే ఎందుకు మారేరు, మారకపోతే ఎందుకు మారరు, నిజంగా మార్పు కోరే మార్తారా, ఎలాటి మార్పు కోరి మార్తారు ... ఇలా అనేక ప్రశ్నలు తలెత్తేయి. అంచేత మార్పు అన్న పదం ఎన్నిరకాలుగా దర్శనమిస్తుందో సూచనప్రాయంగానైనా చిత్రించడానికి ప్రయత్నించేను. ఉన్నఊరినించి కట్టుకున్నబట్టలవరకూ, తెల్లారి లేచినదగ్గర్నుంచీ పొద్దు పోయేవరకూ ఎన్నో మార్పులు చూస్తాం. అంతే కాదు. మనుషులు మారడం, మనిషి నిజంగా మారడని గాఢంగా విశ్వసించడం కూడా మార్పుతాలూకు మరొక రూపమే.

నేను చూసిన లోకం, ఆ లోకంలో మనుషులు ఆధారంగా ఈ కథ నడుస్తుంది. ఎప్పుడు ఏ కథైనా మనకి తెలిసినప్రపంచంలోంచే పుడుతుంది కనక (పుంఖానుపుంఖాలుగా బుక్కులు చప్పరించేసి తిరిగి ఒప్పగించేసేవారిని తప్పిస్తే), నాకు తెలిసినమనుషులూ, నేను చూసినలోకమే ఇక్కడ మీకు తారసిల్లుతుంది. అయితే ఏ ఒక్కపాత్రా ఏ ఒక్కరూ కాదు. అంతర్గతంగా ఉన్న ఒక మానవనైజాన్ని నాలుగుచోట్ల చూడ్డం తటస్థించినప్పుడు దాన్ని ఒకపాత్రలో ఆవిష్కరించడానికి ప్రయత్నించేను.

ఈకథ ప్రారంభం నేను ఊరు మారడంతో మొదలయినా ఇందులో "నేను" ఒక పాత్రగానే ఆవిష్కరించేను. అది స్పష్టం చేయడానికి మొదటి "నేను" కి మాలిక అని పేరు పెట్టేను.

ఇక అసలు కథలో వద్దాం.

000

# మార్పు

నేను విస్కాన్సిన్ నించి డలెస్ వచ్చి నాలుగు నెలలయింది. డలెస్ వచ్చేక తొలి షాకు మంచు.

ఇక్కడ కుప్పలుతిప్పలుగా మంచూ, ఎముకలు కొరికేసే చలీ ఉండవనీ, విస్కాన్సిన్ కి పూర్తి వ్యతిరేకం అని విన్నాను ఇక్కడికి రాకముందు. ఆ అభిప్రాయాన్ని వమ్ము చేస్తూ మంచు కురిసింది. ఇదేదో నాకోసమే పడిందేమో మరి.

నాలుగురోజులుగా బులబులాగ్గా బూది చల్లినట్టు మంచు కురుస్తోంది.

నాస్నేహితురాలు సుధ ఫోనులో పిలిచి సౌజన్యఇంట్లో పార్టీ వాయిదా పడిందని చెప్పింది. రెండు వారాలక్రితం తన స్నేహితురాలు సౌజన్యఇంట్లో పార్టీకి వెళ్దాం రమ్మని చెప్పింది. అదన్నమాట ఇప్పుడు చెప్తున్నది.

“నువ్వే మీ విస్కాన్సిన్ మంచు తీసుకొచ్చేవు మాప్రాణాలమీదకి,” అంటూ నన్నే దెప్పేరు సన్నిహితులు, తదితర సారసాక్షులూను.

నిజం చెప్పొద్దూ నాకు మంచు కురిసిన తొలిరోజు చాలా హుషారుగానే ఉండింది కానీ గత మూడురోజులనించీ నరకం మొదలయింది. నాలుగ్గోడలమధ్యా కూర్చుని పరమ నిదానంగా నత్తగుల్లల్లా ఈడుస్తూనో ఏడుస్తూనో పోతున్న కార్లని చూస్తుంటే చిరాకేస్తోంది. మీకు తెలీదు గానీ నేను అడుగెత్తు మంచులోనూ మోకాల్లోతు నీళ్ళలోనూ కూడా బండి నడిపిన మహావీరచక్రని. అలాటిది ఇప్పుడు బయట అడుగుపెట్టడానికే వెరపు. ఎందుకంటే నాకు లేని భయాలు నా నేస్తులూ ఇతర చాదస్తులూ నూరి పోసేసేరు నామనసులో చిక్కగా కూరుకుపోయి జీడిమరకలా స్థిరం  అయిపోయేవరకూ.

నాదసలే తిరిగే కాలు. తిట్టేనోరు లేదు కానీ చెయ్యి మాత్రం కొంతవరకూ చేసే చెయ్యే. ఇలా 14 అడుగుల చదరపుగదిలో అదే సోఫాలో అదే దృశ్యం చూస్తూ గంటలతరబడీ రోజులతరబడీ కూర్చోడం నాతరం కాదు. అక్కడికీ పోనీ భారీ ఎత్తున వంటలు చేసేద్దాం, ఆ కూరలు తరుక్కోడాలూ, గిన్నెలు కడుక్కోడాలూ కొంత కాలక్షేపం అనుకుంటే అదీ కుదరడంలేదు.

ఈడుళ్ళో మన దేశవాళీ కూరలు గోరుచిక్కుడుకాయలూ, పొట్లకాయలూ, బీరకాయలూ, దొండకాయలూ ఎంచక్కా తాజా తాజాగా దొరుకుతుంటే మంచుపాతర వేసిన మరియు గడ్డ కట్టిన కూరముక్కలు కొనుక్కోడమేమిటని అవి కొనడం మానేశాను ఇక్కడికొచ్చేక. కానీ సరిగ్గా

మంచు ముమ్మరంగా కురిసినరోజులలోనే ఇంట్లో కూరలకి కరువొచ్చింది. కూరలు నిండుకున్నప్పుడే మంచు కురియును అనిపిస్తోంది - వాన పడ్డప్పుడే గొడుగు పట్టుకెళ్ళడం మరిచిపోయినట్టు. బట్టలుతుక్కుందాం అంటే, "ఎనెర్జీ పొదుపుగా వాడండి. వాషరు వాడకండి. హెయిర్ డ్రయరు వాడకండి, ఎలెక్ట్రిసిటీతో వాడేవన్నీ ఆపేయండి" అంటూ ఎనర్జీశాఖవారి తాఖీదులు!

చుట్టూ చూశాను - నేను వాడే వస్తువులు - స్టౌ, మైక్రోవేవ్, ఫ్రిజ్, టీవీ, కంప్యూటరు, - నాబతుకుంతా వీటిచుట్టూనే తిరుగుతూ ఉంటుంది ముప్పొద్దులా. ఇవి లేకపోతే బతుకే లేదు. కారుంది కానీ అది కూడా ప్రస్తుతపరిస్థితుల్లో నిరుపయోగమే కదా.

నిజానికి విస్కాన్సిన్ మంచుతో పోలిస్తే ఇక్కడ పడ్డ మంచు టుప్పుటుప్పూ తొలకరి చినుకుల్లా చూపుకి గట్టిగా ఆనదు కూడానూ. అయినా ఈమంచుకే స్కూళ్ళు మూత పడిపోడాలూ, రోడ్లమీద కార్లు ఢీకొట్టుకోడాలూనూ ... నాకైతే నవ్వుగానే ఉంది.

లేదులెండి. ఇక్కడ పడ్డ రెండంగుళాల మంచూ గడ్డ కట్టుకుపోయి ice rink లా ఉంది నిజానికి. టీవీలో figure skating చూసినప్పుడల్లా అనుకుంటాను నేను కూడా skating నేర్చుకోవాలని. ఆ వెంటనే మంచులో పడి చెయ్యి విరగ్గొట్టుకున్న దుర్దినం కూడా గుర్తుకొస్తుంది.

కిటికీలోంచి గడ్డకట్టుకుపోయిన మంచు చూస్తూ మరోసారి అనుకున్నాను ఎంచక్కా నేను ice skating చెయ్యగలిగితే, Michelle Kwan లా triple axle, double toe గంతులేసుకుంటూ వెళ్ళి నాలుగు కూరలు తెచ్చుకునేసేదాన్ని కదా.

మొత్తంమీద ఇలా నాలో నేను చాలా విచారణలు చేసుకుని, మరియు గుండె దిటవు చేసుకుని, వెన్ను చరుచుకుని, "ఒస్, ఏమవుతుంది, మహా అయితే పడి మరోసారి కాలో చెయ్యో విరగ్గొట్టుకుంటాను. స్నేహితురాలింట్లో కాలుమీద విరిగిన కాలేసుకుని దర్జాగా జరుపుకోవచ్చు," అని సుళువులు చెప్పుకుని బయల్దేరేను.

టైము పదిన్నర. ఉద్యోగాలున్నవాళ్లు ఆఫీసుల్లోనూ, బజార్లు తిరిగేవారు మాలుల్లోనూ స్థిరపడిపోయి ఉంటారు ఈపాటికి. రోడ్లమీద కార్లు అతి తక్కువ ఉండే సమయం. నెమ్మదిగా కారు తీసి వీధిన పడ్డాను.

మామూలుగా ముప్పావుగంటలో ముగిసే బజారు ఇవాళ రెండు గంటల యాభై నిముషాలు పట్టింది. ఇంత చలిలోనూ చిరుచెమటలు కూడా పట్టేయి. మొత్తంమీద మంచులో కారు నడిపి

నా పూర్వ వైభవం జ్ఞప్తికెలయించుకున్నాను. అహో, ఒహో నాకింకా పూర్వవాసనలు పోలేదు. ఆ వైభవం ఇప్పుడు కూడా ఉంది. ఇది మాత్రం మారలేదని ఆనందించేను.

అయితే ఇక్కడ కూడా మామూలుగా మన బతుకుల్లో సర్వసాధారణమయిన పరిహాసం లేకపోలేదు. కూరలు తెచ్చుకుని రెండు రోజులు కూడా లేదు టెక్సస్ వాతావరణం మళ్ళీ వచ్చేసింది! అంటే మంచుపాతరేసుకున్న కూరల అవుసరం లేదు. ఈ బూడిదలాటి మంచువల్ల నా ఆలోచన మార్చుకుని ఆ చల్లటి కూరగడ్డలు ఎందుకు కొన్నానా అని విచారించేను కొంచెంసేపు!

000

మంచు కురువడం, పడ్డ మంచు కరిగిపోవడం అయేక, సౌజన్యఇంట్లో పార్టీకి వెళ్ళేను సుధతో. డలస్ లో మొదటి పార్టీ చూడడం సంభవించింది. మామూలుగా నేను పార్టీలమనిషిని కాను కానీ సుధ పట్టు పట్టడంతో వెళ్లక తప్పలేదు.

మేం వెళ్ళేసరికి ఓ పదిమంది ఉన్నారు. సుధ చనువుగా లోపలికి వెళ్ళి అందర్నీ పలకరించేస్తూ హడావుడిగా తిరిగేస్తోంది గలగలా. నేను సందేహిస్తూ ఓమూల నిల్చుని నాటకం చూసినట్టు చూస్తున్నాను.

ఇంతలో ఒకావిడ నావేపు వస్తూ కనిపించింది. ఎక్కడో చూసినట్టుందే, ఎక్కడ చూసేను చెప్మా అనుకుంటూ కళ్ళు చిట్లించి చూస్తున్నాను.

ఆవిడ తిన్నగా వచ్చి చిన్నగా నవ్వుతూ నాకు ఎదురుగా గజందూరంలో నిలబడింది.

చూస్తూ నిలబడిపోయేను రెప్పపాటుకాలం నేను.

“గుర్తు పట్టలేదు,” అందావిడ కొంటెతనం కళ్ళలో మెరుస్తుంటే.

“సిరి” అన్నాను నెమ్మదిగా, నన్ను నేను నమ్మించుకోడానికి ప్రయత్నిస్తున్నట్టు.

శ్రీదేవి దగ్గరగా వచ్చి నాచెయ్యి తనచేతిలోకి తీసుకుని, “నువ్వు మాత్రం ఏం మారలేదు” అంది.

“మారలేదా? ఏమో. మారని రూపాయిని. పదేళ్ళయిందేమో కదూ,” అన్నాను.

“ఇంకా ఎక్కువే అయుంటుంది. మేం షికాగో వదిలేసింతరవాత ఓ ఆర్నెల్లు కొంతకాలం ఫోనులో మాటాడుకున్నాం. తరవాత అంతే సంగతులు అయిపోయింది.”

అవునన్నట్టు తలూపేను. సిరి షికాగోలో ఉన్నంతకాలం తరుచూ కలుసుకునేవాళ్ళం. మొదటి పరిచయం తనే అయినా ఆవిడతో కన్నా నాకు వాళ్ళాయన ప్రభంజనంగారితోనే ఎక్కువ కాలక్షేపం అయేది. ఆయన ఆపకుండా ఆరుగంటలు మాటాడగలరు ఏవిషయంమీదైనా సరే. సిరేమో నాలుగుమాటల్లో ముగించేసేది ఎంత క్లిష్టమైన ప్రశ్నయినా.

"ఇంతకీ నువ్వు మాడిసన్లోనే ఉన్నావా?"

నేను చుట్టూ చూసి, "మాడిసన్లోనా? ఇది టెక్సస్ అనుకుంటున్నానే," అన్నాను వెక్కిరిస్తూ.

"హా హా. ఏమో, చుట్టపుచూపుగానో, నన్ను చూడ్డానికో వచ్చేవేమో అనుకున్నా."

"అదేమిటి?" ఓ చిన్న అమ్మాయి నా ఎదురుగా నిల్చుని నాచేతిలో ఉన్న చిన్న పొట్లం చూస్తూ అడిగింది. తొమ్మిదేళ్ళుంటాయేమో. చురుకైన కళ్ళు, గుండ్రని మొహం, పాలబుగ్గలూ ముద్దొస్తోంది.

"ఇదా? ఇది రహస్యం," అన్నాను నవ్వుతూ.

ఆ అమ్మాయి నాకు ఇంకా దగ్గరికొచ్చి, "నేను ఎవరికీ చెప్పనులే," అంది.

"నీపేరేమిటి?"

"అపూ. అదేంటో చెప్పు."

మరోపక్కనించి ఓ కంఠం వినిపించి అటు తిరిగేను. "అమెరికా అంతరించే సమయం ఆసన్నమయింది. చరిత్రలో ఏ సామ్రాజ్యం మాత్రం శాశ్వతంగా ఉండిపోయింది కనక?" నాలుగు కాలాలు చూసిన పెద్దాయన చారిత్ర్యక సత్యాలని వల్లిస్తున్నారు.

ఈమధ్యనే పట్టం పుచ్చుకున్న యువకుడు అమెరికా ప్రపంచంలో మేధావులందరికీ ఇదే ప్రస్థానం అనీ వాదిస్తున్నాడు.

ఇంకో మూలనించి -

"Bisquick అదీ వాడనండీ నేను. మైదాపిండీ, స్వయంగా ఇంట్లో తోడు పెట్టిన పెరుగుతో చేసేను," అన్నారు గులాబ్ జాం తీసుకొచ్చినావిడ.

బొప్పాయికాయ కూర ఎలా చెయ్యడమని అడుగుతోంది అమెరికాకి కొత్తగా కాపురానికొచ్చిన ఒక కొత్తపెళ్ళికూతురు పక్కనున్నావిడని.

టీవీలో ఏదో తెలుగు సినిమా గోలగోలగా. నాకు ఒక్క ముక్క కూడా అర్థం కాలేదు. అసలది ఎవరూ చూస్తున్నట్టు కనిపించలేదు. ఎందుకు ఎవరు ఎవరికోసం పెట్టేరో కూడా నాకర్థం కాలేదు. అదో లాంఛనం కాబోలు.

“అయితే నువ్వు ఇండియా వెళ్ళే ఆలోచనలేమైనా ఉన్నాయా?” శ్రీదేవి అడిగింది.

“లేదు. ఈమధ్యనే వెళ్ళొచ్చేను. ఆర్నెల్లయింది. మళ్ళీ రెండేళ్ళవరకూ ఆమాటెత్తను,” అన్నాను.

“తెలంగాణా ఇచ్చేయక తప్పదు. బందులూ, ధర్నాలూ దేశం అట్టుడికినట్టు ఉడికిపోతోంది,” అన్నారు నాయుడుగారు.

ఎవరూ జవాబు చెప్పలేదు. అమెరికాలో ఆర్థికసంక్షోభంగురించి మళ్ళీ అందుకున్నాడు ఇందాకటి అబ్బాయే. తెలంగాణాసమస్య కంటే అమెరికా పరిస్థితులే ఎక్కువ ముఖ్యం మరి అతడికి.

“ఆదివారం టెంటక్స్ సభకి వస్తావా?”

“ఎవరు మాటాడుతున్నారు?”

“ఎవరో రాగరాజు గంతాకులట.”

“ఏం మాటాడతారేమిటి?”

“ఈమధ్యే వచ్చిన పుస్తకంమీదట.”

“దానికో సభా? మనమే ఆ పుస్తకమేదో చదివేస్తే పోదా?”

“లీలగారేరీ, రాలేదా ఇంకా?

“అదుగో, మాటల్లోనే వచ్చేరు నూరేళ్ళాయుష్షు.”

“ఏమండీ లీలా పొన్నాగారూ, అసలీమధ్య ఎక్కడా కనిపించడంలేదు? బొత్తిగా నల్లపూసయిపోయారు.”

“నల్లపూసేంటండీ, నల్లపూసా, కారప్పూసా? మీరు మరీనూ … ఇంతటి మహా కాయం నూటతొంభైఎనిమిది పౌన్లు కనిపించడంలేదా మీకు? నిన్ననే సందార్ గారు ice cream maker తెచ్చేరు. ఆ రెండు పౌనులూ కూడా పడితే, రెండూ, రెండు సున్నాలు అని ఎంచక్కా చెప్పకోవచ్చు తేలిగ్గా ఉంటుందంటూ.”

స్థానికులభాషలో సుందార్ అయిన సుందరం ఆవిడకి రెండడుగులు వెనక వస్తూ అందుకున్నారు, "ఏం చెయ్యనండీ? నాకెలాగా తినే యోగం లేదు. తినేవారిని చూసైనా ఆనందిద్దామని," అన్నారు.

"చెప్పేనా కిందటివారం మంచం కొన్నాం అని. మన తాతలనాటి పందిరిమంచంలా రెండడుగుల ఎత్తుంది. నిన్న మంచం దిగబోతూ కింద పడిపోయేను. అయ్యో పడిపోయింది అని చెయ్యందియ్యడం పోయి ఒకటే నవ్వు ఈ మహరాజు."

"నువ్వంటే దిట్టంగా గుమ్మడిపండులా ఉన్నావు. కింద పడ్డా నీకేం కాదు. నేను చెయ్యందించి నిన్ను లేవనెత్తబోయి నేనే పడ్డానంటే పులుసులోకి ఎముక లేకుండా చితికిపోయేవాణ్ణి కాదూ?"

"యం.పి.సి" అంటూ గొణిగింది నాపక్కనున్న పదహారేళ్ళమ్మాయి.

"ఆరోగ్యం, ఆరోగ్యం అంటూ మేకల్లా ఆ ఆకులూ అలములూ నమలకపోతే నాలా చక్కగా షడ్రుచులతో కమ్మగా కడుపునిండా తినకూడదా, నువ్వు కూడా నాలా కండ బట్టి నునుపు తేలేవాడివి."

ముగ్గురు మొహాలు ఇబ్బందిగా పెట్టేరు. మరో ఇద్దరు లేచి పక్కగదిలోకి వెళ్ళిపోయేరు. ఒక్క నాకు మాత్రమే అనుకుంటా అదేమంత ఎబ్బెట్టుగా అనిపించలేదు. నాతరంలో మొగుడూ పెళ్ళాలు ఒకరినొకరు ఇలా ఎత్తిపొడుచుకోడాలూ, వేళాకోళాలాడుకోడాలూ మామూలే. అప్పట్లో మేం దాన్ని హాస్యంకిందే తీసుకుని నవ్వేసి ఊరుకొనేవాళ్ళం. మాకు అదే sitcom, standup కామెడీ, హాస్య ప్రదర్శనా అన్నీ. ఈ హాస్యం మునిమాణిక్యం, పానుగంటి రచనల్లో చూడలేదూ? అదేమిటో మరి. ఎప్పుడు ఎలా మారిపోయిందో తెలీదు కానీ ఈ తరంవారికి ఇది అసభ్యత, అవమానం, నీచం కూడానేమో. మళ్లీ టీవీల్లోనూ క్లబ్బుల్లోనూ అలాటి వేళాకోళాలు చూసి విరగబడి నవ్వుతారు. అప్పుడే అభ్యంతరాలూ ఉండవు వీరికి.

"లీలగారూ, రండి. అప్పడాలు మీరే వేయించాలి. మీకోసం గంటసేపట్నుంచీ ఎదురు చూస్తున్నాను. నూనె కాగింది." అంటూ సౌజన్య వచ్చింది.

లీలగారు ఒక్క ఉదుటున లేచి, "అయ్యయ్యో, నూనె పొయ్యిమీద పెట్టేశావా? ఎన్ని అప్పడాలు, ఎంత నూనె, ఎంత టెంపరేచరు చూసుకోకుండా," అంటూ వంటింటివేపు నడిచారు హడావుడిగా.

ఆవిడ హుషారు చూస్తే చెప్పొద్దూ నాకు మహ సరదా వేసింది. ఆవిడ వెళ్ళినవేపే చూస్తూ, "అప్పడాలవేపుడుకి అంత ఆర్భాటం కావాలని నాకు తెలీదు," అన్నాను.

“మీకు తెలీదులెండి. వంటా వార్పూ పుస్తకం చూసి మూడు పేకట్ల అప్పడాలు రెండు గేలన్ల నూనే తగలేసి, ఆర్నెల్లు ప్రాక్టీసు చేసింది. దేశం నలుమూలలా ఎవరింట్లో అప్పడాలు వేయించాలన్నా ఆవిణ్ణే పిలుస్తారు,” అన్నారు సుందరంగారు.

“సరే. నాక్కూడా ఆవిడ నెంబరివ్వండి. ఎప్పుడవసరం వస్తుందో,” అన్నాను గంభీరంగా.

“మొన్నే కదా పట్టుకెళ్ళేవు అప్పుడే చదవడం అయిపోయిందా?”అన్న ప్రశ్న వినిపించింది వెనకనుంచి. గిరుక్కున అటు తిరిగి ఎవరా అని చూసేను.

నాకు నాలుగు కుర్చీలు ఎడంగా కూర్చున్న గోపాచార్యగారు ఓ పన్నెండేళ్ల అబ్బాయిచేతిలోంచి పుస్తకాలు అందుకుంటూ అడుగుతున్నారు. కఠోపనిషత్తు, మాండూక్యోపనిషత్తూ, శంకరభాష్యాలు. ఆ పుస్తకాలు ఆ అబ్బాయి చేతిలో ఇంతకుముందు చూశాను కానీ వాళ్ళమ్మో నాయనమ్మో చదువుతారు కాబోలనుకున్నాను కానీ అతనే చదువుతాడనుకోలేదు.

“చదివేనండి,” అన్నాడు ఆ అబ్బాయి తలొంచుకుని.

కాస్త ఎడంగా గోడవార కూర్చుని ఏదో ఆటలాడుకుంటున్న ఇద్దరు పిల్లల్లో పెద్దవాడు

“నాన్నా!” అంటూ కూత పట్టేడు. వాడిని చిన్నవాడు మోసం చేస్తున్నాడుట.

నేనేం చెయ్యలేదంటాడు చిన్నవాడు.

పిలుపందుకున్న నాన్న చిన్నవాడిదగ్గరికి వెళ్ళి, నలుగురు కూడినచోట అరచుట మర్యాద కాదనీ, అన్నదమ్ములు పోట్లాడుకోకూడదనీ, ఆటల్లో గెలుచుట ఒక్కటే ముఖ్యము కాదనీ - ఇలాటివే మరి కొన్ని సాంఘికమర్యాదలు పాఠం చెప్పి వచ్చేరు.

చిన్నవాడు కళ్ళు చిట్లించి కొంటెగా నవ్వుతూంటే, పెద్దవాడు మూతి ముడుచుకుని అమ్మపక్కన చేరేడు.

టైం మూడయింది. ఒకొక్కరే ఇళ్ళకి మళ్ళడానికి ఉద్యుక్తులవుతున్నారు. నేను సుధవేపు చూశాను పదమన్నట్టు.

“మాయిల్లు అట్టే దూరం లేదు. రాకూడదూ. మా పెద్దక్కని కూడా చూడొచ్చు” అంది సిరి నాతో.

“మీ పెద్దక్క ఇక్కడున్నారా?” అన్నాను సాలోచనగా.

“ఆర్నెల్లయింది వచ్చి. మాబావగారు పోయేక అక్కడ ఒక్కత్తీ అవస్థలు పడుతోందని తీసుకొచ్చేశాను. నాదగ్గరే ఉంటుంది. ఏం వస్తావా?”

నాకు ఇప్పటికే నీరసం వస్తోంది. నాలో కలుపుగోరుతనం గోరంత మాత్రమే.

“ఇవాళ కాదులే. మరోసారి వస్తాను. ఇప్పటికే ఇంతమందిని కలుసుకున్నాను కదా. వీళ్ళందర్నీ గుర్తు పెట్టుకోడానికి ఇంటికెళ్ళి నామెదడుతో గంటసేపు సాము చెయ్యాలి.”

“సరే. నీనెంబరియ్యి. ఫోను చేసి దారి చెప్తాను. మీఇంటినించి అరగంట కంటె పట్టదు.”

అలాగేనంటూ తలూపి చిన్న కాయితంమీద నెంబరు రాసిచ్చేను. ఓ రెండున్నరగంటల కాలంలో సగం ఊరు చూసినట్టనిపించింది నాకాపూట.

000

పది రోజులతరవాత సిరికి ఫోను చేసి, రావచ్చా అని అడిగి, రావచ్చు అనిపించుకుని, ఓ మధ్యాహ్నం వెళ్ళేను వాళ్ళింటికి.

ఆకబురూ ఈకబురూ చెప్పుకుంటున్నాం.

"పెద్దక్కేరీ?" అన్నాను చుట్టూ చూస్తూ.

"నాయుడుగారు తీసుకెళ్లేరు న్యూయార్కు చూపిస్తాం అని. శనివారం వస్తుంది."

ఆమాటా ఈమాటా ఓ అరగంట అయేక ఇద్దరం ఆగిపోయేం మరి మాట తోచక.

సిరి లోపలికెళ్ళి, టీ పెట్టి, టీతోపాటు నాలుగు చక్కిలాలు ఓ చిన్నపళ్లెంలో పెట్టుకు తీసుకొచ్చింది.

"అమ్మో చక్కిలాలే! నువ్వే చేసేవా?" అన్నాను. ఇక్కడ మాకు ఇవి అపురూపమే మరి.

ఇండియానుంచి ఎవరో తెచ్చి ఇచ్చేరుట. మళ్ళీ నిశ్శబ్దం చక్కిలాలచప్పుళ్ళు తప్ప.

హఠాత్తుగా ఏ నాందీ ప్రస్తావనా లేకుండా, “లోకంలో నీతీ న్యాయం - రెండూ సమాజశ్రేయస్సుకే అయినా రెంటికీ పొత్తు లేదెంచేతో,” అంది సిరి ఎటో చూస్తూ.

నేను ఉలిక్కి పడ్డాను.

“ఏం ఈ పూట న్యాయాన్యాయాలవేపు మళ్ళింది బండి,” అన్నాను తనని పరీక్షగా చూస్తూ.

టీవీలో కోర్ట్ టీవీ చూస్తోంది. అది నాక్కూడా ఇష్టం. బహుశా కనీసం టీవీలోనైనా న్యాయం జరుగుతోందన్న సాంత్వన కావచ్చు.

నిజానికి అన్ని కేసుల్లోనూ న్యాయమే జరగదు. ముఖ్యంగా పుష్టిగా కనిపించేవాళ్ళు ఏదో వంక చెప్పి, సర్టిఫికెట్టొకటి పుట్టించుకుని, సోషల్ సెక్యూరిటీ వసూలు చేసుకుంటున్నారు. వాళ్లని చూస్తే నాకు మహా మంటగా ఉంటుంది. వాళ్ళు నాడబ్బేదో దోచుకుంటున్నట్టు. ఒకవిధంగా ఆలోచిస్తే అది నిజమే కూడాను. నేను సోషల్ సెక్యూరిటీకి సమర్పించుకున్న డబ్బు వాళ్ళు వసూలు చేసుకుంటున్న సొమ్ములో ఉంది కదా.

"అది కాదు. మనకి చిన్నప్పటినించీ నూరిపోసేది ఏమిటీ? ధర్మపన్నాలే కదా. ఆ తరవాత కాస్త అక్షరపుముక్కలొచ్చేక భారతాలూ భగవతాలు చదువుతాం. అందులో సత్పురుషులు చేసే అధర్మాలన్నిటికీ ఏవో బీరకాయపీచు వివరణలు ఉంటాయి. ధర్మారాజు అశ్వత్థామ హతః కుంజరః అన్నా, హరిశ్చంద్రుడు ఇల్లాలిని అమ్మకానికి పెట్టినా, శ్రీరామచంద్రుడు సహధర్మచారిణిని అడవులపాలు చేసినా ధర్మసమ్మతమే. అటు చూడు," అంది టీవీవేపు చూపుతూ.

టీవీలో ఈ కోర్టు కేసులు నిజంగా జరిగినవి.

18 ఏళ్ళ అబ్బాయి తండ్రిమీద కేసు పెట్టేడు. ఆ తండ్రి తన క్రెడిట్ కార్డూ, సోషల్ సెక్యూరిటీ నెంబరూ వాడుకుని అప్పులు చేసేశాడనీ, తన్మూలంగా తన క్రెడిట్ హిస్టరీ చిక్కుల్లో పడిందనీ, ఆ అప్పులాళ్ళు తనవెంట బడుతున్నారనీ ఆ అబ్బాయి కేసు. ఆ అప్పులన్నీ కుటుంబంకోసమే చేసినందున తండ్రిగా తనబాధ్యత తాను నిర్వర్తించేనని తండ్రి వాదన.

జడ్జీగారు ఆ అబ్బాయిని అడుగుతున్నారు. "స్కూల్లో బాగా చదువుతున్నావా?"

"చదువుతున్నాను యువరానర్."

"ఏ గ్రేడ్స్ వస్తున్నాయి?"

"ఒక ఎ ఒక బీ వచ్చేయి. ఒక సి వచ్చింది."

తండ్రిని ప్రశ్నించేరు. "ఏం ఉద్యోగం చేస్తున్నావు?"

"ఇళ్లు కట్టడం."

"ఇప్పుడేం చెయ్యడంలేదండీ," అన్నాడు కొడుకు.

జడ్జీగారు అతన్ని మాటాడొద్దని సౌంజ్ఞ చేసేరు.

‘‘కట్టడంపనిలో ఇప్పుడున్నావా?”

“లేదు. దేశంలో ఆర్థికపరిస్థితులు బాగులేవు కదా. పని దొరకడంలేదు.”

“అంటే ఇప్పుడు పని చెయ్యడంలేదు అని.”

“పనికోసం చూస్తున్నాను.”

“నీకు పూట ఎలా గడుస్తోంది?”

"జరుపుకొస్తున్నాను.”

“అదే ఎలా అని అడుగుతున్నాను.”

“స్నేహితులు సాయం చేస్తున్నారు.”

అబ్బాయి మళ్ళీ అందుకున్నాడు, “నా క్రెడిట్ కార్డుమీద గర్ల్ ఫ్రెండుకి బట్టలు కొన్నాడు. ఇద్దరూ దేశం తిరుగుతున్నారు. కారు కొన్నాడు.”

“కారు కొన్నావా?”

“పని వెతుక్కోడానికి కావాలి.”

“అది కాదు నేనడిగేది. కారు కొన్నావా. జవాబు అవుననో కాదనో.”

“అవును.”

“కొనడానికి డబ్బెలా వచ్చింది?”

“క్రెడిట్ కార్డుమీద.”

“ఎవరి కార్డుమీద?”

“అబ్బాయికార్డు.”

“నీకార్డుమీద ఎందుకు కొనుక్కోలేదూ?”

“నాక్రెడిట్ దెబ్బ తింది. నేనిన్నాళ్ళూ ఆ అబ్బాయికి ఎంత ఖర్చు పెట్టేనో …”

“అది తండ్రిగా నీధర్మం.”

అబ్బాయికి అనుకూలంగా తీర్పు జరిగింది. ఇద్దరూ బయటికి వచ్చేరు. కోర్టు వరండాలో నిటారుగా నిలబడి, ఆ తండ్రి తానేమీ తప్పు చెయ్యలేదనీ, జడ్జీగారు సందర్భం సరిగ్గా అర్థం చేసుకోలేదనీ నొక్కి చెబుతున్నాడు.

సిరి నిట్టూర్చి అంది, "చూశావా. టొత్తిగా ఇరవైఏళ్ళయినా లేని కుర్రాడు. వాడికి ముందు ముందు ఇంకా ఎంతో జీవితం ఉంది. ఆఅబ్బాయి క్రెడిట్ హిస్టరీ ఇంకా మొదలయిందో లేదో అప్పుడే వాడితండ్రి దాన్ని బుగ్గి చేసేసేడు తన సరదాలకోసం. ఆ మనిషికి సిగ్గెలా వేయలేదో నాకర్థం కాదు. కొడుకు బాగోగులు చూడవలసిన తండ్రే కొడుకుని అలా అప్పులపాలు చెయ్యడం ఎంత ఘోరం. అలాటివి చూసినప్పుడే నాకనిపిస్తుంది అసలు ఒక మనిషి మరొక మనిషిని నొప్పించినప్పుడు తాను అవతలివారిని నొప్పిస్తున్నాను, వారికి హాని చేస్తున్నానన్న స్పృహ ఎందుకు కలగదు అని? అసలు కొందరైతే పెద్ద పెద్ద చదువులు చదువుకుని ఉన్నతోద్యోగాల్లో ఉన్న మేధావులే."

"కలగదు" అన్నాను ఎదటివారికి నొప్పి కలిగిస్తున్నాం అన్న స్పృహగురించి. "కొందరికి కేవలం అవతలివారిని బాధించి ఆనందించే మనస్తత్త్వాలు ఉంటాయి కానీ, చాలామటుకు తాము తప్పు చెయ్యలేదని అనుకునేవారే ఎక్కువ. తనచర్యకి తాను ఇచ్చుకున్న వివరణలే తప్ప ఎదటివారికి తాము చేసిన ఎగ్గు తలకెక్కదు. అదొకరకం జబ్బే అనుకో. ఎంతసేపూ నన్నర్థం చేసుకోలేదూ, నాకెంత బాధగా ఉందో చూడ్డంలేదూ అంటూ ఏడుస్తారు. ఏంచేస్తాం. వాళ్ళఖర్మ అదీ."

"అంతేనేమోలే. మా మనవరాలు అరవిందని చూడు. ఆ విషీతో తిరిగింది కొంతకాలం. నాలుగునెలలక్రితం అతన్ని వదిలేసింది. మనవాళ్ళేలే. తెలిసినవాళ్ళే కూడాను. రెండేళ్ళక్రితం ఇరుగూ పొరుగూ ఉండేవాళ్ళం. వాళ్ళు ఇల్లు కట్టించుకుని మారిపోయేరు. మాపిల్ల అతన్ని వదిలేసినా, అతను ఈమెని వదల్డంలేదు"

"ఏమంటాడేమిటి?"

"ఏమీ అనడు. మాపిల్ల వెళ్ళినచోటల్లా- బజారుకెళ్తే బజారులో, సినిమాకెళ్తే థియేటర్లో ప్రత్యక్షమయి తనని తాను ఆమెకి గుర్తు చేయడానికి ఆరాటపడుతూంటాడు అదే అతని ఉద్యోగం అయినట్టు."

నేను మాటాడలేదు. తెల్లారి లేస్తే ఇలాటివి ఎక్కడోక్కడ వింటూనే ఉంటాను. కాఫీ, పేపరూ అంత మామూలు ఈకథలు.

"ఆ అబ్బాయి మాత్రమే అయితే పోన్లే కుర్రతనం అనుకోవచ్చు. నాకు ఆశ్చర్యం ఏమిటంటే వాళ్ళనాన్న కూడాను. వారానికోమారు ఆఫీసునించి ఈదారినే పోతూంటాడు."

"దారేనేమో?"

"అదే కదా నేనంటున్నది. ఇది చుట్టుతిరిగి అవుతుంది వాళ్ళింటికి. వారానికోమారు ఇట్నించి వెళ్ళకపోతే తోచదాయనకి," అంది శ్రీదేవి నవ్వుతూ.

"మ్. కొందరికి పధ్నాలుగేళ్లు దాటుతూనే బుర్రలు ఎదగడం మానేస్తాయి శరీరాలు ఎదిగినా. ఆ బాపతు కాబోలు." అన్నాను నవ్వుతూ.

"అలాగే ఉంది చూస్తే," అంది సిరి కూడా నవ్వుతూ. "ఇలాటివాళ్ళని మాఅమ్మ చీమల్తో పోలుస్తుండేది. వాటివల్ల పెద్ద హాని జరగదు కానీ కనిపించీ కనిపించకుండా చిరాకు పెడుతుంటారు."

"సరే, వస్తాను మరి." అన్నాను లేస్తూ.

"ఉండరాదూ. భోంచేసి పోదువు గానీ."

"లేదులే మరోసారి వస్తాను. ఇంట్లో పనులున్నాయి." అని చెప్పి శలవు తీసుకున్నాను.

000

శ్రీదేవి మాటలే నామనసులో సుళ్ళు తిరుగుతున్నాయి. ఒక మనిషి మరొక మనిషిని ఎందుకు బాధిస్తాడు, 'ఆమనిషిని బాధ పెడుతున్నాను, ఎదటివాడి నొప్పి నాకానందం' అని తెలిసే చేస్తాడా? లేక యాదృచ్ఛికంగా జరుగుతుందా ఆ బాధించడం అన్నది? అవతలివాడు బాధ పడుతున్నాడు అని తెలిస్తే తన ప్రవర్తన మార్చుకుంటాడా?

తలుపు తట్టిన చప్పుడయి, తలెత్తి చూశాను. ఈసమయంలో ఎవరై ఉంటారా అనుకుంటూ లేచి వెళ్ళి తలుపు తీసేను.

ఎవరో అమ్మాయి, 17, 18 ఉండొచ్చు. ఆ అమ్మాయే పరిచయం చేసుకుంటుందని చూస్తున్నాను.

"నేను అరవిందనండీ. మాఅమ్మమ్మ మీకు ఈపుస్తకం ఇవ్వమంది," అంది ఆ అమ్మాయి.

"ఓ, అరవిందా! నీపేరు విన్నాను, చూడలేదు కదా, గుర్తు పట్టలేకపోయేను" అన్నాను పుస్తకం అందుకుంటూ.

"ఫరవాలేదండీ," అంది అరవింద.

పుస్తకం ఇవ్వడం అయిపోయింది, ఇంక వెళ్లిపోవచ్చు అన్నట్టు లేదు ఆ ముఖం.

"రా," అన్నాను తలుపు బార్లా తీసి, తను లోపలికొచ్చేక, తలుపు చేరేసి, సోఫావేపు నడుస్తూ.

ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నట్టు అరవింద చటుక్కున లోపలికి వచ్చి, సోఫా అంచున నాకు కొంచెం ఎడంగా కూర్చుంది.

నాకు ఏం మాటాడాలో తోచలేదు, "నువ్వు చదివేవా?" అన్నాను పుస్తకం తిరగేస్తూ.

"చదివేనండీ," అంది నెమ్మదిగా.

"తెలుగు బాగా మాటాడుతున్నావే,"

"నాచిన్నప్పుడు ఇండియాలోనే ఉన్నాను. తరవాత అమ్మమ్మ ఇక్కడికి వచ్చినా తెలుగే మాటాడ్డంతో నాకూ ఆ అలవాటు అలా ఉండిపోయింది."

మళ్ళీ నిశ్శబ్దం.

"కాఫీ పెట్టనా?"

"ఇప్పుడొద్దండీ. ఇంట్లో తాగే వచ్చేను."

సంభాషణ కుంటుతోంది. కానీ ఆ పిల్ల కదిలే సూచనల్లేవు. ఆ పుస్తకం నెపం పెట్టుకు ఇంకేదైనా మాటాడ్డానికొచ్చిందేమో అనిపించింది నాకు ... విషి విషయమేమో ... ఎలా అడగను? ఇక్కడ పిల్లల్ని సొంతవిషయాలు అడిగితే మాట దక్కదు. పైగా కొత్త. ఇదే కదా చూడ్డం.

ఆలోచిస్తూనే నెమ్మదిగా "హైస్కూలు అయిపోతుంది కదా ఈయేడుతో. కాలేజీలు చూస్తున్నావా?" అన్నాను. ఈపిల్ల కాలేజీచదువుకీ తాను వదిలేసిన, కనీసం వదిలించుకున్నాననుకుంటున్న విషికీ ఓ బీరకాయపీచు సంబంధం ఉంది. ఊరు వదిలి మరో కాలేజీకి వెళ్తోందంటే, ఆకాలేజీకే విషి కూడా ప్రయాణమవుతాడా అన్నది ఒక యక్షప్రశ్న. ఈసంగతి నాకు సిరి చెప్పింది. అది అరవిందకి కూడా తెలుసు. చూశారా చిక్కులు ... సిరి

చెప్పినప్పుడు నాకెంత నవ్వొచ్చిందంటే, విషి నాన్న కూడా ఇక్కడ ఉద్యోగం వదిలేసి ఆఊరికి మారతాడా అని అడిగేను. అంతటివాడే అంది సిరి కూడా నవ్వుతూ. ఆమాట గుర్తొచ్చి మళ్ళీ నవ్వుకున్నాను.

"ఎందుకు నవ్వుతున్నారు?"

"ఏం లేదులే, మరేదో గుర్తొచ్చింది. ఇంతకీ ఏ కాలేజీలు చూస్తున్నావు?"

"మాఅమ్మ షికాగో, మిషిగన్ అంటోంది. వారం వారం ఇంటికొచ్చేయొచ్చనీ. నాకు పెద్ద కాలేజీలకి వెళ్ళాలని లేదు. మరో పక్క ... నాకంతా గందరగోళంగా ఉంది. ..." అరవింద ఆగిపోయింది. అసలు పాయింటుకి వస్తోంది.  "విషి కూడా అక్కడికే ప్రయత్నిస్తున్నాడు."

"ఇంత పెద్ద దేశం. లక్షలకొద్దీ కాలేజీలు. పోనీ, ఉన్న ఊళ్ళోనే చెయ్యకూడదా undergrad?" అన్నాను నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానం వినియోగించి.

"ఏమోనండీ. నాకు కొత్త ఊరూ, కొత్తపరిసరాలూ చూడాలని కూడా ఉంది. ఇక్కడ చిరాగ్గా ఉంది."

నాకు ఇవన్నీ కొత్త. నాచదువంతా ఆరోక్లాసు తరవాత ఏడూ, తొమ్మిది తరవాత పదీ, హైస్కూలయిం తరవాత కాలేజీ ... అలా ఏటవాలుగా, గాలివాటుగా సాగిపోయిందే కానీ ఇన్ని ఆలోచనలు లేవు. నేను కూడా వీళ్ళలా ఆలోచించుకుని ఉంటే ఎలా ఉండేదో. ...

"Love does not bind, not hold on; love liberates అంటారు మాయా ఏంజెలో."

నేను ఉలికిపడ్డాను ఒక్కక్షణం. మరుక్షణం గుర్తొచ్చింది నాఅనుమానం. సందేహంలేదు. ఏదో మాటాడ్డానికే వచ్చిందీ అమ్మాయి.

"అలాగా? నేను వినలేదు. నేను ఇంగ్లీషుపుస్తకాలు చదవడం తక్కువ," అన్నాను క్షమాపణలు చెప్పుకుంటున్నట్టు.

"అయ్యో మీరు Maya Angelou చదవాలండి. ఇంగ్లీషు అని కాదు. ఆవిడ రచనల్లో మనల్ని మనం చూసుకోవచ్చు కూడా."

నాకు ఆశ్చర్యమూ సరదా కూడా వేసింది తనని చూస్తుంటే. ఇంత చిన్నపిల్లకి ఎంత నిర్దుష్టమైన ఆలోచనలు!

"సరే చూస్తాను. ఇంకొంచెం చెప్పు," అన్నాను.

అరవింద నావేపు అనుమానంగా చూసింది నేను హాస్యానికంటున్నానేమో అని కాబోలు.

"లేదు, నిజంగానే చెప్పు," అన్నాను మళ్ళీ.

"అది కాదండీ. ఆవిడ ప్రేమకి ఇచ్చిన నిర్వచనం చాలా అర్థవంతంగా అనిపించింది నాకు. మొదట వింతగానే ఉంది అనుకున్నాను కానీ ఆలోచిస్తే నిజమే అనిపించింది. ప్రేమ అంటే తాను ప్రేమిస్తున్న మనిషిని కట్టిపడేయడం కాదు. తనబతుకు తాను బతకడానికి అవకాశం ఇవ్వడం అంటారు. అంటే అవతలివారి ఇష్టాఇష్టాలు ఆదరించడం కదా. కానీ Shakespeare లాటి మహామహులంతా ప్రేమంటే ఇద్దరూ ఒకరికొకరు మామిడిచెట్టుకి మాధవీలతలా చుట్టుకుపోయి, ఏకజీవిగా జీవితాలు సాగించడం అనే కదా నూరి పోస్తున్నది మనకి."

ఇంకా ఏమంటుందో అని చూస్తున్నాను.

అరవింద తలవంచుకుని తనలో తను మాటాడుకుంటున్నట్టు అంది, "బహుశా, ఇద్దరూ ఒకేరకం ఆశలూ, ఆశయాలూ, కోరికలూ గలవారైతే, ఒకరి సాన్నిధ్యం రెండోవారికి ఎదగడానికి ఉపయోగపడేదయితే ఇద్దరూ కలిసిఉండొచ్చునేమో. లేకపోతే, ఆ ఇద్దరిలో ఏ ఒక్కరు ఎదగడానికి అవకాశం లేకపోయినా, ఆ వ్యక్తిని రెండోవారు కబంధహస్తాలతో కౌగిలించుక్కూచుకుండా బయటికి పోనివ్వాలి అనేమో. అంటే ఆ వ్యక్తి తనకి కావలసినరీతిలో ఎదగడానికి అవకాశం ఇవ్వాలి నిజంగా ప్రేమ ఉంటే."

నాకు నోట మాట రాలేదు. ఇంత చిన్నపిల్ల ఇంత లోతుగా విశ్లేషిస్తూ మాటాడ్డంతో విస్తుపోయేను. అవి ఆ అమ్మాయి తనపరిస్థితికి అన్వయించుకుంటోందేమో.

"ఏమోలెండి. ఇలాటివి మాటాడ్డం సుళువే. నాకు ఆ విషీవాళ్ళతో మహా చిరాగ్గా ఉంది," అంది తనే మళ్లీ. అసలువిషయానికి వస్తోంది.

ఏమయింది అన్నమాట నాలుక చివరిదాకా వచ్చింది.

"ఉండు" అని లోపలికెళ్లి రెండు కప్పుల్లో కాఫీ, చిన్నపెళ్లెంలో జంతికలూ పెట్టుకుని వచ్చేను. ఆ అమ్మాయికి ఆలోచించుకోడానికి టైముంటుంది. మాటాడుతున్నప్పుడు కూడా వ్యవధి దొరుకుతుంది మధ్య మధ్యలో. నేను అమెరికా వచ్చేక తెలుసుకున్న బ్రహ్మరహస్యాల్లో ఇదొకటి. కాఫీలూ చిరుతిళ్లూ, ఆఖరికి మంచినీళ్లు కూడా ఆలోచించుకోడానికి వ్యవధి కల్పించేవే అని.

"ఏమిటీ, ఇందాకా ఏదో అంటున్నావూ," అన్నాను.

అప్పుడు చెప్పింది నడుస్తూన్న భాగోతం.

విషీ, తనూ విడిపోయేక, అంతటితో సరి అనుకుంది అరవింద. విషి అలా అనుకోలేదు. ఒక వారంరోజులు ఊరుకున్నాడు కానీ ఆ తరవాత రకరకాలుగా తనని ఇరుకున పెడుతున్నాడు - తాను ఎక్కడికెళ్తే అక్కడ ప్రత్యక్షం కావడం, కాఫీకో టీకో రమ్మంటూ పిలవడం, తాము నిజంగా విడిపోలేదనీ, అరవింద ఏదో పన్లో ఉందనీ మిత్రవర్గంలో ప్రచారం చేయడం ...

అరవిందకి ఈ నాటకం మహ చిరాగ్గా ఉంది.

అది చాలదన్నట్టు విషితండ్రి కూడా సమిధలు వేస్తున్నాడు. అరవిందగురించి బంధుమిత్రులతో రకరకాల వ్యాఖ్యానాలు. "మాఅబ్బాయి డేటింగ్ డేటింగంటూ ఆపిల్లతో తిరక్కముందు ఎంతో హుషారుగా ఉండేవాడు. అన్నిట్లో A తెచ్చుకునేవాడు. ఇప్పుడు అరవిందమత్తులో పడడంతో వాడి చదువు నాశనం, వాడిబతుకు నాశనం," అని ఒకటే గోల. అంతేకాదు, "మళ్ళీ నువ్వే వచ్చి అతన్ని మళ్ళీ మనలోకంలో పడేలా చెయ్యాలి" అని అరవిందని కూడా పోరుపెడుతున్నాడు.

"మరి నావల్ల అతనిచదువు పాడవుతుంటే, నేను వదిలేయడం మంచిదే కదా. ఆయనమాటలు చూస్తుంటే ఆయనకే తెలీదులా ఉంది ఏం చెయ్యాలో. ఆయనకీ తెలీదు. నాకూ తెలీదు. నావల్ల విషికి మేలే జరుగుతోందో? కీడు జరుగుతోందో?" అంది వెల్తిగా నవ్వుతూ.

నాకు అయ్యో అనిపించింది కానీ నేను చెయ్యగలిగిందేముంది?

"నువ్వన్నట్టు ప్రేమ అంటే రెండోమనిషిని ఎదగనివ్వడమే అన్నది బాగుంది," అన్నాను.

"నేను కాదండీ. మాయా ఏంజెలో అన్నారు," అంది. ఆ స్వరంలో రవంత విచారం ధ్వనించింది. ఆ భావం ఆచరణలో ఎంత కష్టసాధ్యమో గుర్తు చేసుకుని కాబోలు.

"ఏంజెలోకొడుకు చిన్నవాడే. సుమారుగా నావయసు ఉండొచ్చు. అప్పటికే అతనికో కొడుకు. ఆ పిల్లాడిని తీసుకుని ఇంట్లోంచి వెళ్ళిపోతానన్నప్పుడు అతనికీ ఆవిడకీ మధ్య జరిగిన సంభాషణ గొప్పగా ఉంది. చూడండి -

"అమ్మా, నేను వెళ్ళిపోతున్నాను."

"ఈ ఇంట్లోంచా?"

"అవును, ఈ ఇంట్లోంచే."

"ఈ ఇంట్లోంచి వెళ్ళిపోతావా?"

"అవును. ఈ ఇంట్లోంచి వెళ్ళిపోతున్నాను. నాకు పని దొరికింది. అక్కడ వంట చేసుకోడానికి సౌకర్యం ఉంది. ఆ ఇంటావిడ పాపడిని చూసుకుంటాననంది."

"సరే. వెళ్ళు. నేను నిన్ను అడ్డుపెట్టను. నీఇష్టం వచ్చినచోటికి వెళ్ళు. నువ్వంటే నాకు ప్రేమ కనకనే నిన్ను పోనిస్తున్నాను. నీకు ఎప్పుడు కావలిస్తే అప్పుడు రావొచ్చు."

అది చెప్పి, ఆ అబ్బాయి అంటారు, "ఆతరవాత నేను ఎప్పుడు ఇంటికి వెళ్ళినా, ఓ వచ్చావా, రా అంటూ ఎంతో సంతోషంగా ఆహ్వానించింది కానీ ఒక్కసారి కూడా నేను చెప్పేనా అంటూ దెప్పలేదు మాఅమ్మ."

అరవింద గుక్క తిప్పుకోడానికన్నట్టు ఆగింది.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. ఇలాటి సందర్భాల్లో తెలుగుమాటలు లేవు. మనసంప్రదాయంలో బాగుంది అంటాం. నాకు అది చాలదనిపించింది. "That's beautiful," అన్నాను.

అరవింద మరో అరగంట ఉంది. మాయా ఏంజెలోగురించి తను సేకరించిన సమాచారం అంతా చెప్తోంది. ముఖ్యంగా వాక్కు శిలీముఖంలా ఎంత పదునైనదో Maya Angelouమాటల్లో అరవింద చెప్పినవి నామనసులో గట్టిగా నాటుకున్నాయి.

మాయా ఏంజెలో మాటల్లో -

'మాటలు చాలా బలమైనవి. నాకు ఏడేళ్ళప్పుడు మాఅమ్మ boyfriend నన్ను రేప్ చేశాడు. అది ఇంట్లో ఎవరికి చెప్పినా వాళ్ళు అతన్ని హింసిస్తారని చెప్పలేదు. మాఅన్న Bailey అంటే నాకు దైవమే. అంచేత అతనికి చెప్పేను. అతను ఇంట్లో చెప్పేడు. వాళ్ళు పోలీస్ రిపోర్టు ఇచ్చేరు. పోలీసులు అతన్ని ఒక పగలు, ఒక రాత్రి జెయిల్లో పెట్టి వదిలేశారు. ఆతరవాత ఇద్దరు పోలీసులు వచ్చి చెప్పేరు ఎవరో అతన్ని కాళ్ళతో కుమ్మి చంపేశారు, అని. అప్పుడు నాకనిపించింది. నేను హంతకురాలిని. ఏడేళ్ళ నల్లజాతి Natzini . నామాటవల్ల అతను చనిపోయేడు. నేను మాటాడకపోతే ఇది జరిగిఉండేది కాదు.'

ఆతరవాత మాయా ఏంజెలో ఆరేళ్ళపాటు మౌనంగా ఉండిపోయింది. మాటలు జాగ్రత్తగా వాడాలి అంటారామె.

నాకు మనసు బరువెక్కింది. అంతటి ఘోరం జరిగినందుకో, ఆ అనుభవానికి ఆమె చెప్పుకున్న వివరణమూలంగానో, ఆ సంఘటన అరవిందమీద అంతటి బలమైన ముద్ర వేయడమో ఏదో ఫలానా అని చెప్పలేను కానీ నన్ను తీవ్రమైన ఆలోచనల్లో పడేసినమాట నిజం.

మరో పావుగంట కూర్చుని అరవింద "వెళ్తానండీ," అంటూ లేచింది.

"అప్పుడప్పుడు వస్తూ ఉండు," అన్నాను.

"నిజంగా రావొచ్చా?" అంది అరవింద.

"నిజంగానే. ఈ పుస్తకం చదివేనంటున్నావు కదా. నేను కూడా చదివేక మాటాడుకుందాం దీన్నిగురించి," అన్నాను, నేను కూడా లేచి గుమ్మంవరకూ నడుస్తూ.

000

చాలాసేపు "మాట పదును" గురించి ఆలోచిస్తూ కూర్చున్నాను. ఒకరు మరొకరిని ఎందుకు బాధిస్తారో అనుకుంటూ మొదలు పెట్టేను కానీ ఇప్పుడు మరో ఆలోచన వస్తోంది. ఒకరు మరొకరిని ఎందుకు బాధిస్తారో తెలీదు కానీ నేను మరొకరిని నామాటలతో బాధ పెట్టకుండా ఉండడానికి ప్రయత్నించవచ్చు కదా. అంటే పని గట్టుకు నామాటలతో మరొకరిని బాధ పెడుతున్నానని కాదు కానీ నేను ఆలోచించకుండా అన్న మాటలమూలంగా మరొకరు బాధ పడిన, లేదా పడదగ్గ సమయాలు ఉన్నాయనే అనిపిస్తోంది వెనక్కి తిరిగి చూసుకుంటే. ఆ సంఘటనలు నాకు గుర్తొస్తున్నాయిప్పుడు!

అరవింద చెప్పిన మరో వాక్యం - మాయా ఏంజెలోదే - గుర్తొచ్చింది. "If you cannot make a change, change the way you think. Maybe you will find a solution." అవును, నేను ఆలోచించే తీరు మార్చుకోవాలి.

ఈ Maya Angelou ఎవరో ఇంకా ఏం చెప్పేరో తెలుసుకోవాలనుంది కానీ అరవిందమాటలతో మనసంతా కల్లోలం అయిపోయింది. ముందు ఆ మాటలు అర్థం చేసుకుంటే కానీ ముందుకి సాగలేను.

టైం చూసేను. ఐదయింది. అలా కొంచెంసేపు తిరిగొస్తే కొన్ని ఆలోచనలు స్పష్టం కావచ్చు అనుకుంటూ లేచి బయల్దేరేను. నాలుగువీధులు దాటితే పార్కు.

పిల్లలు Soccer ఆడుతున్నారు. వాళ్ల అమ్మలూ, నాన్నలూ, వాళ్ళ నేస్తాలూ ఆట చూస్తూ, కబుర్లు చెప్పుకుంటూ మధ్య మధ్యలో పిల్లలకి హుషారిస్తూ జేజేలు కొడుతున్నారు. దృశ్యం చూడముచ్చటగా ఉంది.

ఓ బెంచీవేపు నడిచేను కొంచెంసేపు కూర్చుని ఆట చూసి ఆనందిద్దామని.

ఓ అబ్బాయి ఒంట్లో ఉన్న బలాన్నంతా కూడగట్టుకుని ఒక్క తన్ను తన్నేడు బంతిని. అది పదడుగులు గాల్లోకి లేచి యాభై గజాలదూరంలో ఉన్న నాకాళ్ళదగ్గర పడింది. వంగి దాన్ని అందుకోబోతుంటే ఓ అమ్మాయి పరుగెత్తుకుంటూ వచ్చింది బంతికోసం. ఎనిమిదేళ్ళుంటాయేమో.

బంతి అందుకుని, నావేపు చూస్తూ, ‘‘నేను ప్రెసిడెంట్ అవుతాను,’’ అంది.

‘‘ఆహా. ప్రెసిడెంట్. బాగుంది,’’ అన్నాను.

తండ్రి కాబోలు వెనకే వచ్చి నన్ను చూసి, ‘‘థాంక్స్’’ అన్నాడు.

నేను తలూపేను చిన్నగా నవ్వి.

‘‘ఇంతప్పటినుండీ ఉంటాయి ఆశలు.’’

నేను ఉలికిపడి ఆమాట వచ్చినవేపు చూశాను.

ఎవరో యాభైలు ఉండొచ్చు. ఆయన నావేపు చూడ్డంలేదు. నాతో అన్నాడో తనలో తనే అనుకుంటున్నాడో నాకర్థం కాలేదు. ఆపిల్లమాటకే అనుకుంటా ఆయన వ్యాఖ్య. ఆ పిల్ల ఆయనకి పరిచయమా? అదే నిజమయితే, మరి ఆ పిల్ల ఆయనతోనే ఎందుకు మాటాడలేదు?

నేను ఊరుకున్నాను.

ఆయన మళ్ళీ మొదలు పెట్టేరు. ‘‘ఇక్కడే పుట్టింది కాబోలు. అమ్మో నాన్నో చెప్పి ఉంటారు నువ్వు ప్రెసిడెంటువి కావచ్చని. ఇంకా ఇండియా ప్రధానివి కూడా కావచ్చు అని కూడా చెప్పేరేమో. మనకా పట్టింపుల్లేవు కదా. ఎక్కడ పుట్టినా ప్రధానికావడానికి ఎలాటి ఆంక్షలూ లేవు మనదేశంలో. మనవి విశాల హృదయాలు.’’

తలూపేను అవునన్నట్టు ఆట చూస్తూ. ఆయనకి నాసమాధానం అక్కర్లేకపోతే నావేపు చూడరు. నేను తలూపేనో లేదో తెలీదు. నాసమాధానం కావలిస్తే నావేపు చూస్తారు. నేను వింటున్నట్టే

లెక్క అనుకుంటూ. నిజానికి ఆయన నాతో మాటాడుతున్నట్టు నాకు అనిపించలేదు. ఆటాడుతున్న పిల్లల్ని చూస్తూ వినీ విననట్టూరుకుంటే సరి అనుకున్నాను.

"మాది గుంటూరుదగ్గర పెదరెడ్లపల్లె. మాఊళ్ళో అప్పుడే కొత్తగా పెట్టినబళ్ళో నాచదువు ... బాగా సాగడంలేదని మానాన్న నన్ను తాతగారింటికి పంపించేరు .... హైదరాబాదు. మాతాతగారు లండన్లో చదివి వచ్చి హైదరాబాదులో ఐసియస్ ఆఫీసరుగా ఉండేవారు. అంచేత నాచదువంతా ఇంగ్లీషు ... బతుకంతా ఇంగ్లీషు. ఆయనకి మహా నిష్ఠ. నిరతాగ్నిహోత్రుడు. యమకం, రుద్రం రోజూ పారాయణ చేసేవారు. అయినా చదువు మాత్రం అంతా ఇంగ్లీషు. రెండు సాంప్రదాయాలూ కలగలుపుగా అంత ఛాందసంగా పాటించిన మనిషిని మరొకరిని నాజీవితంలో నేను చూడలేదు. ... నాకూ అవే వచ్చేయి. ఏద్దైనా పట్టుదలతో సాధించడం, సాధించేవరకూ విడవకపోవడం ... మనిషన్నాక ఒక నియమం ఉండాలి. ఆ నియమం నిష్ఠగా పాటించాలి అని ఆయన సిద్ధాంతం. నాకూ అంతే ... 80, 20 రూలు. అంటే తెలుసా? నాబాధ్యత ఎనభైశాతం, ఆయనబాధ్యత 20 అన్నమాట నేను తీసుకునే నిర్ణయాల్లో. అలాగే బాధ్యత చేపడితే సక్రమంగా నిర్వర్తించాలి. ఏదోఒకటి 'చేస్తానన్నాను, చేసేను' అన్నట్టు ఉండకూడదు. పరిణామాలు క్షుణ్ణంగా ఆలోచించుకుని కానీ దిగకూడదు ... " ఆగి ఆగి, ఎటో చూస్తూ మాటలు గాల్లోకి వదులుతున్నట్టుంది కానీ మాటాడుతున్నట్టు లేదు.

నాకు చిరాకేసింది. "ఇదుగో, ఎవరితో మాటాడుతున్నావు? అసలు నువ్వు చెప్తున్నదేమిటి? ఏమిటీ తలా తోకా లేని సోది?" అని గట్టిగా కసురుకుని ఉందును మరో సందర్భం అయితే. కానీ ఇది నాఇల్లు కాదు, ఈ బెంచీ నాదు కాదు. అలా అరవడం మర్యాద కాదు. ఆయనిష్టం ఆయనది. పోనీ లేచి పోతే పోదా అని కూడా అనిపించింది. కానీ మరోపక్క కుతూహలం కూడా. ఈయన ఏం మాటాడుతున్నారు? ప్రకాశంగా ఈ స్వగతం ఏమి ఫలితం ఆశించి?

హోహో ... హోహో ... పార్కులో చేరిన ప్రేక్షకులంతా జయజయధ్వానాలు చేసేరు.

ఇందాకా ప్రెసిడెంటునవుతానన్న అమ్మాయి గోల్ చేసింది.

నేను కూడా హుషారుగా చప్పట్లు కొట్టేను.

"గోలు కొడితేనే అంత మురిసిపోతున్నారు. నిజంగా ప్రెసిడెంటయితే ఇంకా ఎంత మురిసిపోతారో,"

అన్నాడాయనే మళ్ళీ. ఆ అమ్మాయి గోలు కొట్టినందుకు ఆయన సంతోషించినఛాయలు లేవు. ఇంకా ఏదో చెయ్యలేదని విచారిస్తున్నట్టుంది ఆయనవాలకం.

“నాచదువు పూర్తయి ఇంజినీరునయేను. మెకానికల్ ఇంజినీరుని. ఇప్పుడు స్కూటర్లలో పెడుతున్న చిన్న ఇంజను నేను తయారు చేసిందే. ప్రెసిడెంట్ ఎవార్డు కూడా వచ్చింది. ఈరోజు మెకానికల్ ఇంజినీర్లలో నాపేరు తెలీనివాళ్ళు లేరు.”

బహుశా ఇప్పుడెవరూ ఆమాట అనడంలేదేమో. అదేనేమో ఆయనబాధ. ఆ ప్రతిష్ఠ లేదని కాబోలు ఆయనబాధ.

“మాపెద్దవాడు కూడా నాలాగే ఇంజినీరు కావాలని ఎంతో ఆశ పడ్డాను. డాక్టరయేడు. అమెరినమ్మాయిని చేసుకుని వేరే స్థిరపడ్డాడు. ఏడాదికోమారు కలుస్తాం. ఇక్కడ మదర్స్ డే, ఫాదర్స్ డే లాగే అర్థంలేని ఆచారాలు. రెండోవాడికి హైస్కూలు అయిపోతుంది ఈయేడు. కాలేజీలకి అర్జీలు పెట్టుకుంటున్నాడు. వాడిష్టం. నేను చెప్పలేను. ప్రేమా దోమా అంటూ జీవితాలు కావాలని చేజేతులా నాశనం చేసుకునేవాళ్లని ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు?”

ఉలిక్కిపడ్డాను. హఠాత్తుగా ఈయనగానీ విషితండ్రి కాదు కదా అనిపించింది. ఎందుకలా అనిపించిందటే చెప్పలేను. బహుశా ఆయన్ని నేను కలుసుకోడం జరిగితే మా సంభాషణ ఇలాగే ఉండేదేమో అని అనుకుంటాను.

“అయినా మాకాలంలో ఇలా కాదు కదా. చదువంటే చదువూ, ఉద్యోగం అంటే ఉద్యోగం, సంసారం అంటే సంసారం .. దేనికదే .. దానిమీదే దృష్టి. నేను చదువుకునేరోజుల్లో చదువుమీదే నాధ్యాసంతా. మాతాతగారు చండశాసనుడు. ఆయన అసలు ఒక్క మాట కూడా అనక్ఖర్లేదు. ఆయన గదిలో అడుగు పెడితే చాలు నిశ్శబ్దం అయిపోయేది గది. కూర్చున్న ఆడవాళ్ళు లేచి నిలబడేవారు. కొందరయితే పక్కగదిలోకి వెళ్ళిపోయేవారు. మళ్ళీ ఒక్కనాడు కూడా ఆయన ఎవరిమీద గానీ చెయ్యెత్తడం నేను చూడలేదు. గాంభీర్యం ఉట్టిపడే విగ్రహం. మావాడికి చెప్పేను ఆ పిల్లమీద అంత మనసుంటే చేసుకో. కానీ ముందు చదువు పూర్తి చెయ్యి. తరవాత ఆపిల్లకి ఇంకా నీమీద మనసుంటే చూద్దాం. ఇప్పుడు వయసుపోరు అలా అనిపిస్తుంది కానీ కాస్త ఎదిగేక నీ ఆలోచనలు మారొచ్చు. ఆఅమ్మాయి అభిప్రాయాలు మారొచ్చు. నీకో ఆఅమ్మాయికో ఇంకా ఎక్కువ ఇష్టమయిన మరో మనిషి తటస్థపడొచ్చు కూడా అని. ... వింటేనా ... ఒకటే గోల ఆ అమ్మాయి లేకపోతే బతుకు లేదూ అంటూ. సినిమాలొచ్చి మనకి పెట్టిన భిక్ష ఇదీ.”

నాకు నవ్వొచ్చింది. ఎంతసేపూ తప్పు మరొకరిదే ... అరవింద, విషి, .. వాళ్ళ నాన్న ... మరి సిరిమాటలు కూడా అలాగే ఉన్నాయా? నాకెందుకో లేదనే అనిపించింది. మానవనైజం కాబోలు.

“పోనీ, నిజంగానే వీళ్ళిద్దరూ మేం ఒకరికోసమే ఒకరం పుట్టేం అనుకుంటున్నారేమో చూదాం అని ఆ అమ్మాయితో మాటాడడానికి ప్రయత్నిస్తున్నాను. కానీ వినదే. పెద్దవారు చెప్తున్నారు, ఆలోచించుకోవాలి అనైనా లేదు. ప్రేమా ప్రేమా అంటూ అల్లాడతాడు వీడిక్కడ, అక్కడికి ప్రేమంటే ఏమిటో నాకు తెలీనట్టు. నేనూ ప్రేమించే చేసుకున్నాను.”

నాకు ఇప్పటికి కాస్త కుతూహలంలాటిది కలిగింది. “అలాగా,” అన్నాను.

“నాకూ తెలుసు ప్రేమంటే. నాభార్యకి ఏంకావాలో నాకు తెలుసు. ఆమెకి కావలిసినట్టు అన్నీ అమరుస్తాను. అంతే కాదు. ఆమెకి తెలీనివి కూడా నేనే గమనించి చెప్తాను నీకు ఇది బాగుంటుందని, ఇలా ఉండాలని. అసలు ఆమెని సంతోషపెట్టడానికే వీడిని కూడా ఓదారిలో పెట్టాలని చూడ్డం.”

మూలకారణం కొంచెం కొంచెంగా వెలువడుతోంది, ఉదయారుణరేఖల్లా. భార్యకి ఏం కావాలో తెలీనివి అనడంలోనే తెలుస్తోంది ఆయనతత్వం.

“మాతాతగారికి నామీద ప్రేమ ఉండబట్టే కదా నన్ను అంత కట్టుదిట్టాలతో పెంచేరు. పెద్దలు అనుభవంతో చెప్తారు. అది కూడా వినాలి. అదే నేను ఆ అమ్మాయికి చెప్పేను. ”

నేను నవ్వేను, “అనుభవాలా… మానవాళి చరిత్రనుండీ నేర్చుకున్న పాఠం అదొక్కటే కదండీ. చరిత్ర చూసి మనం ఏమీ నేర్చుకోము అన్నదొక్కటే. నిజంగా చరిత్ర చూసి పాఠాలు నేర్చుకుంటే లోకం ద్వాపరయుగంలో భారతయుద్ధం ముగియగానే బాగుపడేది. ఇన్ని యుద్ధాలు ఉండేవి కావు. ”

ఆయన నామాట వినిపించుకోలేదు. లేదా పట్టించుకోలేదు.

“ప్రేమంటే నీకు కావలసింది చూసుకోడమే కాదు అబ్బాయికి ఏం కావాలో కూడా చూడ్డం అని. … అసలు ఆ అమ్మాయికి ఆ తత్త్వమే అర్థమయినట్టు లేదు. లేదా నేనే పొరపాటు అంచనా వేసేనేమో. నెమ్మదిగా కనిపిస్తే అణుకువగల పిల్ల అనుకున్నాను. కానీ నాకు ఇప్పుడనిపిస్తోంది మందబుద్ధి అయినా కావాలి. మొండితనమయినా కావాలి అని.”

“మందబుద్ధి అని ఎందుకంటారు? ఆలోచించి నిదానంమీద జవాబు చెప్పడం కూడా కావచ్చు కదా,” అన్నాను, నామమాత్రంగానైనా తెలీని ఆ అమ్మాయిపక్షం వకాల్తా పుచ్చుకుని. దానికి కారణం నాగురించి కూడా అలాగే అనుకోవచ్చు మరి. నేను కూడా నిదానంగానే కనిపిస్తాను. నేను కూడా మాటకి మాట టక్ టక్మని వెంటనే చెప్పను మరి!

‘‘ఏమైనా ఆపిల్ల మావాడికి తగదు. అది మావాడు అర్థం చేసుకునేలా చెప్పడం ఎలాగో నాకు తెలీడంలేదు’’ అన్నారాయన లేస్తూ.

ఈయన విషితండ్రి అవునో కాదో నాకు తెలీదు కానీ అయిఉంటే, ఆయనమాటలు ఇలాగే ఉండేవి అనిపించింది.

నిదానంగా తలొంచుకుని అడుగులేసుకుంటూ కోరలు పీకిన సింహంలా నడిచిపోతున్న ఆయన్ని కనుమరుగయేవరకూ చూసేను. అయ్యో అని కూడా అనిపించింది నాకు, అర్థరహితమే అయినా.

000

మళ్లీ సిరి ఇంట్లో అరవిందని కలిసేను. ఏవో మాటాడుతూండగా, సంభాషణ తెలుగు హాస్యంమీదకి మళ్ళింది.

“నవ్వెప్పుడు ఎలా వస్తుందో చెప్పడం కష్టం,” అంది అరవింద.

"నవ్వెప్పుడు రాదో చెప్పడం కూడా కష్టమే," అన్నాన్నేను.

“నువ్వు వినలేదేమిటి లీలాసుందరులకథ,” అంది సిరి.

“లేదు. ఏమాకథ? వినుటకుత్సాహంబయ్యెడిని, చెప్పు చెప్పు చెప్పు చెప్పూ” అన్నాను హుషారుగానూ మరియు పూర్వపు బాణీ నెమరేసుకుంటూను.

“ఇది చెప్పులకథ కాదు. చెప్పుదెబ్బలకథ. సరే. ఏమయిందంటే ...”

ఇండియానించి కొత్తగా దిగేడు రామిరెడ్డి.

"కోడికూర ఎలాగా చెయ్యవు కనీసం మాంఛి ఘాటైన తెలుగువంటకం చేసిపెట్టు, పదికాలాలపాటు నిన్ను తలుచుకుంటాడు," అన్నాడు సుందరం లీలతో రామిరెడ్డిగురించి.

రామిరెడ్డి ఏదో కోర్సుకోసం వచ్చేట్ట. ఒక సెమెస్టరుంటాడు. తెలుగుతిండికోసం మొహం వాచి ఉన్నాట్ట.

లీల సరేనంది. ఆమధ్య ఏదో వంటలపుస్తకంలో కనిపించిన “కేరట్ ఆవకాయ పెడతాను. ఆ ఆవగుండ ఘాటికి రామిరెడ్డేమిటి హరిహరాదులు కూడా అదిరిపడగలరు,” అంది.

అమెరికాలో సామర్లకోటనూనె, అనకాపల్లి మామిడికాయలూ, తుని మిరపకాయలూ దొరకవు కానీ ఇంచుమించు ఆఘాటుకి సరి తూగగల సరుకులు కమ్యూనిటీ స్టోరులో దొరుకుతాయి. ఇక్కడ మెక్సికన్ మిరపకాయలూ, మరెక్కడినించో వచ్చిన సన్నావాలు రుచికి లోపం లేదు.

కేరట్ తెచ్చి, సన్నగా ముక్కలు తరిగి, రెండ్రోజులు నిమ్మపులుసులో నానబెట్టింది. ఆ తరవాత కారం, ఆవగుండా ఉప్పూ పసుపూ బాగా కలియబెట్టి, కేరట్ ముక్కలేసి మరోమారు కలియబెట్టి మూతపెట్టింది. నాలుగురోజులు ఊరబెడితే రుచి బాగుంటుంది కానీ టైము లేదు. మర్నాడే రెడ్డి భోజనానికి వస్తున్నాడు. ఊళ్ళోనే ఉంటాడు కదా నాలుగు రోజులయింతరవాతే పిలవొచ్చు కదా అనడక్కండి. లేడికి లేచిందే ప్రయాణం. సుందరం తలచినప్పుడే విందు.

సుందరం వెళ్ళి రెడ్డిని తీసుకొచ్చేడు. లీల సాదరంగా ఆహ్వానించింది. సుందరం డ్రింకులు తెచ్చి ఓ గ్లాసు రెడ్డికిచ్చి, తానొకటి పుచ్చుకు పక్కసోఫాలో సర్దుకుని మాటలు మొదలుపెట్టేడు. అరగంట తరవాత లీల బల్లమీద వంటకాలు సిద్ధం చేసి ఇద్దర్నీ భోజనానికి లెమ్మని పిలిచింది.

ఆ బల్లా, బల్లమీద గిన్నెలూ, గిన్నెల్లో దినుసులూ చూస్తుంటే రెడ్డికి కళ్లూరేయి. తింటుంటే కళ్లూ, నోరూ కూడా ఊరిపోయేయి ఊటబావిలో నీళ్లలా. తింటున్నంతసేపూ లీలగారి కేరటావకాయ మెచ్చుకుంటూనే ఉన్నాడు.

“మరేమిటనుకున్నారు మాలీల పాకశాస్త్రప్రావీణ్యం. మీరింకా చూడలేదు. మరో రెండు సార్లు తిన్నారంటే ఆ తరవాత రెండు జరగడానికి అవకాశం ఉంది,” అన్నాడు సుందరం.

“రెండంటే?”

“ఈవిడగారి రుచులకి అలవాటు పడిపోయి, మరెక్కడా తినలేక మాయింటికి మకాం మార్చేస్తారు. ఇహ ఇండియా తిరిగెళ్ళేమాటే రాదు కల్లోనైనా. లేదా కళ్లు తిరిగి, మొహం మొత్తి ఈ తిండి నావల్ల కాదు మహాప్రభో అంటూ మాయింటివేపు రావడం మానేస్తారు,” అన్నాడు సుందరం తన హాస్యచతురతకి తానే మురిసిపోతూ.

రెడ్డి కూడా నవ్వేడు “భలేవారండీ మీరు, భలే మాటాడతారు.”

“అదేమిటండీ రెడ్డిగారూ, నా వంటలరుచులు వదిలేసి ఆయనగారి హాస్యచతురతమీదికి మళ్ళించేశారు బండి. నావంటలు అంత తీసికట్టా?” అంది లీల సీరియస్గా

“అమ్మమ్మ, ఎంతమాట. మీ పాకంతరవాతే వారి మాటలు,” అన్నాడు రెడ్డి.

భోజనాలయేయి.

“ఊళ్ళో తెలుగుసినిమాలు లేవు కానీ పొరుగుజాతి తమిళచిత్రం ఆడుతోంది, లీలకి తమిళం కొంచెం వచ్చు. వెళ్దామా?” అన్నాడు సుందరం ఇద్దరివేపూ మార్చి మార్చి చూస్తూ.

“పదండి. మీరేదంటే అదే. నాకేదైనా ఒకటే. ఇంగ్లీషుబళ్ళో చదివేను. నాకు తెలుగూ, తమిళం, మరాఠీ అన్నీ ఒక్కలాగే వినిపిస్తాయి. మూకీ చూసినట్టు బొమ్మలు చూస్తానంతే,” అన్నాడు రెడ్డి.

“నాతమిళం కూడా అంతంత మాత్రమేలెండి. రెడ్డిగారు చెప్పినట్టు ఏ సినిమా అయినా ఒకటే, పదండి,” అంది లీల ఎంగిలికంచాలూ, గ్లాసులూ సింకులోనూ, మిగిలిన కూరలూ అన్నాలూ ఫ్రిజ్లోనూ సర్దేస్తూ.

సినిమా మొదలయి అరగంట అయింది. ఎవరికీ ఏమీ తెలీడంలేదు. తమకేమీ తెలీడంలేదని చెప్పడానికి ఎవరూ సిద్ధంగా లేరింకా. మరో పావుగంటయితే చెప్తురేమో.

రెడ్డి ఇబ్బందిగా కదలడం మొదలెట్టేడు కుర్చీలో. మరో పదినిముషాలయింతరవాత కడుపమీద చెయ్యేసి ఊఁ అంటూ చిన్నగా మూలిగేడు.

“ఏంటండీ, కడుపులో బాగులేదా?” అడిగేడు సుందరం గాభరా పడిపోతూ.

“కడుపులో ఏంటోగా ఉందండీ,” అంటూ మొహం వికృతంగా పెట్టి, నెమ్మదిగా లేచేడు రెడ్డి.

“అయ్యయ్యో, మా లీలవంటకాలు అగ్గి పెట్టేసేయేంటి మీకుక్షిలో,” అంటూ సుందరం కూడా లేచేడు.

సినిమా చూస్తూ సంభాషణలసారం గ్రహించడానికి ప్రయత్నిస్తున్న లీలకి సుందరం, రెడ్డి లేచిపోవడమే తెలిసింది కానీ వారిమధ్య మాటలు వినిపించలేదు.

సరే, ఏ సిగరెట్ తగలేసుకోడానికో బయటికి పోతున్నారు వాళ్ళే వస్తారు అనుకుంది బయటికి వెళ్తున్న వాళ్ళని కొనకళ్ల చూసి.

ఆమె అనుకున్నది జరగలేదు. సినిమా అయిపోయింది. తనని తోలుకొచ్చిన బంధుమిత్రులు అయిపు లేరు.

తనవరసలోపక్కవాళ్లు లేచి నిలబడి ఆమె లేవడంకోసం చూస్తూ నిలబడ్డారు. ఇహ లాభంలేదనుకుని మెల్లిగా లేచి, జనప్రవాహంలో పడి కొట్టుకుపోతూ బయటికి వచ్చింది. తనని కట్టుకున్నవాడూ తనచేతివంట తిన్నవాడూ కనిపిస్తారేమోనని.

సినిమా చూసినవారందరూ వెళ్ళిపోయేరు.

రెండోఆట చూడ్డానికొచ్చినవాళ్ళు హాల్లోకి పోయేరు. కొందరు పరిచయస్తులు కనిపించి సినిమా చూడ్డానికొచ్చేరా, చూసి వెళ్ళిపోతున్నారా అని ప్రశ్నించేరు.

లీల నెమ్మదిగా నడుస్తూ ఇల్లు చేరుకుంది.

తలుపు తాళాలు తీస్తుండగానే గలగల్లాడుతూ మాటలూ నవ్వులూ వినిపించేయి.

హాల్లో కూర్చుని సుందరం రెడ్డీ పేకాడుతున్నారు.

లీలని చూస్తూనే సుందరం, "అయిపోయిందా సినిమా? బావుందా?" అన్నాడు అతిమామూలుగా.

"చెప్పకుండా వచ్చేశారేమిటి? మీకోసం చాలాసేపు చూశాను," అంది లీల శాంతంగా.

"నీ కొత్తావకాయ ఘాటు రెడ్డిగారికడుపులో మంట పెట్టేసింది," సుందరం హోరున నవ్వేడు.

రెడ్డి చిన్నగా నవ్వేడు "మరీ అంత కాదులెండి" అంటూ.

"అంత కాదంటారేమిటి? జులై 4 తారాజువ్వలు కనిపించేయన్నారు కదా మీరే," అన్నాడు సుందరం మళ్ళీ.

రెడ్డి ఇబ్బందిగా మొహం పెట్టేడు.

లీలమనసు కలుక్కుమంది. మాటాడకుండా పక్కగదిలోకి వెళ్ళిపోయింది.

ఆ వెనకే సుందరం వచ్చేడు.

"అదేం మర్యాద? పెద్దమనిషి హాల్లో ఉంటే అలా వచ్చేస్తావేమిటి?" అంటూ.

"మర్యాదా? నన్నొక్కదాన్నీ అలా సినిమాహాల్లో వదిలేసి రావడం మర్యాదగా ఉందా?"

"బాగుంది. ఆయనకి కడుపునొప్పి అంటే 'మీరెళ్ళండి, నేను తరవాత మాఆవిడతో వస్తాను' అని చెప్పమంటావా?"

"ఏం పసిపిల్లాడేమిటి? నువ్వు పక్కనుండి బాత్రూంకి తీసుకెళ్ళాలా? పోనీ, వెళ్ళేవు సరే. వెళ్ళేముందు చెప్పొచ్చు కదా. ఆ తరవాతయినా, 'ఆవిడతో చెప్పకుండా వచ్చేశాం. వెళ్ళి తీసుకొస్తాను మీరు పడుకోండి' అని ఆయనకి చెప్పలేవూ?"

“ఇది మహా బావుంది. మామూలుగా ఒక్కదానివీ ఊరంతా ఇంకా పొరుగూళ్లూ కూడా తిరుగుతావు కదా. రెండు బ్లాకులు కూడా లేదు సినిమాహాలు ఇక్కడ్నించి. నిన్ను కొట్టడానికి ఎవడికైనా ఎన్ని గుండెలు. నిన్ను చూసి వాడే ఝడుసుకుని పారిపోతాడు,” సుందరం మళ్లీ నవ్వేడు.

హాల్లో రెడ్డి నవ్వినట్టు లీలకి అనిపించింది..

సుందరం హాల్లోకి వచ్చేశాడు.

రెడ్డి, “తెల్లారగట్లే క్లాసుంది, పేగిరం లేవాలి. వస్తానండీ,” అంటూ లేచేడు.

సుందరానికి మాత్రం రెడ్డిని అలా అర్థంతరంగా సాగనంపడం బాగులేదు.

“అదేంటండీ. కూర్చోండి. కనీసం ఈ ఆట పూర్తి చేసి వెళ్ళొచ్చు. మీరేం ఆవిడని పట్టించుకోకండి. ఊరికే అలా అలక నటిస్తుంది కానీ నిజంగా బాధ కాదు. గొప్ప sense of humor ఆవిడది. మాకిద్దరికీ ఇదలవాటే ...”

లీలకి వినిపిస్తూనే ఉంది ఈ సంభాషణంతా. కొంతవరకూ సుందరం చెప్పింది నిజమే. ఇద్దరూ పేసి పేయించుకోడం అలవాటే. పార్టీల్లో కూడా ఒకరినొకరు హేళన చేసుకుని నవ్వుతూ అందర్నీ నవ్విస్తూనే ఉంటారు.

కానీ. .. ఇవాళ మనసు చివుక్కుమంది.

“సుందరం ఎందుకు అలా ప్రవర్తించేడంటావు,” అంది సిరి.

“వాళ్ళిద్దరిమధ్య సామరస్యం అలాటిది కావచ్చు. వాళ్ళెంతకాలంగా కాపురం చేస్తున్నారో మనకి తెలీదు. ఆ సమయంలో అతనికి అలాటి అభిప్రాయం ఏర్పడి ఉండవచ్చు. అంటే తను చేసింది లీలకి బాగానే ఉంటుంది అనుకున్నాడేమో. మామూలుగా తను ఒక్కర్తీ బయటికి పెళ్ళడం అలవాటే అన్నాడు కదా. అతిథిసత్కారాల విషయంలో గృహస్థధర్మాలు అవీ అని అతనిఅభిప్రాయం. లీల ఇంట్లో మనిషి. ఇంట్లో మనిషిని ప్రత్యేకంగా చూడ్డం మన సాంప్రదాయంలో లేదు కదా. 'మనలో మనకేంటి' అంటాడు అతను. పరాయివారయితేనే ఏమనుకుంటారో అనుకుంటూ జాగ్రత్త పడాలి, కానీ ఇంట్లో వాళ్లతో అక్కర్లేదు. పాపం రెడ్డి కొత్తగా వచ్చేడు. అమెరికాలో అతనిదినాలు సుఖకరం చేయడం సాటితెలుగువాడిగా తనవిధి ... ఇలా ఉండి ఉంటాయి ఆయన ఆలోచనలు'' అన్నాను ఆలోచిస్తూ.

పైగా అలా ప్రవర్తించడం సుందరానికి ఆనందదాయకమే అయి ఉండాలి కానీ అది ఇక్కడ అప్రస్తుతం.

‘‘అయితే రెడ్డికి అది బాగుందా? అతనసైనా 'లీలగారిని ఒక్కరినీ సినిమాహాల్లో వదిలేసి వచ్చేం. చెప్పనైనా చెప్పలేదు. పోనీ మీరు మళ్ళీ వెళ్లండి. నేను నారూముకి పోతాను' అనొచ్చు కదా. అనాలి,’’ అంది అరవింద.

‘‘ఏమో .. నీట్లోంచి బయట పడ్డ చేపలా కొత్తదేశంలో మనిషికి మాట తోచదు. పైగా సుందరం తనకంటే పెద్దవాడు, అనుభవజ్ఞుడూ... ఆయనకి తను చెప్పేదేమిటి? ఇంకా వాళ్ళ అనుబంధం అలాటిది అనుకొని ఉండొచ్చు కూడా. లేదా కేరటావకాయ కడుపులో మంటలు పెట్టేస్తుంటే బుర్ర పని చేయలేదేమో. వాళ్ళకి లేనిబాధ నాకెందుకు అనుకోవచ్చు,’’ అంది సిరి.

‘‘మరి సుందరం ఎకసక్కేలు ఎప్పుడూ తేలిగ్గా తీసుకునే లీలకి ఇప్పుడు కోపం ఎందుకు వచ్చిందంటావు?’’ అంటూ నావంతు ప్రశ్న వేసేను.

‘‘బాగుంది యక్షప్రశ్న. ఇది అరువిందకి వదిలేస్తున్నా. నువ్వు చెప్పు అరూ,’’ అంది సిరి అటు తిరిగి.

‘‘మంచి ప్రశ్నే. అవును. ఎంచేత లీల నొచ్చుకుంది? ఇంతకాలం ఇంటా బయటా కూడా ఇద్దరూ ఒకరినొకరు వేళాకోళాలు చేసుకుంటూనే ఉన్నారు కదా. మరి ఇప్పుడు వేరు ఎలా ఎందుకైంది? రెడ్డి కొత్తవాడు, పరాయివాడనా? అతను కూడా నవ్వినందుకా? మొగుడు కొట్టినందుక్కాదు తోడికోడలు నవ్వినందుకులాగ ....అసలవేవీ కావేమో ... సుందరం జోకులు పాతరికార్డులా అరిగిపోయి కీచుమనే సమయం ఆసన్నమయిందేమో? లీలకి హాస్యరసం ఆస్వాదించేగుణం తగ్గుముఖం పట్టిందేమో? హుమ్. ఇంకా ఆలోచించి, మరిన్ని పుస్తకాలు చదివి కానీ చెప్పలేను,’’ అంది అరవింద.

నేను లేచేను ఇంక వెళ్తాను అంటూ.

"ఉండండి. అప్పుడేనా ఎందుకంత తొందర," అంది అరవింద చెయ్యి పట్టి లాగుతూ.

‘‘అది కాదండీ. మనం ఇంకా నవ్వు గురించి మాటాడ్డానికి చాలా ఉంది. అప్పుడే వెళ్లిపోతానంటే ఎలా?’’ అంది తనే మళ్లీ.

"సరే. చెప్పు," అన్నాను, మళ్లీ కూర్చుంటూ.

‘‘అందరూ నవ్వుగురించి రాస్తారు. నోరి నరసింహశాస్త్రిగారు ఏడుపుగురించి భలే చెప్తున్నారు. నవ్యకవితలో కృష్ణశాస్త్రిగారు ఏడుపు ఫాషను చేసారు, ఏడుపులో మాధుర్యము చూపినారు అన్నా తప్పులేదు. శోకశాస్త్ర కోవిదుడు అంటారు కొందరాయన్ని. కృష్ణపక్షానికి ముందే ఆయన కన్నీరు అన్న కావ్యం రాసి ఏడుపులో ప్రత్యేక ప్రజ్ఞ సంపాదించుకున్నారుట. మరి అంతకుముందే నన్నయ్య, తిమ్మన, భట్టుమూర్తి, శ్రీనాధుడూ ఏడ్చారంటారు. ఇంతకీ ఈ ఏడుపుకవిత్వానికి ఆద్యులెవరో తెలీడంలేదు,’’ అంది అరవింద.

‘‘ఏడుపుకి ఆది ఏమిటి? పిల్లలు ఏడుస్తూనే పుడతారు కదా. ఏడుపు సృష్ట్యాదినుండీ ఉంది. ఆ తరవాత మనిషి అది లేదూ ఇది లేదూ అంటూ జన్మంతా ఏదో ఏడుపు ఏడుస్తూనే ఉంటాడు,’’ అంది సిరి.

‘‘అలా అనకు అమ్మమ్మా. అందరూ ఏడవడంకోసమే పుట్టరు. ఏడ్చేవాడికి ఏదో ఒక సాకు ఎప్పుడూ దొరుకుతుంది. అది వేరే సంగతి,’’ అంది అరవింద ఆరిందాలా.

‘‘ఆ సాకులేమిటో కూడా చెప్పు మరి,’’ అన్నాను కాలక్షేపానికి.

అరవింద నావేపూ, సిరివేపూ మార్చి మార్చి చూసి, ‘‘నాకు తెలీదులెండి,’’ అంది.

‘‘చెప్పడం ఇష్టంలేక అదో సాకు,’’ అన్నాను ఎద్దేవా చేస్తూ.

సిరి నవ్వింది. ‘‘తెలీడంలేదూ? తను మాటాడుతున్నది విషిగురించి.’’

‘‘ఆ కథ అయిపోయిందనుకున్నానే. మళ్ళీ ఏమయింది?’’

‘‘నన్ను వదిలేలా లేడు. డేటు కాదులే, కాఫీకి రా, సినిమాకి రా అంటూ ఏదో ఓ వంక పెట్టి పిలుస్తుంటాడు. నేను ఏ పార్టీకి వెళ్ళినా అక్కడ తనూ హాజరు వీళ్ళు నాక్కూడా స్నేహితులే అంటూ."

నాకేం చెప్పాలో తోచలేదు. చూస్తూ ఊరుకున్నాను.

"అరూ అరూ అంటూ ఒకటే గోల. అరవమంటారా?’’ అంది నామొహంలోకి పట్టి చూస్తూ.

నవ్వొచ్చింది కానీ నవ్వితే బాగుండదు. గబుక్కున మంచినీళ్ల గ్లాసు అందుకున్నాను.

‘‘నిజమే కావచ్చు కదా. ఒకే స్కూల్లో చదువుతున్నారు. ఇద్దరికీ తెలిసివాళ్ళుండడంలో ఆశ్చర్యమేముంది?’’

‘‘కాదండీ. నిజంగా ఏ స్నేహమూ లేకపోయినా పిలవకపోయినా తయారవుతాడు నేనూ ఉన్నానంటూ. ఇహనక్కడ ఫార్సు చూసితీరాలి. మరో అమ్మాయితో సరసాలాడుతూ, నన్ను వెక్కిరిస్తూ … అక్కడికి నేనేదో కుళ్ళుకుని పరుగెత్తుకెళ్ళి అతడిఒళ్ళో వాలిపోతానని.’’

‘‘మరి నీకు కుళ్ళుగా లేదా?’’

అరవింద మాటాడలేదు. మనిషన్నాక ఆమాత్రం ఉండకపోదు. ఎలప్రాయం, ఎంత కాదనుకున్నా తొలివలపు. అంతకుమించి సర్వసాధారణమయిన మనస్తత్త్వాలు కూడా ఉంటాయి కదా. అరవింద చూపు అటు మొగ్గుతోంది పైకి చెప్పకపోయినా.

‘‘కవులుమాటేమో కానీ నిత్యజీవితంలో వేళాకోళాలూ, హాస్యం, వ్యంగ్యం అన్నీ ఏడుపు దాచుకోడానికేనేమో. అది వదిలేయండి. నరసింహశాస్త్రిగారు ఈరోజుల్లో కూడా కవితల్లో ఏడుపు ఎక్కువగానే ఉందన్నారు కానీ నామటుకు నాకు అది మారిందనిపిస్తోంది. భానుమతిగారి **తెలివితేటలవిలువ, జీవితంలో అగాధాలు** కథల్లో కథానాయకులు ఏడవలేక నవ్వే సీదా మనుషులే. ముళ్ళపూడి వెంకటరమణగారు **భగ్నవీణలూ, బాష్పకణాలూ** కథలో హాస్యమే ఎక్కువ. అందులో నాయకుడూ నాయికా నిజంగా బాధ పడ్డట్టు కనిపించదు. ఆయనకి వారి హృదయవేదన అర్థం కాలేదో, దాన్ని తేలిక చేయాలనో.”

‘‘కలకంఠికంట కన్నీరొలికినయింట సిరి యుండనొల్లదంటారు కానీ కవిత్వం చిలుకుతుందేమో.”

“కవిత్వాలమాటకేంగానీ మాఅక్కయ్యయింట సిరులూ కన్నీరూ ఒక్కలాగే ఒలకడమేమిటి పొంగి పొరలుతున్నాయి. ఆవిడకి సదా నెత్తిమీద నీళ్ళకుండ ఉంటుంది. ఏడ్చి సాధించుకోడం అంటే ఏమిటో ఆవిడదగ్గరే నేర్చుకోవాలి,” అంది సిరి.

“శోకంలోనించి శ్లోకం పుట్టిందంటారు, అదే రామాయణమయింది. కానీ ఈమధ్య వచ్చిన కల్పవృక్షాలు, విషవృక్షాలూ, విషవృక్షఖండనలూ - ఎవరికి వారే వారి పాండిత్యం ప్రదర్శించుకోడానికే పనికొచ్చింది కానీ అందులో శోకమూ లేదు. హాస్యమూ లేదు. చివరి రెండిట్లో కోపం, కక్షలూ, కార్పణ్యాలూ బాగానే కనిపిస్తాయి. విషాదం వ్యంగ్యానికీ, కోపానికీ, చివరికి తిట్లలోకీ దిగుతోంది అనుకోవాలి.”

“పూర్వం తిట్లకి సంస్కృతం, ఇప్పుడు ఇంగ్లీషు.”

“లేదులే. అచ్చతెలుగు తిట్లు కూడా బాగానే చోటు చేసుకున్నాయి కదా ఈనాటి రచనల్లో.”

"బాగుందీ వరస. మనం ఎక్కడో మొదలెట్టి ఎక్కడో తేలేం. సాహిత్యంలో ఏడుపు ఎలా ఉంటుందంటే ..."

"ఎక్కడో తేలడం ఏమిటి. ఏడుపు మారి కోపతాపాల్లోకీ తిట్టుకవిత్వంలోకీ దిగిందని నిర్ధారణ చేసేం."

"అప్పుడు శ్లోకం ఇప్పుడు ఆవేశం?"

"బాగానే ఉంది ఏడుపుమీద మాటాడ్డానికి ఇంత ఉంటుందనుకోనే నేను," అన్నాను నేను లేస్తూ.

000

లీలకి నవ్వు రాలేదు. ఏడవాలనుంది కానీ అదీ రాడం లేదు. నగరివాకిట నుండు నల్లగుండులాటిదేదో గుండెల్ని పట్టి దిగలాగుతున్నట్టుంది. కారుమేఘాలు తరుముకొస్తున్నట్టుంది. రాబోయే శిశిరాన్ని రారమ్మంటూ స్వాగతం పలుకుతూ ఆకులు రాల్చుకుంటున్న మహావృక్షంలా ఉంది మనసంతా.

నోరి నరసింహశాస్త్రిగారు చెప్పినట్టు మహాకవులంతా ఏదో రకం ఏడుపు ఏడుస్తూనే ఉన్నారు అందరూ యుగయుగాలుగా. తనక్కూడా తనదైన ఫక్కీలో ఓ ఏడుపు రాకూడదూ ... ఎలాటి ఏడుపు బాగుంటుంది? అల్లసాని పెద్దనలా అల్లనల్లన? భట్టుమూర్తిలా బావురుమనా? ముక్కు తిమ్మనలా ముద్దుముద్దుగానా? కృష్ణశాస్త్రిలా ఎలుగెత్తి ఏడ్వనా?

సుందరాన్నే అడిగాలేమో ... ఆయనగారికి తెలీనిసంగతి లేదు, ఉపన్యసించలేని విషయం లేదు. ఆయనఅభిప్రాయాలకి గురి కాని వస్తువు లేదు భూనభోంతరాళాలో. అడగాలే కానీ ఏదో ఓ పుస్తకంపేరు చెప్పి ఉదాహరణలు గుప్పిస్తూ ఎన్నో సంగతులు వల్లించేయగలడు ఏకాకీని. పండితపరమేశ్వరుడన్నబిరుదు ఊరికే రాదు కదా. మూతిమీద మీసం మొలవకముందే విశిష్టసేవాపురస్కారం అందుకున్న ప్రముఖుడు. స్థానిక గురువరుడు.

నేనిప్పుడు మరో సుందరాయణం రాయలేమో? అనుకుంది వెలితినవ్వుతో.

నిజానికి తనది శోకం ఎప్పుడయింది? ఇంతకాలం నవ్వుతూ తుళ్ళుతూ గలగలా సెలయేరులా సాగుతున్న జీవితంలో ఎప్పుడు ఎక్కడ ఎలా గండి పడింది?

లీల ఆలోచనల్లో పడిపోయింది.

000

కూరలబజారులో లీల ఏం కొనడానికొచ్చిందో మర్చిపోయి అరలమీద వరసగా పేర్చిన సీసాలూ, ప్లాస్టిక్ సంచులూ, అట్టపెట్టెలూ చూస్తూ నెమ్మదిగా అడుగులేస్తోంది సంతలో తప్పిపోయిన నాలుగేళ్ల పిల్లవాడిలా.

ఎదురుగా విశాల చక్రాలబండితో నిలిచి, "బాగున్నారా?" అంది చిన్నగా నవ్వుతూ.

"ఆఁ బాగానే ఉన్నాను. మీరెలా ఉన్నారు?"

"ఏదో ఉన్నాం. రండి, మాఇల్లు చూద్దురు గానీ. ఈమధ్యనే కట్టించుకున్నాం."

"ఇప్పుడు కాదులెండి. మరోసారి వస్తాను."

"మరోసారి మళ్లీ రావచ్చు. ఒకసారి వచ్చి పోండి. దగ్గిరే."

"దగ్గిరా?" అంది లీల ఆలోచిస్తూ.

"దగ్గిరే. పొయ్యిమీద పెనం పెట్టి, ఉప్పుకో మిరపకాయకో రావచ్చు. అన్నట్టు నిజంగానే కౌంటరుమీద ఉల్లిపాయలు తరిగి పెట్టి వచ్చేసేను, ఉప్మా చేద్దాం అని. తీరా చూస్తే టొమేటోలు లేవు. నాకు ఉప్మా అంటే టొమెటో ఉండితీరాలి అంచేత వచ్చేను, రండి. మీరు కూడా ఉప్మా తిని పోదురుగానీ," అంది విశాల గుక్క తిప్పుకోకుండా.

లీలకి మనసు బాగులేదు. "ఇవాళ కాదులెండి, మరోసారి వస్తాను."

"ఫరవాలేదు రండి. మరోసారి మళ్ళీ వద్దురుగాని. ఇప్పుడొచ్చి తాజా తాజా టొమేటోతో చేసిన ఉప్మా తినేసి వెళ్ళిపోండి. చెప్పేను కదా సరంజామా అంతా సిద్ధంగానే ఉంది. స్టౌమీద నీళ్లు పెడితే మూణ్ణిముషాల్లో వేడి వేడి ఉప్మా సిద్ధం."

లీలకి కబుర్లు చెప్పే ఓపిక లేదు కానీ ఇంటికెళ్ళాలని కూడా లేదు. రెండురోజులక్రితం సుందరంతో తగువేసుకుని, ఇంట్లో ఉండలేక బయటికి బయల్దేరింది. గంటసేపు ఊరు సగం తిరిగి, అప్పటికీ ఇంటికెళ్ళడానికి మనసు రాక, మరెక్కడికీ వెళ్ళలేక, పార్కుకెళ్లి అక్కడ కార్లోనే పడుకుంది చీకటి పడేవరకూ. అది తలపుకొచ్చి మరింత చికాకైపోయింది మనసు ఇప్పుడు.

"సరే. పదండి. అట్టేసేపు ఉండను మరి. మళ్ళీ మీరేం అనుకూడదు. నేను కూడా ఇంట్లో వంటకి సరంజామా కౌంటరుమీద పెట్టి వచ్చేను," అంటూ దారితీసింది.

ఇద్దరూ విశాల ఇల్లు చేరుకున్నారు పది నిముషాల్లో.

హాల్లో వినయ దేవీవిగ్రహానికి అలంకరణ చేస్తున్నాడు. విశాల వంటింట్లోకి వెళ్లి పొయ్యిమీద గిన్నె పెట్టి, ఓ గరిటెడు నూనె వేసి, హుషారుగా టొమెటోలు తరగడం మొదలు పెట్టింది.

వినయ లీలని చూసి చిన్నగా నవ్వేడు. లీల అక్కడే నిలబడి, దేవీవిగ్రహానికి అతను చేస్తున్న అలంకరణలు చూడసాగింది కుతూహలంగా.

"ఊదారంగు చీరె బాగుంది. కట్టు," అంది.

"లేదండీ. అది నిన్న కట్టేను. ఈరోజు పచ్చరంగు అనుకుంటున్నాను," అన్నాడు వినయ. తలొంచుకుని ఒకొక నగా చేతిలోకి తీసుకుని పరీక్షగా చూస్తూ.

"కట్టిన చీరె కట్టదేమిటి మీ అమ్మవారు," అంది లీల తేలిగ్గా నవ్వుతూ.

వినయ కూడా చిరునవ్వు నవ్వేడు. "నవరాత్రులు కదండీ. ఒకొక రోజు ఒకొక అలంకరణ," అన్నాడు ఆ విగ్రహానికి పచ్చచీరె నేర్పుగా చుట్టి, కుచ్చెళ్లు సర్ది, మీద పచ్చరవిక తొడిగి, మెళ్ళో పచ్చరాళ్ల నెక్లెస్ అమర్చి, ముక్కుకీ చెవులకీ ఆభరణాలు ఏది బాగుంటుందో చూస్తున్నాడు ఒకొకటే ఎత్తి పట్టుకు.

"మ్. ఈ అమ్మవారు ఊరుకున్నా మీ అమ్మగారు ఒప్పుకోరేమోలే."

"అదేంలేదండీ, అదంతా వాడిష్టమే. నాకేం సంబంధం లేదు," అంది విశాల పోపేసి, నీళ్లు పోస్తూ. పోపులో నీళ్లు చుయ్యంటూ శబ్దం చేసి చల్లారేయి.

లీలకి మొదట అర్థం కాలేదు.

విశాలే అంది మళ్లీ. తను ఈ పూజలూ, వ్రతాలూ అవీ ఏం చెయ్యదుట.

"మరి మీ అబ్బాయికి ఎలా వచ్చింది? వాళ్ళనాన్న చేస్తారా?"

"లేదు. ఆయన ఇప్పుడు లేరులెండి. ఉన్నప్పుడు కూడా అంత పట్టింపుల్లేవు. వీడికెలా వచ్చిందో నాకూ తెలీదు కానీ వాడికి మూడేళ్లప్పుడే మొదలయింది."

లీల మళ్ళీ ఆ అబ్బాయివేపు చూసింది. మహా అయితే పన్నెండేళ్లుంటాయేమో. సాటిపిల్లలతోనో ఒంటరిగా ఏ విడియో ఆటలో ఆడుకుంటూ అల్లరచిల్లరగా తిరిగే వయసు. ఇంత దైవభక్తి, శ్రద్ధ ఎలా వచ్చాయో!

లీల వంటింటివేపు నడిచి కౌంటరుదగ్గర నిలబడింది.

"ఏమిటో దిగులుగా కనిపిస్తున్నారు. వంట్లో బాగులేదా?" అంది విశాల కన్నెత్తి లీలవేపు చూడకుండా.

"ఏం లేదండీ. బాగానే ఉన్నాను." అంది లీల నిరామయంగా.

"ఎప్పుడూ నవ్వుతూ నవ్విస్తూంటారు హుషారుగా. ఏంలేదంటే ఎలా నమ్మమంటారు. మనసు బాగులేదా, ఆరోగ్యం బాగులేదా?" అంది విశాల మళ్లీ వదలకుండా.

హఠాత్తుగా లీలకి ఉప్పెనగా దుఃఖం వచ్చింది. పూడుకుపోయిన గొంతుతో నాలుగురోజులక్రితం జరిగిన ఉదంతం - తనూ, సుందరం, సినిమా, రెడ్డి ఉదంతం చెప్పింది.

"ఏమోలెండి. ఆయనదృష్టిలో ఆయన చేసింది తప్పుకాదు. అదేమని అడిగిన నాదే తప్పేమో." అంది చివరికి.

విశాల కాస్సేపు ఊరుకుని, నెమ్మదిగా అంది, "అతను ఇన్నాళ్ళూ మీతో ఎలా ప్రవర్తించేరో ఆరోజు అంతే అనుకుంటా. అంటే మీరు ఇంట్లో మనిషి. మర్యాదలు పాటించక్కర్లేదు. పైగా మీరు ఆయనగారి సహధర్మచారిణి కనక ఆయన చేసినపనికి మద్దతు ఇవ్వాలి. అది మీధర్మం. మనదేశంలో అతిథిసేవకి అంత విలువ మరి. అటు రామిరెడ్డి కొత్తగా కలిసిన స్నేహం. అదో రకం ఉత్సాహం. అన్నీ కలిసి మిమ్మల్ని నిర్లక్ష్యం చేస్తున్నట్టు తోచకుండా చేసేయేమో."

"ఏమోనండీ. నాకు మాత్రం మరుద్దామన్నా మరుపు రాకుండా ఉంది. తలుచుకోడానికే బాధగా ఉందసలు."

"బాధ శరీరానికే కానీ ఆత్మకి లేదు."

లీల ఉలికిపడి ఆ మాట వచ్చినవేపు తిరిగి చూసింది.

వినయ తదేకధ్యానంతో దేవీవిగ్రహం అలంకరణలో మునిగి ఉన్నట్టున్నాడు. అయినా తమమాటలు వింటున్నాడన్నమాట.

"ఏమన్నావూ?" అంది లీల నమ్మలేనట్టు. బొమ్మలకి అలంకారాలు చెయ్యడం వేరూ, ఆత్మజ్ఞానం మాటాడ్డం వేరూ కదా.

"బాధ శరీరానికే కానీ ఆత్మకి లేదండీ."

లీలకి గుర్తొచ్చింది. ఈ అబ్బాయే సౌజన్య ఇంట్లో ఉపనిషత్తులూ శంకరభాష్యాలు చదివేనని గోపాచార్యగారికి చెప్పింది.

"మనం ఈ శరీరాలలోనే ఉన్నాం కనక శరీరానికి కలిగిన బాధ మనకి కలిగినట్టు కాదా?"

"మీరు నవ్వినప్పుడు మీకు బాధగా అనిపించలేదు. నవ్వుని అంగీకరించేరు. అలాగే బాధని కూడా అంగీకరించాలి. ఉపనిషత్తులు చెప్పేది అదే. సుఖంలాటిదే దుఃఖం, సంతోషంలాటిదే విచారం. రెంటినీ సమదృష్టితో అంగీకరించినప్పుడు సంతోషమూ, బాధా కూడా మనని అంటవు."

లీలకి ఈ కుర్రవాడిఆలోచనలు ఆశ్చర్యం. వాదన అని కాకపోయినా ఏమంటాడో చూదాం అనిపించింది సరదాకే కావచ్చు. "రెండూ ఒకటే అయితే మంచిని వదిలేసి చెడునీ, సుఖాన్ని వదిలేసి దుఃఖాన్నీ, సన్మార్గాన్ని వదిలి దుర్మార్గాన్నీ ఎందుకు స్వీకరించకూడదు. మనం ఎవరం అది చేయం కదా?" అంది.

"అది కుతర్కం. మానవజన్మ ఉత్కృష్టమయినది. ఈ జీవితంలో మంచిని పాటించడంద్వారా జీవన్ముక్తులవడానికి అవకాశం కల్పించబడింది. దాన్ని వినియోగం చేసుకోవలసినబాధ్యత మనదే."

"మానవజీవితం ఉత్కృష్టమయిందని చెప్పింది మానవుడే కదా."

''కాదని మీరు నిరూపించగలరా?"

"సరే నీమాటే నిజం అనుకుందాం ప్రస్తుతానికి. నవ్వు వచ్చినప్పుడు మనసుకి తృప్తిగా ఉంటుంది, ప్రశాంతంగా ఉంటుంది. బాధ కలిగినప్పుడు మనస్తాపానికి గురి అవుతాం. ఎంచేత?"

"అదే అంటున్నాను. ఈ సుఖదుఃఖాలు మీభావనలో ఉన్నాయి. వాటికి మీరు ఇచ్చుకునే వ్యాఖ్యానాల్లో ఉన్నాయి. మనవాళ్ళు చూడండి చిన్నపిల్లలకి చక్కిలిగింతలు పెడతారు. పిల్లలు నవ్వుతారు. ఆ నవ్వు కృతకంగా ఏర్పడింది, శారీరకమైన ఒక స్పందన మాత్రమే అది. నేను మీచేతిమీద కొట్టబోతే మీరు చెయ్యి వెనక్కి లాక్కున్నట్టే - అసంకల్ప ప్రతీకారచర్య. ఆ పిల్లవాడి నవ్వులో సంకల్పం లేదు. నిజానికి అలా చక్కిలిగింతలు పెడుతున్నప్పుడు ఆ పిల్లవాడికి బాధగా ఉండవచ్చు. పెద్దవాళ్లకి అది తోచదు. వాళ్లకి పిల్లవాడు నవ్వడమే కనిపిస్తుంది. సంబరపడతారు. బాహ్యంగా కలిగే ఈసుఖదుఃఖాలు కూడా అలాటివే."

లీలకి అతనివాదనలో కొంత నిజం కనిపించింది. ముఖ్యంగా చక్కిలిగింతలు పెట్టడం విషయంలో. అసలావిషయం ఎంతమంది ఆలోచిస్తారు?

"మరో ఉదాహరణ చెప్తాను," అంటూ వినయ కొనసాగించేడు. నెలరోజులక్రితం వాళ్లమ్మ వినయకి చెప్పినకథ -

రోజంతా ఎండలో తిరిగొచ్చింది. మంచంమీద పడుకోగానే గాఢంగా నిద్ర పట్టేసింది.

“అమ్మా, తలుపు తియ్యి, తియ్యి” అంటూ ఢిల్లీలో ఉన్న అక్క బొంగురుగొంతు వినిపించింది. అమ్మ లేవబోయింది కానీ కాళ్లూ, చేతులూ కదల్లేదు ఎంత గింజుకున్నా. బలవంతాన కళ్ళు విప్పి చూసింది. కిటికిలో అక్కనీడ కనిపించింది, గోలగోలగా ఏడుస్తూ తలుపు తియ్యమంటోంది. ఎవరో పోలీసుజవానులా ఉన్నాడు వచ్చి నెమ్మదిగా అక్కభుజంమీద చెయ్యేశాడు అభయమిస్తున్నట్టు.

ఆఖరికి అతికష్టంమీద గొంతు పెగల్చుకుని వస్తున్నా అంటూ అమ్మ లేచింది.

మళ్లీ కిటికీవేపు చూస్తే ఇందాకా చూసిన కిటికీ లేదు, అక్కనీడా లేదు.

కల. కానీ ఎంతో నిజంగా జరిగినట్టే ఉంది మేలుకున్న తరవాత కూడా.

లేచి, ఫోను తీసి అక్కని పిలిచింది, “ఎలా ఉన్నావు?”

“నేను బాగానే ఉన్నా. మామూలుగా నువ్వీవేళకి పడుకుంటావు కదా?”

“పడుకున్నా. కలొచ్చింది నువ్వు ఎందుకో ఏడుస్తున్నట్టు. ఏమయిందోనని ...”

“లేదే. ఏమీ కాలేదు. బాగానే ఉన్నాను. రేపు ఒక మీటింగుంది. కాయితాలు చూసుకుంటున్నా. నువ్వెలా ఉన్నావు?”

“బాగానే ఉన్నా. అబ్బ, ఆ కల ఎంత వాస్తవంగా అనిపిస్తోందో ఇప్పటికీ, మెళుకువ వచ్చేసింతరవాత కూడా. సరేలే, నేను మళ్లీ పడుకుంటా. నీపని చూసుకో,”

వినయ మళ్లీ కొనసాగించేడు, “చూసేరా. అదొక చేతనాచేతనావస్థ. మాఅమ్మకి అది కలే అని స్పష్టంగా తెలిసినా చేతనావస్థలో కూడా ఇంకా వాస్తవంగానే అనిపించింది. ఫోను తీసి మాఅక్కతో మాటాడేవరకూ ఊరుకోలేకపోయింది. నిజానికి అది కలే కదా. అయినా మాఅమ్మకి ఆ క్షణంలో అది నిజం. అదీ మనం గమనించవలసింది. జీవితం కూడా కలలాటిదే. మనం ఏది నిజం అనుకుంటున్నామో అది భ్రమ.”

“అంటే నాబాధ నిజం కాదనా నువ్వనడం?”

“మీనవ్వులాటిదే ఆ నిజం కూడా. నవ్వు నిజమైతే బాధా నిజమే. నవ్వు భ్రమ అయితే బాధ కూడా భ్రమే. రెండూ సమంగా చూడడమే జ్ఞానం.”

"మనవాళ్ళు పోనిద్దూ అదేం పట్టించుకోకు అంటారు. ఇక్కడ Therapists సలహాలు కూడా అలాగే ఉంటాయి. ఇదేనేమో మనవేదాంతాలు చెప్పేది కూడా."

"అవి లౌకికం.  నిత్యవ్యవహారాల్లో అలా పట్టించుకోకపోవడం, సర్దుకుపోవడం, పొమ్మని చెప్పడం, ఆచరించడం శారీరకస్థాయిలో జరిగే ఆలోచనలు. వారివారి సంస్కారాన్నిబట్టి కూడా ఉంటుంది. ఒక స్థాయిలో ఈలోకంలోని అనుభవాలు, సంగ్రహించిన భావాలే కాక పూర్వజన్మవాసనల ప్రభావం కూడా ఉంటుంది.

మరొకస్థాయిలో ఈ విషయాన్ని నిశితంగా, క్షుణ్ణంగా పరిశీలించుకోవచ్చు. ఈ శరీరం వేరు. నేను ఈ శరీరం కాదు. ఈ శరీరం పరిణామస్వభావం కలది. వృద్ధి పొందడం, క్షీణించడం, నశించడం ఒక క్రమపద్ధతిలో జరిగిపోతాయి. నిత్యసత్యమైన ఆత్మకి పరిణామస్వభావమూ లేదు, ఈతిబాధలూ లేవు. అది ఆకళించుకోడమే జ్ఞానం. ఆ గ్రహింపు గలవారు ద్వంద్వాతీతులు."

లీల అవాక్కయిపోయి చూస్తూ ఉండిపోయింది. ఇంత చిన్నకుర్రవాడిలో ఇలాటి ఆలోచనలు, ఇంతటి అవగాహన ఎలా కలిగింది?

"ఏం చదువుతున్నావు?"

"7"

“రండి. మాటల్లో పడి నా ఉప్మా మరిచిపోతారు. చల్లారిపోతే బాగుండదు,” అంటూ విశాల పళ్ళేలూ, గిన్నెలూ బల్లమీద సర్దుతూ పిలవడంతో, ఇద్దరూ లేచి భోజనాలబల్లవేపు నడిచేరు.

మరో అరగంట కూర్చుని లీల శలవు తీసుకుంది.

## 7

ఇంటికొస్తున్నంతసేపూ దారిపొడుగునా, ఇంటికొచ్చేకా లీలని వినయమాటలే వెంటాడుతున్నాయి. అంత చిన్నకుర్రవాడిలో అంత గంభీరమైన, క్లిష్టమైన ఆలోచనలు ఎలా కలిగేయి అన్న ప్రశ్న కన్నా ఆమాటలలో అంతరార్థాలగురించే ఆలోచిస్తోంది.

మనుషుల ఆలోచనలూ, ఆచారాలూ యుగయుగాలుగా మారుతూనే ఉన్నాయి. అసలు ఒక యుగంలోనే అనేక భావాలు. త్రేతాయుగంలో రాముడిని ఏకపత్నీవ్రతుడని ఎంతో ప్రశంసిస్తారు. తండ్రి దశరథుడు  పాటించిన ఆచారం అది కాదు. ఏదో ఒక ధర్మాన్ని ఆవిష్కరించి ప్రజలని ఆ ధర్మం ఆచరించేలా చేయడమే రామాయణం ధ్యేయం.  ద్వాపరయుగంలో ధర్మం వేరు. కృష్ణుడు ఏకపత్నీవ్రతం పాటించినట్టు లేదు. ప్రతి యుగానికి కనీసం కొన్నివిషయాల్లో ధర్మాలు మారుతున్నాయి. మారడం సహజం. కలియుగంలో ధర్మం ఏమిటో ఇంకా స్పష్టమయినట్టు లేదు. బహుశా మరోయుగం కావాలేమో దీన్ని నిర్వచించడానికి.

నేను అంటే ఈ శరీరం కాదు అన్నాడు వినయ. నేను చూస్తున్నాను అంటే నాకళ్ళు చూస్తున్నాయి అని. నేను ఆ కళ్ళు కాదు. నాకళ్లు చూస్తున్నాయి అంటే నేను వేరు, కళ్ళు వేరు అని వేరు చేస్తున్నాను. నాకళ్ళు నేను కానట్టే ఈశరీరం నేను కాదు.  ఆత్మ కాదు. ఆత్మ నాలో ఉంది కానీ నేను ఆత్మ కాదు. నేను అంటే ఈ శరీరమే తాత్కాలికంగా లౌకికవ్యాపారాలకి సంబంధించినందుకు.

సుందరం అంటే సుందరం కాడు. సుందరం ఒక శబ్దం. పేరు ఒక శబ్దం. సుందరం పలికిన పలుకు శబ్దం, నోటినుండి వెలువడి గాలిలో కలిసిపోతాయే శబ్దాలు.

నేను నేను కాను కనక ఆ శబ్దాలు కూడా ఈ శరీరానికి వర్తిస్తాయేమో కానీ నేను అయిన ఆత్మకి తగలవు.

బహుశా ఏ మూలో మనసు చీకటికోణాల్లో అట్టడుగు పొరల్లో నాకు ఇలా అనిపించడంచేతనేనేమో సుందరం హాస్యం పట్టించుకోలేదు ఇంతవరకూ. మరి ఇప్పుడు ఎందుకు పట్టించుకుంటున్నాను?

నేను ఈ శరీరం కాదనుకుంటే అతను ఆ శరీరం కాదు. అసలు తనకి చిన్నప్పట్నించీ ఈ ఎడం ఉంది. ఎక్కడ ఎవరితో మాటాడుతున్నా తను కొంచెం ఎడంగా నిలబడి నాటకం చూస్తున్నభావం కలుగుతుంది. అంటే తనని తాను వేరు చేసుకుని చూసుకుంటోంది అనే కదా. ఈ ఆత్మ, పరమాత్మ ఆలోచనలు లేవు కానీ ఎందుకో తాను ఈలోకంలో భాగం కాదన్న భావం స్థిరంగా ఉంది. అందుకేనేమో సుందరం హాస్యాలు తనని అంతగా బాధించలేదు ఇంతకాలం. మరి అదే నిజమనుకుంటే, ఇప్పుడు మాత్రం ఎందుకు నొప్పి?

"ఏమిటలా చూస్తున్నావు, కొత్తవాణ్ణి చూసినట్టు," అన్నాడు సుందరం తలుపు తీసుకు లోపలికొచ్చేడు.

లీల అతనివేపు చూసింది. ఎవరితను?

"ఏమిటలా చూస్తున్నావు కొత్తవాణ్ణి చూసినట్టు. నన్ను మరిచిపోయేవేమిటి, నేను సుందరాన్ని," అన్నాడు నవ్వుతూ.

హీహీ అంది లీల వెక్కిరిస్తున్నాట్టు.

సుందరం అలవాటుప్రకారం కౌంటరుమీదున్న కాఫీ కప్పులో పోసుకుని తనగదిలోకి వెళ్ళిపోయేడు.

లీలకి ఆలోచనలు తెడగం లేదు. ఆలోచనలు మళ్ళించడానికి తాను ఈమధ్య చూస్తున్న twilight zone షో తెరిచింది టీవీలో. మామూలుగా ఒకదానితరవాత ఒకటి వాళ్ళు ప్రసారం చేస్తున్నదే చూస్తుంది కానీ ఇవాళ ఆ వరస ఎందుకో మార్చాలనిపించింది. రెండు ఎపిసోడ్స్ దాటేసి, మూడోది చూడ్డం మొదలుపెట్టింది.

బస్సుకోసం ఎదురుచూస్తూ బస్టాండులో కూర్చున్న ఒకఅమ్మాయికి విచిత్రమైన అనుభవాలు కలుగుతాయి. అక్కడ ప్రతివారూ ఇంతకుముందు వచ్చేవు కదా, ఇదే మాట క్షణంక్రితం అడిగేవు అంటూ ఆమెని అయోమయంలో పడేస్తారు. మొదట అయోమయంలో పడి, తరవాత ఆ అమ్మాయి ఒక ఆలోచన చేస్తుంది. ప్రతివారికి రెండు శరీరాలు ఉంటాయి. ఆ రెంటికీ సమన్వయం కుదరకపోవడంల్ల అయోమయావస్థ కలుగుతుంది. అది గ్రహిస్తే, అయోమయం ఉండదు.

లీలకి ఒక్కసారిగా ఆశ్చర్యం ముంచుకొచ్చింది. సుమారుగా ఆ సమాధానం తనకి కూడా అన్వయించుకోవచ్చు. తనకి రెండు ఎపిసోడ్స్ దాటేయాలన్న ఆలోచన కలగడానికి కారణం ఈ జవాబు నాకు ఇవ్వడానికేనా? రెండు శరీరాలు ఉంటాయన్న ఊహ కొంతవరకూ శరీరం, ఆత్మలకి అన్వయించుకోవచ్చు కదా. అసలు ఈరోజు జరిగినవన్నీ యాదృచ్ఛికాలే -

బజారుకెళ్ళడం

విశాల కనిపించడం

వాళ్లింటికి తాను వెళ్ళడం

వాళ్ళింట్లో వినయ వేదాంతబోధ

ఆఖరికి టీవీలో ప్రత్యేకించి ఆ ఎపిసోడ్ రావడం -

ఒక్కటి కూడా తాను ముందు అనుకున్నది కాదు. అన్నీ కాకతాళీయమే!!

సుందరం మళ్లీ హాల్లోకి వచ్చి, "అలా పుస్తకాలషాపుకి వెళ్లొస్తాను" అని చెప్పి వెళ్లిపోయేడు.

000

"ఏమయ్యా సుందరం, చాల్రోజులయింది చూసి. బాగున్నావా, లీల ఎలా ఉంది.?" అన్నాడు ప్రాభాస్రావు అతనికి ఎదురుగా మరో కుర్చీలో కూర్చుంటూ.

సుందరం ఉలికిపడి అటుతిరిగి, ఆయనవేపు చూస్తూ, “ఓ, అంకుల్, ఆ, బాగానే ఉన్నానండి. ఆంటీ వీషీ బాగున్నారా?” అన్నాడు తిరుగుటపాలాటి జవాబిస్తూ.

“నాలుగేళ్ళయి ఉంటుంది. పిలుద్దాం అనుకుంటూనే ఏదో అలా అయిపోతోంది ఎప్పటికప్పుడు. పైగా నాకు తీరినా నీకు తీరిక ఉండదేమో అనొకటీ,” అన్నాడు ప్రభాస్రావు.

“నిజమేనండీ. ఈదేశంలో చావడానికి కూడా ముందే చెప్పుకోవాలి వారాలబ్బాయిలా. ఆ యమధర్మరాజే వచ్చినా, ఇప్పుడు కాదు బాబూ, ఆర్నెల్లతరవాత కనిపించు అనాలి.”

“బాగా చెప్పేవు.”

సుందరానికి ఈయన ప్రత్యేకించి ఇవాళ ఇలా తనకి “తటస్థపడడం” అనుకోకుండా జరిగినట్టు లేదు.

తను తరుచూ పుస్తకాలషాపుకి వస్తాడని తనని తెలిసినవాళ్లందరికీ తెలుసు. ఇది తనకి చాలా ఇష్టమయిన ప్రదేశం. ఇక్కడ పుస్తకాలే కాక కూర్చుని కాఫీ తాగడానికీ, కబుర్లు చెప్పుకోడానికీ కూడా అవకాశాలున్నాయి.

రెండు నిముషాలు నిశ్శబ్దం.

“నువ్వూ లీలా ... మీరిద్దరూ బాగానే ఉన్నారా?” అన్నాడు ప్రభాస్రావు గొంతు తగ్గించి, అటూ ఇటూ చూస్తూ.

సుందరం మనసులోనే ఉలికిపడ్డాడు.

“ఏం లేదు. పెద్దవాణ్ణి కదా. మీనాన్నా నేనూ ఓ కంచంలో తిని ఓ మంచంమీద పడుకోలేదు గానీ ఇంచుమించు కవలపిల్లల్లాగే పెరిగేం హైస్కూలు అయిపోయేవరకూ. మీపెళ్ళికి కూడా వచ్చేను, గుర్తుందా? అంచేత మనవాడెలా ఉన్నాడో అని అప్పుడప్పుడూ అనుకుంటూ ఉంటానంతే.”

“థాంక్స్. బాగున్నామండీ. ఇంట్లో ఒకత్తీ ఉంటుంది తోచడం లేదంటే కొత్త కంప్యూటరు కొనిచ్చేను, చాలా సంబరపడిపోయిందనుకోండి,” అన్నాడు సుందరం గబగబా.

మళ్ళీ రెండు నిముషాలు నిశ్శబ్దం. ఇద్దరూ షాపులోకి వచ్చే పోయేవారినీ, కాఫీలు తాగుతున్నవారినీ, కాఫీ కప్పు పుచ్చుకు, ఏ పుస్తకమో దీక్షగా చదివేసుకుంటున్నవాళ్ళనీ చూస్తూ కూర్చున్నారు.

ప్రభాస్రావే మళ్లీ మొదలుపెట్టేడు, “ఆమధ్య ఏదో విన్నాలే. లీల ఎవరితోనో ఏదో అందని మీ ఆంటీ నాతో అంది. దానికేముందిలే ఏవో చిన్నచిన్న తగూలు సహజమే కదా మొగుడూ పెళ్ళాలన్నతరవాత అన్నాను.”

“ఏం తగువండీ?” అన్నాడు సుందరం కంగారు కప్పిపుచ్చుకుంటూ.

“హుం. చూశావా. నేనూ అదే అనుకున్నాను తగువు ఏమిటిలే ఏదో మాటా మాటా అనుకున్నారేమో. అంతమాత్రానికి తగువనడమేమిటి అని."

సుందరం అయోమయంగా చూసేడు, "ఎవరిమాటండి, లీలా నేనూనా? మాకేమీ తగువుల్లేవే."

"… మ్… ఆ … అదే ఆమాటే అన్నాను మాఆవిడతో. అసలు సంగతేమిటంటే … అదే నువ్వూ, ఆవిడా మరెవరితోనో సినిమాకి వెళ్ళి, ఆవిణ్ణి ఒక్కదాన్నీ ఒదిలేసి వచ్చేశావుట. అందుకు ఆవిడ చాలా బాధ పడిపోయి ఆ విశాలగారితో చెప్పుకుందిట.” ప్రభాస్రావు అదేం పెద్దవిషయం అనుకోలేదులే అనిపించే స్వరంతో.

“ఓహ్ … అదా. అబ్బే, అదేంలేదండీ. తను ఆ క్షణానికి కాస్త బాధ పడిందనుకోండి. ఉప్పూ పులుసూ తినేవాడికెవరికైనా అలా అనిపించడం సహజమే కదండీ. ఆతరవాత నేను పరిస్థితి చక్కగా విడమర్చి చెప్పింతరవాత తను కూడా ‘నిజమే‘ అంది. తనకి ఆమాత్రం తెలీక గాదండీ. అసలు సమస్యేమిటంటే లీలకోపం చితుకులమంట. స్వల్పవిషయానికే అగ్గిపుల్లలా భగ్గున మండి చప్పున చల్లారిపోతుంది.”

“నేను అదే అనుకున్నాలే,” అన్నాడు ప్రభాస్రావు తృప్తిగా.

"ఏం చెప్పేనని అడగరేం? అసలు అంతెందుకూ, మీరే చెప్పండి ఇలాటి సందర్భాలలో మధ్యేమార్గం ఉంటుందా? 'మీరెళ్ళండి, నేను మాఆవిడని ఒంటరిగా వదిలి రాలేను' అని రెడ్డికేనా చెప్పాలి, 'నేను రెడ్డితో వెళ్తున్నాను, నువ్వు తరవాత రా' అని లీలకేనా చెప్పాలి. అంతేగదా. ఇద్దరితోనూ ఉండడానికి నాకేం రెండు శరీరాలు లేవు కదా. నేనేం ఆ వాసుదేవుణ్ణి కాదుకదా ఇక్కడా అక్కడా, ఎందెందు చూచిన అందందు కనిపించడానికి. హా హా. లేదులెండి, ఊరికే హాస్యానికంటున్నా. పాపం రెడ్డి 'కడుపులో కెలికేస్తోందండి, నేనింక కూర్చోలేను' అనగానే, నాకు మరేం తోచలేదు. 'పదండి,' అని బయటికి తీసుకుపోయేను. ఆతరవాత ఏదో మాటాడుకుంటూ ఇంటికి వచ్చేసేం. లీల ఇంటికి వచ్చేవేళకి మేమిద్దరం పేకాడుతూండడమే తనకి కనిపించింది కానీ అతను ఆ మధ్యలో ఎంత అతలాకుతలం అయిపోయేడో తెలీలేదు. అంచేత ఆ క్షణానికి కోపం తెచ్చుకుంది. తరవాత నేను వివరించి చెప్పేక తను కూడా అర్థం చేసుకుందిలెండి."

"ఆహా. అయితే నువ్వు మాటాడేవన్నమాట ఆవిడతో. బావుంది. మరి ఆమాత్రం దానికి ఆ విశాలగారిదగ్గర ఎందుకూ ఆ ఏడుపూ?"

"ఏమోనండి. మనవాళ్ళు అదుగో పులి అంటే ఇదుగో తోక అనేరకం. పులీ, తోకా లేనిచోట కూడా ఓ కాయితప్పులిని పుట్టించి, కలకలం రేపుతారు. అసలు లీల ఏమందో, ఆ విశాలగారు ఏం అర్థం చేసుకున్నారో … హుమ్. ఆడవాళ్ళు …."

"మాబాగా చెప్పేవు సుందరం. నాకు తెలుసు నువ్వు ఎలాటి విషమపరిస్థితులయినా తేలిగ్గా సమర్థించుకు రాగలవు, నీకది వెన్నతో పెట్టిన విద్య మీనాన్నలాగే."

"మీకు తెలుసా. మేం విస్కాన్సిన్ వచ్చినకొత్తలో తెలుగుమొహాలకి వాచిపోయేవాళ్ళం. నేను కాదులెండి, లీలకే. తెలుగువాడు కనిపిస్తే, సాక్షాత్తూ శ్రీవెంకటేశ్వరస్వామి ప్రత్యక్షమయినంత పొంగిపోయేది. అప్పుడే ఏదో షాపులో కనిపించి నాయుడుగారు కొత్తగా వచ్చేం అని తెలిసి, వాళ్ళింటికి పిలిచేరు. ఆరోజు ఆవిడ చేసిన మిరప్పళ్ళపచ్చడి లీల ఇప్పటికీ తలుచుకుంటుంది. దేశం కాని దేశం వచ్చేక ఇక్కడ ఉన్నవాళ్ళే కద మనకి తల్లులూ, తండ్రులూ, చెలులూ, సఖులూ, బంధువులూను."

"నేనూ అదే అన్నాను మాఆవిడతో. లీలకి అంత బాధగా ఉంటే ఆమాట సుందరంతోనే చెప్తే పోయేది కదా అని. ఊళ్ళోవాళ్ళతో చెప్తే వాళ్ళేం చేస్తారు? ఇదుగో ఇలా కాకిగోల చేసి, నీ పరువు తియ్యడం తప్ప."

"నేను అదే చెప్పేను లీలకి. రెడ్డి కొత్తవాడు. అతనేం అనుకుంటాడో అని మనం బాధపడాలి కానీ నీకూ నాకూ మధ్య ఈ మర్యాదలూ, మన్ననలూ ఏమిటి అని. నిజం చెప్తున్నా అంకుల్. అసలు మేమిద్దరం ఒక్కతాటిమీద నడుస్తాం, ఒక్కమాటమీద నిలబడతాం. తనేం చేసినా నేనేం అనుకోను. నేనేం చేసినా తనేం అనుకోదు. అసలు మేం ఒకరినొకరం అర్థం చేసుకున్నంతగా ఉన్నవాళ్ళు తక్కువే నన్నడిగితే. ఇక్కడ అమెరికనులకి అలాటి తెలివితేటలు లేవు కనకే అస్తమానం 'ఐ లౌ యూ, ఐ లౌ యూ' అంటూ హామీలిచ్చుకుంటూ ఉంటారు ఒకరికొకరు. మన సంప్రదాయంలో అది లేదు. ఎందుకంటే ఇదే కారణం. మనలో భార్యాభర్తలు ఒకరినొకరు అర్థం చేసుకుని, ఒకరిప్రవర్తనని మరొకరు గౌరవించే ఆచారం ఉంది."

సుందరం మన సంస్కృతీ, సంప్రదాయాలగురించి ఇనుమిక్కిలి ఉద్రేకంతో చెప్పుకుపోతుంటే, ప్రభాస్రావుకి ముచ్చటేసింది.

"అవును సుందరం, నీకు మన సంప్రదాయాలు ఇంత చక్కగా అవగాహన ఉండబట్టే మీ సంసారం సజావుగా సాగిపోతోంది. చెప్పేనో లేదో మీ ఆంటీకీ నాకూ మధ్య అనుబంధం కూడా అలాటిదే."

"లీల కూడా అదే అందండీ. 'మీరన్నది సబబే. పాపం రెడ్డి ఇంక ఎన్నాళ్ళుంటాడు కనక. మరో నెల రోజులు, అంతే కదా. కాస్త దగ్గరుండి కనిపెట్టుకునుండండి. నాకు కుదుర్తుందో కుదర్దో ... మీరిద్దరూ రోజు సినిమాలకి వెళ్తూండండి. అసలు అక్కడే పడుకుంటే బాగుంటుందేమో. మళ్లీ ఏ రకాల పుకార్లూ పుట్టకుండా, చెరో గదిలో పడుకుని, అలా ఫొటోలు కూడా తీసిపెట్టుకోండి అంది."

ప్రభాస్రావు మొహంలో అయోమయం గమనించి, సుందరం గట్టిగా నవ్వేడు. "హా ...హా హా ... అదేనండీ మా లీల హాస్యరసికత. మేం ఇద్దరం తెగ నవ్వుకున్నాం రెడ్డి వెళ్లిపోయేక."

సుందరం లేస్తూంటే, ప్రభాస్రావు కూడా లేస్తూ, "పద, నీతో రెండు మాటలు చెప్పాలి." అన్నాడు సుందరాన్ని అనుసరిస్తూ.

సుందరానికి ప్రభాస్రావు తనమాటలని మెచ్చుకోడం, తనతో ఏదో ముఖ్య విషయం చర్చించాలనడం మహా తృప్తినిచ్చింది. "చెప్పండి," అన్నాడు బయటికొచ్చి ఆగి.

"అదే విషిసంగతి."

"విషిసంగతా? ఏమయిందేమిటి?"

"ఏం కాలేదు. అరవింద నీకు తెలుసు కదా. నీకు వరసకి చెల్లెలవుతుందనుకుంటాను."

"చాలా దూరపు చుట్టరికమండీ. ఇంతకీ అసలు సంగతి చెప్పేరు కారు."

"పిల్లలు కదా. ఆవేశాలెక్కువ. ఇక్కడ ఇదో గోల. హైస్కూలేనా కాకుండా డేటింగంటూ మొదలెడతారు."

"ఓస్. అంతేనా. మీరన్నట్టు అది ఇక్కడి సంప్రదాయం. అదే పోతుందిలెండి. వీళ్ళకి పాతిక దాటేలోపున ఇలాటివెన్నో," అన్నాడు సుందరం తేలిగ్గా.

"అదే బాబూ నేను కూడా అన్నది. కానీ విషి అలా అనుకోడం లేదు. నేను చెప్తే వినడం లేదు. ఆ పిల్లే నా జీవితసర్వస్వం అంటూ ఒకటే గోల."

"విషితో మాటాడమంటారా?"

ప్రభాస్రావు క్షణం ఆలోచించి, "విషికి నేను చెప్తానులే. వాడిది అసలే చాలా సున్నితమయిన మనసు. నీతో చెప్పేనని తెలిస్తే మరింత బాధ పడతాడు. నువ్వు ఆ అరవిందతో మాటాడు. విషికేమిటి మగాడు. కో అంటే కోటిమంది వాడిముందు వాల్తారు. ఆ అమ్మాయికుండాలి. వాళ్ళపెద్దలకుండాలి. ఆడపిల్ల. ... కొంతకాలం వీడితో తిరిగింది అంటే మనవాళ్లమధ్య పరువుంటుందా?"

"మీరేవంటున్నారో నాకర్థం కావడంలేదు."

"ఏం లేదు. మళ్ళీ వాళ్లిద్దరూ కలిస్తే బాగుంటుందనీ .... ఇప్పుడే పెళ్ళి చేసేస్తాం అనడం లేదు నేను. ఇద్దరి చదువులూ అయి మనవాడు ఉద్యోగంలో స్థిరపడ్డాకే చూసుకోవచ్చు. అంతవరకూ మనవాడిని ఆ పిల్ల వదిలేసిందన్న మాట పైకి పొక్కకుండా ఉంటే మంచిదని. ఈదేశంలో పెరుగుతున్నారు ఇద్దరూను. ఇక్కడ ఉన్నవాళ్ళలోనే చూసుకోవాలి కదా. వాళ్ళకి మళ్ళీ మాలాటి సంబంధం దొరుకుతుందేమిటి? అందులోనూ కొన్నాళ్ళు మావాడితో తిరిగిందంటే? నువ్వే చెప్పు."

"అవునౌను. పరువుతక్కువ కాదూ. ఇంతకీ నన్నేం చేయమంటారు?"

"అదే, నువ్వోమారు మీ చెల్లెలితో మాటాడు. మీ ఆంటీ కూడా ఆ పిల్లంటే ముచ్చట పడుతోంది. అంచేత వీళ్ళిద్దర్నీ ఒకింటివాళ్ళని చెయ్యాలని నాకుంది. మావాడు మనతెలుగుపిల్లనే చేసుకుంటానని పట్టు బట్టేడు. వాళ్ళకీ అలాటి కోరికే ఉందనుకుంటాను."

“సరేనండీ. చూస్తాను. చెప్పేను కదా. మేమూ వాళ్ళూ కలవడం తక్కువే. కానీ ఇలాటి సందర్భాల్లో చుట్టరికం తిరగదోడడంలో తప్పులేదు కదా.”

సుందరం ప్రభాస్రావుకి ధైర్యం చెప్పి తనకారువేపు నడిచేడు.

ప్రభాస్రావుకి తన ఆలోచన కార్యరూపం ధరిస్తుందనే నమ్మకం కుదిరింది.

"అన్నట్టు మరోమాట. లీలకి ఏదైనా మనస్తాపం కలిగితే ఆంటీతో చెప్పమను. సంసారం గుట్టూ, రోగం రట్టూ అన్నారు. ఇలాటి చిన్న చిన్నవిషయాలు బయటికి పొక్కనీయకూడదు," అన్నాడు ప్రభాస్రావు చివరిమాటగా.

"ఎందుకులెండి. నేను చూసుకుంటాను. అవసరమయితే చెప్తాలెండి" అన్నాడు సుందరం ఆయన్ని చిన్నబుచ్చడం ఎందుకని.

000

ఎండ మాడ్చేస్తోంది. ఏం తోచక ఓ పుస్తకం పట్టుకు కూర్చున్నాను.

ఫోను మోగింది.

అరవింద. “శనివారం నాతో మీకేమైనా పని ఉందేమోనని అడగడానికి పిలిచేనండీ?”

నాకు అయోమయం అయింది. “అది నీకిప్పుడు ఎందుకింత అర్జంటుగా కావలసివచ్చిందీ?” అన్నాను.

“అది కాదండీ. తప్పనిసరిగా నేను మీయింటికి రావలసిన అవసరం మీకు ఉంటే బాగుంటుందనీ.”

నాకు అరవింద ధోరణి అర్థం కాలేదు. చిన్నగా నవ్వుకుని, “ఉంది. అసలు నువ్వు రాకపోతే కొంపలంటుకుపోతాయి. ఆరోజు మరేపనీ పెట్టుకోకు,” అన్నాను ఆ అమ్మాయి ధోరణి పుచ్చుకు కొనసాగిస్తూ.

రెండు క్షణాలు చేతిలో ఫోనువేపు చూస్తూ కూర్చున్నాను, ఇప్పుడయినా అసలు సంగతేమిటో చెప్తుందేమోనని.

కిటికీలోంచి గాలికి సన్నగా ఊగుతున్న పేరు తెలీని చెట్టు కొమ్మలూ, ఉండీ ఉడిగీ ఓ పిట్ట కూతా తప్ప మరే శబ్దమూ లేదు.

అరవింద మాటాడలేదు. నాకు ఫోనులో మాటాడడం అంతగా నచ్చదు. గోడతో మాటాడినట్టుంటుంది. "అన్నట్టు మరిచిపోయేను. అసలు ఇప్పుడే ఓ పెద్దపని తగిలింది. ఓమారు రాకూడదూ?" అన్నాను ఆఖరికి. ముఖాముఖి మాటాడుకోడం తేలిక అని.

అరవింద అందుకోసమే ఎదురు చూస్తున్నట్టు, "చెప్పరేం మరి. ఇదుగో అయిదు నిముషాల్లో అక్కడుంటాను," అని ఫోను పెట్టేసింది.

పది నిముషాల్లో ప్రత్యక్షమయింది. అట్టే జాప్యం లేకుండానే అసలు సంగతి అర్థమయింది.

"సుందరంగారెందుకో ఫోను చేశారు."

"అంటే? మామూలుగా చెయ్యరా?"

"చెయ్యరు. వాళ్ళకీ మాకూ ఏదో దూరపు చుట్టరికం ఉంది. తెలుగువాళ్ళం కదా ఎవరిళ్ళలోనో ఏదో అయినప్పుడు కలుస్తుంటాం. అసలు నేనయితే ఆయన్ని చూసి రెండేళ్ళకి పైనే అవుతోంది."

"ఎందుకు పిలిచారో చెప్పలేదా?"

"ఆయన చెప్పలేదు కానీ నాకో అనుమానం ఉందిలెండి."

నేను మాటాడలేదు తను ఎంతవరకూ చెప్పదలుచుకుందో నాకు తెలీదు కదా.

"విషినాన్న ఈయన్ని నాతో ఏదో మాటాడమని చెప్పిఉంటారు. ఈయన ఏం అడుగుతారో, నేనేం చెప్పాల్సివస్తుందో అని నాభయం. భయమేమిటిలెండి, చిరాగ్గా ఉంది. అసలు నా సొంతవిషయాలగురించి వీళ్ళందరికీ నేను జవాబులు చెప్పుకోడం ఏమిటని?"

"నీ సొంత విషయాలే ఆయన మాటాడతారని నువ్వెందుకనుకుంటున్నావు?"

"పదిరోజులకిందట నాకూ విషికీ మధ్య ఓ చిన్న నాటకం జరిగిందిలెండి. దాంతో వాళ్ళనాన్నకి కోపం వచ్చింది. ఆయనేమో సుందరంగారిని మధ్యవర్తిత్వం జరపమన్నట్టుంది. అసలు ఆయనకి మాత్రం ఎందుకో నాకర్థం కావడంలేదు."

ఆ నాటకం ఏమిటంటే -

ఈనాటి ఆర్థికపరిస్థితులలో పరిమిత ఆదాయంగల మధ్యతరగతి కుటుంబాల్లో ఆరోగ్యం ఎలా కాపాడుకోగలరు? అన్న విషయంమీద అరవింద రాసిన వ్యాసానికి దేశస్థాయిలో మొదటి బహుమతి వచ్చింది.

క్లాసులో వాళ్ళ ఎకనమిక్స్ టీచరు ఆవిషయం ప్రకటించేరు. క్లాసు మొత్తంగానూ విడివిడిగానూ అభినందించారు. అరవింద మహోత్సాహంలో పొంగిపోతూ ఇంటికి బయల్దేరింది. బహుమతి ప్రదానాలు ఆగస్టులో వాషింగ్టన్‌లో జరుగుతాయిట.

అరవింద ఉత్సాహంగా కూనిరాగాలు తీస్తూ అడుగులేస్తోంది. విషి తారసపడ్డాడు రోడ్డుమీద. శుభవార్త చెప్పింది. “హేయ్, నావ్యాసానికి మొదటి బహుమతి వచ్చింది. నేను వాషింగ్టన్ వెళ్తున్నా.”

విషి, ముఖం ముడుచుకుని “యా” అన్నాడు. ఆ స్వరంలో సంతోషం లేదు. సంతోషిస్తున్న ఛాయలు లేవు.

అరవింద ఉత్సాహం సగం చచ్చింది. “అదేమిటి? ఎంచక్కా నిన్ను చూస్తే నాకెంత గర్వంగా ఉందో అనో నువ్వు గెల్చేవంటే నాకు అమందానందం అనో అనాలి కానీ,” అంది అతని నీరసాన్ని హాస్యంలోకి దింపే ప్రయత్నంలో.

ఆ హాస్యం అతనికి హత్తలేదు.

“అసలు ఆ బహుమతి నాకు రావలసింది. నీకెలా వచ్చిందో నాకు తెలీదు. అసలు వాళ్ళు నావ్యాసం చదవలేదో, ఆ మట్టిబుర్రలకి అర్థం కాలేదో. అయినా అంతేలే. ఆడపిల్ల పేరు చూడగానే మతులు పోయి ఇచ్చేసుంటారు.”

దాంతో అరవింద ఉత్సాహం పూర్తిగా చచ్చింది. చిన్నకోపం కూడా వచ్చింది. “ఛీ. నీతో చెప్పడం నాదే తప్పు. అసలిందుకే నిన్ను వదిలేసేను.” విసురుగా తిరుగు సమాధానం వచ్చింది.

విషి కాస్త తగ్గేడు. “నేనంటున్నది అది కాదు. వాళ్ళు నాతెలివితేటలు గుర్తించలేదు అంటున్నా. నీతప్పు అన్లేదు. నాకెప్పుడూ ఇంతే అవుతోంది. ఎంచేత అని. అది నాకెంత అవమానంగా ఉంటుందో ఆలోచించేవా?”

“ఇది నీగురించి కాదు బాబోయ్,” అని అరవాలనిపించింది అరవిందకి. తను ఎప్పుడు తనసంగతి మొదలుపెట్టినా అతను ఇదే వరస.

"నీకెప్పుడూ నీగొప్పలే కానీ నాగురించి ఆలోచించవేం?" అన్నాడు మళ్ళీ అతను.

అరవింద మనసులో పెద్ద సుడిగాలి లేచింది. మరో క్షణం ఉంటే బావురుమని ఏడ్చేసేలా ఉన్నాడు విషి. విసుగు, చిరాకు, కోపం, అసహ్యం తన్నుకొచ్చేయి. తను ఇంత సంతోషంగా ఉన్నందుకు కనీసం ఈ ఒక్కసారికీ "నాకూ సంతోషం అనొచ్చు కదా" .... కనీసం సంతోషిస్తున్నట్టు నటించకూడదా?

అసలు తనదే తప్పు. తెలిసి, తెలిసి ఎందుకు అతనికి చెప్పడం? అతన్ని వదిలేసేక ఇంకా ఎందుకు స్నేహంగా ఉండడం? ఆలోచిస్తూ ఇల్లు చేరుకుంది.

వారంరోజులపాటు సాఫీగానే సాగింది. ఏ గొడవా లేదు. స్కూల్లో అప్పుడప్పుడు కలుస్తూనే ఉన్నారు. విషి మళ్ళీ మామూలుగా, సరదాగా మాటాడుతున్నాడు. వీలు చిక్కినప్పుడల్లా ఏ చాకొలెట్ బారో, సోడావో కొనిస్తున్నాడు.

ఇప్పుడు సుందరం పిలిచేవరకూ, మళ్ళీ ఈ విషయం తలెత్తుతుందని అనుకోలేదు అరవింద.

నాకు ఏం చెప్పాలో తోచలేదు. అసలు నాకీ దేశంలో అబ్బాయిలూ-అమ్మాయిలూ, వాళ్ల సంబంధాలూ, స్నేహాలూ అట్టే తెలీదు. జీవితం సగం అయింతరవాత ఇక్కడికి వచ్చేను. ఆ తరవాత కూడా జీవనస్రవంతిలో కలవలేదు. కలిసిపోడానికి అసలు ప్రయత్నించలేదు కూడా. ఇప్పుడు, నాజీవితం ముప్పాతిక దాటిపోయేక, ఈ అరవిందలాటివారి పరిచయాలమూలంగానే కొంచెం కొంచెం తెలుస్తోంది!

అంచేత, నేను చెప్పగలిగిందేమీ లేదు, వినడమే తప్ప. అదే అన్నాను అరవిందతో.

"నాకేం తెలుసు. నీకే తెలియాలి. నువ్వే చెప్పు ఏమనుకుంటున్నావో?"

"అదే నేనంటున్నది. మీకిప్పుడు అర్జంటుగా నేను తప్ప పరిష్కరించలేని పనేదో ఆ శనివారం తగలాలన్నమాట. ఆయన అయిదుగంటలకి రమ్మన్నారు. మీరు నాలుగున్నరకి పిలిస్తే చాలు."

నేను నవ్వేను. "బాగుంది. ఏదో కనిపెడతాను. కానీ ఎన్నాళ్ళు అలా తప్పించుకుంటావు. ఎదురు పడి తాడో పేడో తేల్చేసుకుంటే సుఖం కదా," అన్నాను. నా అనుభవసారం అదీ!

నాకు మరో అనుమానం వచ్చింది. "మీ అమ్మా, నాన్నా ఏమంటారు?"

అరవింద ఫక్కున నవ్వింది, "బాగా అడిగేరు," అంటూ.

“అదేమిటి? ఎంత అమెరికాలో పెరిగినా, మన సంప్రదాయాలు కూడా నీకు బాగానే ఒంట బట్టినట్టున్నాయి కదా. వాళ్ళని కూడా మీకెందుకు అన్నావేమిటి?” అన్నాను సందేహిస్తూ.

నాభయం ఏమిటంటే నేనెంతదూరం వెళ్ళొచ్చా నాకు కొత్తగా వచ్చిన ఈ ఆచార్యస్థానంలో అని.

“లేదులెండి. నిజమే నవ్వొచ్చే సంగతి కాదు. ఎందుకు నవ్వేనంటే, ఇదే క్షణంలో అక్కడ మాయింట్లో కూడా మాంఛి జోరుగా ఓ చర్చ జరుగుతోంది. నాకింకా 17 ఏళ్ళే కదా, ఇతను కాకపోతే మరోడు వస్తాడు, ఎందుకు ఇప్పట్నుంచీ ఈ లంపటాలు పెట్టుకోడం అంటుంది మాఅమ్మ. మానాన్నకేమో ఇతనిలాటి గొప్ప వరుడు మరి దొరకడని గొప్ప నమ్మకం.

నేను కూడా అనుకుంటానులెండి ఇలాటి మానవుడు మరొకడు ఈ భూప్రపంచకంలో ఉంటాడా అని. అది వేరే సంగతనుకోండి. ఇంతకీ మా నాన్న వాదన మేధావులందరికీ మెదడులో ఒక భాగం పుచ్చిపోయి ఉంటుందనీ, అది సీరియస్‌గా తీసుకోకూడదనీ. వేపకాయంత వెర్రి లేనివాడుంటాడా అంటారాయన.”

నాకు ఏం చెప్పడానికీ తోచలేదు. ఇంతచిన్నపిల్లకి ఇప్పట్నించీ ఇంత పెద్ద సమస్య ఏమిటి .ఇది ఈదేశంలో పిల్లలపెంపకంలో భాగమే కాబోలు అని సరిపుచ్చుకోవాలేమో.

“సరే వస్తానండీ,” అంది అరవింద లేస్తూ.

“ఎక్కడికి వెళ్తావు?”

“ఇంకెక్కడికి? ఇంటికే. అమ్మమ్మయింటికి వెళ్ళొచ్చు కానీ మళ్ళీ మాఅమ్మా, నాన్నా ఆవిడమీద ఎగిరిపడతారు. ఎందుకొచ్చిన గొడవ. నేనే పడితే పోలే.”

“పోనీ, ఈరాత్రికి ఇక్కడ ఉండు.”

“మీరు గుండెనొప్పో ఏదో తెచ్చుకుంటారా మరి?”

“చూస్తాను, ఏది వీలో.”

ఇద్దరం నవ్వుకున్నాం. అరవింద వెళ్ళిపోయినతరవాత చాలాసేపు ఆ అమ్మాయిగురించే ఆలోచిస్తూ కూర్చుండిపోయేను.

000

శనివారం.

అరవింద పుస్తకాలషాపులో అడుగు పెట్టేవేళకి సుందరం కాఫీ తాగుతూ ఆనాటి న్యూయార్క్ టైమ్స్ చూస్తూ ఓ మూల కుర్చీలో కనిపించేడు.

అరవింద మెల్లిగా వచ్చి పక్క కుర్చీలో కూర్చుంది చిన్నగా నవ్వి, హలో చెప్పి.

"చాల్రోజులైంది చూసి. బాగున్నావా? క్లాసులు ఎలా అవుతున్నాయి? అన్నట్టు, కాఫీ, టీ?"

అరవింద గబుక్కున లేచింది, "నేను తెచ్చుకుంటాలెండి."

"అహహ. అలా కాదు. నేను కదా రమ్మన్నది. పైగా పెద్దవాణ్ణి," అంటూ సుందరం చనువుగా అరవింద బుజంమీద చెయ్యేసి, కూచోపెట్టి, "ఏంటి?" అన్నాడు.

"టీ."

సుందరం వెళ్ళి టీ తెచ్చేవరకూ, ఆయన వదిలేసిన పేపరు చూస్తూ కూర్చుంది అరవింద.

సుందరం రెండుకప్పులతోనూ వచ్చి తనకి టీకప్పు అందించి, తనకప్పుతో కూర్చున్నాడు.

అరవింద ధన్యవాదాలు చెప్పింది.

"స్కూల్ ఎలా ఉంది?"

"బాగానే ఉంది?"

"కాలేజీలకి అప్లై చేస్తున్నావా?"

"ఆఁ. ... చూస్తున్నా."

"ఏ కాలేజీలకి?"

"మ్..మ్.. ఆలోచిస్తున్నా..."

నాటుబండిలా నెమ్మదిగా నడిచింది సంభాషణ నాలుగు నిముషాలపాటు.

ఆఖరికి అసలువిషయంలోకి వచ్చేడు సుందరం.

"విషికి నువ్వంటే చాలా ప్రేమ. నువ్వంటే ప్రాణం. అతనే ఏమిటి, వాళ్ళింట్లో అందరికీ అంతే. విషి మూలానే అనుకో. నువ్వు పక్కనుంటే అతను ఎంతో వృద్ధిలోకి వస్తాడు. నీకా శక్తి ఉంది."

అరవింద అతనివేపు చూస్తూ కూర్చుంది, నెమ్మదిగా టీ చప్పరిస్తూ.

సుందరం కొంచెంసేపు ఆగి, "పోనీ, ఇది చెప్పు. నీకు అతనంటే ప్రేమ ఉందా?"

"నాకు అతనంటే ఇష్టం లేదని నేనెప్పుడూ చెప్పలేదు కదా," అంది అరవింద నెమ్మదిగా.

ప్రేమకీ, ఇష్టానికీ మధ్య గల అంతరం ఇద్దరూ వాడుకోడానికి ప్రయత్నిస్తున్నారు.

"అదీ ముఖ్యంగా కావలసింది. మీ యిద్దరికీ ఒకరంటే ఒకరికి ప్రేమ ఉన్నతరవాత, మిగతావి తేలిగ్గానే సర్దుకుపోవచ్చు. నేనీమాట అందరికీ చెప్పను. నువ్వు కనక చెప్తున్నా. నీకు కూడా విషిలాగే అద్భుతమైన మేధాసంపత్తి ఉంది కనక చెప్తున్నాను. ఇవాళ ఏదో అన్నాడనీ ఏదో చేశాడనీ పుటుక్కున తెంచేసుకోడం మూర్ఖత్వం. నువ్వు దూరదృష్టితో జీవితంగురించి ఆలోచించుకోడం నేర్చుకోవాలి. చిన్న చిన్న అభిప్రాయబేధాలు అందరితోనూ వస్తాయి. ఆ మాటకొస్తే ఏ ఇద్దరిమధ్య అయినా రావచ్చు కదా. నీకింకా అనుభవం లేదు కానీ మా బాసుతో నాకు ఎన్ని చిరాకులొస్తాయో తెలుసా తెల్లారి లేస్తే? అయినా అక్కడే ఎందుకున్నాను అంటే నాకు అక్కడే మంచి భవిష్యత్తు కూడా ఉంది కనక. ఈదేశంలో అంతా నీఇష్టం, ఉద్యోగాలు వదిలేయొచ్చు, మరోటి చూసుకోవచ్చు అంటారు కానీ వాస్తవంలో జరిగేదేమిటి? 'నువ్వెంత, నీ ఉద్యోగం ఎంత' అంటూ ఉద్యోగం వదిలేయడానికి క్షణం పట్టదు. కానీ, ఆలోచిస్తే తెలిసేదేమిటి? మరో కంపెనీలో మరోరకం తగువులు రావా? అలా రెండు మూడు అయేక ఏమవుతుంది? నా ఫీల్డులో నలుగురిమధ్యా నాపరువు పోతుంది. "వీడితో పడలేం బాబూ," అని మరింక ఎక్కడా నాకు నీళ్ళు పుట్టకుండా చేస్తారు. అంచేత నేను కొంత లౌక్యం కూడా ప్రదర్శించాలి. ఇంట్లో అయినా అంతే, ఆఫీసులో అయినా అంతే."

సుందరం మళ్ళీ ఆగేడు అరవింద జవాబుకోసం.

అరవిందకి ఏం చెప్పాలో తోచలేదు. ఎక్కడ మొదలు పెట్టడం? ఏం చెప్తే సుందరానికి తన అవస్థ అర్థమవుతుంది? ఆఖరికి "నేను అతనితో స్నేహంగానే ఉన్నాను కదా," అంది.

సుందరం చిన్ననవ్వు నవ్వేడు. "ఈదేశంలో అందరూ అందరికీ స్నేహితులే. బజారులో షాపువాడు, ఫోనులో టెలిమార్కెటరూ కూడా బాగున్నారా అంటూ మనయోగక్షేమాలూ అడుగుతారు. నేనంటున్నది అది కాదు. విషికి నువ్వు పరిపూర్ణ సహకారం ఇవ్వాలి. అదొక హామీ అనుకో. స్పష్టంగా నువ్వు అతనికి సర్వదా సర్వవిధాలా అండగా ఉంటానని నచ్చచెప్తే తేరుకుంటాడు. 'నాకింకా 17 ఏళ్ళు. ఇప్పుడే ఏంటండీ' అంటావేమో. మనవాళ్ళు జాతకాలూ, వంశప్రతిష్ఠలూ చూడ్డంలోనూ ఇక్కడివాళ్ళు డేటింగ్ అంటూ కలిసి తిరగడంలోనూ పరమార్థం ఒకటే. అబ్బాయీ, అమ్మాయీ ఒకరికొకరు అన్నివిధాలా - మేధలోనూ ప్రవృత్తిలోనూ సరి తూగుతారా, వీళ్ళిద్దరూ ఒకరికొకరు అండగా నిలిచి, జీవితాన్ని సుఖవంతం చేసుకోగలరా లేదా

అనే కదా. మనదేశంలో పెద్దవాళ్ళు చేస్తారు. ఇక్కడ పిల్లలే చూసుకుంటారు. వీళ్ల సంస్కృతీ, సాంప్రదాయాలు ఇవీ. ఎటొచ్చీ నువ్వూ, విపి అటూ రెండువేపులనించీ నరుక్కురావలసి వస్తోంది. తెలుగువాళ్ళం కనక తల్లిదండ్రులు కలగజేసుకుంటారు. అమెరికాలో ఉన్నారు కనక మీరిద్దరూ నిర్ణయాలు చేసుకుంటారు. జోడుగుర్రాలస్వారీ అన్నమాట."

"అయితే నన్నేం చెయ్యమంటారు?" అంది అరవింద.

"నువ్వు మంచీచెడ్డా జాగ్రత్తగా ఆలోచించకుండా అతన్ని వదిలేసేవని బాహాటంగా చెప్పడంగురించి అంటున్నాను. చూడు, జాగ్రత్తగా, లోతుగా ఆలోచిస్తే నీకే తెలుస్తుంది. విపి నీకు అన్నివిధాలా తగినవాడు. కాలం కలిసొచ్చి మీఇద్దరికీ పరిచయం అయింది. ఇద్దరూ ఇష్టపడ్డారు. ఇప్పుడు హఠాత్తుగా నువ్వు నాకక్ఖర్లేదు, ఫో అంటే అతనెంత బాధ పడతాడో ఆలోచించేవా?"

సుందరం ఖాళీ కప్పు తీసుకుని, లేచేడు, "ఒక్క క్షణం" అంటూ. అరవిందకి ఆలోచించుకోడానికి కొంత టైమివ్వాలని అతని ఉద్దేశం. అంత పెద్ద పాఠం ఒక్కసారే చెప్పేస్తే ఝుడుసుకుని ఏడుపు మొదలు పెడుతుందేమో అనుకున్నాడతను.

అరవింద ఎదురుగా ఉన్న టైమ్స్ తీసుకుని, పేజీలు తిరగేస్తూ కూర్చుంది. మళ్ళీ అతను వచ్చేలోపున లేచి వెళ్ళిపోదామా అన్న ఆలోచన కూడా వచ్చింది కానీ, ఇంకా అతనేం చెప్తాడో అన్న కుతూహలం కూడా ఉండడంచేత కదల్లేదు.

సుందరం కాఫీకప్పుతో వచ్చి మళ్ళీ మొదలు పెట్టేడు, "ప్రకృతిసిద్ధంగా ఆడవాళ్ళకీ మగవాళ్ళకీ వ్యత్యాసం ఉంది. శారీరకంగానే కాదు. మానసికంగా కూడా ఆడవాళ్ళలో ఎదుగుదల చాలా త్వరగా జరుగుతుంది. భార్యగా చిన్నదాన్ని ఎన్నుకోడంలో రహస్యం ఇదే. ముసలితనంలో భర్తలకి సేవలు చెయ్యడంకోసం అంటారు కానీ నేనొప్పుకోను. పూర్వకాలపు సంగతి వదిలేద్దాం. ఇప్పుడు ఇద్దరికీ చదువులూ, ఉద్యోగావకాశాలూ కూడా సమంగా ఉన్నప్పుడు అది నిజం కాదనే అనుకోవాలి. అయినా అమ్మాయి చిన్నా, అబ్బాయి పెద్దా అయివుండాలన్న ఆనవాయితీలో అట్టే మార్పులేదు. ఏంచేతంటావు?"

అరవిందకి ఏం చెప్పాలో తోచలేదు. ఈరోజుల్లో అట్నుంచి ఇటు అమ్మాయి పెద్దా అబ్బాయి చిన్నా లేదా అమ్మాయిదే పెద్ద ఉద్యోగం - ఇలాటివి అక్కడా అక్కడా కనిపిస్తున్నాయి కానీ ఇంకా సుందరం చెప్పినట్టు పిల్లవాడు కనీసం రెండు, మూడేళ్ళు పెద్దవాడుగా ఉండేలా

చూస్తూనే ఉన్నారు పెళ్ళిచూపులు నామమాత్రంగా జరుపుతున్న సంబంధాల్లో కూడా. తమకంటే తక్కువ చదువో ఉద్యోగమో ఉన్నవాడిని చేసుకోడానికి ఇష్టపడే అమ్మాయిలు అట్టే లేరు.

"ఎందుచేతంటే తెలివితేటల్లో ఆడవాళ్ళదే పైచేయి కాబట్టి. పైకి కనిపించరు కానీ వాళ్ల మేధ అద్భుతం. స్త్రీలు పిల్లల్ని కంటారు కనక వాళ్ళకి పిల్లలతో పేగుసంబంధం ఉంటుంది కనక పిల్లలపెంపకం బాధ్యత వాళ్ళదే అన్నది కూడా పాతకాలపు ఆలోచనే. నిజానికి స్త్రీలు సూక్ష్మబుద్ధితో పిల్లలమనసులు తెలుసుకుని, వారిని సన్మార్గంలో పెట్టగలరు కనక ఆ గురుతరబాధ్యత వారికి ఒప్పచెప్పేరు. మగవాళ్ళకి అలాటి తెలివితేటలు లేవు కనక బయట మరోరకం బాధ్యతలు నెత్తినేసుకుంటారు. అంచేత ఆ రెండు బాధ్యతలూ సమానమే అయినా స్త్రీలు చెయ్యవలసిందీ, చెయ్యగలిగిందీ ఎక్కువ. అఫ్ కోర్స్, నువ్వూ, విషి కూడా ఇంకా చిన్నవాళ్ళు. కానీ నువ్వు ఆలోచించుకోవలసింది భవిష్యత్తులో ఏం చెయ్యదలుచుకున్నావు అని."

ఏదో హరికథ వింటున్నట్టు కూర్చున్న అరవింద ఉలిక్కిపడింది. "ముందు నాచదువు పూర్తి కావాలి. తరవాతే మిగతా సంగతులు," అంది.

"సరిగ్గా చెప్పేవు. చదువు ముఖ్యం. నీలాగే విషికి కూడా చదువు ముఖ్యం. నీమీద మనసుతో అతను తన చదువుని నిర్లక్ష్యం చేస్తున్నాడు. నీమీద అతనికి గురి ఉంది కనక నువ్వు చెప్తే మళ్ళీ చదువు కొనసాగిస్తాడు. నీకు కూడా కావలిసింది అదే కదా. పోతే పెళ్ళి మాట ఇప్పుడు చెప్పను కానీ ఆవిషయంలో కూడా నువ్వు జాగ్రత్తగా ఆలోచించుకోవాలి. విషికంటే మేధావి నీకు మళ్ళీ దొరుకుతాడా? ఆ కొత్తగా వచ్చేవాడిలో మాత్రం ఏదో ఒక లోపం ఉండదన్న భరోసా ఏమైనా ఉందా నీకు? సర్దుకుపోవడంలోనే కదా ఉంటాయి తెలివితేటలు. తప్పులు పట్టడానికేముంది. నువ్వు ఏమనిషిని గానీ చూపించు. నేనేదో ఒక దోషం చూపగలను. ఇలా అంటున్నానని నువ్వు మరోలా అనుకోకు. జీవితం చూసినవాణ్ణి కనక చెప్తున్నాను. అంతెందుకూ నేను లీలని పూర్తిగా గౌరవిస్తాను. ఆమెకి పరిపూర్ణ స్వాతంత్రం ఇచ్చేను. ఇచ్చేను అంటే మళ్ళీ తప్పుపడతారు. నేను తనని ఎప్పుడూ ఏ విషయంలో అడ్డు చెప్పలేదు. తను ఏం చేసినా ఎక్కడికి వెళ్ళినా అంతా తనిష్టం. కారు తీసుకుని మిల్వాకీ వెళ్ళిపోతుంది. మినియాపొలిస్ వెళ్ళిపోతుంది. నేను ఒక్కసారి కూడా ఏమిటా తిరగడం అన్లేదు. తను అలా తనకి తానుగా వెళ్ళడం, రావడం అలవాటే కనకనే ఆరోజు తనే ఇంటికి వస్తుందనే అనుకున్నానే

కానీ ఒక్కదాన్నీ సినిమాహాల్లో వదిలేశాను అని అనుకోలేదు. ఆతరవాత తనకి మరేవో చికాకులు కలిగి, ఆ విశాలగారితో యదాలాపంగానే అని ఉంటుంది. దానికి ఆవిడ చిలవలూ పలవలూ చేర్చి రచ్చ చేసింది. చెప్పొచ్చేమాట ఏమిటంటే మాయిద్దరికీ ఏవైనా పొరపొచ్చాలు వచ్చినా మేం సర్దుకుపోతాం. మామధ్య అలాటి అనుబంధం ఉంది. నీకు కూడా అలాటి దృక్పథం ఏర్పడాలి. అదీ నేను చెప్తున్నది. ఏమంటావు?"

అరవింద "వస్తాను, ఆలస్యమయిపోయింది ఇప్పటికే. అమ్మమ్మ నాకోసం ఎదురు చూస్తూ ఉంటుంది," అంటూ లేచి, గబగబా వీధిపేపు అడుగులేయసాగింది..

"సరే. బాగా ఆలోచించుకో నామాట. కావలిస్తే మళ్ళీ కలుద్దాం. నీకు ఎప్పుడు మాటాడాలనుంటే అప్పుడు పిలు, నానెంబరు నీదగ్గరుంది కదూ," అంటున్నాడు సుందరం వెనకనించి.

అరవింద వెనక్కి తిరిగి చూడకుండా తనకారువేపు గబగబ అడుగులేసింది.

అరవిందకి మతి పోతోంది. ఎవరితోనైనా మాటాడాలి. ఇంకెవరున్నారు?

విషి, సుందరం, మాలికగారి అభిప్రాయాలు తెలిసేయి. అమ్మమ్మని అడగాలి ఏమంటుందో?

అమ్మమ్మగారింటివేపు మళ్లించింది కారు.

ooo

తలుపు తట్టిన అరవిందకి తలుపు తీసి, "రా, ఇప్పుడే అనుకుంటున్నా, టీ పెట్టుకుందామా అని," అంది సిరి.

"నే పెడతాలే" అంది అరవింద వంటగదివేపు నడుస్తూ.

అరవింద టీ తెచ్చి సిరికిచ్చి, ఎదురుగా కూర్చుంది.

"నువ్వు తెచ్చుకోలేదేం?"

"ఇప్పుడే తాగి వస్తున్నా. సుందరంగారి భిక్ష."

"ఆహా, సుందరంగారు అతిథిమర్యాదలు బాగా చేసేరేంటి?"

"ఆహా. చాలా బాగా. కళ్ళు తిరిగేయి."

"మొహం చూస్తే ఏమంత రుచించినట్టు లేదు. ఏమయిందేమిటి?"

“రుచించడానికేం, టీ బాగానే ఉంది. ఆయన మాటలే … మరోగంట అక్కడుంటే, ఉరుకులు పరుగులతో వెళ్లి విషిని పెళ్ళాడేసేదాన్నేమో కూడా.”

సిరి నవ్వింది.

“నీకు నవ్వెందుకొస్తోంది?”

‘‘నువ్వూ నవ్వుతున్నావు కదా.”

“అది కాదు. అసలు నాకు ఆశ్చర్యం ఏమిటంటే యథార్థాన్ని, పరమసత్యాలని ఎంత అసందర్భంగా ప్రయోగించగలరో అనీ … ఆయన చెప్పిన సు-భాషణలయితే శభాష్ అనిపించేయి. కానీ నాకిప్పుడు ఆ పాఠం అవుసరమా అన్నదే నాకర్థం కాలేదు.”

“నువ్వేం చెప్పేవు? నువ్వేం తక్కువ తినలేదు కదా వాదనలమాటకొస్తే.”

“నేనేం చెప్పలేదు. ఎంత చెడ్డా పెద్దవారు కదా, పైగా అంత మాటాడేంత పరిచయం కూడా లేదు.”

కొంచెంసేపు ఇద్దరూ వార్తలు చూస్తూ కూర్చున్నారు.

తరవాత నెమ్మదిగా అంది అరవింద, “అమ్మమ్మా, నాకు ఒక సందేహం. సుందరంగారు

ఎంతసేపూ నేను విషిని అర్థం చేసుకోవాలనే గోల. అందరూ చెప్పే ఊకదంపుళ్లే. అది ఆచరణలో ఎలా సాధ్యం అన్నదే ఒకపట్టాన అర్థం కాడంలేదు. ఈ అర్థంచేసుకోడాలు, సర్దుకుపోడాలూ నాకొక్కదానికేనేమిటి? ఇద్దరికీ ఉండాలి కదా.”

“ఆమాట ఆయన్నే అడగలేకపోయావా?”

“ఆయన్నా? మళ్ళీ మరో పాఠం మొదలుపెడతారేమోనని భయమేసి ఊరుకున్నా.”

సిరి చిన్నగా నవ్వింది తలూపుతూ.

“ఇంతకీ నాసందేహం మీకాలంలో మీరెలా సాధించుకొచ్చేరు అని. తాతయ్యతో నీకెప్పుడూ ఈ అర్థాలూ, అపార్థాలూ, కోపతాపాలూ రాలేదా?”

“అసలు ఈ అర్థాలూ అపార్థాలూ… ఇవన్నీ ఇప్పుడే, మీకాలంలోనే, వచ్చేయి. అంటే మాకాలంలో లేవని కాదు. మేం ఇలా తీరికూచుని ఈ ఈకపీకుడు ఆలోచనలు చేసేవాళ్ళం కాదు. మారోజుల్లో అన్ని రోజుల్లాగే అది మరో రోజు. మన జీవితాల్లో భాగమే తినడం, తాగడం,

పడుకోడంలాగే. అంతే. అడుగడుగునా ఏదో ఒకరకం పొరపొచ్చాలు అను అభిప్రాయబేధాలు అను వస్తూనే ఉంటాయి. వాటిని మేం అంతగా పట్టించుకోలేదు," అంది సిరి సాలోచనగా.

"అంటే నీకూ తాతయ్యకూ - అదే పొరపొచ్చాలు - వచ్చేవా?"

"ఆహ్ లక్షణంగానూ."

"మరి నువ్వే సర్దుకుపోయేదానివా?"

"అదే మీతో చిక్కు."

"మీతో.. అంటావేమిటి. నాకు తెలీదు కనకే నిన్ను అడుగుతున్నాను. కదా."

"మరేంవనమంటావు? - అవును నేనే సర్దుకుపోయేదాన్ని - అని నేను అనాలని నీఆశ. హాహా. ఆరోజుల్లో ఆడవాళ్ళందరూ భర్తలచేతా, అత్తా ఆడబడుచులా చేతా నానా అగచాట్లూ పడ్డారనే కదా కథలన్నీ. బాధలు ఎంత హృదయవిదారకంగా ఉంటే అంత మంచికథ. అసలు అలా రాయకపోతే అది కథే కాదు. కానీ అలా కాక కొందరు నాలాటివారు తమకీ ఎదటివారికీ కూడా బతుకు ప్రశాంతంగా సాగిపోయేలా జరుపుకొచ్చేరంటే దానికి నువ్వేదో పేరు పెడతావు?"

"ఏమిటి నువ్వనేది?"

"ఇల్లు నా సామ్రాజ్యం. వంటిల్లే నా రాజధాని. నేనక్కడ ఏం చేసుకున్నా ఎవరూ అడగరు. పూజలు చేసుకున్నా వ్రతాలు చేసుకున్నా నాఇష్టమే. వీధిలోకి వెళ్ళినాయన ఆలస్యంగా వస్తే నాకు బాధ లేదు. ఎక్కడెక్కడ తిరుగుతాడో, ఏం చేసి ఉంటాడో అనుకుంటూ అనుక్షణం నన్ను నేను హింస పెట్టుకుంటూ ఆయన ఇంటికి రాగానే ఆరాలు తీస్తూ నాబుర్ర పాడుచేసుకోనూ లేదు, నాఇల్లు నరకం చేసుకోనూ లేదు."

అరవింద అయోమయంగా చూసింది. "ఆయన ఎలా చేసినా నీకు అంగీకారమే అంటావు. మరి నీకొక వ్యక్తిత్వం, నీజీవితానికొక ధ్యేయం లేవా? నేనూ మనిషినే అని నీకు ఎప్పుడూ అనిపించలేదా?"

"అదే నేనంటున్నది. చూసావా? అంగీకారాలూ, వ్యక్తిత్వాలూ, ధ్యేయాలూ ... అంటూ రొడ్డకొట్టు పేర్లు వల్లించేస్తున్నావు. అప్పట్లో మాకు అలాటి ఆలోచనలు రాలేదు. అది ఇప్పుడు మార్చలేం. ఈనాడు ప్రచారంలో ఉన్న ప్రమాణాలతో ఆనాటి జీవితాన్ని కొలుస్తున్నావు. అది న్యాయం కాదు. ఆకాలం అదీ అని నీకు తోచాలి."

‘‘నీకు ఆ ఆలోచన లేనంతమాత్రనా దుర్మార్గం దుర్మార్గం కాకుండా పోతుందా? ఏకాలం అయినా మనిషిని మనిషిగా చూడాలన్న ఆలోచన తప్పెలా అవుతుంది?”

“తప్పొ ఒప్పొ అని కాదు నేనంటున్నది. ఆరోజుల్లో లేని భావజాలం “లేదేం?” అని అడిగితే నేనేం చెప్పగలను అంటున్నా. పోనీ, మరొకటడుగుతాను చెప్పు. ఈరోజుల్లో మీరేదో ప్రేమలూ, పెళ్ళిళ్ళూ మీరే కనిపెట్టినట్టు, మిగతా అందరూ పెద్దలు చెప్పినమాట ప్రకారం పెళ్ళిళ్ళు చేసుకుని ఏదో కోల్పోయినట్టు మాటాడుతున్నారు. పెళ్ళి ఎలా జరిగినా, అయినతరవాత, ఒకరినొకరు అర్థం చేసుకునో చేసుకోకుండానో కాపురాలు చేసుకుంటున్నవారు వేలకి వేలు లేరా? అసలు ఏ ఇద్దరు ఒక గాటకి కట్టబడినా … కారణం ఏదైనా కానీ … ఇద్దరూ ఎంతో కొంత వదులుకోడం తప్పదు. తల్లీ పిల్లా, తండ్రీ కొడుకూ, అన్నదమ్ములూ అక్కచెల్లెళ్ళూ, యజమానీ-పాలేరూ, మేనేజరూ గుమాస్తా … ఎవరైనా సరే. మరోమనిషి పక్కన ఉంటే నీ జాగాలో కొంత తరుగు అయి తీరుతుంది. చాలాసార్లు చిన్నవిషయాలకే పెద్ద రచ్చ పెట్టేసుకుని - నాకిలా చెయ్యడానికి అధికారం ఉంది, నీకలా చెయ్యడానికి అధికారం లేదూ - అంటూ అరిస్తే ఎవరికీ సుఖం లేదు. ఆ రోజుల్లో నేను వండినకూర ఆయనకి నచ్చకపోయినా, ఆయన తెచ్చినచీర నాకు నచ్చకపోయినా పోతే పోనీ అనేసి ఊరుకునేవాళ్ళం. అంతే. దీనిలో వ్యక్తిత్వాలూ, అధికారాలూ - వీటి ప్రమేయం లేదు.”

“అయితే నేనే అనవసరంగా రచ్చ చేస్తున్నానంటావు?”

“మారోజులకీ ఈరోజులకీ పోలిక లేదు, కూడదు అంటున్నా. పోనీ మరో ఉదాహరణ చెప్తాను. మారోజుల్లో ఇన్ని కారుప్రమాదాలూ, విమానప్రమాదాలూ లేవు కదా అంటే నువ్వేమంటావు? అప్పుడు ఇన్ని కార్లూ, విమానాలూ లేవు కదా అంటావు, అవునా?”

‘‘అంతే కదా మరి.”

“అలాటివే మనుషుల ప్రవృత్తులూను. మార్క్స్ ఏమన్నాడో, మావో ఏమన్నాడో మాకు తెలీదు. మనువూ, శంకరుడూ ఏమన్నాడో కొంచెం తెలుసనుకో, అదైనా సూచనప్రాయంగానే. ఏది ఏమైనా ఒక్కటి మాత్రం చెప్పగలను. ఆరోజుల్లో మేమే ఎక్కువ ప్రశాంతంగా బతికేం. ఇప్పుడు మీ ధోరణే వేరు. మీఆలోచనలూ ధోరణులమూలంగా వచ్చే తికమకలకీ, ఈతిబాధలకీ కూడా మీరే బాధ్యులు. వెనకటిరోజుల్లో మతంపేరుతో కొన్ని నియంత్రణలు ఉండేవి. నిస్సంగం అనో సంయమనం అనో పేరు పెట్టి అదే ప్రచారం చేసేరు. ఇప్పుడు సైకాలజిస్టులచేత చెప్పించుకుంటున్నారు సుమారుగా అలాటిమాటే. నువ్వు చెప్పు. ఈ సైకాలజిస్టులు

understanding పేరుతో చెప్పేదేమిటి? నువ్వు నీ ఆలోచించేతీరు మార్చుకోమనే కదా. అంటే అందులో వదులుకోడం లేదా?"

"మేమే కోరి ఈ తలనొప్పులన్నీ తెచ్చుకుంటున్నాం అంటావు?"

"నాకు కనిపించిన ధోరణులు నేను చెప్తున్నాను. అవి విపరీతధోరణులో కాదో నేను చెప్పలేను. నువ్వు ఎలా అర్థం చేసుకుంటావు అన్నది నీయిష్టం."

"కూరా, చీరా - చిన్నవిషయాలు. వాటిమాట వొదిలెయ్. తాతయ్య నిన్ను మీదపడి కొడుతూంటేనో ... వేరే ఆడవాళ్ళవెంట పడి నిన్ను నిర్లక్ష్యం చేస్తేనో .. అప్పుడు కూడా అలాగే పోనిస్తూ అని ఊరుకుంటావా?"

"అదే అంటున్నాను. అలాటి పెద్దవిషయాల్లో కూడా వారి వారి స్తోమతనిబట్టీ స్థితిగతులనిబట్టి ఎవరికి వారు నిర్ణయాలు తీసుకున్నారు. అంతే కానీ పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రం అనుకోలేదు. కొందరు పుట్టింటికి పోయేరు. కొందరు మరోడితో లేచిపోయేరు. కొందరు బావుల్లో దూకో ఉరేసుకునో ప్రాణాలు తీసుకున్నారు. అప్పుడు కూడా ఇన్ని రకాలూ ఉన్నాయి అనే చెప్తున్నాను. ఆ కేసులన్నీ విడివిడిగా దేనికదే ఒక కేసు. అలాగే తీసుకోవాలి కానీ వాటిని అన్నిటినీ ఒక కుప్ప పోసి ఓ సిద్ధాంతం చేసి, అందరికీ ఇదే మార్గం అంటూ రూళ్లు చేసేయడం జరగలేదు. నామటుకు నాకు అదే నయం అనిపిస్తుంది."

"అంటే ఇప్పుడు నేను కూడా విషివిషయంలో నీలాగే ప్రశాంతంగా ఉండాలంటావేమిటి, అతను ఎంత  భూగోళంలాగ తనచుట్టూ తాను తిరుగుతున్నా? సుందరంగారు చెప్పింది కూడా అదేలే," అంది అరవింద చిలిపిగా.

సిరి నవ్వింది, "లేదు. అది సాధ్యం కాదు. చెప్పేను కదా కారూ, విమానాల్లాగే - అవి ఎక్కడికీ పోవు. అంచేత వాటివల్ల వచ్చే ప్రమాదాలూ ఎక్కడికీ పోవు. మాకాలపు ఆలోచనలు ఈకాలానికి పనికిరావు. కానీ, ఈకాలంలో వచ్చిన ఇంత స్వోత్కర్ష, అహంకారం మాత్రం - ఈ "నేను", "నాది" - అన్నది అదుపులో పెట్టుకుంటేనే మనశ్శాంతి. ఎంతసేపూ దీనివల్ల నాకేం ఒరుగుతోంది అని కాక ఇది లేకపోతేనేం అని కొంత వదులుకోడం నేర్చుకుంటే సుఖపడతారు."

"అది నాకొక్కదానికేనా... విషికీ ... ఇంకా అడిగితే వాళ్ళనాన్నకీ కూడా ఉండాలి కదా. వాళ్ళబతుకులే కాక నాబతుకేమిటో కూడా వాళ్ళు ఆలోచించాలి కదా."

సిరి అవునన్నట్టు తలూపింది.

మళ్ళీ అరవిందే అంది, “అలా అంటే నాది స్వార్థం అంటావు కాబోలు.”

“నేనేమీ అనడంలేదు. నువ్వే ఆలోచించుకో అంటున్నాను. అవును. విషికీ వాళ్లనాన్నకీ కూడా లేవు. వాళ్ళు మారరు. మరి అది తెలిసిన తరవాత నువ్వు ఏం చేస్తావు, ఏమి చేయగలవు అన్నది నువ్వే ఆలోచించుకోవాలి అంటున్నాను. వెనక నువ్వు మాయా ఏంజెలో మాటల్లో చెప్పింది అని అన్నది అదే కదా.  ఏది స్వార్థం, ఏది శాంతియుత సహజీవనం అన్నది మాటల్లో నిర్ధారించడానికి వీలవదు. నువ్వు సాయం చేస్తున్నాను అనుకోవచ్చు. అది నీ చేతకానితనం అని అవతలివాడు అనుకోవచ్చు. లేదా అది అతని ఘనత అని కూడా అనుకోవచ్చు. ఇలాటివే - నేనంటున్నది అర్థాలకీ, అపార్థాలకీ, అనర్థాలకీ కూడా దారి తీస్తాయి. మాకాలంలో మేం అంత సీరియస్‌గా తీసుకోనివి కూడా ఇవే...”

“నాకెందుకో లీలగారితో కూడా మాటాడితే బాగుంటుందేమో అనిపిస్తోంది.”

“మాటాడి చూడు. నీకిదేదో ప్రాజెక్టులా ఉంది. విషీ నువ్వూ మళ్ళీ కలిసినా విడిపోయినా నీకు జ్ఞానోదయం కావచ్చు. భవిష్యత్తులో పనికిరావొచ్చు.”

“నీకు అంత హాస్యంగా ఉందేమిటి?”

“అదే కదా చెప్తున్నాను. నేనేదీ సీరియస్‌గా తీసుకోను. హీహీ.”

“హాహా.”

అరవింద బయటికొచ్చి కారెక్కింది కానీ తీరా రోడ్డెక్కేసరికి ఎక్కళ్లేని నీరసం, చిరాకూ ఆవహించేయి. ఇంతవరకూ సేకరించిన సమాచారంతో బుర్ర వేడెక్కిపోయింది.

ఆలోచిస్తూ రెండు వీధులు దాటేక, లీలసంగతి పక్కన పెట్టేసి కారు మాలికగారింటివేపుకి మళ్లించింది.

000

"ఏం చేస్తున్నారేమిటి?" అంటూ లోపలికొచ్చింది అరవింద.

ఇది తనకి వేళకానివేళ, ఏమిటో విశేషం అనుకుంటూ, "ఏముందీ వేళప్పుడు, వంటే," అన్నాను.

“మంచి ఘుమఘుమ వాసనలు. ఏం చేస్తున్నారు?"

"మజ్జిగపులుసు. తింటావా?"

"ఏంటో మీరు! ఇంతకాలంగా మీయింటిచుట్టూ తిరుగుతున్నా. రా, భోంచేసి పోమ్మని ఒక్కసారయినా అన్లేదు."

నేను తెల్లబోయి, తమాయించుకుని, "సరే, ఇప్పుడు అంటున్నాను. ఒక్క పావుగంట ఆగు. అన్నం అయిపోతుంది."

"ఇవాళ కాదులెండి. శనివారం వస్తాం."

"వస్తాం అంటే? బంధుమిత్రసపరివార సమేతంగానా? ఎంతమందిని వేసుకొస్తావేమిటి?"

"లేదులెండి. వాళ్ళంతా ఎందుకు? ఒక్క మిత్రమే."

"ఓ. ... సరే. శనివారం రండి ఇద్దరూ. అతని ఇష్టాయిష్టాలూ, ఎలర్జీలు కూడా ఏమిటో ఇప్పుడే చెప్పు. తీరా కంచందగ్గర కూర్చున్నాక ఇది తినను, అది పనికిరాదు అంటే ఒప్పుకోను."

"అతను ... అంటారేమిటి. ఎవరో నేను చెప్పలేదు కదా," అంది అరవింద చిలిపిగా.

"సరే, అతనో ఆవిడో మరేదో శాల్తీయో ... ఎలర్జీలమాట చెప్పు."

"కాకరకాయ చాలా యిష్టం," అనేసి నవ్వుతూ పారిపోయింది అరవింద.

నేను అక్షరాలా విభ్రాంతితో ఆ అమ్మాయి వెళ్ళినవైపు చూస్తూ ఉండిపోయేను చాలా సేపు. మామూలుగా ఇది డేటింగులో రెండో భాగం. ఇద్దరూ ఇష్టపడ్డాం అనుకున్నతరవాత వారి వారి ఇళ్ళల్లో పెద్దలకి పరిచయం చేస్తారు ఒకరినొకరు. నాకు ఆశ్చర్యం అయింది. ఈ నాటకంలో నేనెక్కడ ఇముడుతాను అన్నది. అసలు ఆలోచిస్తే ఈ అంకం అక్కర్లేదు. వాళ్ల కుటుంబాలు ఒకరికొకరు పరిచయమే కనక. కానీ నన్ను ఇరికించడంలో మాత్రం అరవిందకి ఏదో ఆలోచన ఉన్నట్టే అనిపిస్తోంది. లేదేమో. అదే తెలుస్తుంది అనుకుని మరో పనిలో పడిపోయేను.

000

శనివారం ఇద్దరూ చెరో కారులోనూ వచ్చేరు. వాళ్ళు వచ్చేసరికి నేను కాకరకాయలు తరుగుతున్నాను.

విషి వస్తూనే, "హా కాకరకాయలు! ఇటివ్వండి నేను తరుగుతాను," అంటూ నాచేతిలోంచి కత్తి తీసుకున్నాడు చనువుగా.

“ఉండుండు. ఇలా మొదటిపరిచయంలోనే మేం ఇంటికొచ్చినవాళ్ళని వంటింట్లో పనికి పెట్టేయము,” అన్నాను కానీ అతను వినిపించుకోలేదు.

“చెయ్యనివ్వండి. అతనికి సరదాలెండి. పైగా బాగా చేస్తాడు కూడాను,” అంది అరవింద తేలిగ్గా.

నేను కత్తీ, కాకరకాయలూ అతనికొదిలేసి, వేరుశనగగింజలు వేయించడం మొదలు పెట్టేను.

“అవెందుకూ?“

“పులిహోరలో బాగుంటాయని.“

అరవింద సింకులో ఉన్న గాజు గ్లాసులు రెండు కడగడం మొదలెట్టింది. “అవలా ఉండనియ్యిలే, నేను తరవాత చూస్తాను,“ అంటున్నా వినిపించుకోకుండా.

వాళ్ళిద్దరి చొరవా, పనితనం చూస్తే నాకు ముచ్చటేసింది. “బాగుంది. ఇలా అని ఇంతవరకూ తెలీలేదు నాకు. ఇహమీదట మీరిద్దరూ రెండురోజులకోమారు మాయింటికి రావాలి తప్పకుండా.“

“తప్పకుండాను. నానెంబరిస్తాను. స్పీడ్ డయలుమీద పెట్టుకోండి,” అన్నాడు విషి.

మరుక్షణం ఠప్మని చెప్పుడయింది.

అరవింద చేతిలో గాజుగ్లాసు చెయ్యి జారి సింకుఅంచుకి కొట్టుకుని ముక్కలయింది. అరవింద వేలికి గాజుపెంకు గీసుకుని రక్తం చిమ్మింది.

"అయ్యయ్యయ్యో..." అంటూ విషి అరవింద చెయ్యి పుచ్చుకుని చన్నీళ్లతో కడుగుతూ, “తువాలు ఇవ్వండి,“ అన్నాడు నాతో.

నేను కూడా హడావుడిగా లేచి డ్రాయరులోంచి తువాలు తీసి తడిపి ఇచ్చేను.

“అబ్బ, మరేం ప్రమాదం లేదులెద్దూ,“ అంటూనే ఉంది అరవింద కానీ ఇద్దరం వినిపించుకునే స్థితిలో లేం. అదేమైనా కోతిపుండు బ్రహ్మారాక్షసి అవుతుందేమోనని నాభయం.

ఆ సుకుమారమైన చేతికి గాయమయిందే అని విషి బాధ పడిపోతున్నాడు.

“హుష్. మాటాడకు," అని అరవిందకీ "first aid kit తీసుకురండి,“ అనీ నాకూ చెప్పేడు మహ ఆరాటపడిపోతూ.

“అంత ప్రమాదం లేదని చెప్తున్నానా? రెండునిముషాలు ఇలా తడిగుడ్డ చుట్టి పట్టుకుంటే అదే పోతుంది," అంది అరు.

“అంత రక్తం కారుతుంటే ఏం లేదంటావేమిటి?“

“రక్తం అలా కనిపిస్తోంది కానీ నిజంగా తక్కువే.“

“first aid కిట్టు లేదు మాఇంట్లో. band aid అయినా లేదు. కొందాం అనుకుంటూనే తాత్సారం చేసేను.“

“మీరిలా ఈ చెయ్యి పట్టుకోండి. నేనెళ్ళి బాండెయిడ్ తీసుకొస్తాను.“

“ఇప్పుడేం అఖ్ఖర్లేదంటున్నానా?”

“క్షణంలో వచ్చేస్తాను,” అంటూ వెళ్లిపోయేడు అతను అరవిందమాట వినిపించుకోకుండా.

అతనలా బయటికి అడుగు పెట్టేడో లేదో అతనిసంచీలో సెల్లు ఆలాపన అందుకుంది.

నేను అరవిందవేపు చూసాను, “సెల్ పట్టుకెళ్ళడం మరిచిపోయినట్టున్నాడు.“

అరవింద నవ్వింది, “అదొక నటనలెండి.“

నాకు అయోమయం. "అంటే? కావాలనే వదిలేసి వెళ్ళిపోయేడా?"

“వాళ్ళనాన్న అయివుంటుంది. అయివుంటుందేమిటి ఆయనే. ... బుజ్జితండ్రి ఎక్కడ తప్పిపోతాడో అని ఆయనకి బెంగ. పూటకి మూడుసార్లు పిలిచి యోగక్షేమాలు కనుక్కుంటూ ఉంటారు. నాతో ఉన్నాడని తెలిస్తే ఐదేసి నిముషాలకోసారి వస్తాయి, మన tornedo warnings లాగే.“

విషి చిన్నసైజు భోషాణంలాటి పెద్ద first aid పెట్టెతో తిరిగొచ్చేడు.

“అంత పెద్ద పెట్టె తెచ్చేవేమిటి? బాండెయిడ్ బాక్స్ తెస్తే సరిపోయేదానికి.“

“ఉండనియ్యండి. ఎప్పుడే అవసరం వస్తుందో చెప్పలేం కదా.“

అరవింద వేలు మరోసారి కడిగి, ఏదో మందు రాసి, కట్టు కట్టేడు.

“ఇంత కట్టు మాఅమ్మ చూసిందంటే మూర్ఛపోతుంది.“ అంది అరవింద.

ఆ తరవాత తింటున్నంతసేపూ, విషి ఆరాటపడుతూనే ఉన్నాడు. “నేను కలిపి పెట్టనా?“ “మంచినీళ్ళు అందించనా?“ అంటూ.

మళ్ళీ సంచీలో సెల్లు మోగింది. విషి తీసి చూసి మళ్ళీ సంచీలో పెట్టేశాడు.

“మీకు తెలుగు భోజనాలు ఇష్టమా?“ అన్నాను కూరా అన్నం కలుపుకుంటూ.

“తినదగ్గది ఏదైనా తినేస్తాడండీ.“

“అదేం కాదు. నేను ఏం తింటున్నానో చూసుకునే తింటాను.“

“అంటే?“

“నాకు అన్ని రుచులూ కావాలి. అన్నీ తింటాను అంటే రుచిగానే అయినా పోషకపదార్థాలు కూడా చూసుకుంటాను. మనవాళ్లు డైటింగు డైటింగు అంటూనే భోజనం అంటే కంచంనిండా అన్నం పెద్ద కుప్ప పోసి కూరలూ, పప్పూ నామమాత్రంగా కలుపుకు తింటారు. లేదా తినడం మానేస్తారు. నేనలా కాదు. అన్నీ తింటాను. ఒకరోజు అదేపనిగా జిలేబీలూ, మైసూరుపాకూ తినేస్తాను, మరో వారంరోజులు వాటివేపు చూడను. అలాగే కూరలూనూ. మనకూరల్లో ఎన్నో బలమిచ్చేవి ఉన్నాయి. సమతూకంలో తినడం - అదీ ముఖ్యం. కారాలు తింటాం. దానికి విరుగుడు పెరుగు. అలాగే మెంతులు, ధనియాలూ, జీలకర్రా, అల్లం - వీటన్నిట్లో ఇక్కడ వాళ్ళు చెప్పే ఫైబరూ అవీ ఉన్నాయి. వంకాయ, బీరకాయ, బెండకాయ - ఇవన్నీ కూడా ఎంతో మంచివి. వాటిలో నీరు ఎంతో మంచిది. చక్కగా తాజాకూరలు తినొచ్చు కదా. మన కూరలు రక్తపోటు, గుండెదడలాటి జబ్బులు రాకుండా కాపాడతాయి. అయితే సరిగ్గా తినడం తెలియాలి. అంతే. తింటే అదేపనిగా కడుపులో చిచ్చు పెట్టేంత కారాలూ, లేకపోతే అన్నీ వేపుళ్ళూ. అలా కాదు. సరైన పాళ్లలో తింటే ఏది తిన్నా మంచిదే. అదే సిసలైన నీతిసూత్రం."

నేను అతనివేపు చూస్తున్నాను కంచంలో చేయి పెట్టుకు. ఇతనికి మనభోజనాలమీద అంత ఆసక్తీ, ఆలోచనలూ ఉండడం నాకు ఆశ్చర్యంగా ఉంది.

"సరిలే. చాలు నీ డైటుపాఠాలు. ఆవిడని తిననియ్యి," అంది అరవింద నవ్వుతూ.

"తింటున్నాలే. చెప్పనియ్యి అతని సిద్ధాంతాలు," అన్నాను ఉలికిపడి అన్నంముద్ద నోట్లో పెట్టుకుంటూ.

భోజనాలయేక, వాళ్లు తెచ్చిన Apple struedel ముక్కలు కోసి, “whip cream ఉందా?“ అన్నాడు ఫ్రిజ్ తలుపుమీద చెయ్యేసి.

లేదన్నాను. “పోనీ, Venilla ice cream తో తిందాంలెండి.“

"అది కూడా లేదు," అన్నాను విచారపడిపోతూ. నాకు తోచనేలేదు ఇలాటివి అవుసరం అవుతాయని.

"ఏంటీ? ice cream కూడా లేదా? ఆశ్చర్యమ్! హుమ్. ఉండండి. క్షణంలో వచ్చేస్తా," అంటూ మళ్ళీ బయల్దేరేడు.

"ice cream లేకుండా తిందాం, మళ్ళీ ఏం వెళ్తారు, మీరిక్కడ ఉన్నంతసేపూ బజార్లు తిరగడంతోనే సరిపోతోంది," అన్నాను.

"ఫరవాలేదండీ, రెండు నిముషాల్లో వచ్చేస్తా," అంటూ హడావుడిగా వెళ్ళిపోయేడు విపి.

"అతనంతేలెండి," అంది అరవింద.

"ఈదేశంలో ఇంట్లో ice cream లేనివాళ్ళని ఇదే చూడ్డం కాబోలు."

"నిజం చెప్పమంటారా?."

"చెప్పు."

"నిజంగానే ఇంట్లో ice cream లేనివాళ్ళని అతను సహించలేడు. క్షమించడు అన్నా తప్పులేదు. అదో లోకంలెండి."

"పోన్లే. అయినా అదో లోపమా ఏమిటి. ఎవరిపెర్రి వారికానందం."

"ఆఁ."

"మంచి అబ్బాయిలాగే ఉన్నాడు, నువ్వంటే చాలా ఇష్టం కూడా. కనిపిస్తూనే ఉంది," అన్నాను. మరెందుకు వదిలేసేవతన్ని అని నేను అనలేదు కానీ తనకి అర్థమయినట్టే ఉంది. అరవింద తల వంచుకుంది చిన్నగా సిగ్గుపడుతూ.

"అదేనండీ బాధ. అందుకే ఈ సందిగ్ధావస్థ. నిజంగా మంచివాడే. తిక్క రేగినప్పుడు మాత్రం భరించడం కష్టం."

"ఎవరైనా అంతే కదా. ఆమాత్రం పేపకాయంత పెర్రి లేనివారు ఉండరని జనవాక్యం."

"అవుననుకోండి. నాకింకా పదిహేడే కదా. ముందు ముందు ఏం చేస్తామో ఎలా మార్తామో నాకూ తెలీదు, అతనికీ తెలీదు. ఏదో సరదాగా కొన్నాళ్ళు కలిసి తిరిగేం. ఆమాత్రానికే వాళ్ళమ్మా, నాన్నా మాకు పెళ్లయిపోయినట్టు నా ప్రాణాలు కొరుక్కుతినేస్తే ఎలా?"

“అవును. అసలు నువ్వెప్పుడూ వాళ్ళమ్మగురించి మాటాడలేదు. నీతో ఆవిడ బాగానే ఉంటారా?“

“ఫరవాలేదు, ఆయనకంటె నయమే కానీ," అరవింద వాక్యం పూర్తి కాకముందే విషి వచ్చేడు ice cream, whip cream కూడా తీసుకుని.

“రెండూ తెచ్చేరేమిటి? నేను అవి వాడను. పోనీ మీరు పట్టుకుపోండి వెళ్ళేటప్పుడు,” అన్నాను.

“ఉండనీండి. మేం కాకపోతే మాలాటివాళ్ళు మరొకరు రావచ్చు కదా.”

“ఇంక వచ్చేవాళ్ళెవరూ లేరు. మీరే రావాలి ఆ క్రీములు రెండూ అయిపోయేవరకూ.“

“సరే, మీరంతగా చెప్తుంటే ఏం చేస్తాం! అలాగే వచ్చేస్తూంటాం. వారానికొకమారు రమ్మంటారా? రెండుమార్లు రమ్మంటారా?”

మరో అరగంట కూర్చుని ఇద్దరూ వెళ్తాం అంటూ లేచేరు.

వాళ్ళని గుమ్మంవరకూ సాగనంపి, రెండు కార్లూ కనుమరగయేవరకూ చూస్తూ నిలబడిపోయేను.

000

ఒకరిగురించి వేరేవాళ్ళు చెప్పినప్పుడు ఏర్పడే అభిప్రాయాలకీ ఆ మనిషే ఎదురుపడి కాస్సేపు కబుర్లు చెప్పుకున్నతరవాత ఏర్పడే అభిప్రాయాలకీ ఎంత తేడావో!

నాకు అరవింద సమస్య అర్థం అయినట్టే అనిపించింది. ఆ పిల్లకి అతనంటే ఇష్టం లేకపోలేదు. బహుశా అతని తల్లిదండ్రులు అంత గొడవ చేయకుండా వాళ్ళమానానికి వాళ్ళని వదిలేస్తే, వాళ్ళకి వాళ్ళే తేల్చుకుసేవారేమో. అరవింద తెలివైనది. ఆడపిల్లలు ఎదిగినంత తొందరగా మగపిల్లలు ఎదగరు. ఇతను కాకపోతే ఇతని తాతలాటివాడు మరొకడు అంటారు కానీ వాళ్లు ఆలోచించనిమాట ఆ మరొకరికి మరో రకం వెర్రి ఉండదన్న హామీ ఏమీ లేదు అన్నది. అరవింద కూడా అది గ్రహించే ఉండాలి. అందుకే అతనితో పూర్తిగా తెగతెంపులు చేసుకోలేకపోతోంది కానీ ఒకటి మాత్రం నిజం. అరవింద సమయం వచ్చినప్పుడు తగిన నిర్ణయం చేసుకోగలదు. అవుసరమైతే విషికి ఒకటో రెండో పాఠాలు కూడా నేర్పగల సమర్థురాలే అనుకున్నాను తలుపు వేసి, లోపలికి నడుస్తూ.

000

8

ఎండ మండిపోతోంది. ఇంత గాలివాన నేనెప్పుడూ చూళ్లేదన్న నక్కని తలుచుకున్నాను. డలస్ వచ్చేక, ఇంత ఎండ చూడ్డం ఇదే మొదలు. విస్కాన్సిన్‌లో ఎండలు 90 డిగ్రీలు దాటిన రోజులు లేవని కాదు కానీ విస్కాన్సిన్ అంటే మంచే కనిపిస్తుంది నాకు కానీ ఎండలు కాదు.

''ఇంకా మీరు టెక్సస్ ఎండలు చూడలేదు,'' అన్నారు రెడ్డిగారు కిందటివారమే. అంచేత ఆ టెక్సస్ గాడ్పులకోసం ఎదురు చూస్తున్నాను. నిజంగా వచ్చే గాడుపులకన్నా ఈ ఎదురు చూపులమూలంగా వచ్చే ఏడుపే ఎక్కువగా ఉంది ... మ్ మ్...

తలుపు చప్పుడయింది. తారకం గుమ్మంముందు నిల్చున్నాడు.

"రా. రా. తోచక చస్తున్నాను. మంచి సమయానికే వచ్చేవు," అన్నాను తలుపు బార్లా తీసి.

తారకం లోపలికొస్తూ, "మంచి సమయానికే వచ్చేనన్నమాట. ఇంకా పిలవకుండా వచ్చేనని కోప్పడతారేమో అనుకున్నా," అన్నాడు.

"లేదులే. ఇంతకీ విశేషాలేమిటి? అసలు ఈమధ్య కనిపించడమే లేదు."

"రాబోయే వేసవిలో అంతర్జాతీయస్థాయిలో తెలుగుమహాసభలండి. వాటితో తీరడంలేదు," అన్నాడు తారకం.

ఇక్కడ తారకం ఎవరో తెలీనివారికి ఒకమాట చెప్పాలి. తారకంతో నాకు పరిచయం పదేళ్లపైనే. తెలుగుకథలంటే పట్టలేని అభిమానం. ఏదో రాసేయాలనో చేసేయాలనో తపన. 12 ఏళ్లు అయిందనుకుంటా ఎవరింట్లోనో కలిసేడు. అప్పుడప్పుడు మాఇంటికి వస్తాడు కబుర్లు చెప్పుకోడానికి.

"ఆహా, బాగుంది," అన్నాను.

కొంతకాలంగా సభలంటే నాకు ఉత్సాహం చచ్చింది. అంచేత ఏం సభ, ఎక్కడ అని అడగలేదు.

" అది కాదండి. మీరు కొంచెం సాయం చేయాలి."

"నేనేం చెయ్యగలను. సిరిని పిలుస్తాను. ఆవిడ చెప్పగలదు నీప్రశ్నలకి సమాధానాలు."

"ఆవిడెందుకులెద్దురూ. మీ అభిప్రాయాలేవిటో చెప్పండి, సరిపోతుంది," అంటూ నసిగేడు తారకం.

"నేనసలు ఈమధ్య ఏం చదవడంలేదు. ఇప్పుడేం జరుగుతోందో నాకే తెలీదు, నీకేం చెప్పను? తెలిసీ తెలీని మాటలు మాట్లాడితే నీకూ నాకూ కూడా తలనొప్పి తరవాత. సిరి తెగ చదువుతుంది. అన్ని విషయాల్లో అప్ టు డేటు ఆవిడే. ఆవిడ చెప్తే బాగుంటుంది. ఏం? నీకిష్టం లేదా? ఏంవయిందేమిటి?"

"ఏమిటోలెండి. ఆవిడదంతా అదో రకం, మీకు మాత్రం తెలీదేమిటి?"

"తెలీదు. ఆమెతో కానీ తగువు పడ్డావా? ఏవిషయంలో?"

"తగువులేం లేవండీ. అసలు ఆవిడకథలు. అవి బాగానే ఉంటాయి. కానీ పాఠకులు ఏదైనా అడిగితే మాత్రం ఆవిడ చెప్పే సమాధానాలు ..." అంటూ సగంలో ఆపేసి నాముఖం చూసి ఆగిపోయేడు.

నేను ఇలాటి వ్యాఖ్యానం వినడం ఇదే మొదలు. నాకు కొంచెం ఆశ్చర్యమూ, మరింత కుతూహలమూ కలిగేయి.

"ఓహో. ఏదో పెద్దకథే అయినట్టుంది. మరి అదేదో స్పష్టం చేసుకోడానికేనా ఎదురుపడి మాటాడుకోవాలి కదా. పిలుస్తానుండు," అని ఫోను తీసేను అతన్ని మాటాడనివ్వకుండా.

"సరే, రానీండి. నేను అడిగినవాటికి ఆవిడకి కోపం వస్తే మాత్రం మీదే పూచీ."

"ఏంటి కథ? పంచాయితీ పెట్టేరు," అంది సిరి గదిలో అడుగు పెడుతూనే.

"ఏదో కాలక్షేపంలే. తారకానికి హఠాత్తుగా నీ కాలంలో నువ్వెలా నెగ్గుకొచ్చేవో తెలుసుకోవాలని గట్టి కోరిక పుట్టింది. నీచేతే చెప్పించాలని నిర్ణయించుకున్నాం. ఈరోజుకి క్లాసు నీదే," అన్నాను.

"ఏంటో ఆ రోజులు. అసలు మేం అంత అమాయకంగా ఎలా పెరిగేం అని నాకే ఆశ్చర్యం వేస్తుంది ఇప్పుడు తలుచుకుంటే."

నేను మాటాడలేదు. నాకూ అనుభవమే మరి. తారకంవేపు చూసేను అడుగు అన్నట్టు.

"మీచిన్నతనం ఎలా గడిచిందో చెప్పండి. పుస్తకాలు చదవడానికి మిమ్మల్ని ఎవరు ప్రోత్సహించేరు? మీకు కథలు రాయాలన్న కోరిక ఎలా కలిగింది? ఎవరు మీకు స్ఫూర్తినిచ్చేరు?"

సిరి నవ్వింది. "ఇదేమిటి ఇంటర్వ్యూలా ఉంది? ఇలా అని ముందే తెలిస్తే దానికి తగ్గట్టు సిద్ధం అయి వచ్చేదాన్ని కదా."

తారకం కూడా నవ్వేడు. "అదేనండీ, మీరు ముందే జవాబులు సిద్ధం చేసుకు వచ్చి సువ్వీ సువ్వీ దంపుళ్లపాటల్లా కాకుండా ఇప్పటికిప్పుడు తోచిన ఆలోచనలూ, అభిప్రాయాలు చెప్తారనే ఇలా పెట్టేం ఈ సమావేశం."

"అలాగే చెప్తాను కానీ మళ్ళీ అప్పుడలా అన్నారు, ఇప్పుడిలా అంటున్నారు అని సతాయిస్తే ఒప్పుకోను."

"అదేంటండీ. పాఠకులం మేం ఏం అడిగినా చెప్పాలి కానీ 'అది చెప్తాను, ఇది చెప్పను' అని రూల్సు పెడితే ఎలా?"

"నేను చెప్పననడంలేదు. నాకు తెలిసింది నాకు తోచినమాటల్లో చెప్తాను. ఆపైన మీయిష్టం అంటున్నాను."

"సరే మొదలెట్టండి మీ చిన్నతనంగురించి,"

"చిన్నతనంగురించి ఏం చెప్పమంటావు?"

"మీరెంతమంది అక్కచెల్లెళ్ళూ, అన్నదమ్ములూ?"

"ముగ్గురన్నదమ్ములు, ఇద్దరక్కచెల్లెళ్ళం. నేను చిన్నదాన్ని. అంచేతో మరెంచేతో ఇంటిపనుల్లో నాకు అట్టే జోక్యం ఉండేది కాదు. నేను పట్టించుకునేదాన్నీ కాదు. మాఅమ్మ చెప్పేదీ కాదు. ఏ అమావాసకో పున్నానికో ఓ రోజు వంటింటి గుమ్మందగ్గర నిలబడి 'నేనేమేనా చెయ్యనా' అంటే మా అమ్మ 'చెయ్యాలనుంటే చెయ్యి, లేకపోతే లేదు. పనిమనిషికి చెప్పినట్టు చెప్పమంటావేమిటి నీకు' అనేది. లేదా 'ఇదుగో ఈ కూర తరుగు' అని ఓ అరిటికాయా కత్తిపీటా నాముందు పడేసేది. నేనేమో ఆ కాయ తరిగేసి ఆ తొక్కులు పారేసి వెళ్ళిపోయేదాన్ని - ఏదో నాటకంలో వేషం వేసినట్టు. అంతేగానీ ఇంటిపనులు పట్టించుకోలేదు."

"అంటే బాధ్యతలు లేకుండా పెరిగేరన్నమాట."

“చూసేవా నేనింకా మొదలే పెట్టలేదు అప్పుడే నువ్వో పేరు పెట్టేసేవు. అప్పుడే ఓ అభిప్రాయానికి వచ్చేసేవు.”

“మీరే కదా అన్నారు ఇంటివిషయాలు పట్టించుకోలేదని. అది బాధ్యతారాహిత్యం కాదా?”

సిరి నావేపు చూసింది పాహి మాం అన్నట్టు.

“కానీలే. నువ్వు చెప్పేదేదో చెప్పు. తరవాత చూద్దాం.” అన్నాను.

“ఆ రోజుల్లో మా ధోరణే వేరు. ఇది నాది, ఇది నాయిష్టం అన్న దృష్టి లేదు. అసలు ఒకొక ఇంట్లో అయితే ఎవరు ఏ ఇంటివారో కూడా తెలిసేది కాదు. ఇరుగూ పొరుగూ కూడా ఇంట్లోవాళ్ళలాగే మసిలేవాళ్ళు. ఓమాట అనుకున్నా ఆడుకున్నా ఆటల్లో అరటిపండు, తూనా బొడ్డూ అనేసి మళ్ళీ ఆటల్లో పడిపోడమే. అసలు నేనయితే ఇంట్లో కంటే పక్కింట్లో తిన్నరోజులే ఎక్కువ.”

“మరి ఆ రోజుల్లో ఆడపిల్లల్ని స్వేచ్ఛగా తిరగనిచ్చేవారు కాదంటారు కదా. మా అమ్మమ్మ అసలు రైలు కాదు కదా బస్సు కూడా ఎక్కలేదుట జీవితంలో.”

“అవును కొన్ని ఇళ్ళలో ఉండేవి మొహర్బానీపోకడలు. మాఇంట్లో లేవు. అంటే పూర్తిగా లేవు అని కాదు. నేనెప్పుడేనా చీకటి పడ్డాక ఎవరింటికైనా వెళ్తానంటే మాఅమ్మ మాతమ్ముడిని కూడా సాయం పంపేది.”

“మీ తమ్ముడు మీకంటే చిన్నవాడు మీకు సాయం ఏమిటి? పైగా అతను ఎక్కడికైనా వెళ్తానంటే ఝూమ్మని సైకిలెక్కి వెళ్ళిపోతాడు కదా ఏ సాయమూ లేకుండా. అదే మరి వివక్ష.”

“అదుగో మళ్లీ మరో పేరు. నువ్వు ఈ పడికట్టురాళ్ళు విసరడం ఆపకపోతే నేనింక ఇక్కడే ఆపేస్తాను," అంది సిరి చిరాగ్గా.

తారకం తగ్గేడు, "సరే మీరు చెప్పదల్చుకున్నది చెప్పండి."

"ఆ రోజుల్లో మాకు అలాటి ఆలోచనలు రాలేదు మరి. ఒకవేళ తోచినా అదేదో పెద్ద రచ్చ చెయ్యాల్సినంత పెద్దవిషయంగా తోచలేదు మాకు అప్పట్లో. ఇతరత్రా అనేక విషయాల్లో ఆంక్షలు అట్టే లేకపోవడం చేతనేమో.”

“ఎలాటి విషయాల్లో?”

“నువ్వలా నిలదీసి అడిగితే నాకేం తోచడంలేదు. మ్ … చెప్తా ఉండు. చదువుమాట తీసుకో. చాలామంది ఇళ్ళల్లో ఆడపిల్లల్ని చదివించలేదు. మరి మాఇంట్లో మా అమ్మా, నాన్నా ఇద్దరూ

కూడా మాఅక్కయ్యనీ నన్నూ కూడా చదివించేరు. దానికోసం మేము అరిచి రాగాలు పెట్టవలసిన అవుసరం లేకపోయింది." అని నావేపు తిరిగి "మీయింట్లోనూ అంతే కదా. నీచదువుకి ఎవరూ అడ్డు చెప్పలేదు కదా," అంది.

"లేదు."

"ఎంచేతంటారూ?"

"అందరూ అని చెప్పను కానీ కొందరిళ్ళలో స్వతంత్రభావాలు చక్కగా నాటుకున్నాయి అనుకుంటా. మొత్తం దేశంలో అందరికీ చదువు కావాలి అంటూ మొదలయిన ఉద్యమంలో ఆడా, మగా, చిన్నా పెద్దా, చదువుకున్నవారూ, చదువు లేనివారూ అందరూ ఉన్నారు. స్వాతంత్ర్యోద్యమంలో ఆడవాళ్లు కూడా పాల్గొన్నారు కనక ఆ ఉత్సాహం 50, 60 దశకాల్లో కొనసాగింది. ఆ రోజుల్లో మానాన్నగారు విశాఖపట్నంనించీ బరంపురం నడిచి వెళ్ళేరుట కాంగ్రెస్ మహాసభలకి."

"నడిచా? నేన్నమ్మను."

"నాకూ అలాగే అనిపించింది. ఏమైనా నేను విన్నది అదీ. ఇంతకీ చెప్పేది ఆ రోజుల్లో స్వాతంత్ర్యోద్యమంతో పెరిగిన ఉత్సాహం అను ఉద్రేకం అను దేశమంతటా సుడిగాలిలా వ్యాపించేసింది. స్వాతంత్ర్యం వచ్చినతరవాత, దేశ పునరుద్ధరణ కార్యక్రమాలు. వాటిలో ముఖ్యంగా చెప్పుకోవలసింది స్త్రీవిద్యా వయోజనవిద్యా. వాటితో గ్రంథాలయోద్యమం. ఇటు స్కూళ్లూ అటు లైబ్రరీలూ, మరో పక్క పత్రికలూ కని విని ఎరగని స్థాయిలో పుంజుకున్నాయి. ఆ రోజుల్లో పత్రిక లేని ఇల్లే లేదు. అంతే కాదు. ఒకింట్లో ఒక పత్రిక మరో ఇంట్లో మరో పత్రిక. రెండు పత్రికలూ రెండిళ్లలో అందరూ చదవడం. అంచేత కొన్న పత్రికలకంటే చదివినవి ఎక్కువే ఉండేవి ఏ ఇల్లు తీసుకున్నా."

"మీయింట్లో అన్నీ చదవనిచ్చేవాళ్ళా?"

"మాయింట్లో చదవనిచ్చేవాళ్ళు. నాస్నేహితురాళ్ళు కొందరు వాళ్ళింట్లో చదవనివ్వడంలేదని మాయింటికొచ్చి కూర్చుని చదివేవారు కూడా."

"ఏంటీ, వాళ్ళు రహస్యంగా చదవడానికి మీరు వీలు కల్పించేరా? అన్యాయం," అన్నాడు తారకం కళ్ళింతలు చేసుకుని.

"అదే మరీ. మీనాటోల్లు పెద్దిల్ల ఆడోల్లు కిమ్మనకుండ పడుంతరనుకుంతరు గానీ అమ్మో అప్పట్ల ఆల్లకి గావాల్సినయి ఆల్లు సక్కంగనే సెగ్గించుకునీవోరు సాపకింద నీరునాగ," అంది సంద్రాలు మెచ్చుకుంటున్నట్టు తలూపుతూ.

"రహస్యం ఏముందీ. ఒకొకప్పుడు పెద్దవాళ్ళ ఆలోచనలకీ పిన్నల ఆలోచనలకీ పొత్తు కుదరదు. అలాటప్పుడు పెద్దలని ఎందుకు కించపరచడం అని. పుస్తకాలు చదివినంత చెడిపోరు ఎవరూ."

"మరి చెడిపోతారన్న భయంతోనే కదా పిల్లల్ని చదవొద్దని ఆ పెద్దలు ఆంక్షలు పెట్టడం? మీరేమో పెద్దలంటే గౌరవం అంటున్నారు మళ్ళీ వాళ్ళకళ్ళు కప్పి … "

"అదొక అపోహ. చెడిపోయే బుద్ధున్నవాళ్ళు చెప్పడానికి అదో వంక, అంతే."

"మరి మీరిలా ఆ పిల్లలతల్లిదండ్రుల ఆశయాలకి విరుద్ధంగా చేస్తున్నారని మీ అమ్మ, నాన్నలకి తెలీదా? మీరు వాళ్ళకి తెలీకుండా చేసేరంటే, మీరు కూడా వాళ్ళని మోసం చేసినట్టే కదా?"

"ఏ పనికైనా ఎన్ని రకాల భాష్యాలయినా చెప్పుకోవచ్చు. వాస్తవంలో ప్రతి విషయాన్ని ఇలా పీకి పాకం పట్టడం జరుగుతుందా? బత్తుల కామాక్షమ్మగారి వ్యాసం ఒకటి ఉంది **అనుభవాలూ, జ్ఞాపకాలూ** అని. చిన్నదే. నాలుగే పేజీలు. నువ్వు తప్పకుండా చదవాలి. నాలుగు పేజీల్లో ఆవిడ ఎంత చెప్పేరో ఆనాటి పరిస్థితులూ, వారింట ఆచారవ్యవహారాలూ, వాటన్నిటి మధ్యా ఆవిడ నెగ్గుకొచ్చిన తీరూను."

"నేను చూడలేదులెండి. ఏమిటి రాసేరేమిటి?"

"ఆవిడ బాలవితంతువు. వారిది కలవారి కుటుంబం. ఇంట్లో రాచమర్యాదలు. ఆడవారు గడప దాటితే అవమానం అనుకునే రోజులు. ఆవిడకి చదవాలని కోరిక. లైబ్రరీ ఉద్యమంలో భాగంగానో గొప్పింటి బిడ్డ కావడంచేతో ఆవిడకి కావలిసిన పుస్తకాలు లైబ్రరీవారు ఇంటికి పంపేవారుట. వీరేశలింగంగారి చివరి రోజుల్లో ఆవిడకి సుమారుగా 18 ఏళ్లు. ఆయన పుస్తకాలు చదివేనని రాసుకున్నారు. ఆయనంటే గౌరవం. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, వీరేశలింగంగారి అభిప్రాయాలు గౌరవించినా ఆవిడ మళ్ళీ పెళ్ళి చేసుకోడానికి ఒప్పుకోలేదు."

"అదేం గౌరవమండీ? ఆచరణలో పెట్టని గౌరవం గౌరవం కాదు. ఒట్టి గాలికబుర్లు."

"అదే నేనంటున్నది. ఎదటివారి అభిప్రాయాలు అంగీకరించినా తమ అభీష్టాలకి అనుగుణం అయితే ఆచరిస్తాం లేకపోతే లేదు. ఆవిడ చేసుకోలేదు కానీ చాలామంది ఆడపిల్లలకి మళ్ళీ పెళ్ళి

చేసుకోడానికి అన్ని విధాలా సాయం చేశారు. తన జీవితాన్ని సంఘసేవకి అంకితం చేసేరు. అదీ వ్యక్తిత్వం అంటే. ఆ నాలుగు పేజీలూ చదివితే ఆనాటి పరిస్థితులగురించి ఎంత తెలుస్తుందో ..."

"ఆవిడ కూడా పెళ్లి చేసుకుని ఉండొచ్చు కదా."

"అదేనయ్యా బాబూ నేనంటున్నది. మూస పోసినట్టు అందరికీ అన్ని సూచనలూ ఒకేలా నప్పవు. ఎవరికి వారు వాళ్ళ ఇష్టాయిష్టాలనిబట్టి, వాళ్ళ పరిస్థితులనిబట్టీ వాళ్ళ జీవితాన్ని నిర్ణయించుకుంటారు. నీకు పెళ్లే ముఖ్యం కావచ్చు. అంచేత అందరూ పెళ్లి చేసుకు తీరాలని నువ్వంటే అది నీ అభిప్రాయం వారిమీద రుద్దుతున్నట్టే కదా. ఎవరిజీవితం వారికి నచ్చినట్టు గడుపుకోగలగడమే నిజమైన స్వేచ్ఛ. ఎంత చదువుకున్నా తనకి ఏది కావాలో ఎవరికి వారు నిర్ణయించుకోలేకపోతే అది చదువే కాదు."

"సరేలెండి. ఆవిడ ఒకశతాబ్దం వెనకటిమనిషి. మరి మీకాలంలో ఎలా ఉండేది? మరి ఏ విషయాల్లో మీకు మీరే నిర్ణయాలు చేసుకోగలిగేరు? ఏ విషయాల్లో మీ అమ్మా నాన్నా మాటలే చెల్లేయి?"

సిరి ఆలోచనలో పడిపోయింది ... ఆనాటి జీవితం తలుచుకుంటూ. కొంచెంసేపు తలొంచుకు కూర్చుంది.

ఏం చెప్తుందా అని మేం అందరం చూస్తున్నాం.

నెమ్మదిగా అంది, "ఒక శతాబ్దం వెనకటి స్త్రీ అని దాటేయడం కాదు. ఆవిడ భావాలు ఎంత ఆదర్శప్రాయమో, ఎంత ఆధునికమో చూడాలి మనం. 'ఎంత మంచి సలహా అయినా గుడ్డిగా ఆచరణలో పెట్టడం కాదు. తనకి తానుగా తనజీవితాన్ని తన ఆశయాలకి అనుగుణంగా మలుచుకుంటూ తనకి నచ్చిన సలహాలని తదనుగుణంగా ఉపయోగించుకోవాలి' అని కామాక్షమ్మగారి అభిప్రాయం. అలాగే వారి బంధువు నాళం సుశీలమ్మగారు కూడా ఒక వ్యాసం రాసేరు. వాళ్లచుట్టరికం నాకు సరిగా గుర్తు లేదు కానీ కామాక్షమ్మగారు సుశీలమ్మగారి మేనత్త అనుకుంటాను. ఇవన్నీ **యుగపురుషుడు వీరేశలింగం స్మారకోత్సవ సంచికలో** ఉన్నాయి. సుశీలమ్మగారు కూడా 'ఆ రోజులలాటివి. అందుకు నేను సిగ్గుపడడంలేదు, బాధ పడుతున్నాను గానీ, రామానుజాచార్యులవారి సతి కూడా ఇటువంటి అనుభవాలే పొందేరు' అని విన్నతరవాత నాకు సాంత్వన కలిగింది. ఈనాడు నేను ఆంధ్ర మహిళా గానసభ నడుపుతున్నాను' అంటారు. అంటే ఆవిడ ఆ స్థాయికి ఎదగగలిగేరు. నేను చెప్పొచ్చేదేమిటంటే,

స్త్రీలు గడప దాటరాదు అన్న ఆచారాన్ని ఆచరణలో పెడుతూన్నట్టు కనిపిస్తూనే, బయటికి వెళ్ళగల సౌలభ్యాన్ని మరొక విధంగా సాధించుకున్నారు."i

"ఏమోనండీ. నాకు మాత్రం అదేమంత గొప్పగా కనిపించడంలేదు. నిజంగా ఆమెకి గుండెబలం ఉంటే, 'నేను బయటికి వెళ్తాను. మీరేం చేసుకుంటారో చేసుకోండి అనాలి'."

అన్నాడు తారకం.

"అవును. ఈ రోజుల్లో అందరూ అలాగే అంటున్నారు. కానీ నువ్వు గమనించవలసింది ఆనాడు కామాక్షమ్మగారూ, సుశీలమ్మగారూ, ఇంకా అంతకుముందు భండారు అచ్చమాంబగారూ, ఇంకా మనకి తెలీని ఎందరో స్త్రీలు ఎంతో చాకచక్యంతో ఆంక్షలు పెట్టేవారి అభిప్రాయాలని మార్చుకుంటూ వస్తేనే ఈనాటికి ఇది సాధ్యం అయింది. నేను బయటికి పోతాను అనగల ధైర్యం రావడానికి ఇంతకాలం పెట్టింది. మార్పు ఒక కీ కొడితే తెరమీద కనిపించేసే అక్షరమో బొమ్మో కాదు. ఇది కంప్యూటరు ప్రోగ్రాములకి అలవాటు పడిపోయిన మీలాటివాళ్ళకి అర్థం కాదు."

తారకం సిరివేపు చూసేడు. ఏం జవాబు చెప్పాలో తోచలేదు అతనికి.

"సరే. ఇప్పటికి అది అలా వదిలేద్దాం. మీకు రాయాలన్న కోరిక ఎలా మొదలయిందో చెప్పండి? మీ నాన్నా, అన్నయ్యలూ రచయితలా?" అన్నాడు ఆఖరికి.

సిరి కళ్ళలో కొంటెనవ్వు మెరిసింది.

"ఎందుకండీ నవ్వుతారు?"

"నీప్రశ్నకి. మీ అమ్మా, అక్కయ్యా కథలు రాసేవారా అని అడగలేదే అని. అది సరే. ఊరికే హాస్యానికంటున్నా కానీ నీప్రశ్నకి సమాధానం - మా పెద్దన్నయ్య ఒక కథా, రెండో అన్నయ్య ఒక కథా రాసేరు. మాఅమ్మ రాయలేదు కానీ చాలా పుస్తకాలే చదివేది. పత్రికలు కాదు. పురాణాలూ, ఉపనిషత్తులూ చదివేది. మా అక్కయ్య కూడా తరవాతికాలంలో ఆత్మవిచారంగురించి రెండు పుస్తకాలు రాసింది."

"మరి మీరు ఎలా మొదలు పెట్టేరు? మీకు స్ఫూర్తి ఎవరు?"

"మ్. నాకు స్ఫూర్తి నిచ్చినవాళ్ళు … ఏమో .. నేనసలు అలా ఆలోచించలేదు ఎప్పుడూ. చెప్పేను కదా. పత్రికలు విరివిగా అందుబాటులో ఉన్నరోజులు. అందరం చదివేవాళ్ళం. అందరం

కాదులెండి. మాయింట్లో నేనూ, మా చిన్నన్నయ్యా ఎక్కువగా చదివేవాళ్లం. మా చిన్నన్నయ్య భారతిలాటి సాహిత్యపత్రికలు ఎక్కువ ఇష్టపడేవాడు.”

“ఒక్కమాటలో మీరొక్కరే. ...”

“అవునవును. నీమాటే. నేనొక్కదాన్నే. ... అయితే అవి చదవొద్దని మాత్రం మాయింట్లో ఎవరూ అడ్డు చెప్పలేదు. పత్రికలు నాలుగు కొన్నా అన్నీ చదివేదాన్ని కాదు. ముఖ్యంగా నేను సీరియల్సు అట్టే చదవలేదు. మొట్టమొదటి సీరియలు కోడూరి కౌసల్యాదేవి చక్రభ్రమణం అనుకుంటా. ఆవిడకి బాగానే పేరొచ్చింది. కానీ ఆ తరవాత సులోచనారాణి వచ్చి సెక్రటరీ నవలతో కౌసల్యాదేవిని మించిపోయింది.”

“సులోచనారాణినవలలమీద మీ అభిప్రాయం ఏమిటి?”

“నేను చదవలేదు.”

“అయ్యో అదేమిటి సులోచనారాణి నవలలు చదవకుండా పత్రికలు చదవడమేమిటండీ. మరి ఏం చదివేరు పత్రికలలో?”

“అందరికీ అన్నీ నచ్చుతాయా? ఎవరు మాత్రం ఏ పత్రికలోనైనా అన్నీ చదువుతారా? నాకు నచ్చిన కథలు నేను చదివేదాన్ని.”

“సర్లెండి. అసలు విషయం వదిలేశారు. మీరు రాయడం ఎలా మొదలయింది?”

“మీ అందరిలాగే. చెప్పేను కదా ఓ కథ చదివినప్పుడు నేనూ మీఅందరిలాగే - ‘ఇది ఇలా కాదు అలా ఉంటే బాగుండేది.’ ‘ఆ పాత్రని చంపకుంటే కథ ఎలా సాగేదో,’ లాటి ఆలోచనలు చేసేదాన్ని. ఇప్పుడు మీరయితే మరీ చాదస్తంగా ‘ఆయన ఆవిడకి ముందే చెప్పేసి ఉంటే తగువొచ్చేది కాదు,’ ‘ఆవిడే ఆయన్ని అడిగేసి అసలు విషయం తెలిసేసుకుంటే పోలా’ అంటారు.”

“అలా ప్రశ్నిస్తే తప్పేమిటి?”

“అది కథ మార్చేయడం కాదా? ఆయన ఆవిడతో చెప్పకుండా మరొకావిడని ఇంటికి తీసుకొచ్చేరు. ఆవిడకి కోపం వచ్చింది. అదీ కథ. ఆకథ చదివి ఒకావిడ 'ఆయన ఆవిడతో ముందే చెప్పేస్తే సరిపోయేది' అన్నారు. అలా ముందే చెప్పేసి, ఏ గొడవలూ లేకపోతే ఇంక కథెక్కడుంది? ఆమాత్రం ఆవిడకి తెలీదా? ఆవిడా రాస్తారు కథలు మరి. నాకు మాత్రం అది ఆలోచించకుండా రాసిన వ్యాఖ్యే అనిపించింది.”

"అలా జరక్కూడదా?"

"నువ్వు మళ్ళీ మొదటికొస్తున్నావు. అలా జరగదని కాదు. అప్పుడు అది మరో కథ అవుతుంది. దానికి కావలిసిన సంఘటనలు వేరే కావాలి. అసలు ఆవ్యాఖ్య రాయడంలో ఆవ్యాఖ్యాత అభిప్రాయం ఏమిటి? దానివల్ల కథగురించి ఏమి తెలిసింది? కథలో విషయం ఆ దంపతులమధ్య సఖ్యత లేదు, మంచీచెడ్డా మాటాడుకోడం లేదు అనే కదా. కథకి సంబంధించిన శిల్పంగురించి కానీ శైలిగురించి కానీ కాదు కదా ఆవ్యాఖ్య? నేను కథ రాసేను కానీ నిజంగా జరిగిన విషయం చర్చడం లేదు కదా. దానికి పరిష్కారాలు సూచిస్తూ వ్యాఖ్యానం చేస్తే అది కథమీద వ్యాఖ్యానం ఎలా అవుతుంది?"

"మీకు కోపం వచ్చిట్టుంది," అన్నాడు తారకం.

నాకు చిన్న వణుకు! ఈ చర్చ వీళ్లని ఎక్కడికి తీసుకుపోతుందో, ఏం ముప్పు తెస్తుందో అనుకున్నా ఇద్దరిముఖాలూ చూస్తూ.

"ఉండయ్య బాబు, ఆయమ్మని సెప్పనీవేటి?"

నేను ఉలిక్కిపడి అటు చూసి, "నువ్వెప్పుడొచ్చేవు. నేను చూడనేలేదు," అన్నాను.

"శానాసేపయినాదిలే," అని, తారకంవేపు తిరిగి కొనసాగించింది తన అభిప్రేయం, "ఆ యమ్మ ఏటంటదంటే మీ అబిప్రియేలు మీరు సెప్పినట్టె ఆయమ్మ అబిప్రియం ఆయమ్మ సెప్తది. నివ్వట్ల అనుకున్నవు. నానిట్ల అనుకుంతను అని. అదీ సంగతి. అప్పుడు మీకు ఇంక యక్కవ అబిప్రియలు ఎరికైతయ్ కద. పస్నలూ నేదు పెసరకాయా నేదు."

"సరేనమ్మా," అని సంద్రాలుతో అని, తారకం శ్రీదేవివేపు తిరిగేడు, "మరి మీరు ఆవిడకి ఏం చెప్పేరు? ఆవిడ మళ్లీ ఏమైనా అన్నారా?"

"పత్రిక ఇంటికొచ్చేసరికే పదిరోజులు. ఆ తరవాత పాఠకులు ఉత్తరాలు రాస్తే అవి పత్రికఆఫీసు చేరి, ఎడిటరు వాటిని ప్రకటించేవేళకి మరో మూడు వారాలు అయిపోయేవి. పైగా ఎడిటర్లు అన్ని ఉత్తరాలూ ప్రచురించరు. రచయితలకి కోపం తెప్పించేవీ, పాఠకులకి కోపం తెప్పించేవీ, పత్రికల నిబంధనలకి అనుగుణంగా లేనివీ ... ఇలా ఏరి పారేసి, మిగతావాటిల్లో ఒకటో రెండో గోడమీద పిల్లివాటం అభిప్రాయాలు ఎంచి పత్రికలో ప్రచురించేవారు. ఇన్ని గండాలు గడిచి వచ్చిన ఆ అభిప్రాయాలని పట్టించుకునే ఓపికా, తీరిగా ఎవరికుంటుంది కనక. అంచేత రచయితలు జవాబివ్వడం అసలే లేదు."

"మళ్లీ వెనక్కి వెళ్లినట్టు ఉంటుంది కానీ అడక్క తప్పదండి. ఇలా కాదు అలా ఉంటే బాగుండేది అంటే అది వ్యాఖ్య కాకుండా పోతుందా?"

"నా అభిప్రాయంలో కథమీద వ్యాఖ్య కాదు. ఆ కథగురించిన ఆలోచన కావచ్చు," అని ఓ నిముషం ఆగి మళ్ళీ అంది, "నువ్వు అడిగేక అనిపిస్తోంది బహుశా అది కూడా కథగురించే అని. పాఠకుడు కథలో అంతగా మమేకమైపోతేనూ, అంత బలంగా అతనిమీద ముద్ర వేస్తేనూ అలాటి స్పందన వస్తుంది. అంటే అది రచయిత నైపుణ్యానికి మెప్పు అన్నమాటే. మరో ప్రయోజనం ఆ ప్రశ్న మరోకథ ఆలోచించుకోడానికి దారి తీయొచ్చు."

“రచయితలు పాఠకుల అభిప్రాయాలని పట్టించుకునేవారు కాదేమో అనిపిస్తోంది.”

“అది కాదు నేనంటున్నది. ఆ ఆలోచన లేదని. ఎప్పుడేనా ఏ సభల్లోనో సమావేశాల్లోనూ ఎదురు పడ్డప్పుడు పాఠకులు కలిసి ఏమైనా అడిగితే రచయితలు మర్యాదగానే జవాబులిచ్చేవారు. సందేహం లేదు. నేను అప్పటికింకా చిన్నదాన్ని. ఎప్పుడేనా పెద్ద రచయితలని కలవడం జరిగితే వాళ్ళు నాతో మర్యాదగానే మాటాడేరు.”

“మీరు వాళ్ళకథలని విమర్శించలేదా?”

“ఈరోజు మీరు రాసే వ్యాఖ్యలలాటివా అంటే లేదనే అంటాను. అయినా నేను అట్టేమంది రచయితలని కలవలేదు కనక నాకు అంత వివరంగా తెలీదులే.”

“మీరు ఇలా కాదు అలా ఉండాలి అన్న పాయింటు తీసుకుని మరో కథ రాసేరా ఎప్పుడైనా?”

“అంటే అచ్చంగా ఉన్నదున్నట్టు తీసుకుని, రామయ్యని సోమయ్యగానూ, పిల్లిని ఎలకగానూ మార్చి రాయలేదు. కథగురించి అనేక రకాల ఆలోచనలు వస్తాయి. అందులో ఇవి కూడా ఉంటాయి. వెంటనే కాకపోవచ్చు. తరవాత ఎప్పుడో మరొక వస్తువు తీసుకుని కథ రాయాలని గట్టిగా అనిపించినప్పుడు ఈ ఆలోచనలు కూడా వచ్చి ఆ కథ మలుచుకోడానికి సాయం చేస్తాయి. చేశాయి అనే చెప్పాలి. నిజానికి ఇలాటివి చాలామటుకు అచేతనావస్థలో జరుగుతాయి. అంటే పని గట్టుకుని ఈవిషయం ఈకథలో పెట్టేస్తాను అని కాక సందర్భానికి అనువు అయితే అవే పైకొస్తాయి. మనం చదివినవాటిలోంచే కొత్తకథలు పుట్టుకొస్తాయి,” అంది శ్రీదేవి చిన్నగా నవ్వి.

“నేను మరొకరిని కలవాలండి. ఇప్పటికే ఆలస్యం అయిపోయింది. మళ్లీ కలుద్దాం,” అంటూ తారకం లేచేడు.

అతనికి శ్రీదేవి మాటలు రుచించలేదన్నది స్పష్టం.

నేను లేచి అతన్ని అనుసరించేను. అతన్ని శాంతపరచవలసిన అవుసరం నాకుంది మరి.

"చెప్పేను కదండీ ఆవిడకి నేనడిగిన ప్రశ్నలు నచ్చలేదు. నాకు ముందే తెలుసు ఇలా జరుగుతుందనీ," అన్నాడతను గడప దాటి వరండాలోకి వెళ్ళేక.

"అది కాదు తారకం. నువ్వు నీఅభిప్రాయం చెప్పినట్టే ఆవిడ తన అభిప్రాయం చెప్పింది. ఆలోచనలు పంచుకోడం అంటే అంతే కదా మరి. ఎవరూ ఎవరినీ అపార్థం చేసుకోనక్కర్లేదు," అన్నాను.

తారకం అసంతృప్తిగా తలాడిస్తూ వెళ్ళిపోయేడు.

వెనుదిరిగి నేను లోపలికి అడుగు పెడుతుంటే సంద్రాలు మాటలు వినిపించేయి, "నివ్వెందుకనాగ అనుకుంతవు. నీమాట నివ్ సెప్పినవ్. ఆయనమాట ఆయన సెప్పిండు. ఎవురి అబిప్పిరియేలు ఆరియి. అంతే."

శ్రీదేవికి కూడా అదే అనుమానం వచ్చిందన్నమాట.

000

ఆ తరవాత నాలుగు నెలలపాటు నేను దేశాటనం చేసి ఇంటికొచ్చేను. వారంరోజులతరవాత శ్రీదేవిఇంటికి వెళ్ళేను.

"అయిందా దేశాటనం? ఎప్పుడొచ్చేవు?" అంది శ్రీదేవి గదిలోకి వస్తున్న నన్ను చూసి.

"ఆఁ అయింది. ఉన్నచోట ఉండకుండా తిన్నచోట తినకుండా. బయల్దేరినప్పుడు బాగానే ఉంది కానీ తిరిగొచ్చేవేళకి హమ్మయ్య అయిందనిపించింది. ఇంతకీ నీవిశేషాలు చెప్పు. నాలుగు నెలలే కానీ ఏళ్ళూ పూళ్ళూ అయినట్టుంది."

"ఏళ్లూ పూళ్ళూ అయినట్టేలే ... చాలానే జరిగేయి."

చాలానే అయినా అవేమంత ఆనందదాయకమైనవి కావేమో అనిపించింది తనముఖం చూస్తూంటే. "ఏమయిందేమిటి?"

"పెద్దక్క వచ్చింది."

“వచ్చిందేమిటి? అదివరకెప్పుడో ఓసారి అన్నావు రా కలుద్దుగానీ అని. ఈమధ్య ఎక్కడికేనా వెళ్ళేరేమిటి?”

శ్రీదేవి కొంచెంసేపు మాటాడలేదు. తరవాత నెమ్మదిగా, “చెప్పడం మొదలెట్టాలే గానీ చాలా ఉంది కథ.”

చెప్పు అనలేదు నేను. ఏం చెప్తుందో అని చూస్తున్నాను.  ఏదో పెద్దకథలాగే ఉంది.

సిరి చాలాసేపు మాటాడలేదు.

ఏతావాతా నాకు అర్థమయిందేమిటంటే పెద్దక్క శ్రీదేవికి స్వయానా అక్క కాదు. దూరపు చుట్టం. చిన్నప్పుడు ఇరుగూపొరుగూ. వయసులో దాదాపు పదిహేనేళ్ళు పెద్ద కావడంచేతా, శ్రీదేవికి మరో అక్క ఉండడం చేతా, ఈవిడని పెద్దక్క అని పిలిచేది అప్పట్లో. క్రమంగా ఆయింటా, ఈయింటా కూడా ఆవిడ పెద్దక్కగా స్థిరపడిపోయింది. ఆవిడకి పెళ్ళినాటికి పదకొండేళ్ళు. పెళ్లికొడుకు వీరభద్రానికి 17. ఇంటరులో చేరడానికి నెలరోజులముందు పెళ్ళి చేసేరు. ఆనాటి ఆనవాయితీప్రకారం పిల్లవాడి కాలేజీచదువు ఖర్చులు మామగారు భరించడానికి ఒప్పుకున్నారు.

సూక్ష్మంగా చాలాకాలం తరవాత భర్త చనిపోవడంతో సిరి ఆవిడని అమెరికాకి తీసుకొచ్చేసింది తనదగ్గర పెట్టుకుంటానని. మధ్యలో ఏం జరిగిందో తెలీదు కానీ పెద్దక్క వేరే వాటాలో ఉంటోంది ఊళ్లోనే.

000

విషి పెద్దక్కని ఫిజికల్ థెరపీకి తీసుకెళ్ళి, వచ్చేటప్పుడు దారిలో పళ్ళ కూడా కొనుక్కొచ్చేడు. “పెద్దక్కకి చెయ్యి విరిగినప్పటినుండీ ఆవిడకి బయట కావలిసినవన్నీ విషియే చూస్తున్నాడు, ” అంది అరవింద.

పెద్దక్క ఎడంచేతిని కుడిచేత్తో ఒడిసి పట్టుకుని నెమ్మదిగా సోఫాలో కూచుని, నావేపు చూస్తూ, “ఎలా అయింది ప్రయాణం?” అనడిగింది.

లోపల్నించి లీల వచ్చి, “జూస్ తీసుకురానా? కాఫీ? ” అనడిగింది ఆవిణ్ణి. నావేపు తిరిగి హలో అని మళ్లీ పెద్దక్కవేపు చూసింది.

నాకు లీలనీ, విషీని అక్కడ చూడ్డంతో ఏదో పాతకాలపు సినిమా fast forward చేసేసినట్టు అనిపించింది. సిరి చెప్పినట్టు చాలా విశేషాలే జరిగినట్టున్నాయి నాలుగు నెలల్లోనూ.

పెద్దక్క కాఫీ అన్నారు.

"మీరు కూడా కాఫీ తీసుకుంటారా?" అని అడిగింది నన్ను. అవునన్నట్టు తలూపేను సోఫాలో సర్దుకు కూర్చుంటూ. బోలెడు కథ ఉందని తెలిసేక, మంచి చిక్కటి కాఫీ కోరదగును.

"అయితే నీకు పదకొండేళ్ళకే పెళ్ళయిందా?" అంది ఆశ్చర్యంగా అరవింద.

"అప్పట్లో అది ఆలస్యంకిందే లెక్క. మా అమ్మకీ, అక్కయ్యలిద్దరికీ ఇంకా ముందే అయిపోయేయి."

"అందుకే మన్ని అనాగరికులంటారు," అన్నాడు విషి.

"నేనయితే నాకీపెళ్ళి వద్దు అంటూ ఇంట్లోంచి పారిపోయేదాన్ని," అంది అరవింద.

పెద్దక్క చిన్నగా నవ్వింది.

"నవ్వుతావు కానీ నిజంగా నువ్వు ఇష్టపడే చేసుకున్నావా? ఇప్పుడు నాకున్నట్టు నీక్కూడా అప్పుడు వీలుంటే నీఇష్టాయిష్టాలు చెప్పకుండా ఊరుకునేదానివా?" అంది అరవింద.

"ఇప్పుడు నీకు అలా అనడం తేలికే. మీరిక్కడికి ఇలా ఇష్టాయిష్టాలు మాటాడేస్థాయికి ఎలా వచ్చేరనుకుంటున్నావు? ఆరోజుల్లో జీవితం అదీ. చెప్పేను కదా మా అమ్మకి ఆరేళ్ళకే పెళ్ళి చేసేరుట. మా అక్కయ్యలదగ్గరకొచ్చేసరికి తొమ్మిదయింది. క్రమంగా పదకొండూ, పదహారూ, పద్ధెనిమిదీ, ... ఇప్పటికి ఇరవై, ఇరవైనాలుగూ, ... అలా సాగుతోంది. మార్పు ఎప్పుడూ ఒక్కక్షణంలో మెరుపులా వచ్చేయదు. అసలు నిజంగా ఎవరితో ఏ మారుమూల మొదలయిందో చెప్పడం కూడా కష్టమే ఏ ఒక్కమార్పు తీసుకున్నా."

"అసలు ఈ పిల్లలపెళ్ళిళ్ళు ఎలా వచ్చేయో. వేదాల్లో ఆడవాళ్ళకి బోలెడు స్వాతంత్ర్యం ఉండేదిట కదా. గార్గి, మైత్రేయివంటి స్త్రీలు మహా విద్వాంసులతో వాదోపవాదాలకి దిగి గెల్చేరంటారు."

"వేదాలు అపౌరుషేయాలంటారు. పురుషులు రాయలేదు కనక అలా ఉన్నాయేమో."

"అపౌరుషేయాలేమిటి?" అనడిగేడు విషి.

"పురుషులు అంటే అసలు ఎవరు రాసేరో తెలీదు ఎప్పట్నుంచో ఉన్నాయని. బహుశా ఆరోజుల్లో కర్తృత్వంమీద అంత మోజుండేది కాదేమో. ఎవరు చెప్పేరని కాక వారికి తెలిసింది వ్యాప్తిలోకి తీసుకురావడమే వారి ధ్యేయమేమో."

"మరి ఇంతకీ ఈ పిల్లలపెళ్ళిళ్ళు ఎప్పుడు ఎలా వచ్చేయో? పురాణాల్లో సీతస్వయంవరం, రుక్మిణీకల్యాణంలాటివి చూస్తుంటే, అమ్మాయిలు పెద్దయేకే చేసినట్టుంది కదా."

"సీతపెళ్ళి స్వయంవరం ఎలా అయింది? జనకుడు శివధనుస్సు ఎక్కు పెట్టగలవాడికిచ్చి చేస్తానన్నాడు. అంటే పెద్దలు నిర్ణయించినవాణ్ణే వరించింది కదా," అంది అరవింద.

"పురాణాలకి నీభాష్యాలు బాగున్నాయి," అంది పెద్దక్క.

"మళ్ళీ ఆ పురాణాల్లోనే బాల్యవివాహాలు కూడా ఉన్నాయి కదా. జాంబవతి ఉయ్యాల్లో ఊగుతోందంటారు ఓమారు. మళ్ళీ కృష్ణుడు శమంతకమణిని తెచ్చిస్తే, ఆ జాంబవతినే ఇచ్చి పెళ్ళి చేసేరంటారు. అంటే మరి జాంబవతి పసిపాపా? వయసులో ఉన్న పడుచా?"

ఈ పురాణాలచర్చ పెద్దక్కకి నచ్చలేదు. పూర్వులని ప్రశ్నించరాదు అన్నది ఆమెమతం.

"సాహిత్యంలో పురాణాలస్థానం వేరు. వాటిసంగతి తరవాత చూదాం కానీ ఇప్పటికి ఇంకేమైనా చెప్పు," అంది పెద్దక్క.

"సరే అది వదిలేద్దాం. ఇంతకీ ఈ బాల్యవివాహాలు ఎప్పుడొచ్చేయో చెప్పు."

"నేను ఎప్పుడు ఎక్కడ విన్నానో కూడా గుర్తు లేదు కానీ మధ్యయుగంలో మహమ్మదీయులు దండయాత్రలు చేస్తున్నకాలంలో వచ్చేయంటారు. మహమ్మదీయులకి కన్యలే గానీ వివాహితలయిన ఆడవాళ్ళు అక్కరకి రారుట. అలా అదొక భద్రతకి సంబంధించిన సమస్య అయినట్టుంది. ఆడపిల్లలని సంరక్షించుకోడానికి చిన్నతనంలోనే పెళ్ళి చేయడం మొదలయి, ఆఖరికి మరీ పురిటికందులకి తాళి కట్టేయించడందాకా పోయింది. అసలు ఏసంఘటనకయినా ఎప్పుడూ ఏదో ఒక్కటే కారణం అవదు కదా. ఇంకా చాలా కారణాలు ఉండే ఉంటాయి. బహుశా ఆడపిల్లలకి చదువులూ, ఇతర వ్యాపకాలు లేకపోవడం, పిల్లకి పెళ్ళి చెయ్యడం తమ కర్తవ్యం, ఎప్పుడో ఒకప్పుడు చెయ్యాలి, ఎంత త్వరగా చేసేస్తే అంత మంచిది లాటి ఆలోచనలతో మొదలయి పసికందులకే చేసేడం మొదలయిందేమో. ముస్లిములు ఎత్తుకుపోతారన్నది నాకేమంత బలమైన కారణంగా కనిపించడంలేదు."

"ఏం?"

"చిన్నపిల్లలకి పెళ్ళి చేసినా, పెద్దమనిషయినతరవాతే కదా మొగుడితో సంభోగం. పెళ్ళి తంతు జరిపించేసినా ఆ అమ్మా అత్తారింటికెళ్ళేవరకూ కన్యే కదా. ఏమైనా ఏదో ఓకాలంలో ఏవో కొన్ని కారణాలమూలంగా అవి జరిగేయి. క్రమంగా కాలంతోపాటు ఆ ఆచారం మారుతోంది. అందుకు సంతోషించాలి."

"ఎక్కడ మారిందండీ. ఇప్పటికీ మనదేశంలో జరుగుతూనే ఉన్నాయి. ప్రపంచం మొత్తంమీద మనదేశంలోనే 40 శాతం వరకూ జరుగుతున్నాయి. పైగా ఎందులో ముందున్నా లేకున్నా ఇలాటివాటిలో మనవాళ్ళు మొదటివరసలో ఉన్నారు. 1929లో బాల్యవివాహ్ నిరోధకచట్టం వచ్చింది. మన పార్లమెంటు 1978లో Child Marriage Restraint Act ప్రకారం అమ్మాయికి 18 ఏళ్ళు, అబ్బాయికి 21 ఉండాలన్న చట్టం అమలులో పెట్టాలని తీర్మానించేరు. 1978కి ఇంకా చట్టాలు చేస్తూనే ఉన్నారంటే మనగొప్ప చెప్పుకోవాలి," అన్నాడు విషి. పత్రికలలోనూ ఇతర మీడియాలోనూ వచ్చే గణాంకాలన్నీ అతడికి కంఠస్థం.

"సరి, మనం ఆపకపోతే లెక్కల్తో మనతలలు తినేస్తాడు. నువ్వూ తాతయ్యా ఎలా ఉండేవారో చెప్పు, పెద్దక్కా," అంది అరవింద.

పెద్దక్క వదనంలో వరసగా రంగులు మెరిసేయి - ఆనాటి తీపిగురుతులు, అలరించే తలపులు, ఇప్పుడు లేరన్నవిచారం, బాధ … ఇంకా ఎన్నెన్నో, ఏవేవో …

అరవిందతోపాటు నాకూ లీలకీ కూడా ఆతృతగా ఉంది ఆవిడ ఏం చెప్తారో అని.

పెద్దక్క తలొంచుకుని నెమ్మదిగా మొదలుపెట్టింది.

"నేనంటే మీతాతకి మహ ఇష్టంగా ఉండేది చిన్నప్పట్నుంచీ. వాళ్ళమ్మ ఏం చేసినా తప్పనిసరిగా నాకు తెచ్చి పెడుతుండేవాడు మొదట్లో. తరవాత్తరవాత వాళ్ళింట్లోనూ మాయింట్లోనూ కూడా ఎగతాళి చెయ్యడంతో రహస్యంగా వచ్చి ఎవరికీ కనిపించకుండా ఏ చెట్టు చాటునో పెట్టి పోతుండేవాడు. అందుకే పెళ్ళంటే నాకేం విశేషంగా అనిపించలేదు. ఏదో ఆరోజుల్లో ఆడుకునే అన్ని ఆటల్లోనూ అదో ఆట. చక్కగా ముస్తాబు చేసి అందరూ హడావుడీ చేస్తుంటే నేనేదో మహరాణీనయినట్టు మహ గొప్ప పడిపోయేను. ఆ పెళ్ళిమంత్రాలూ అవీ తమాషాగానే అనిపించింది. అయినా ఇప్పుడు మాత్రం బాగా పెద్దవాళ్ళయిన తరవాత చేసే పెళ్ళిళ్ళలో కూడా ఎంతమందికి అర్థమవుతాయి అ బ్రాహ్మడు వల్లించే మంత్రాలు. ఏదో మమ అనమంటే మమ

అనడం, చేతిలో అక్షింతలూ, నీళ్ళు తీసుకుని పళ్ళెంలోకి విడవమంటే, విడవడమే కానీ అంతకంటే ఎవరికి మాత్రం ఏం తెలుస్తుంది కనక."

"మరి నువ్వు పదకొండేళ్ళకే అత్తారింటికి వెళ్ళిపోయేవా?"

"లేదు. పెళ్ళంటే చేసేస్తారు కానీ, పిల్లవాడి చదువయి, ఉద్యోగంలో స్థిరపడేవరకూ పుట్టింట్లోనే ఉంటుంది. నేను కూడా స్కూలికి వెళ్ళేదాన్ని."

"అసలు అంత చిన్నవయసులో ఎందుకు చేసేసేవారంటావు పెద్దక్కా? పురాణాల్లో సీతా, రుక్మిణీ వాళ్ళందరి పెళ్ళిళ్ళూ అంత చిన్నతనంలో జరగలేదు కదా," అనడిగింది అరవింద.

పెద్దక్క ఆలోచనలు కూడదీసుకుంటున్నట్టు నిదానంగా కొనసాగించింది, "ఏమో, ఏ ఒక్క సంప్రదాయానికి గానీ ఏదో ఒక్కటే కారణమే ఉండదు. అనేక సంఘటనలూ, ఆలోచనలూ కలిసి ఒకదానితో ఒకటి ముడి పడిపోయి ఒక అలవాటుగా, సంప్రదాయంగా ఏర్పడతాయనుకుంటాను. మనధర్మాల్లో చెప్పిన నాలుగు ఆశ్రమాలూ - చదువు, పెళ్ళి, క్రమేపీ బాధ్యతలు వదిలించుకోడం, తరవాత పైస్థాయి వైరాగ్యం. మన నిత్యవ్యవహారాల్లోనూను అదే క్రమమేమో. అంటే ఒకటి తరవాత ఒకటి చేసుకుంటూ పోవడం. పిల్లలు చదువుతుండగానే, రెండో ఆశ్రమంగురించి ఆలోచిస్తూ, పెళ్లి చేసేస్తే తమపని ఒకటి అయిపోతుందనుకుని చేసేసేరేమో."

అరవింద అయోమయంగా చూసింది. "నిజంగా అంటున్నావా, హాస్యానికంటున్నావా?"

పెద్దక్క నవ్వుతూ, "నాకూ తెలీదు. ఊరికే అలా అనిపించిందంతే. మన కుటుంబాలూ, సమాజంలో జరుగుతున్న కథలూ చూడు. ఉన్న ఊళ్ళో ఉండడం, కలిగినదానితో సంతృప్తి పడి బతకడం మనకి తరతరాలుగా వస్తున్న ఆచారం. మద్రాసు వెళ్ళినా దేశాంతరం వెళ్లిపోయినట్టే లెక్క. ఏ రంగూనో, బర్మావో వెళ్తే, జరక్క దేశాలు పట్టుకుపోయేడు అని జాలి పడేవాళ్ళు అప్పట్లో. మన ప్రపంచం చిన్నది. మన చుట్టూ ఉన్న మనుషులే మనలోకం. అంచేత అబ్బాయీ అమ్మాయీ గల తల్లులూ తండ్రులూ వీళ్లకి ముడి పెట్టేస్తే బాగుంటుందని అని చేసేసేవారు కాబోలు. పైగా పెద్దలు ఏం చూస్తారు పెళ్ళి చేసేముందు? అవతలవారి ఆస్తిపాస్తులూ, కులగోత్రాలూ, వంశమర్యాదలూ, సంఘంలో వారి స్థాయి – ఇవన్నీ ఎందుకు? పిల్ల సుఖపడుతుందనే కదా. పైగా ఇలా పరిచయం ఉన్న కుటుంబాలే అయితే మళ్ళీ తగువులు వచ్చినా ఆ పెద్దలే కలగజేసుకుని ఇద్దర్నీ చీవాట్లు పెట్టి ఓ దారికి తెస్తారు. అదొక రక్షణ. అలాగే ఆ పిల్లలు కూడా ఈ మనిషితోనే నా ముందు బతుకంతా అని మనసారా నమ్మి,

తదనుగుణంగా తమ ఆలోచనలూ, అభిప్రాయాలూ దిద్దుకుంటారు. తగువులొస్తే పెద్దలున్నారని నిశ్చింత."

"అలా అనుకుంటే బాల్యవివాహాలే నయమేమో! ఎదుగుతున్నకొద్దీ అభిప్రాయాలు బలంగా నాటుకుపోయి మార్చుకోడం కష్టమవుతుంది," అంది లీల.

"అది కాదు. ఇప్పుడు పెద్దయేక, ఒకరినొకరు చూసుకుని, ఒకరితో ఒకరు మాటాడుకుని, ఆహా నీకోసమే నేనూ నాకోసమే నువ్వు పుట్టేం అనుకుంటూ పెళ్లిళ్లు చేసుకున్నవాళ్లందరూ అలాగే ఉంటున్నారా కలకాలం? ఎంతమంది విడిపోవడంలేదు? ఈమధ్య ఒక పెళ్లి చూసేను. స్నేహితులు వాళ్లిద్దర్నీ ఒకరికొకర్ని పరిచయం చేసేరు అని వాళ్ళే చెప్పుకున్నారు. నాకు నవ్వొచ్చింది. అంటే అది మీస్నేహితులు 'ఎరేంజుడు' చేసినట్టే కదా అన్నాను నవ్వుతూ. ఇక్కడ విడాకులలెక్కలు చూస్తే ఈ స్వయంవరాల్లో కూడా ఏదో లోపం ఉన్నట్టే ఉంది అనిపించదా?" అంది పెద్దక్క.

ఇంతవరకూ ఊరుకున్నాను కానీ ఇంక ఊరుకోలేకపోయేను. "మీరే చెప్పినట్టు ఏ ఒక్క సంఘటనకైనా ఒక్కటే కారణం ఉండదు. అసలు నేననుకోడం ఇప్పుడు అన్నివిషయాల్లోనూ ఆలోచించేవిధానంలో  వచ్చినమార్పు అని. ఇదివరకు  మనం నేర్చుకున్న పాఠం ఎదటివారి సౌఖ్యం మనసులో పెట్టుకోవాలని. ఇప్పుడు 'నేనూ, నాసౌఖ్యం' అన్నదే తిరుమంత్రం. మిగతా ఆలోచనలూ, అభిప్రాయాలూ, ప్రవర్తనలూ అన్నీ ఆ మంత్రాన్ని కేంద్రబిందువు చేసుకునే," అన్నాను.

"పద్ధతులూ సాంప్రదాయాలూ అన్నీ మంచి ఉద్దేశంతోనే మొదలవుతాయి. క్రమేణా వాటికి కొందరు వక్రభాష్యాలు చెప్పి, స్వప్రయోజనాలకోసం మార్పులూ చేర్పులూ చేసేసి వాడుకుంటారు. ఆ కాలంలో నిజంగా ఏం జరిగిందో నాకు తెలీదు. ఇలా జరిగి ఉండొచ్చు అని నాకు అనిపించింది అంతే," అంది పెద్దక్క.

"సరే, మనం సిద్ధాంతాల్లోకి దిగిపోయేం. మనమెవరమూ ఈ విషయంలో శాస్త్రోక్తంగా పరిశోధనలు చేయలేదు, చేయబోము. కనక ఈ చర్చ ఇంతటితో సమాప్తం. నువ్వు చెప్పు పెద్దక్కా, నీ సంసారంగురించి," అంది అరవింద, విషయాన్ని ప్రస్తుతానికి లాక్కొస్తూ.

"మీతాతయ్య చదువు అయేక మద్రాసులో కాపురం పెట్టేం. నాకేమో వంట రాదు. బియ్యం పొయ్యిమీద పెట్టి, కూర తరిగి ఏడుస్తూ కూచున్నాను ఏం చెయ్యాలో తెలీక. ఆ సాయంత్రం

ఆయన కచేరీనించి వచ్చి నావంట చూసి ఒకటే నవ్వు. బియ్యం ఉడకలేదు. కూర మాడిపోయింది. చారు ఉప్పుకషాయం. ఆయన నవ్వుతుంటే నాకు మరింత ఉడుకుమోత్తనం, ఏడుపూ కోపం వచ్చేయి. ఆపూటకి తనే వండి పెట్టేరు. ఆ తరవాత వరసగా వారం రోజులపాటు పక్కన కూచుని  నాలుగు రకాల కూరలూ, పచ్చళ్ళూ చెయ్యడం, చారు పెట్టడం నేర్పేరు.

అప్పట్లో చక్కగా కొబ్బరినూనె తలకి రాసుకుని, జడ బిగించి వేసుకునేదాన్ని. పదిరోజుల తరవాత ఛ, అలా కాదు అంటూ ఆయనే తల దువ్వి జడ వదులుగా వేసి, భుజంమీంచి ముందుకి వేసి, చూడు ఇలా అయితే చక్కగా నాజూగ్గా అటూ ఇటూ ఊగుతూ చూడ్డానికి బాగుంటుంది అన్నారు."

ఆనాటి తలపులు మనసులో మెదలడంతో కళ్ళు తడి అయినట్టుంది, తల వాల్చి చిరునవ్వుతో ఆలోచిస్తూ కూర్చుంది  పెద్దక్క.

"బాగుంది తాతయ్య నీకు జడ వేసేడా?" అంది అరవింద నవ్వుతూ.

"అసలు కచేరీకి తప్పిస్తే ఎక్కడికెళ్ళినా ఇద్దరం కలిసివెళ్ళడమే. కాపురం పెట్టిన కొత్తలో ముందటి అలవాటు ప్రకారం స్నేహితులింటికి పేకాటకి వెళ్తూ నన్ను కూడా రమ్మన్నారు. ఒకటి రెండు సార్లు వెళ్ళేను కానీ తరవాత రానన్నాను. నాకక్కడ తోచదు, ఆ యింటావిడతో మాటాడ్డానికేం ఉండదు. అప్పట్నుంచీ ఆయన కూడా వెళ్ళడం మానీసేరు. మీఆవిడ కట్టుబాట్లు అంత కఠినంట్రా అని స్నేహితులు వేళాకోళం చేసినా పట్టించుకోలేదు. పోస్లెద్దూ, నువ్వూ నేనూ శాశ్వతం కానీ వాళ్ళూ నేనూనా అనేవారు."

"మరి మీరెప్పుడూ దెబ్బలాడుకోలేదా?"

"ఎందుకు లేదూ, అవీ ఉన్నాయి."

"ఏ విషయాల్లో వచ్చేవేమిటి తగువులు?"

"ఏవిషయమంటే … చాలా విషయాల్లోనే వచ్చేవి. నాకేమో కాకరకాయ ఇష్టం. ఆయనకేమో బెండకాయ ఇష్టం. బజారుకెళ్తే, కాకరకాయ వద్దని ఆయనా, బెండగాయ వద్దని నేనూ… బట్టలదుకాణానికెళ్తే, జరీ బుటాలున్న నీలంచీర తీసుకో, నీమొహం చంద్రబింబంలా ఉంటుంది, ఆకాశంలో చుక్కల్లా ఆ బుటాలు అని ఆయనంటే, ఉల్లిపొరరంగు చీర కొంటాను చక్కని సాయంశోభని తలపింపజేస్తూ ప్రశాంతంగా ఉంటుందని నేనూ …"

“మరి ఏచీర తీసుకున్నావు?”

పెద్దక్క నవ్వింది. “ఏమో. ఏదైతేనేం ... తగువులు పెట్టుకోడం అదోరకం సరదా, పెంకెతనం ... అంతే.”

“నాఅనుమానం నువ్వు అన్నీ తాతయ్యకి కావలిసినట్టే చేసేవని,” అంది అరవింద ఆట పట్టిస్తున్నట్టు.

పెద్దక్క చిలిపిగా నవ్వింది మొహం పక్కకి తిప్పుకుని.

“అసలు మీతరంలో మీరు, ’మేం ఇలా చెయ్యం, అలా చెయ్యం, మీరెంతో మేమూ అంతే అంటూ’ ప్రారంభించి ఉంటే మాకిప్పుడు ఇన్ని కష్టాలుండకపోను,” అంది అరవిందే మళ్లీ.

నేను నవ్వుతూ, "అలా చెప్పేవాళ్ళు లేకపోయేరు మీపెద్దక్కకి," అన్నాను.

“బాగుంది. మేం చక్కగా సంసారాలు చేసుకున్నాం ’చీటికి మాటికి నాయిష్టం, నాసుఖం,’ అంటూ పేచీలు పెట్టుకోకుండా. అదీ తప్పేనా?” అంది పెద్దక్క.

“తప్పు కాదేమిటి? ఎంతసేపూ ఆ భర్తగారికేం కావలిస్తే అది ఎలా కావలిస్తే అలా చెయ్యడమే అయితే మీ సొంత వ్యక్తిత్వాలేమయినట్టు? ’మేమూ మనుషులమే, మాకూ ఆలోచనలూ, ఆశలూ, కోరికలూ, అభిప్రాయాలూ ఉంటాయి’ అని మీకు అస్సలెప్పుడూ అనిపించలేదా?”

“మాటలో భేదం అంతే. మేమూ అనుకున్నాం మా వ్యక్తిత్వాలు మావి అని. అయితే అవి ఎలా వ్యక్యమయేవి అన్నది మీకు అర్థం కాదు. మీచదువులు వేరు.”

“చెప్పరాదూ మాకు అర్థమయేట్టు.”

పెద్దక్క ఏదో ఆలోచిస్తూ ఊరుకుంది. “పోనీ ఇది చెప్పు. చీరా, కూరా చిన్న విషయాలు. అవి ఎలాగైనా సర్దుకుపోవచ్చు. పెద్ద పెద్ద తగువులు, అభిప్రాయభేదాలు రాలేదా? అప్పుడేం చేసేరు మీరిద్దరూ?”

“అప్పుడూ అంతే. అసలు పెద్ద ...”

తలుపు తట్టిన చప్పుడవడంతో అందరం అటు చూసేం. అరవింద ఉలికిపడి, “సరేలే. నేను లైబ్రరీకి వెళ్ళాలి. మరోరోజు చెప్దుగాని,” అంది లేస్తూ.

పెద్దక్క సరేనన్నట్టు తలూపింది.

సిరి, "ఫరవాలేదులెద్దూ, కూచో. నిన్ను కొరుక్కు తినేస్తేడేమిటి అలా పారిపోడానికి," అంది లేచి తలుపు తీస్తూ.

విషి లోపలికి వస్తూ, "మరే కొరుక్కుతినేస్తానేమిటి? తినబోతే మాత్రం ఇంతమంది ఉన్నారు, వీళ్ళంతా ఊరుకుంటారా?" అన్నాడు.

అరవింద సోఫాఅంచున కూచుంది ముళ్ళమీద కూచున్నట్టు. పెద్దక్కవేపు తిరిగి, "చెప్పు. మరి పెద్ద తగూలు వస్తే ఏం చేసేదానివి?" అన్నతరవాత విషివేపు చూసింది.

"చూసేరా, ఇది నాకు పాఠం," అన్నాడు ఎడంగా మరో కుర్చీలో కూచుంటూ.

"నువ్వు నామాట అడుగుతున్నావా, అసలు ఆరోజుల్లో ఎవరైనా ఏం చేసేవారని అడుగుతున్నావా?"

"ఏదైతేనేం? సరే. రెండూ చెప్పు. నువ్వేం చేసేవు? ఇంకెవరైనా ఏం చేసేరు?"

"చెప్పాలంటే చాలానే ఉంది. మాది పెద్ద కుటుంబం కదా. ఒకొకరికి ఒకో కథ.

ఆ కథలు చెప్తే చాలు నీకు ఆనాటి ప్రపంచం మొత్తం తెలిసిపోతుంది. నావిషయంలో పెద్ద తగూలు అట్టే లేకపోవచ్చు కానీ అసలు లేవనను. ఉమ్మడి కుటుంబాలయినప్పుడు మామధ్య కాకపోతే మరొకరిమూలంగా వస్తాయి పేచీలు."

"అత్తమామలూ, ఆడబడుచులూనా?" అంది అరవింద.

"ఒకరేమిటి, అందరూను. ముఖ్యంగా పెద్ద బావగారు. చెప్పేను కదా మీతాత పేకాట ఆడేవారని. నామూలంగా మానేసేరు కదా. మాపెద్ద బావగారికి ఆటంటే ఆట కాదు, వ్యసనమే. సంసారం నాశనం చేసేరు పేకాటలో పడి. మా తోడికోడలు కొంత రగడ చేసింది ఏడ్చీ, మొత్తుకునీ, నయానా, భయానా చెప్పి ... ఆఖరికి పుట్టింటికి పోతానని బెదిరించింది కానీ లాభం లేకపోయింది."

"పోతే పోఅన్నారా?"

"లేదు. మళ్ళీ అభిజాత్యం కదా. పెళ్ళాం వొదిలేసిందంటే నామర్దా కాదూ. వెళ్ళనిచ్చేవాడు కాదు. ఒకవేళ ఆయన ఇంట్లో లేనప్పుడు బండి కట్టించుకుని వెళ్ళినా, రెండు రోజులతరవాత ఈయన వెళ్ళి తీసుకొచ్చేసేవాడు ఇంక ఆడనులే అంటూ బతిమాలీ బామాలీ. ఎంత చెడ్డా ఆడదానికి

పుట్టింట్లో ఏం గౌరవం అనో, మార్తానన్నారు కదా అనో ఆవిడ మళ్ళీ వచ్చేసేది. ఆవిడ అటు బండి దిగ్గానే ఈయన ఇటు వీధిలోకి ఉడాయించేసేవారు."

"మరి మీమామగారూ, అత్తగారూ ఏమీ అన్లేదా?"

"వాళ్లు మాత్రం ఏం చేస్తారు. చెప్పినంతకాలం చెప్పేరు. తరవాత కోడలిమీద పడ్డారు మొగుణ్ణి చెప్పుచేతల్లో పెట్టుకోడం చేతకాదని. అమ్మా, నాన్నా తనమానానికి తననొదిలేసి, కోడలిమీద పడ్డంతో ఆయనకి మరింత ఆటవిడుపయింది. మాతోడికోడలు మెళ్ళో గొలుసు, చేతిగాజులూ అమ్మేసి, చేతికందిన చోటల్లా అప్పులు చేసి సాగించేరు. అప్పుడే మీ తాతయ్యదగ్గర్నించి కూడా డబ్బు తీసుకోడం. కొంతకాలం ఊరుకున్నాను కానీ మనసంపాదనలు కూడా ఆయన పేకాటలకే తగలేస్తే ఎలా అని. దాంతో మీతాతయ్యకి కోపం వచ్చింది. పెద్దవాడు వచ్చి డబ్బు కావాలంటే ఎలా లేదంటాను అంటారు ఈయనగారు."

"అదేంటి. పెద్దవాడయితే పెద్దరికం నిలుపుకోవాలి కదా. ఆయన చెడు అలవాట్లని మీరు పోషించడమేమిటి?"

"అదే మరి. మీతాతయ్య ఆయనకి ఎప్పుడైనా కాస్త ఓ మంచిమాట చెప్పబోతే, మామామగారు ఈయన్నే అనేవారు. ఇంటికి పెద్దవాడు, నాతరవాత నీకు వాడే దిక్కు. మర్యాదగా మసలుకోడం నేర్చుకో అని."

"మరి మీకు మీబావగారు ఎప్పుడేనా సాయం చేసేరా?"

"ఏమో, ఓమారు ఏదో పెద్దమొత్తం అప్పు చేసి, ఆడి ఓడిపోతే, అవతలవాళ్లు పట్టుక్కొట్టేరుట. ఆ దెబ్బలతో నెలరోజులు మంచంలో ఉన్నారు. ఆరోజుల్లోనే మామగారికి పక్షవాతం వచ్చింది. మరో నెలరోజులకి పోతారనగా, ఓరోజు పెద్దకొడుకుని దగ్గర కూచోపెట్టుకుని, తలుపులేసుకుని ఏం చెప్పేరో మూడున్నర గంటలసేపు. ఆ తరవాత మాబావగారు పూర్తిగా మారిపోయేరు. నిజానికి ఆయన మంచివాడే ఆ ఒక్క దురలవాటు తప్పిస్తే. ఊళ్ళో ఎవరికేం వచ్చినా ఆదుకునేవారు. చాలామంది ఇప్పటికీ ఆయన్ని తలుచుకుని దణ్ణం పెడతారు."

పెద్దక్క ఏదో గుర్తు చేసుకుంటున్నట్టు కొంచెంసేపు మౌనంగా ఊరుకుంది.

మేం ఏం మాటాడలేదు. ఎందుకో బరువుగా అనిపించింది. ఇలాటివి జరుగుతాయని తెలీని ప్రపంచంలోకి వచ్చేసేం అని అనిపించడంచేతేమో!

"ఓమారు తిప్పడు, మాయింట్లో పనివాడు, తెల్లారుఝామునే కొడుకుని తీసుకొచ్చేడు ఆవులకి మేత వేసి, పాలు పితకడానికి. హఠాత్తుగా పిల్లాడు కెవ్వుమన్నాడు. బారెడు పాము జరజర గడ్డివాములోకి దూరిపోయింది. తిప్పడు ఓరయ్యో అంటూ పిల్లాడిని పెరటివేపు పంచలోకి వచ్చి, బాబో, బిడ్డని పురుగు కుట్టేసినాదంటూ ఏడుపు మొదలెట్టేడు. మాబావగారు గబగబ బయటికొచ్చి, తుండుగుడ్డ భుజాన వేసుకుని, విషం పైకెక్కకుండా పిల్లాడి కాలుకి మరో తుండు గట్టిగా కట్టి, వాణ్ణి భుజాన వేసుకుని ఐదుమైళ్ళు నడిచి డాక్టరుగారింటికి తీసుకెళ్లి చికిత్స చేయించేరు. ఇంటికి తిరిగొచ్చేక, మా అత్తగారు యానాదివాడిపిల్లాడిని నువ్వెత్తుకు తీసుకెళ్ళడమేమిట్రా, వెళ్ళి స్నానం చెయ్యి అంటూ కసురుకున్నారు. మాబావగారు మాత్రం ఈచలిలో నేనిప్పుడు స్నానం చెయ్యను. తరవాత చేస్తాలే అన్నారు. ఆవిడ మళ్ళీ యానాది అని ఏదో అనబోతుంటే నాచిన్నప్పుడు తిప్పడు నన్ను ఎత్తుకు తిరిగినప్పుడు ఏమయింది ఆ యానాదిరికం అంటూ కసురుకుని లోపలికెళ్ళిపోయేరు."

అరవింద ఆయోమయంగా చూసింది. "నాకర్థం కావడం లేదు. ఆయన అడిగిన ప్రశ్న నిజమే మరి. తిప్పడు ఆయనని ఎత్తుకు తిరిగినప్పుడు ఎలా పనికొచ్చింది?" అన్నాడు విషి.

"నాకు తెలీదు బాబూ. నాకథ చెప్పమన్నారు. చెప్పేను. అంతే."

"సరేలెండి. ఇంతకీ మీకేమైనా బజారునించి ఏమైనా కావాలేమోనని అడగడానికొచ్చేను. ఓ వారంరోజులపాటు ఇంట్లో హడావుడి. అంచేత మీకైమైనా కావలిస్తే చెప్పండి. ఇప్పుడే తెచ్చేస్తాను," అన్నాడు విషి.

"వారందాకా రావడానికి వీలు లేదంటే, కాస్త పాలూ, కాఫీ తెచ్చి ఇచ్చీ. ఇంకేం అక్కర్లేదు."

సరేనని చెప్పి, విషి వెళ్ళిపోయేడు. అతను వెళ్ళేక అరవిందా, నేనూ కూడా లేచేం వస్తాం అంటూ.

అందరం గుమ్మందాకా వచ్చేం. విషీ, అరవిందా వెళ్ళేక చూస్తే రోడ్డుమీద నాకారొక్కటే కనిపించింది. "రండి, మీయింటిదగ్గర దింపుతాను," అన్నాను లీలతో, ఆవిడ కారు తీసుకురాలేదేమోనని.

సిరి కిటికీవేపు తిరిగింది.

లీల ఓ క్షణం ఆగి నెమ్మదిగా, "నేనిక్కడే ఉంటున్నాను," అంది.

ఒక్కక్షణం గాలి స్తంభించిపోయింది. వెంటనే సర్దుకున్నాను.

"సరే. వస్తాను మరి," వీలయినంత మామూలుగా ధ్వనించడానికి ప్రయత్నిస్తూ వీధివేపు నడిచేను.

బయటికి వచ్చింతరవాత, అరవింద నావేపు తిరిగి, "మీకు రేపు ఖాళీయేనా?" అనడిగింది.

"ఖాళీయే. ఏం?"

"ఏంలేదు. పెద్దక్క చెప్పినకథ మీరే వివరించాలి. నాకేమిటో అదంతా విన్నతరవాత మరింత గందరగోళంగా ఉంది. అసలు పెద్దక్క ఆకథ నాకోసమే చెప్పినట్టుంది. అందులో నిజంవెంతో కల్పనెంతో."

"సరే, రా. రేపు మాటాడుకుందాం," అన్నాను కారు ఎక్కుతూ. నాకు అరవిందలా అనుమానం లేదు కానీ ఆవిడ ఇంకా చెప్పగలిగింది, చెప్పవలసింది చాలా ఉందనిపిస్తోంది.

000

"లీల గారిని కూడా తీసుకొచ్చేను మీరేం అనుకోరని," అంది అరవింద లోపలికొస్తూ.

నేను నవ్వి, "రండి," అన్నాను తలుపు బార్లా తీసి, పక్కకి నిలబడి, వాళ్ళకి దారిస్తూ.

"కాఫీ, టీ?"

"ఏమీ వద్దండీ. మీరు కూచోండి. ముందు మాటాడుకుందాం."

"ఏమిటో ఇక్కడ ప్రతివారూ మన పెద్దలు నిర్ణయించి చేసే పెళ్ళిళ్ళగురించి అడగడం, ఎవరైనా అవును మాది పెద్దలు చేసిన పెళ్ళే అనగానే వాళ్ళు అదేదో మహా నేరం అయినట్టు తుళ్లిపడడం. అలా చేసుకున్నవారు కూడా బాగానే ఉన్నారు కదా. మా అమ్మా, నాన్నా చూడరాదూ," అంది అరవింద ఆలోచిస్తూ.

"నిజానికి పెళ్ళి ఎలా జరిగిందన్న ప్రశ్న కంటే పెళ్ళయినతరవాత ఆ వైవాహికజీవితం ఎలా కొనసాగించేరు, ఒడిదుడుకులు వస్తే ఎలా తట్టుకు నిలబడ్డారు అన్నది ఎక్కువ ముఖ్యం. వాటికి అంత తేలిగ్గా సమాధానాలు దొరకవు. అందుకే అది నిలబెట్టుకోడం అంత కష్టం. మన పూర్వులు అది గ్రహించి దానికి తగ్గట్టు వాళ్ల జీవితాలు మలుచుకున్నారు," అన్నాను.

"వాళ్ళది పెద్దలు నిర్ణయించి చేసిందని మీఅమ్మ చెప్పిందా?" అంది లీల.

"ఏం? కాదా?" అంది అరవింద ఆశ్చర్యపోతూ.

లీల నావేపు చూసింది, "మీరు చెప్పండి," అన్నట్టు.

"అవుననుకుంటే అవును, కాదనుకుంటే కాదు," అన్నాను తికమకగా.

"అదేమిటి? నేను పెద్దలు చేసిన పెళ్ళి అనే అనుకున్నా."

"నువ్వు అడిగేవా?"

"లేదు. నాకసలు అడగాలన్న ఆలోచనే రాలేదు."

"మీ అమ్మ సవితి అన్నగారు ఒకాయన ఉన్నారు, నీకు తెలుసా?"

"లేదు. అమ్మ ఎప్పుడూ చెప్పలేదు."

"అదొక వింత కథ. మీఅమ్మా, నాన్నలసంబంధం నిశ్చయం అయినప్పుడు జాతకాలూ, కులగోత్రాలూ అన్నీ సవ్యంగానే ఉన్నాయి. తీరా తాంబూలాలు పుచ్చుకున్నాక, ఆ అన్నగారు కాలేజీలో పాఠాలు చెప్పేరోజుల్లో తనదగ్గర చదువుకున్న అమ్మాయిని పెళ్ళి చేసుకుంటున్నట్టు వీరికి తెలిసింది. ఆయన ఈ చెల్లెలిపెళ్ళి అయేక ప్రకటించుదాం అనుకున్నారుట. కానీ వీళ్ళ పెళ్ళికి ముందే ఆవార్త పొక్కింది. దాంతో కులహీనం పిల్లని చేసుకుంటున్న ఇంటిపిల్ల నాకోడలు కాడానికి వీల్లేదంటూ మీతాతగారు చేసిన ఆర్భాటం అంతా ఇంతా కాదు."

"తాతగారే!" అంది అరవింద నమ్మలేనట్టు.

"ఆహా మీ తాతగారే. ఆ పెళ్ళి చేసుకుంటే మళ్ళీ గడప తొక్కనీయను, నాకు కూతురే లేదనుకుంటాను, కాశీకి పోతాను, గంగలో దూకుతాను, అంటూ పెద్ద రగడ లేవదీసేరు."

"నేనింకా అమ్మమ్మకే అభ్యంతరం ఉంటుందనుకున్నా. మామూలుగా పూజలూ, వ్రతాలూ, నోములూ అంటూ సంప్రదాయ పరిరక్షకులు ఆడవాళ్ళే కదా."

"అదే మరి ఆశ్చర్యం. పైకి కనిపించే సంప్రదాయరక్షకులు ఆడవాళ్ళే. తామేదో మహా అభ్యుదయవాదులం అంటూ ఘోషించే మగవాళ్ళలో చాలామంది తమయింట్లో ఆ గీటు దాటితే ఏమాత్రం సహించలేరు."

"మీరేదో స్త్రీవాదుల్లా మాటాడుతున్నారు."

"అదుగో, అదే వద్దంటున్నా. నేనే వాదాలు మాటాడ్డంలేదు. నాకు తెలిసినప్రపంచంలో నేను చూసిన విషయాలు చెప్తున్నా. అంతే. నాకు తెలిసిన ప్రపంచం ఎంత కనక సిద్ధాంతాలు

చేసేడానికి. పిడుక్కీ బియ్యానికీ ఒకటే మంత్రం అన్నట్టుంటాయి ఆ వాదాలు. ప్రతి మనిషికీ ఎవరి పరిస్థితి వారికే ప్రత్యేకం, పరిమితం, వారికి వారే ఆలోచించుకుని నిర్ణయించుకోవాలని నా సిద్ధాంతం. అంచేత నాసిద్ధాంతం ఏ సిద్ధాంతాల్లోనూ ఇమడదు. నీమటుకు నువ్వు నీకు తెలిసిన ప్రపంచం చూడు. ఆతరవాత నీకు తోచినట్టు నువ్వు నిర్ణయించుకో," అన్నాను.

అరవింద ఆలోచనలో పడింది.

"అసలు ఒకొకళ్ళు ఒకొక సందర్భంలో ప్రవర్తించేతీరు చూస్తే వీళ్ళేనా అని ఆశ్చర్యం వేస్తుంది. ఇంతకీ మీతాతగారు చేసిన ఆర్భాటం ఇంతా అంతా కాదు. సరేనా, అక్కడ ఆ అన్నగారేమో ఆ అమ్మాయి మనింటికొచ్చింది కానీ మనం వాళ్ళింటికెళ్ళడం లేదు,  పైగా నాది అనులోమం, శాస్త్రాలు కూడా ఆమోదించేయి అంటూ వాదించేరుట."

"అదేమిటి?"

"మగవాడికంటే కులంలో, ఆస్తిలో తక్కువగా ఉండాలి. అది అనులోమవివాహం. అంతే కాదు, తన పిల్లలవంతు వచ్చేవేళకి మళ్ళీ తనవాదనలు సవరించుకుని, అందరికీ సలక్షణంగా కులగోత్రాలు చూసి మరీ చేసేరు పెళ్ళిళ్ళు."

"ఘోరం. తనకి పనికొచ్చింది కానీ తనపిల్లలకి పనికి రాలేదా కులాంతరం?"

"అదే నేనసేది కూడా. ఎవరికి గానీ వాళ్ళు చేసింది ఒప్పు. దాన్ని సమర్థించుకోడానికి సవాలక్ష కారణాలు చూపిస్తారు. అదే మరొకరు చేస్తే తప్పు."

"అయితే మరి మాఅమ్మా నాన్నలపెళ్ళి ఎలా అయింది?" అడిగింది అరవింద మళ్లీ.

"ఏంచేసేరంటే ఓ శుభముహూర్తం చూసుకుని ఎవరికీ చెప్పకుండా సింహాచలం వెళ్లి పెళ్ళి చేసుకు వచ్చేశారు. ఏడాదిపాటు మీ తాతగారు మీఅమ్మని గుమ్మంలో అడుగు పెట్టనివ్వలేదు."

"ఏడాది అంటే అప్పటికి నేను పుట్టిఉండాలి."

"అవును. నువ్వు పుట్టేవేళకి, ఆడపిల్ల, తొలికానుపు పుట్టింట్లోనే జరగాలి, మీకిష్టం లేకపోతే మీరీగదిలోకి రాకండి అంటూ మీ అమ్మమ్మ మీఅమ్మని ఇంటికి తీసుకొచ్చింది. నిన్ను చూసేక మీతాతగారు శాంతించేరు."

"ఆహా, నాకారణంగా మళ్ళీ ఆయింట్లో శాంతి ఏర్పడిందన్నమాట."

“అవును. కారణజన్మురాలివి.”

కొంచెంసేపు నిశ్శబ్దం ఆవహించింది.

“ఏమిటో ఈ పెళ్లిళ్లు,” అంది లీల సాలోచనగా.

“ఎందుకలా అంటారు?” అని అరవింద కొంచెం సందేహిస్తూ నెమ్మదిగా, “మీరిద్దరూ విడిపోయారంటే నమ్మలేకుండా ఉన్నాం,” అంది టీకప్పులోకి తొంగి చూస్తూ.

లీల వెలితిగా నవ్వింది, “నాకే లేదు నమ్మకం నేనే ఇలా చేసేనా అని,” అంది లీల కిటికీలోంచి ఎటో చూస్తూ. మళ్లీ తనే అంది, "అసలు మొదట్నించీ చిన్నచిన్న చిరమరలు నేనే పట్టించుకోలేదేమో చిలికిచిలికి గాలివాన అయేవరకూ"

“ఏమో, నాకు తికమకగానే ఉంది. మీరిద్దరూ తెలివైనవాళ్లే కదా,” అంది అరవింద,

“తెలివితేటలకీ, జీవితం సుఖవంతం కాడానికీ సంబంధం లేదు. పెద్దక్క చెప్పినట్టు ఇంటింటా ఉంది ఓ పొయ్యి, మాఇంట మరో పొయ్యి అని. తగువులు అన్నిళ్లల్లోనూ ఉంటాయి. మాపెద్దక్క పెళ్ళి తేలిగ్గానే అయిపోయింది చిన్నమామయ్యతో. చిన్నక్కకి సంబంధాలు చూస్తున్నారు. ఇంకా నావంతు రాలేదు కదాని నేను ఇంటరు తరవాత బి.ఎ. తరవాత యమ్మే కూడా చేసేను గాలివాటుగా. ఒక ప్లానూ గట్రా లేదు. తరవాత ఏంచేస్తానన్న ఆలోచన లేదు.

అప్పటికి చిన్నక్కకి ఇంకా సంబంధం కుదరలేదు. మా అన్నయ్య కూడా చెల్లెలిపెళ్ళి అయితే కానీ చేసుకోనని తనకి వచ్చిన పెళ్ళి సంబంధాలు తిరగ్గొడుతూ వచ్చేడు. తోచక ఉద్యోగంలో చేరేను నేను."

లీలని ఇరుకున పెడుతున్నామేమో అనిపించింది నాకు. ఎవరి బతుకైనా సినిమాకథలా చెప్పమనడం బాగుండదు మనకీ వాళ్లకీ కూడా.

"పదండి, అలా కాలువ ఒడ్డున నడుస్తూ మాటాడుకుందాం," అన్నాను. మాఇంటిపక్కనే ఓ పిల్లకాలువ ప్రవహిస్తోంది. కాలువలో బాతుల్నీ, కొంగల్నీ, నీటితరగలమీద మిలమిల మెరుస్తున్న సూర్యకిరణాలనీ చూసుకుంటూ నడవడం నాకు అలవాటు.

కొంచెందూరం నడిచేక, "ఇక్కడ కూర్చుందామా?" అంది లీల.

కూర్చున్నాక, "మరి మీకు సుందరంగారు ఎలా దొరికేరో చెప్పలేదు," అంది అరు.

"చెప్పలేదు," అంది లీల నవ్వుతూ.

ఆవిడకి ఇష్టమవునో కాదో అని చూస్తున్నాను నేను.

కొంచెంసేపు కాలువ ఒడ్డున కూర్చుని కాలువలో ఈతకొడుతున్న బాతుపిల్లల్నీ, కొంగజపం చేస్తున్న కొంగల్నీ చూస్తూ గడిపేం. పడమట సూర్యుభగవానుడి ముఖం ఎర్రబడుతోంది క్రమంగా.

"చీకటి పడుతున్నట్టుంది, నేనింక వెళ్తాను, పెద్దక్క ఎదురు చూస్తుంటారు," అంది లీల.

"సరే పదండి."

నాకెందుకో లీలని అలా పంపడం బాగులేదు. "ఉండండి, భోంచేసి వెళ్దురుగానీ," అన్నాను.

లీల సందేహిస్తూ నావేపు చూసింది, "పెద్దక్క నాకోసం ఎదురు చూస్తుంటారు."

"నేను చెప్తాలెండి," అన్నాను.

ముగ్గురం మౌనంగా ఇంటికొచ్చేసేం.

నేను వాళ్లిద్దర్నీ హాల్లో కూర్చోమని చెప్పి, వంటింటివేపు నడిచేను.

"సాయం చెయ్యనా?" అంటూ ఇద్దరూ నావెనకే వచ్చేరు అక్కర్లేదంటున్నా వినకుండా.

ఫ్రిజిలోంచి వంకాయ తీసి కౌంటరుమీద పెట్టేను.

అరవింద కత్తి అందుకుంది.

లీల పెద్దక్కకి ఫోను చేసి ఇంటికి ఆలస్యంగా వస్తానని చెప్పి, వచ్చింది, "మీరట్టే పని పెట్టుకోకండి. చారూ అన్నం, ఉంటే ఆవకాయా చాలు."

"ఫరవాలేదండి. మాలికగారికి వంట చేయడం సరదా. పైగా వంకాయవేపుడు బాగా చేస్తారు కూడాను," అంది అరు వంకాయ తరుగుతూ.

నేనూ లీలా నవ్వుకున్నాం. "మీరెలా చేస్తారు వంకాయ?"

"నేనూ అంతేనండి. సన్నగా తరిగి వేయించి ఉప్పూ జీలకర్ర కారం, అంతే," అంది లీల.

"ఇలా అడుగుతున్నందుకు క్షమించమని ముందే వేడుకుంటున్నాను. మీరింతకీ సుందరంగారిని ఎలా కలిసేరో చెప్పేరు కారు," అంది అరవింద విచారంగా ముఖం పెట్టి.

ముగ్గురం నవ్వుకున్నాం.

భోజనాలు అవుతుండగా లీలే అంది, "సుందరం దుర్మార్గుడని కాదు కానీ ..." అని ఓ రెండు నిముషాలాగి, కొనసాగించింది, "ఆరోజుల్లో మామూలయిన ఎన్నారై పద్ధతిలో సుందరం నెలరోజులు శలవు పెట్టి వధూపేటకి తెలుగుదేశానికి వేంచేసేడు. ఆయనగారి ఆప్తమిత్రుడు సుందరాన్ని హోటల్ తాజ్‌లో మకాం ఏర్పాటు చేసి, తాను సేకరించిన పెళ్ళికూతుళ్ల సమాచారాలనీ వల్లించేడు. పెద్దచదువు  చదువుకున్న అమ్మాయి, కొంచెం చదువుకున్న అమ్మాయి, కూడబలుక్కుని ఇంగ్లీషు చదవగలిగిన అమ్మాయి, ఆస్తి గలవారి అమ్మాయి, లేనివారి అమ్మాయి, అందమైన అమ్మాయి, అందంగా ఉందని అనిపించుకోలేని అమ్మాయి, పొడుగు పిల్ల, పొట్టి పిల్ల, చక్కని కనుగవ గల పిల్ల, చిక్కని కురుసంపద గలిగినపిల్ల ... ఇలా అనేకానేక అర్హతలు వల్లించేడు.

ఆ తరవాత దేశంమీద పడ్డారు. గుంటూరులో అమ్మాయి బాగుంది కానీ ఇంకొంచెం పొడుగుంటే బాగుండు. విజయవాడ అమ్మాయి బియే పూర్తి చేస్తే బాగుండేది. కాకినాడ పిల్ల ఇంకొంచెం తెల్లగా ఉంటే బాగుండు. రాజమండ్రిపిల్ల మరీ తెలుపు పిండిబొమ్మలా. సామర్లకోట పిల్ల చీరెరంగు నచ్చలేదు సుందరానికి. ఇలా అనేకానేక కొట్టిపేతలయేక నేను దొరికేను. విడిగా కలిసి మాటాడుకోవాలంటే అది కూడా ఏర్పాటు చేసేరు ఆ మిత్రుడుగారు."

"ఆహా, డేట్ అన్నమాట," అంది అరు చిలిపిగా.

లీల నవ్వలేదు.

అరు నాలుక్కొరుక్కుని నావేపు చూసింది. ఫరవాలేదులే అన్నట్టు నేను తలూపేను.

లీల కొంచెంసేపూరుకుని, అంది, "నిన్న పెద్దక్క చెప్పినట్టే ఈ ఆచారాలు. మరీ చిన్నపిల్లలప్పుడు పెద్దవాళ్లు కులగోత్రాలూ, ఆస్తులూ, అంతస్తులూ చూసేరు. కాస్త ఎదిగేక అమ్మాయీ అబ్బాయీ కలుసుకు మాటాడుకోడం ఏర్పాటు చేస్తున్నారు. అమెరికాలో డేటింగ్ అంటూ ఏం మాటాడుకుంటారు? ఇష్టాయిష్టాలూ భవిష్యత్తుగురించిన ఆలోచనలూ ఇవే కదా. ఎలా చూసినా ఇవన్నీ నిజానికి ఒట్టి సొల్లుకబుర్లే. ఒకమనిషికి మరో మనిషిగురించి ఓ గంటలో తెలిసిపోతుందా? ఏమీ తెలీదు. ఏదో తెలుసనుకుంటాం. కులగోత్రాలూ, జాతకాలూ చూసినా అంతే. డేటింగు చేసినా అంతే." అంటూ ఆగింది లీల.

"నిజమేనండి. ఈ డేటింగులో ఇద్దరూ ఒకరినొకరు ఆకట్టుకోడానికి పడే తాపత్రయాలే."

"అంతే. ఆతరవాత ఇద్దరూ ఒకగూటిలో చేరేక, క్షణక్షణం, దినదినం అవతలివారిని చూస్తూ కొంచెం కొంచెం తెలుసుకుంటూ పోతారు. కొందరు సర్దుకుపోతారు, కొందరు ..." అంటూ ఆగిపోయేను.

"విడిపోతారు," అంది లీల, నావాక్యం పూర్తి చేసింది.

సారీ అన్నాను. ఏం లాభం. అప్పటికే అనడం అయిపోయింది.

అరవిందముఖం పాలిపోయింది.

"దానికేంలెండి. నేనేదో లోకరీతి చెప్పేను. సుందరంగారితో మీపెళ్లి బాగానే అయింది కదా," అన్నాను. నామాట నాకే పేలవంగా వినిపించింది.

"కొన్ని సంఘటనలు మాత్రం మనల్ని ఎలా వెంటాడుతాయో చూస్తే ఆశ్చర్యం వేస్తుంది. మనతప్పేమీ లేకపోయినా. ఆరోజు ఈ సుందరమే, అబ్బ ఎంతటి ఔదార్యం అనిపించింది."

"మరి ఇప్పుడు అలా లేదా?"

"ఆ ఒక్కవిషయం అడక్కుండా బాగుండు అనుకుంటాం. తప్పకుండా ఆ ప్రశ్న వచ్చితీరుతుంది."

ఆవిషయమేమిటో అని ఇద్దరం చూస్తున్నాం.

లీల వినీ వినిపించనంత తగ్గుస్వరంలో అంది, సుందరం 'మీ చిన్నమామయ్యకి ఇద్దరు భార్యలుట కదా?' అని అనగానే ఉలిక్కిపడ్డాను. ఆ ప్రశ్న రావచ్చు అనుకున్నా, తీరా వినిపించినప్పుడు ఉలిక్కిపడతాం కదా. నాకు ఏం చెప్పాలో తోచలేదు. ఏం చెప్తే సరిపోతుంది ఆసమయంలో. అవునూ, కాదూ, నాకు తెలీదు, అందులో నాతప్పు లేదు, అయితే మీకు అభ్యంతరమా? ఏవో పిచ్చి పిచ్చి ఆలోచనలు. నాగీత బాగుండి అట్టేసేపు కాకుండానే తనే అన్నాడు, 'ఫరవాలేదు. నాకేమీ అభ్యంతరం లేదని చెప్పడానికే అడిగేను. పాపం, ఆయన ఏపరిస్థితుల్లో చేసుకున్నాడో, ఆయన అవుసరాలేమిటో, ఆలోచనలేమిటో మనకి తెలీవు కదా. అలాటి విషయాల్లో మనం ఉదారంగా ఆలోచించాలని నా అభిప్రాయం. కుటుంబరహస్యాలేవో దాస్తున్నాననుకుంటూ వెలితి, అది బయట పడితే ఏం చిక్కులొస్తాయో అన్న బెరుకూ ఉండకూడదనీ అడిగేను. ఇలాటివిషయాలు మనం నిర్భయంగా మాటాడుకోవాలి, మాటాడగలగాలి,' అన్నాడు. అప్పట్లో ఆహా ఈహృదయం ఎంత విశాలం అనిపించింది."

నాకూ అరవిందకీ మనసులు బరువెక్కేయి.

ఎవరి జీవితమైనా తారుమారు కావడానికి ఎంతసేపు? అరవిందవేపు చూసేను. ఆ అమ్మాయికి కూడా అలాగే అనిపించిందా? ఏమో?

గదిలో గాలాడ్డం లేదు. ఫలానా అని చెప్పలేని బరువేదో గదంతా కమ్ముకున్నట్టుంది.

అరవింద ఆ చిక్కదనానికి గంటు పెట్టింది, "ఇంకొక్కమాట అడుగుతాను. మీకు ఇష్టం లేకపోతే చెప్పొద్దు. మళ్లీ అడగను. మీకు సుందరంగారంటే ఎలాటి అభిప్రాయం. మీఇంటివిషయాలు కాదు. మనిషిగా ఆయన్నిగురించి మీరేం అనుకుంటున్నారు," అంది.

ఇలా అడుగుతోంది స్పష్టమే. లీలకి కూడా అర్థమయినట్టే ఉంది, "ఒక్కమాటలో చెప్పాలంటే మాటకారి. తెలివితేటలున్నాయి. కానీ ఆతెలివితేటలు ఎదటివాణ్ణి బుట్టలో వేసుకోడానికీ, వాళ్లచేత అడ్డమైన చాకిరీ చేయించుకోడానికీ ఉపయోగిస్తాడు. అంతకంటె నాకు ఆశ్చర్యమూ, కొంచెం కోపమూ వచ్చింది ఒకరిని మరొకరి సేవలో పెట్టి, ఇద్దరిచేత తనపనులు సాధించుకోడం."

"అదెలా సాధ్యం?" అరవింద విస్తుపోతూ అడిగింది.

"నీకేదైనా కావాలనుకో. అదుగో మనవాడు, వాడు చేస్తాడులే అంటూ మరొకరిని ఆపనిలో పెడతాడు. ఆ మనవాడికి అంతకుముందు అలా మరొకరిచేత ఏదో సాయం చేయించిఉంటాడు, అలా అన్నమాట తను కూర్చున్నచోటినుంచి కదలకుండా అందరిచేతా మంచి అనిపించుకోడం."

“మీరలా అంటే నాకిప్పుడు మరీ అయోమయం అయిపోతోంది. మొన్న ఆయన నాకిచ్చిన ఉపన్యాసం ఇంకా పచ్చిగా నామనసులో అలాగే ఉంది. నాపెళ్లీ, భవిష్యత్తూ, విషిభవిష్యత్తు అన్నీ మాకంటే ఆయనకే ఎక్కువ తెలుసన్నట్టు మాట్లాడేరు. తల తిరిగి నోట్లోకొచ్చింది. కానీ ఆమాటల్లో ఏదో కుతర్కం ఉన్నట్టు కూడా అనిపించింది. ఇప్పుడు మీరూ అదే అంటున్నారు.

ఆయనమాట ఎలా ఉన్నా, ఒక్క మీయింట్లోనే మూడు రకాల పెళ్ళిళ్ళు జరిగేయి. ఏది మంచి పద్ధతి? ఏది కోరదగ్గది? నేను నాపెళ్ళివిషయం అమ్మానాన్నలకి వదిలేసి ఊరుకోనా? నేనే నిర్ణయించుకోనా? మొదటిపద్ధతి అయితే, తరవాత తగువొచ్చినప్పుడు మీరే చేసేరని వాళ్ళమీద పడి ఏడవడానికి వీలు. ఆ సౌకర్యం వదిలేసుకుని, నాకు నేనే చేసుకున్నప్పుడు కూడా మీరు పెద్దవాళ్లు, మీకామాత్రం తెలీదా, చిన్నపిల్లని అనైనా ఆలోచించకుండా నేనేదో

తెలివితక్కువ పని చేస్తే చూస్తూ ఊరుకుంటారా ఆయ్ అని వాళ్ళమీద అరవొచ్చు, ఏమంటారు?” అంది.

అరవింద చెప్పినతీరుకి నవ్వొచ్చినా ఆమాటల్లో నిజం లేకపోలేదు, .

“చిన్నపిల్లని అని చెప్పడం తెలిసినదానివి చిన్నపిల్లలా ఉండడం తెలీదా నీకు. పెళ్ళీ, సంసారం తరవాత చూసుకోవచ్చు, ముందు చదువు కానీ,” అన్నాను.

“లేదులెండి, హాస్యానికన్నాను,” అని నాతో అని, లీలవేపు తిరిగి, ”అది సరే గానీ, మరి మీరు ఇక్కడికి వచ్చేక ఏమయింది? ఆయనగారి ఈ విరాట్ స్వరూపం ఎప్పుడు ఎలా తెలిసింది?” అనడిగింది.

లీల కనుబొమ్మలు ముడిచి, రెండు క్షణాలు ఆలోచించి, మెల్లిగా అంది, “అదేం లేదనుకుంటా. అసలు ‘తత్వం’ అంటూ మనిషికి స్థిరమైనదీ శాశ్వతమైనదీ ఏదీ ఉండదేమో. సినిమాల్లో అడుగున్నర పిల్లవాడు ఆరడుగులకి గంటన్నరలో ఎదిగిపోయినట్టు కాదు కదా నిజజీవితంలో. నిజజీవితంలో మార్పు చాపకింద నీరులా నెమ్మదిగా కనిపించకుండా జరుగుతుంది. తెలిసి ఒకప్పుడూ తెలీకుండానే ఒకప్పుడూ జరుగుతుందనుకుంటా,” అంది.

“మనిషిలో మార్పు రావడం నిజమే అనుకోండి. కానీ అంతకుమించి లోలోపల ప్రతిమనిషికీ ఒక స్థిరమైన తత్వం కూడా ఉంటుందనుకుంటాను,” అంటూ నావేపు చూసింది అరు.

“నాకేమో రెండూ నిజమే అనిపిస్తోంది. అద్సరే గానీ మీకు ఇక్కడికి రాగానే ఎలా అనిపించిందో చెప్పండి. వీళ్ళ సంస్కృతికీ మనసంస్కృతికీ సహస్రాంతం తేడా. అసలు పూర్తిగా విరుద్ధం. నాకయితే పదేళ్ళు పట్టింది ఆ మాట గుర్తించడానికే. ఆ తరవాత ఇంకా వెతుక్కుంటూనే ఉన్నాను, బహుశా ఆజన్మాంతం నాకదే పని అవుతుందేమో,” అన్నాను.

“అవునండీ నాక్కూడా అలాగే అనిపించింది. అసలు నాపెళ్ళే హడావుడిగా అయిపోయిందేమో నాకు పెళ్ళయిందని తలకెక్కడానిక ఆర్నెల్లు పట్టింది. అంతలో ఈ విదేశీసంస్కృతితో ఢీకొనడం మరింత తికమక అయిపోయింది.”

“బండి మళ్ళీ పట్టాలు తప్పిపోతోంది. సంస్కృతిమాట తరవాత ఆలోచిద్దాం, సంసారం మాట చెప్పండి. నాకు విషి నాలుగేళ్ళగా తెలుసు. మాయిద్దరి ఇష్టాయిష్టాలూ, ఆశలూ, ఆశయాలూ, ఆర్థికసమస్యలూ, సంపదలూ, సంప్రదాయం, దాదాపు అన్నీ మాటాడేసుకున్నాం. అయినా

నాకు అతనితో శాశ్వతంగా జీవితం ముడి పెట్టుకోడానికి ధైర్యం చాలడం లేదు. మీరు గంటసేపు మాటాడి నిర్ణయించేసుకున్నారు. అదెలా సాధ్యం? దానిపర్యవసానం ఏమిటి?" అంది అరవింద.

"ఓపిక. ఓపిక కావాలి. అంత త్వరగా తెలీదు," అంది లీల నవ్వుతూ.

"నాకు ఓపిక లేకపోవడం ఏమిటండీ, నేను విషితో, ఇంకా మాటాడితే వాళ్ళనాన్నతో ఎంత ఓపిక ప్రదర్శిస్తున్నానో మీకు తెలీదు," అంది అరవింద మూతి ముడుచుకుని.

"నాదే తప్పు. నీకు చాలా ఓపిక ఉంది. అదలా ఉండనీ. నీకు విషిని నాలుగేళ్ళుగా తెలుసంటున్నావు కదా. ఈ నాలుగేళ్ళలో అతన్ని గురించి నీకు తెలిసింది చాలానే ఉండి ఉంటుంది కదా. అది చాలనుకుంటావా, ఇంకా తెలీందేదో ఉందనుకుంటావా?"

"అదే కదా ఇప్పుడొచ్చిన బాధ? నాకు నిజంగా అతన్నిగురించి ఎంత తెలుసు? ముందు ముందు ఏమాత్రం అతను మనసు విప్పి మాటాడతాడు? ఇలాటి ప్రశ్నలతోనే ఎటూ నిర్ణయించుకోలేకుండా ఉన్నాను."

"అప్పట్లో ఓ రెండు గంటలసేపు మాటాడి ఇష్టం అంటే ఇష్టం అనుకున్నాం గానీ నిజంగా ఒక మనిషి మరొక మనిషిని పూర్తిగా అర్థం చేసుకోడం ఎప్పటికీ జరగదనే అర్థమయింది నాకు."

"ఎందుకలా అంటారు? కొందరు చూడండి యాభై, అరవై ఏళ్ళగా కలిసి ఉండి కాపురం నిలబెట్టుకున్నారంటే వారిద్దరిమధ్యా ఏమాత్రమో సామరస్యం ఉందనే కదా అనుకోవాలి."

"ఉండొచ్చు. నేనంటున్నది అది కాదు. మనుషులు మారుతూంటారు కనక ఒకరు రెండోమనిషిని అర్థం చేసుకునే సమయం వచ్చేసరికి ఆ రెండోమనిషి మరోరకంగా మారిపోవచ్చు. అలా అన్నమాట ఎదురు పెట్టి చదరంగం ఆడ్డం అయిపోతుంది బతుకు," అంది లీల.

మళ్లీ నిశ్శబ్దం.

అరవింద హఠాత్తుగా ఏదో తోచినట్టు చూపుడువేలు పైకెత్తి, "మార్పు సుందరంగారిలో కాదు. మీకు ఆయనగురించి ఉన్న అభిప్రాయంలో. మారింది ఆయన కాదు, మీదృష్టి మారింది," అంది.

తెల్లబోయేను. లీలవేపు చూసేను. లీల నాకెందుకు తోచలేదూ అది అన్నట్టు చూసింది అరవిందవేపు!

లీల మళ్లీ తనలోకంలోకి వెళ్లిపోయి, తనలో తను మాట్లాడుకుంటున్నట్టు చెప్పసాగింది.

"ఈదేశం, ఈ వాతావరణం ఎంత కొత్తగా అనిపించిందో చెప్పలేను. చాలాకాలం అసలు ఇదంతా కల అనుకున్నాను. ఏదో ఓ సమయంలో తెలివొచ్చేసి, హమ్మయ్య అయిపోయింది అనుకుంటాను అనుకున్నాను. బహుశా ఇక్కడ ప్రతీదీ వింతగానో మనపద్ధతులకి విరుద్ధంగానో కనిపించడంచేతనేమో. పాలూ, నీళ్ళూ రుచులు వేరు. కూరలదేమిటో ఎక్కళ్ళేని తీపి. గాలీ, వెలుగూ, మన్నూ, మిన్నూ, చెట్టూ, చేమా ... అన్నీ మనకి భిన్నంగానే ఉన్నాయి. అదొక వింత అనుభూతి.

ఇండియాలో నావయసువాళ్ళందరూ అమెరికా వెళ్ళాలని తెగ ఆరాటపడుతుంటే ఏమిటో ఈపిచ్చి అనుకునేదాన్ని. పెళ్ళికి ముందు సుందరంతో ఆమాట అన్నాను కూడా. తీరా వచ్చి చూసేక మాత్రం అలా అనుకోలేకపోయేను. అసలు ప్రతి ఒక్కళ్లూ ఈ ఒక్క అనుభవంకోసం అమెరికా కాకపోతే మరోటి - ఏదో ఒక దేశం - వెళ్ళి ఓ ఆర్నెల్లు దేశాంతరవాసం చెయ్యాలనే అనిపించింది. లేకపోతే మనవాళ్లకి నూతిలో కప్పల్లా ఉండిపోయి ప్రపంచంలో మరోదేశం ఉందనీ, వాళ్ల అలవాట్లూ, ఆలోచనలూ వేరుగా ఉంటాయనే ఆలోచన తోచదు. మరో దేశం ప్రత్యక్షంగా చూసి అనుభవిస్తే కానీ మనకి ఆ దేశంగురించి ఉండే అపోహలు పోవు.

మనకి అమెరికనులంటే మూస అభిప్రాయాలు ఉన్నాయి. అమెరికనులకి కూడా మనం అంటే అంతే కదా. మీకూ తెలిసే ఉంటుంది, ఊరికే చెప్తున్నా కానీ. నేనూ అలాటి అపోహలతోనే వచ్చేను. ఈ ఊరికి ఆ ఊరెంత దూరమో ఆ ఊరికి ఈ ఊరూ అంతే దూరం. ఈ భూమ్మీద అడుగెట్టేక కానీ తెలీలేదు వాస్తవం ఎంత వేరుగా ఉంటుందో. అయితే మరి ఆ వాస్తవం ఏమిటి అన్నది మాత్రం ఇంకా తేల్చుకోలేదు.

వీళ్ళందరికీ ఇండియా అంటే ఉన్న అభిప్రాయాలు అన్నీ పుస్తకాల్లోనూ సినిమాల్లోనూ చూసి తెలుసుకున్నవే. అంచేత వాళ్ళ ప్రశ్నలు వాటికి తగ్గట్టుగానే ఉంటాయి. మొదట్లో ఓపిగ్గానే జవాబు చెప్పేను కానీ రాను రాను విసుగేయడం మొదలయింది. తరవాత వీళ్ళకి మన సంస్కృతిగురించి ఎలా చెప్పడమా అన్న ఆలోచన వచ్చింది. నేనేదైనా అడిగితే వీళ్ళు ఆ పుస్తకం చదువు ఈ పుస్తకం చదువు అని చెప్పేసి తప్పుకుంటారు. మామూలుగా ఏ విషయంమీదైనా ఉపన్యాసాలివ్వడం తక్కువే. నేనూ అంతే చేయాలి అనుకున్నా. అయితే పుస్తకాలు అని కాక కథలు చదవమన్నాను. అలాగే వీళ్ళగురించి తెలుసుకోవాలన్న యావ కూడా నాకు ఎక్కువే. అంచేత వీళ్ళెవరైనా పలకరిస్తే నేను కూడా ఉత్సాహంగానే మాటాడేదాన్ని

అది నాతత్వం కాకపోయినా. నాలో వచ్చిన మొదటిమార్పు అదే అనుకుంటా. ఇండియాలోనే ఉంటే ఎవరితో గానీ నేను మాట కలపడం అన్నదే లేదు!

మా పక్కవాటాలో ఉన్న ఒకమ్మాయి, నాన్సీ అని, నెమ్మదిగా పరిచయం అయింది. ఒక రోజు బజారుకి తీసుకెళ్తాను రమ్మంటే వెళ్ళేను. అంతకుముందు సుందరం తీసుకెళ్ళినా నాకేమీ తలకెక్కలేదు. అంచేత మళ్ళీ అంతా కొత్తే. అది చాలనట్టు వీళ్ళ భాషొకటీ. మనం దేశంలో నేర్చుకున్న ఇంగ్లీషుకీ వీళ్ళ ఇంగ్లీషుకీ పోలికే లేదు. వీళ్ళ ఉచ్చారణ, నసుగుతున్నట్టు మాటాడ్డం, ఏదీ స్పష్టంగా పలకరు.

ఇంతకీ ఆరోజు నాన్సీ బజారుకి తీసుకెళ్ళిందా. ఏదో కొన్నాను. నాకు ఇంకా ఈ క్వార్టర్లు, నికెలులూ అలవాటు కాలేదు. నేనింకా రూపాయలూ, నయాపైసల్లోనే ఉన్నాను. ఆ షాపువాడికి నాలుగు డాలర్లు కాటోటు ఇచ్చేను. మరో నికెలు, అన్నాడు. నేను తెల్లబోయి నాచేతిలో చిల్లరా, అతని మొహమూ మార్చి మార్చి చూస్తున్నాను. నాన్సీ నాచేతిలో నికెలు తీసి అతనిచేతిలో పెట్టొచ్చు కదా. ఊహు, అదేం లేదు, నవ్వుతూ నిలుచుంది. అలా పావుగంట భాగోతం అయేక, నావెనకనున్న మరోమనిషి నాచేతిలో నికెలువేపు వేలు పెట్టి చూపుతూ అది అంది. అదే మనదేశంలో అయితే, ఆపని మన పక్కనున్నవాళ్ళు వెంటనే చేసేవారు కదా అనుకున్నాను. మొదట వీళ్ళకి చొరవ తక్కువేమో అనుకున్నాను కానీ తరవాత చాలామందిని చూసేక అర్థమయింది, అలా చొరవగా ఇలా చెయ్యి, అలా చెయ్యి అని చెప్పడం మర్యాద కాదు. నీతెలివితేటల్ని చులకన చేయడం అది.

ఇది నాకు అంత త్వరగా తెలీలేదులెండి. మరో అనుభవం కూడా అయేక ఆలోచించడం మొదలుపెట్టేను. మనలో చాలామంది ఎవరో ఒకరు చేస్తారులే అని ఎదురు చూస్తూ కూర్చుంటారు. ఇక్కడ అలా కాదు. ఎవరూ ఎవర్నీ పని చేసి పెట్టమని అడగరు. అడగరని కాదు కానీ చాలా చాలా తక్కువ. చిన్నవిషయం కానీ పెద్ద విషయం కానీ నీకు కావాలిసింది నువ్వే పూనుకుని సాధించుకోవాలి.

ఓసారి నేను కూరలబజారులో లైనులో నిల్చున్నాను. నా బండీలో చాలా సామానే ఉంది. నావెనక ఒకావిడ ఉంది రెండు పొట్లాలతో. అది చూసి, రెండే కదా అని ఆవిడని ముందుకి వెళ్ళమన్నాను. వెంటనే ఆవిడ, ఏం నేను ముసిలిదాన్ననా? నావంతు వచ్చేవరకూ ఆగే ఓపిక నాకుంది అంది. నేను గతుక్కుమన్నాను, ఎంత చిన్నవిషయానికి తప్పు పడతారో అనిపించింది. అంటే అందరూ అలాగే అని కాదు కానీ, మన జాగ్రత్తలో మనం ఉండడం మంచిది.

అదే ఆవిడే నన్ను ముందు వెళ్ళనిస్తావా అని అడగొచ్చు. అలా జరిగిన సందర్భాలు కూడా ఉన్నాయి. అందుకే నాకు ఇదంతా అయోమయంగా అనిపిస్తోంది."

లీల తన తొలి అనుభవాలు నెమరేసుకుంటోంది. అరవిందకి అది అంతగా నచ్చలేదేమో, "మీరు మీ సంసారంసంగతి వదిలేసి ఊరివాళ్లసంగతులు మాటాడుతున్నారు," అంది.

లీల ఉలికిపడి చిన్న నవ్వు నవ్వి, "ఆఁ, అవును కదూ. ఏమిటో నీలాగే నాకూ బోలెడు సందేహాలు. అలా వచ్చేసేయి మాటలు," అంది.

"మనదేశంలో అత్తారింటికెళ్ళడం పేరూ, మరోదేశంలో అత్తారిల్లు లేదు. కాపురానికెళ్ళడం అనాలి. అది పేరూ అని చెప్తున్నారనుకుంటా," అన్నాను నేను. దేశకాలపరిస్థితులు - వీటి ప్రభావం ఒక మనిషి దృక్కోణాలమీదా వ్యక్తిత్వంమీదా జీవనవిధానంమీదా కూడా బలంగా ఉంటుంది. మనుషుల్ని అనేకరకాల మార్పులకి లోను చేస్తుంది అని నేను కూడా చాలాసార్లు అనుకున్నాను మరి.

లీల నావేపు చూస్తూ అవునన్నట్టు తలూపింది. "మనదేశంలో అత్తారింటికి వెళ్ళినప్పుడు ఆ ఊరూ, ఆ మనుషులూ కొత్తే అయినా కొత్తగా అనిపించదు. ఆ పసుపుతాడు బలం అలాటిది. నాభర్త, నాఅత్తమామలు, నాఆడబిడ్డలు, నామరిది ... అంటూ అదోరకం మమత్వం అత్తారింట అడుగెట్టిన తక్షణమే ఏర్పడిపోతుంది. దేశం విడిచి బయటికి వచ్చినప్పుడు అలా కాదు. ఆ అత్తమామలు, మరుదులు, ఆడబిడ్డలూ ఎవరూ ఉండరు. తనవాడు అనిపించుకోగలవాడు భర్త ఒక్కడే. అతడు ఎంతో హుషారుగా భార్యని ఊళ్ళో తెలుగవాళ్ళకీ, తదితర స్నేహితులకీ పరిచయం చేస్తాడు కానీ ..." అంటూ లీల ఆగిపోయింది.

"మీరు ఇప్పుడు నన్ను మరింత అయోమయంలో పడేశారు," అంది అరవింద.

"కాదులే. నువ్వు ఈదేశంలో ఉన్నావు కదా. పైగా మీఅమ్మానాన్నా, విషి వాళ్ళ అమ్మానాన్నా అందరూ ఇక్కడివాళ్ళే కనక నీకు ఆ బాధ ఉండదు," అంది లీల.

"లేదు లెండి. ఇందాకా మీరన్నారు చూడండి ఇక్కడి తెలుగువాళ్ళతో మాటాడుతుంటే ఏదో వెలితి అని. మాకుటుంబం, విషికుటుంబం ఇక్కడున్నా వాళ్ళకి మన సంస్కృతీ, సాంప్రదాయాలవిషయంలో కూడా పట్టుదలలు బాగానే ఉన్నాయి. ముఖ్యంగా నేను ఆడపిల్లననీ, వాళ్ళబ్బాయి మగపిల్లవాడనీ, ... ఇంకా నాధర్మాలూ, వాళ్ళసంస్కృతీ

సంప్రదాయాలూ ... ఇలా చాలా ఉన్నాయి లెండి," అంది అరవింద. ఆసంగతులు తలుచుకుంటే ఆఅమ్మాయికి ఉత్సాహం అణగారిపోతున్నట్టుంది.

నాకేం చెప్పాలో తోచలేదు. "ఇవాళ్టికి చాలిద్దాం. ఇప్పటికే చాలా మాట్లాడుకున్నాం," అన్నాను.

ఇద్దరూ అవునన్నట్టు తలలూపేరు.

000

లీల, అరవింద వెళ్లిపోయేక చాలాసేపు వాళ్లనిగురించి ఆలోచిస్తూ ఉండిపోయేను. వీళ్లిద్దరూ శతకోటి లింగాల్లో మరోలింగం అన్నట్టు కాక గుంపులో విడిగా నిలబెట్టినట్టు కనిపిస్తున్నారు. లీలలో ఒకరకమైన తాత్త్వికచింతన. అరవింద వయసుకి మించిన ఆలోచనలతో బట్టలదుకాణంలో పట్టుచీరెలమధ్య సాదా నూలుచీరెలా, పగడాలదండలో కొలికిపూసలా విడిగా కనిపిస్తోంది. అదేనేమో విషిని ఆ అమ్మాయివేపు ఆకర్షించింది కూడా. అలా అయితే విషికి తనలో కొరత ఏదో కూడా తెలిసి ఉండాలి. అలా అయితే అతన్ని మెచ్చుకోవలసిందే!

నా ఆలోచనలు అలా గజిబిజి సాగుతూండగా, లీలనీ అరవిందనీ చాలాసార్లు కలిసేను, విడివిడిగానూ, జమిలిగానూ.

000

సాధారణంగా ఏవిషయాన్నైనా లీల తేలిగ్గా తీసుకుంటుంది. అమెరికా రాగానే హఠాత్తుగా అంతా తలకిందులైంది. ఒడ్డున కూర్చుని ఎగసిపడే అలలని చూస్తున్న చిన్నదాన్ని రెక్క పుచ్చుకు ఒక్కఊపున బంగాళాఖాతంలోకి విసిరేసినట్టు గందరగోళంగా అయోమయంగా ఊపిరి సలపనట్టు అయిపోయింది లీలకి.

అమెరికాలో అడుగెట్టగానే సుందరం అమెరికన్ బతుకులో అనుపానులు చక్కగా పక్కనుండి నేర్పేడు లీలకి. వంటింట్లో విద్యుత్ పొయ్యి, గిన్నెలు, కత్తులూ ఉపయోగించే మెళుకువలు బోధించేక బజారుకి తీసుకెళ్ళేడు. కాఫీ Star Bucks, అరటిపళ్ళు Sproutsలో తాజా పళ్లు, ఇండియన్ స్టోరులో కూరలు ఇలా ఒకొకటీ విడమర్చి చెప్తుంటే పదో తరగతి గుర్తొచ్చింది ఆవిడకి. ఇక మిగతా పచారీసామగ్రికీ అమెరికన్ దుకాణం ఉంది కానీ ఇన్ని దుకాణాలు తిరగాలి కనక కారుంటే బాగుంటుందని కారు కొనిచ్చేడు.

అతను అంత చక్కగా అంత శ్రద్ధగా ప్రతివిషయం వివరించడం లీలకి నచ్చింది. "నాఅంచనా తప్పులేదు. సుందరం నిజంగా ఎదటివారి మంచిచెడ్డలు, కష్టసుఖాలూ పట్టించుకునే మనిషి" అనుకుంది సంతృప్తితో.

అంతకంటే ఆనందం కలిగించిన విషయం ఊళ్లో తెలుగువాళ్ళు. అట్టేమంది లేరు. తెలుగు కుటుంబాలు నాలుగే కానీ మరో నాలుగు కుటుంబాలు ఉద్యోగరీత్యా పరిచయమైన ఇతర రాష్ట్రాలవారు. 60వ దశకంలో వచ్చినవాళ్లనుంచీ నిన్నా మొన్నా దిగినవారివరకూ ఉన్నారు. 60లు దాటిన దంపతులనుండీ కొత్తగా చదువుకోడానికి వచ్చిన విద్యార్థులవరకూ అన్ని వయసులవారూ అన్నిరకాల అనుభవాలు కలవారు ఉన్నారు.

లీల వచ్చి రెండు వారాలైనా తిరక్కుండానే ఊళ్లో తెలుగువాళ్లు వరసగా భోజనాలకి పిలవడం మొదలుపెట్టేరు.

మొదటి వారం నాయుడిగారింట్లో. వాళ్లు 60వ దశకంలో వచ్చేరు. ఆయన ప్రొఫెసరు. సత్సంప్రదాయాలు క్షుణ్ణంగా ఎరిగినవారు.

ఆరోజు ఆరు కుటుంబాలు వచ్చేయి. భార్యాభర్తలు, పిల్లా మేకా, ఒంటరి విద్యార్థులూ అంతా ఇరవైదాకా ఉన్నారు.  లీలకి ఎవరితో ఏం మాటాడాలో తెలీలేదు. ఒకరిద్దరు సుందరంగారి భార్యా? అనో కొత్తగా వచ్చారా? అనో అడిగి, దాటుకుపోతూంటే లీలకి అయోమయం అయింది. ఓ మూల సోఫాలో ఒదిగి కూర్చుని వాళ్ళని గమనించసాగింది.

కొంచెం ఆలస్యంగా ప్రవేశించిన రాజుగారిని చూసి లేచి నిలబడింది ఒక అమ్మాయి. "నాలాగే కొత్త కాబోలు" అనుకుంది లీల.

“ఏం సుందరం, ఎక్కడా కనిపించడంలేదు ఎంత కొత్త పెళ్ళికొడుకువైతే మాత్రం,” అంటూ చనువుగా కుర్చీ లాక్కుని, అతనిచేతిమీద చెయ్యేసి కబుర్లలోకి దిగింది మరో అమ్మాయి. బహుశా ఈదేశం వచ్చి చాలాకాలం అయిందేమో.

మరో అమ్మాయి ట్రేలో వైనూ, జూసూ తీసుకొచ్చింది.

రాజుగారు ముందుకి వంగి ఓ గ్లాసు అందుకున్నారు. తరవాత ఆపక్కనే ఉన్న శర్మగారివేపు తిరిగి నిలబడింది ఆ అమ్మాయి. ఆయన రాజకీయాలు మాటాడుతున్నారు రాజుగారితో. ఆ అమ్మాయి రెండు నిముషాలు చూసి, ఆయన ఎంతకీ గ్లాసు అందుకోకపోవడంతో తనే ఓ గ్లాసు ఆయనముందు బల్లమీద పెట్టి వెళ్ళిపోయింది.

“శర్మగారికి ఇచ్చినావా?” అనడిగేరు చాముండేశ్వరిగారు.

“ఎదురుగా బల్లమీద పెట్టేను,” అంది ఆ అమ్మాయి.

చాముండేశ్వరిగారు "ఆయన అట్లా తీసుకోరు" అంటూ వెళ్లి గ్లాసు చేతికి అందించి వచ్చేరు.

లీలకి ఈనాటకం విసుగేసేక, వంటింట్లోకి వెళ్లి, చాముండేశ్వరిగారితో, ”సాయం చెయ్యనా?” అంది నెమ్మదిగా.

“ఏమీ లేదమ్మా, అంతా ముందే చేసేసి ఉంటి,” అందావిడ.

“ఇన్ని రకాల వంటకాలు, ఎప్పుడు మొదలుపెట్టేరేమిటి,” అంది లీల నవ్వుతూ.

“అయ్యయ్యో, అదేమండి, అట్లెట్లౌతది. ముందు రోజు చేస్తె స్వామికి ఆరగింపు పెట్టను గాదు గద. రేత్తిరే లేచి స్నానం చేసి వొండిన,” అందావిడ.

లీల అక్కడున్న బల్లలమీదా, కౌంటర్లమీదా, పొయ్యిమీదా, ఇంకా అవెన్లోనూ ... ఎక్కడ పడితే అక్కడ కనిపిస్తున్న వంటకాలు చూస్తూ అవాక్కయి నిలబడిపోయింది.

పక్కనే ఉన్న రాజేశ్వరిగారు, “మీకు తెలీదులెండి. కిందటివారం సావిత్రిగారింట్లో మీరు చూడలేదు. ఆమె మూడు కూరలు చేస్తే ఈమె నాలుగు, ఆమె రెండు స్వీట్లు చేస్తే ఈమె మూడు,” అంది స్వరం బాగా తగ్గించి.

లీలకి పాతకాలపు సినిమా చూస్తున్నట్టు ఉంది కానీ సరదాగా తెలుగువాళ్లతో కాలక్షేపం చేస్తున్నట్టు లేదు ఆపూట.

ఆ తరవాత మరో మూడు ఇళ్ళలో భోజనాలయేక, లీలకి తాను ఎంత కొత్త ప్రపంచంలోకి వచ్చిందో అర్థమయింది. అమెరికాదేశం ఒక్కటే కాదు తనకి అర్థం కానిది, అమెరికాలో ఉన్న తెలుగువాళ్ళు అంతకి పది రెట్లు కొత్త. వీళ్లు అమెరికన్లూ కారు, ఇండియన్లూ కారు, మరో కొత్త జాతి.

లీలకి ఇండియాలో చచ్చి అమెరికాలో మళ్లీ పుట్టినట్టుంది. తప్పటడుగులతో జీవితం మళ్ళీ మొదలు అనుకుంది.

000

ముందురోజు పదిమంది కలిసేరు బ్రహ్మానందంగారింట్లో. మాటలసందర్భంలో విహారయాత్రలూ, ఉద్యోగాలు, విరమణలూలాటి చర్చలు సాగి సాగి ఆఖరికి ప్రభాస్రావు పుట్టినరోజుమాట వచ్చింది.

"ప్రభాస్, నీ పుట్టినరోజు వస్తోంది కదూ."

"ఇంకా రెణ్ణెల్లుందిలే. అరవై. రెండోజన్మ ఎత్తినట్టే."

"హాహా. అయితే షష్టిపూర్తి పప్పన్నాలు."

"అవునండి. ఘనంగా చేయాల్సిందే."

"అదేంటి?" అడిగేడు విషి.

" అంటే జీవితకాలంలో ఒక ఆవర్తి పూర్తయి మరో ఆవర్తి మొదలవుతుందని."

"అదేమిటి? అరవై ఏళ్ళకే ఒక జీవితం అయిపోయి మరో జీవితమా?"

"అలా కాదు. మన కాలమానంలో అరవై సంవత్సరాలకి 60 పేర్లు కదా. అవి ఒక చుట్టు అయి రెండో చుట్టు మొదలవుతుందని."

"అది కాదు. ఉగ్రరథుడు అన్న రాక్షసుడు అరవై నిండినవాళ్ళకి అనేక రుగ్మతలు కలిగించి ప్రాణహాని కలిగించగలడని, ఆయన్ని శాంతింపడజేయడంకోసం చేస్తారు ఆయుష్హోమం, సత్యనారాయణవ్రతం చేస్తే ఆరోగ్యం ఆయుర్వృద్ధి."

"ఉగ్రరథుడొక్కడే కాదు. ఇంకా భీమరథుడూ, విజయరథుడూ 70, 82 ఏళ్లవయసులలో రుగ్మతలు కలిగించి హాని చేయవచ్చు. వయసు పెరుగుతున్నకొద్దీ శరీరం కృశించి, దాన్ని నిర్వీర్యం చేస్తూ బాధిస్తూంటాయి కనక వాటిని తొలగించి ఆయురారోగ్యాలు ప్రసాదించడంకోసం ఈ శాంతిప్రక్రియలు చేయాలి."

"నేనవేవీ వినలేదు. మా మామగారి షష్టిపూర్తికి మళ్లీ పెళ్లి చేసేరు. 4 నెలలక్రితం మేం ఇండియా వెళ్లేం ఆ రెండోపెళ్లికి."

విషికి అది నచ్చింది, "renewal of wedding vows అని ఇక్కడ చేసుకుంటారు. అలా అన్నమాట. అలా చేదాం," అన్నాడు హుషారుగా.

ప్రభాస్రావు ఉరిమి చూసేడు కొడుకువేపు. "ఆయుష్హోమం సంప్రదాయం. అలా చేసుకుంటేనే బాగుంటుంది. జన్మానికొకసారి వచ్చే పండుగ."

అరవైయేనేమిటి? 59, 61, 36 ఏ ఏడయినా ఒకమారే కదా వస్తుంది ఒకరి జీవితంలో. హోమాలూ అవీ అంటే పెద్ద ఖర్చు. అన్న రాజేషు ఏమంటాడో? విషి ఆలోచనలో పడ్డాడు.

"అవునండి. ఆయుష్హోమమే చెయ్యాలి."

"ఇక్కడ ఎవరున్నారండి ఆ హోమాలు చేయించేవాళ్లు?"

"Chicagoనుంచో Pittlsburgనుంచో పురోహితులను పిలిపించవచ్చండి. లేదా మనమే అక్కడికి వెళ్లి కూడా జరిపించుకోవచ్చు."

"అక్కడికి వెళ్తే ఎలాగండి. మనవాళ్లందర్నీ అక్కడికీ ఇక్కడికీ రమ్మనడం ఏంబాగుంటుందీ?" అన్నాడు ప్రభాస్రావు.

ఖర్చంతా అన్నరాజేషు పెట్టుకోవలసివస్తుంది. అసలుఅన్నకి ఇలాటివి నచ్చవు. ఈమాట విని ఏమంటాడో అన్న ఆలోచనలో పడ్డాడు విష్.

శివాని కలుగజేసుకుని, "చూదాంలెండి. ఇంకా చాలా టైంముంది కదా ఇప్పటికిప్పుడు నిర్ణయించేసుకోవాలేమిటి?" అని అప్పటికి ప్రభాస్రావుని శాంతింపజేసింది.

ఆరాత్రి విషి రాజేషు ని పిలిచి సంగతి చెప్పేడు.

"ఏంటదీ, ఎప్పుడూ?" అన్నాడు రాజేషు అట్నుంచి.

విషి హుషారుగా షష్టిపూర్తి అంటే ఏమిటో తనకి అర్థమైనంతలో తనమాటల్లో చెప్పి, నాన్నకి అది కావాలనుందని తెలియజేసేడు.

లీసానడిగి చెప్తానన్నాడు రాజేషు. రెండు రోజులు పోయేక, "లీసాతో మాటాడేను. సరేనంది. ఇద్దరం వస్తాం. బాబీ 9th కొచ్చేడు కనక వాడి పాఠాలసంగతి ఆలోచించాలి. వాళ్లటీచరుని అడిగి చూస్తాను ఇంట్లో చదువుకుని పూర్తి చేయనిస్తారేమో. లేకపోతే మరో దారి చూడాలి. క్లాస్మేట్ టాం యింట్లో ఉంచుకుంటారేమోలే," అన్నాడు గబగబా.

అతను ఏ విషయాన్నయినా అనేక కోణాల్లోంచి ఏకకాలంలో పరిశీలించి పరిష్కారాలూ కనుక్కోగల ధీనిధి. తను పెద్దవాడు కనక తానే పూనుకుని చక్కగా చదువుకున్న పురోహితుడిని వాకబు చేసి కనుక్కుని, ఆ పురోహితుడు చేయించగల హోమాలూ, పూజలూ, వాటికి తాము సమకూర్చవలసిన సంభారాలూ అన్నీ కనుక్కుని చెప్తానని విషికి చెప్పేడు.

అది విషికీ, ప్రభాస్రావుగారికీ కూడా చాలా ఆనందాన్ని కలిగించింది. ముఖ్యంగా ప్రభాస్రావుగారు మనదేశం, తన చిన్నప్పటి సంప్రదాయాలూ మరొకమారు మననం చేసుకుని ఉప్పొంగిపోయేరు. పెద్దకొడుకు ఎదిగి చేతికొచ్చేడు అనుకునేది ఇలాటి సమయాల్లోనే కదా.

మొత్తంమీద ప్రభాస్రావుగారి షష్టిపూర్తి మహోత్సవానికి భారీఎత్తున సన్నాహాలు మొదలయేయి. ఆయనా, శివానీ ఇండియా ప్రయాణానికి సన్నాహాలు మొదలు పెట్టేరు. శాంతిపూజకి కావలసిన సామగ్రి కొనుక్కురావడానికీ, అక్కడ తమ బంధుమిత్రులందరికీ ఈ సమాచారం అందజేయడానికీను. ప్రభాస్రావుగారిఅక్క రామలక్ష్మికి అమెరికా చూడాలని చిరకాల కోరిక తీరేసమయం వచ్చింది. ఆవిడ వచ్చేఏర్పాట్లు కూడా చేస్తాం అన్నారు కొడుకులు పనిలో పనిగా.

ప్రభాస్రావు ఏమాత్రం ఆలస్యం చేయకుండా ఆ సాయంత్రమే తనకి ముఖ్యులు అనుకున్నవారందర్నీ ఆదరా బాదరా ఫోనులో పిలిచేసి ఇది వాగ్రూపంలో ఆహ్వానమనీ, ఇండియాలో ఆహ్వానాలు ముద్రింపించి తీసుకొచ్చేక కాయితపుఆహ్వానాలు పోస్టులో పంపుతాననీ చెప్పి ఆరోజు మరే వ్యాపకమూ పెట్టుకోరాదని ఒక్కొక్కరికీ నొక్కి చెప్పేడు.

000

విషి ఈమధ్య పెద్దక్కఅవసరాలకి ఆదుకోడం మొదలు పెట్టేక, తరుచు అరవిందకి కనిపిస్తున్నాడు. ఆ అమ్మాయి కూడా విషిదర్శనాలకి అలవాటు పడుతోంది. ఇద్దరూ అప్పుడప్పుడు కాఫీలకీ, సినిమాలకీ కలుస్తున్నారు. వాటిని డేట్ అని మాత్రం అనడం లేదు. తండ్రి షష్టిపూర్తి మహోత్సవం మిషతో అరవింద తమఇంటికి రావడానికీ, తనకి మరింత చేరువ కావడానికీ అవకాశం ఉంది. అది అతనికి మరింత హుషారునిచ్చింది.

అరవిందని శుక్రవారం పిలిచి శనివారం సినిమాకో కాఫీకో రా, నీకో మాట చెప్పాలి అని చెప్పి, ఎంతో "సస్పెన్సు" సమకూర్చి, సంగతి చెప్పడానికి ఆయత్తమవుతున్నాడు. అలా అయితే మన సంస్కృతి సంప్రదాయాలగురించి తనకి గల పరిజ్ఞానం కూడా ప్రదర్శించవచ్చునని అతని ఆలోచన.

శుక్రవారం అరవిందని పిలిచేడు.

అరవింద ఫోను తీసుకుని, చెంపకానించి, "మీ నాన్నగారి షష్టిపూర్తిట కదా?" అంది.

విషి ఉలిక్కిపడి ఫోనులోకి చూస్తూ, "నీకెలా తెలిసింది?" అనడిగేడు.

"మీ నాన్నగారే చెప్పేరు."

"సరే. ఆయన ఇంకా చెప్పలేదేమో, నేనయినా చెప్పకపోతే బాగుండదు కదా అని పిలిచేను. మరి నీకు ఆరోజు వీలేనా?"

"రెణ్ణెల్ల తరవాతిమాట కదా. ఇప్పటికి నాకు తెలిసినంతవరకూ మరే కార్యక్రమాలూ లేవు."

"రేపు సినిమాకి వెళ్దాం రాకూడదూ?"

"ఊఁ...మ్... చాలా ఉంది చదువుకోడానికి."

"... పోనీ, కాఫీకి రా. కొంచెంసేపు..."

అరవింద కాస్సేపు ఆలోచించి సరేనంది. పాపం, పెద్దక్కకి అంత చేస్తున్నాడు. ఏదో మనసు బాగులేనట్టుంది, పోనీ, కొంచెంసేపు ... అంతలో ఏం మునిగిపోతుంది అనిపించింది ఆ అమ్మాయికి.

మరోరోజు "మీకు ఇష్టమని బొప్పాయిపండు కనిపిస్తే తెచ్చేనండీ," అంటూ విషి ప్రవేశించేడు.

"ఎందుకు బాబూ, నీకు శ్రమ. నీచదువూ, నీ వ్యాపకాలూ నీకుంటాయి కదా," అంది పెద్దక్క, పండు అందుకుంటూ.

అరవింద పెద్దక్క పక్కన కూర్చుని భగవద్గీత చదువుతోంది. విషిని చూసి చిన్నగా నవ్వింది.

"ఫరవాలేదండీ. బొప్పాయిపండు ఒంటికి మంచిది. మీతో మాటాడ్డం నాకు సరదాగా ఉంటుంది. మిగతావారితో పోలిస్తే మీరు చాలా వేరుగా ఉంటారు. మావాళ్ళతో నాకు తల తిరిగిపోతోంది," అన్నాడు విషి.

లీల రాత్రికి కూర తరుగుతోంది కొంటరుదగ్గర నిలబడి. అతనివేపు చూసి తల ఊపింది, కనీ కనిపించనంత చిన్నగా.

"ఎలా జరుగుతున్నాయి షష్టిపూర్తి సన్నాహాలు?" అనడిగింది అరవింద.

"బాగానే జరుగుతున్నాయి," అన్నాడు విషి. అతనికేమంత ఉత్సాహంగా ఉన్నట్టు లేదు. అది అరవిందా, పెద్దక్కయ్యా దృష్టి దాటిపోలేదు.

ఆమాటే అరవింద అడిగేసింది కూడా. "ఏంటా నీరసం?"

విషి పెద్దక్కవేపు తిరిగి, "అది కాదండీ. నేనూ, అన్నయ్యా చేస్తున్నాం కదా ఏర్పాట్లన్నీ. అసలిక్కడ surprise party ఇస్తారు. ఎంత సరదాగా ఉంటుందో. ఈ ఏర్పాట్లు మాకు వదిలేయవచ్చు కదా. మేమిద్దరం ఇది కేవలం కుటుంబానికే పరిమితం చేద్దాం, బాగా దగ్గరవాళ్లని నాలుగు కుటుంబాలని పిలుద్దాం అనుకున్నాం. పెద్ద ఎత్తున ఆర్భాటం చేస్తే,

ఆత్మీయంగా మాటాడుకోడానికి ఉండదని. మానాన్నగారేమో వీళ్ళని పిలవకపోతే బాగుండదు, వాళ్ళని పిలవకపోతే ఎలా, వీళ్ళేం అనుకుంటారో, వాళ్ళకి కోపం వస్తుందేమో అంటూ వందకి పెంచేరు అతిథులని. దాంతో, ఇంట్లో పెట్టడానికి వీలవదని హోటలు చూస్తున్నాం. మేం ఒక హోటలు మాటాడేం. మర్నాడు మాతో మాట మాత్రమైనా చెప్పకుండా ఆయన మేం ఏర్పాటు చేసిన హోటలు రద్దు చేసేసి, మరో పెద్ద హోటలులో ఏర్పాటు చేసేరు. అలా ప్రతీదానికీ ఆయన అడ్డు పడుతూ ప్లాను మార్చేస్తుంటే ఎలా చెప్పండి," అని ఆగేడు విపి.

పెద్దక్క చిన్నగా నవ్వి, "ఆయన నాతరంమనిషి. మాతరంవాళ్లు ఆలోచించే తీరు వేరు. మీతరంవాళ్ళ తీరు వేరు. నీలాగే ఆయనక్కూడా ఆరోజు ఘనంగా జరగాలని ఉంది, అంతే," అంది.

"నిజమేనండీ, కానీ ఏదో సమయంలో మాఆలోచనలు కూడా లెక్కలోకి తీసుకోవాలి కదా. నిన్న కంప్యూటరుమీద 4 గంటలసేపు కూర్చుని శుభలేఖ తయారు చేసేను. ఆయనఅభిప్రాయం అడిగితే, ప్చ్ అని చప్పరించేసి, ఇండియాలో మంచి ఆర్టిస్టులున్నారు, వాళ్ళచేత తయారు చేయిస్తానన్నారు."

"పోనీలే. అది ఆయనషష్టిపూర్తి కదా."

"అందుకే కదా ఆయనసలహా అడిగేను. ఇలా కాదు, అలా అంటూ ఏవో సలహాలిస్తే నాకూ సంతోషంగా ఉంటుంది కదా."

పెద్దక్క పెదవి విరిచి, తల పంకించి ఊరుకుంది. ఆవిడ ఏం చెప్తుందో అని ఎదురు చూస్తూ కూచున్నారు విషీ, అరవిందా.

వంటింట్లో లీల నిదానంగా ఒక్కొక్క ముక్కే తరుగుతూ ఓ చెవి ఇటు పారేసి వింటోంది.

4 నిముషాలు ఊరుకుని, పెద్దక్క నెమ్మదిగా మొదలెట్టింది, "మీతరంవాళ్ళకి ప్రతీదీ మాటల్లో స్పష్టం చేసేయాలి. అలా ఎవరైనా చెప్పేస్తే మీకేదో అంతా తెలిసిపోయినట్టు తృప్తి పడిపోతారు. అంతే కానీ మనుషులతత్వాలు చిత్రమైనవీ, సంక్లిష్టమయినవీ అని తోచదు. విషీ, నీ ప్రశ్నకి నేను సమాధానం చెప్పలేను కానీ నాకు తెలిసిందనుకో, నేను నాజీవితంలో చూసింది అనుకో చెప్తాను. అది నీకు పనికొస్తుందో లేదో నాకు తెలీదు. కనీసం ఆ క్రమంలో నువ్వు కూడా ఆలోచించుకుంటావేమో అని.

చెప్పేను కదా ఎవరి స్వభావం కానీ అర్థం చేసుకోడం అంత తేలిక గాదు. సైకాలజీ, సైకియాట్రీ అంటారు కానీ అవన్నీ సిద్ధాంతాలే. వాస్తవజీవితంలో ఇదమిత్థమని చెప్పడానికి కుదరదు. ఏ ఒక్కరి స్వభావం తీసుకున్నా అది మరొకరి స్వభావంలా ఉండదు. అలాటప్పుడు మూకఉమ్మడి సిద్ధాంతాలు ఎలా పనికొస్తాయి? సైకాలజిస్టులయినా సుమారుగా ఇలా ఉంటుంది అని చెప్తారు కానీ ఖచ్చితంగా నూటికి నూరుపాళ్లూ అదే అక్షరసత్యం అని కాదు. మీనాన్నగారు ఇక్కడికొచ్చి 40 ఏళ్లు కావచ్చు కానీ ఆయనసంస్కృతి కొన్ని తరాలనాటిది. ఆయన అట్టే మారలేదు. పైకి మారినట్టు కనిపించినా అంతరాంతరాల, అట్టడుగు పొరల్లో వెనకటి స్వభావం వెన్నాడుతూనే ఉంటుంది నీడలా. నువ్వే ఆలోచించు. ఆదిమానవులనాటి నుంచీ గుంపుగానూ ఒకొకరుగానూ బతుకు సుఖతరం చేసుకోడంకోసమే నియమాలు విధించుకున్నారు. అవి ఎలా ఎవరు చేసేరో పండితులు పుస్తకాలు రాసిఉండొచ్చు. అవన్నీ నాకు తెలీదు. సదా పుస్తకాలు చప్పరించి ఉమ్మేసే మీకే తెలియాలి. నేను చెప్తున్నది కేవలం నేను చూసినలోకం ఆధారంగానే.

వేదాలూ, పురాణాలూ, ధర్మశాస్త్రాలూ వచ్చేవేళకి, ఈ నియమాలకి కొంత స్పష్టత ఏర్పడింది. వాటిల్లో ముఖ్యమైనది జ్ఞానానికి పెద్ద పీట వేయడం. జ్ఞానం అంటే కొందరు మేధావులు తమ అనుభవాలని, భావాలనీ కూడగట్టి, ప్రోది చేసి, ఒక సిద్ధాంతం తయారు చేయడమే కదా. వాటిని మిగతావారికి పంచిపెట్టేరు. అంటే వారికి తెలిసింది తెలియనివారికి చెప్పేరు. ఆ జ్ఞానాన్ని ప్రజలు శ్రద్ధగా విన్నారు. ఆ జ్ఞానులయందు భక్తిభావం పెంచుకున్నారు. ఇక్కడ తమాషా ఏమిటంటే అలా జ్ఞానాన్ని ప్రసాదించేవారియందు అందిపుచ్చుకున్నవారు భక్తిభావం కలిగి ఉండాలని చెప్పింది కూడా ఆ జ్ఞానులే. ఆ సూత్రం అంగీకరించడం జరిగింది ఏదో ఒకకారణంగా. క్రమంగా తల పండిన పెద్దలందరికీ సంక్రమింపజేసేరు. అంటే వయసు పెరిగినకొద్దీ అనుభవాలు కూడా ఎక్కువ అవుతాయి అని నిర్ధారణ చేసేసేరు ఎవరో. ఎక్కువ అనుభవాలు అంటే ఎక్కువ జ్ఞానం. ఇలా ఒకదానికొకటి ముడి పెట్టి పెద్దలంటే పిన్నలకి భక్తీ, గౌరవం ఉండాలన్న ప్రతిపాదన ఏర్పడింది. మన పురాణాలనిండా ఈ భావం అనేకరూపాల్లో కనిపిస్తుంది. అందుకు ప్రతిగా పిన్నలయందు పెద్దలకి ఆదరాభిమానాలు ఉండాలన్నారు. ఇలా ఒకరకం సమతూకం సాధించడానికి ప్రయత్నం జరిగింది.

ఇప్పటికీ ఎక్కడో అక్కడ ఎవరో ఒకరు అనడం వినే ఉంటావు మాతాత చండశాసనుడనీ, మాఅమ్మమ్మ గట్టిగా ఉరిమి చూస్తే మేం గడగడలాడేవాళ్ళం అనీ అనడం. ఇంతకీ నేను అనేదేమిటంటే ఈ ఆచారం – పెద్దలు తమ అనుభవాలు ఆధారంగా పిల్లల్ని సన్మార్గంలో

పెట్టడానికి పూనుకోడం – కొన్ని వేల ఏళ్ళగా వస్తున్న ఆచారం. అది మారుతోంది కానీ చాలా చాలా నిదానంగా. మీ ముత్తాతలకున్న ధాష్టీకం మీ తాతకి ఉండకపోవచ్చు. మీనాన్నగారికి అందులో ఆవగింజంతైనా ఉండకపోతుందా?" అని పెద్దక్క ఆగింది.

విషి గట్టిగా ఊపిరి పీల్చి వదిలేడు, "ఎక్కడ మొదలు పెట్టి ఎక్కడికి తీసుకొచ్చేరండీ? మొత్తం మానవాళి తత్వం అంతా మూణ్ణిముషాల్లో తేల్చేసేరు. మానాన్న నామాట గౌరవించడేం అని అడిగినందుకు!"

అరవింద, లీల నవ్వేరు.

పెద్దక్క కూడా నవ్వింది, "నీ సమస్య చాలా పెద్ద సమస్య అన్నట్టు నేను మాటాడకపోతే నువ్వే మళ్ళీ 'మీరు నన్ను సీరియస్ గా తీసుకోలేదు' అంటావు."

"అంటే నాసమస్య సీరియస్ కాదంటారా?"

"అది కాదు. నీధోరణిని మీనాన్నగారు అర్థం చేసుకోలేదు అనుకోడం కన్నా నువ్వు మీనాన్నగారిని అర్థం చేసుకోడానికి ప్రయత్నించవచ్చు కదా అంటున్నాను. సూక్ష్మంగా చెప్పాలంటే అనుభవం జ్ఞానానికి ప్రాతిపదిక, ముఖ్యంగా లోకజ్ఞానం. లోకజ్ఞానం వయసుతో వస్తుంది కనక వయసులో పెద్దవాళ్ళు చిన్నవాళ్లకి ఏం తెలీదనే అనుకుంటారు, అది పూర్తిగా నిజం కాదులే. మీకు, అంటే చిన్నవాళ్ళకి కొత్తగా వస్తున్న ఆలోచనలతాలూకు జ్ఞానం ఎక్కువ కదా. మరి అది పెద్దవాళ్ళకి అంత తొందరగా తలకెక్కదు. ఏతా వాతా చెప్పేదేమిటంటే, మీరే, పిల్లలే కాస్త ఓపిక పట్టి పెద్దలమాట పాటించాలి. కనీసం పాటించినట్టు నటించాలి."

విషి అరవిందవేపు చూసేడు, "నీకేమైనా అర్థమయిందా ఈ సిద్ధాంతం?"

"నేను వినే 'అవస్థ'లో ఉన్నాను కనక నాకు అర్థమయినట్టే ఉంది."

"సమస్య నీది కాదు కనక."

"పోనీ, అలాగే అనుకో. ఆఖరికి కనిపిస్తున్నదేమిటంటే మీనాన్నగారిని మార్చడం నీతరం కాదు, అంచేత ఆయనమాట ప్రకారమే కానిచ్చేయి, కనీసం ఈ షష్టిపూర్తి మహోత్సవం."

విషి నిట్టూర్చి, "సరేలెండి. ఏంచేస్తాం. ఇంక నేను కలగజేసుకోను," అంటూ లేచేడు.

అరవింద కూడా బయల్దేరింది అతనితో.

వాళ్ళిద్దరూ వెళ్ళేక, లీల, "అయితే మనుషులు మారరంటారా?" అనడిగింది. పాతప్రశ్నే.

“మారతారు. మారడం కూడా మానవసైజమే కదా. కానీ నత్తనడకలో నూరోవంతు వేగంతో జరుగుతుంది. మనమేమో మనోవేగంతోనూ, ఉన్నదానికంటే పదిరెట్లు ఎక్కువ స్థాయిలోనూ జరగాలని ఆశ పడతాం. నూటికో కోటికో ఏ ఒక్కరివిషయంలోనో సాధ్యమేమో కానీ సాధారణంగా అలాటి మార్పులు అంత తేలిగ్గా, ఘనంగా జరగనూ జరగవు, జరిగినా అంత స్పష్టంగా కనిపించవు అనే అనుకుంటా నేను," అని, సూటిగా లీలముఖంలోకి చూస్తూ, "ఇప్పుడెందుకు పాతప్రశ్న మళ్లీ?" అంది పెద్దక్క.

లీల తనలో తను గొణుక్కుంటున్నట్టు అంది, "సుందరం పిలిచేడు నిన్న రాత్రి."

లీల మాటాడలేదు.

“ప్రభాస్రావు నిన్ను పిలిచేడా?”

“పిలిచేరు.”

ఇంకా ఏమైనా చెప్తుందేమో అని రెండు నిముషాలు ఆగి, పెద్దక్క అంది, “నాతో అన్నాడు సుందరాన్ని పిలుస్తున్నాను, లీల ఏమనుకుంటుందో అని.”

"ఓహ్. ఆయనకీ సందేహం వచ్చింది కాబోలు."

"సందేహం అని కాదు కానీ ..."

“మీరేం చెప్పేరు?”

“నేనేం చెప్పగలను? నిన్నే అడగమన్నాను. నాకు సంగతులు తెలీవు కదా. అక్కడేం జరిగిందో, నువ్వెందుకు వచ్చేసేవో నువ్వెప్పుడూ చెప్పలేదు. ఇంతకీ నువ్వేం చెప్పేవు?”

“తరవాత చెప్తానన్నాను. ఆయనెవర్ని పిలుచుకుంటారో మానుకుంటారో ఆయనిష్టం. నేను పిలవమంటే పిలుస్తారా, వద్దంటే మానేస్తారా?”

“అంతేలే. అయినా ఒకే ఊళ్ళో ఉన్నతరవాత ఎక్కడో అక్కడ ఎప్పుడో అప్పుడు ఎదురుపడుతూనే ఉంటారు. ప్రభాస్రావు పెద్ద ఎత్తునే తలపెట్టినట్టుంది ఈ శుభకార్యం. ఆ కోలాహలంలో ఎవరిగొడవ వాళ్ళది. పైగా మనపద్ధతి ఉంది కదా ఆడవాళ్లంతా వంటింట్లోనూ హాల్లోనూ చేర్తారు. మగాళ్లంతా హాల్లోనో వరండాలోనో ఆసీనులవుతారు. అసలు నీకతను కనిపించకనే పోవచ్చు.”

“అది కాదండీ. సుందరం కనిపిస్తాడా లేదా అని కాదు. అంతకి పదింతలు మిగతావాళ్లు ఏమడుగుతారో, నేనేం చెప్పుకోవాలో అని. మనజనాల ప్రశ్నలూ, సలహాలూ దుర్భరం. ఏమైందీ, ఎందుకలా చేసేవూ, ఎందుకలా అన్నావూ, ఇలా అన్లేకపోయేవా, అలా చెప్పలేకపోయేవా, లాయరుతో మాట్లాడలేకపోయేవా, ఇండియా వెళ్లిపోకూడదా అంటూ చంపుకు తినేస్తారు.”

పెద్దక్కకి జాలేసింది. నిజమే. మనవాళ్లు అంతరిక్షంలోకి వెళ్ళినా ఈ అలవాట్లు మాత్రం వదులుకోరు. అంతలో ఉంది నాగరీకం.

“నిజమే. మనవాళ్లు,” అనేసి ఊరుకుంది పెద్దక్క.

“మనవాళ్ళే కాదులెండి, అమెరికన్లలోనూ చూసేను ఇలాటివాళ్ళని. ఇలాటివిషయాల్లో ఏ మార్పూ లేదు. అది ఎవరూ మాటాడరు! ఓ పక్కన సొంతవిషయం గుట్టు, నవనాగరీకం అంటారు. మరోపక్కన వీళ్ళు అడిగే ప్రశ్నలు, సలహాలూ కూడా మనవాళ్ళవరసకేమీ తీసిపోవు. అసలు ఈ privacy అమెరికాలో కొత్తగా వచ్చిందేనేమో. ఎందుకులెండి. అసలు ఏదో జవాబు చెప్పేస్తే పోలే అనుకోమంటారు. కానీ అంతటితో ఆగరు. వాళ్లకి ‘ఒస్ అంతేనా' అనిపిస్తుంది మనకి ఎంత నొప్పినా. 'టీకప్పులో తుపాను, అతన్తో చెప్పేస్తే పోయేది’ అంటూ మరో వరస తగులుకుంటారు. అంతేగానీ ఎంతో కాలం ఎన్నో చిన్న చిన్న సంఘటనలు, ఎన్నో గడ్డిపోచలు చేరి పెను వెంటితాడయినట్టు, ఆ క్షణం, గాలిబుడగలా టుప్పున పగిలిపోయే క్షణం, వస్తుంది అని గ్రహించరు. ఏ చిన్నవిషయం ఎప్పుడు మొదలయిందో, ఎక్కడ మొదలయిందో, ఎలా మొదలయిందో వివరించడం అసలు బ్రహ్మాతరం కూడా కాదు. ఇప్పుడు నేను ఓ పెద్ద గుంపులోకి వెళ్తే, పదిమంది పదిసార్లు అడుగుతారు. నేను పదిమందికి పదిసార్లు ఈ హరికతంతా చెప్పుకుంటూ కూర్చోవాలి. లేదా అందర్నీ ఓచోట చేరమని చెప్పి ఒకేసారి హరికథ పెట్టేయాలి.”

పెద్దక్కకి లీలబాధ అర్థమయింది. తాను చెప్పగల సలహా ఏమీలేదు. చిన్నగా తల పంకించింది. “వాళ్ళని పట్టించుకోకు”, “వాళ్ళకి జవాబు చెప్పకు” అని చెప్పడం చాలా తేలిక. ప్రతివారూ చెప్పేది కూడా అదే. కానీ అలా పట్టించుకోకుండా ఊరుకోడం ఎంత కష్టమో అనుభవించినవాళ్లకి తెలుస్తుంది. పచ్చిపుండు కెలికినట్టు వాళ్ళేమో మాట తేలిగ్గా అనేస్తారు కానీ అవతలిమనిషికి అదెంత నొప్పో ఆలోచించరు. మానవప్రవృత్తి విచిత్రమే కాదు విషాదకరం కూడా.

పెద్దక్క ఏదో గుర్తొచ్చినట్టు లేచి పక్కగదిలోకి వెళ్ళింది. లీల ఆలోచిస్తూ కూర్చుండిపోయింది. రాత్రి భోజనాలదగ్గర మళ్ళీ ఆ ప్రసక్తి లీలే చేసింది, "ఇందాకా సుందరం ఫోనుసంగతి చెప్పేను కదా. నన్నేం చేయమంటారో చెప్పేరు కారు."

"ఊఁ."

లీల రెండు క్షణాలాగి, "మీ చేతికట్టు తీసేసేరు. మీరేమో నన్ను ఏ పనీ చెయ్యనివ్వడం లేదు మీచేతికి వ్యాయామం కావాలని. కూరలు తరగడం, వంట చెయ్యడం, గిన్నెలు కడగడం అన్నీ మీరే చేస్తున్నారు."

"నువ్వు చేస్తానంటే చేయించుకోడం నాకేం కష్టం? నిజంగానే ఏ పని చెయ్యకుండా కూచుంటే చెయ్యి కొయ్యముక్కలా బిగుసుకుపోయి నొప్పి ఎక్కువవుతోంది. కూరలు తరిగినప్పుడూ, గిన్నెలు కడిగినప్పుడూ కొంచెం తెరిపిగా ఉంది. ఆ ఫిజికల్ థెరపిస్టేమో ఏవో వ్యాయామాలు చెప్తుంది కానీ మనం ఇలాటి నిత్యకర్మల్లో చేతికి పని అన్నమాట లెక్కలోకి తీసుకున్నట్టు లేదు. ఇంతకీ ఈమాటెందుకొచ్చిందీ ఇప్పుడు? సుందరం ఏమైనా అన్నాడా?"

"ఏదో మాటాడేడు చాలాసేపే. తరవాత ఎన్నాళ్లు వాళ్ళింట్లో ఉంటావు. వచ్చేయి అన్నాడు."

పెద్దక్క కళ్లు చిట్లించి లీలవేపు చూసింది.

"నీకిక్కడ ఏమైనా కష్టంగా ఉందా?"

లీల నవ్వింది, "మీరన్నట్టే పనేం చెయ్యొద్దంటే తీరిగ్గా తింటూ కూచోడానికేం కష్టం. మీకు నాఅవసరం లేనప్పుడు ఎందుకు ఇక్కడ ఉండడం అని. ఎంతకాలం ఉంటాను చెప్పండి."

పెద్దక్క నెమ్మదిగా కంచం తీసుకుని సింకువేపు వెళ్లింది. లీల తనకంచం తీసుకుని ఆవిడవెనకే వెళ్ళి, ఆవిడ కంచం కడుక్కుంటూంటే చూస్తూ నిలబడింది.

పెద్దక్క నవ్వింది, "ఏం, శుభ్రంగా కడుగుతానో లేదో అని అనుమానమా?"

"లేదండి. నేను మీఅంత శుభ్రంగా కడుగుతున్నానా లేదా అని ఆలోచిస్తున్నా."

ఇద్దరూ నవ్వుకున్నారు. కాస్త మనసులు తేలికయేయి.

"సరే అలా అయితే, నీకు రేపట్నుంచి పాఠాలు పెడతా. కోర్సు పూర్తి చెయ్యకుండా వెళ్ళడానికి వీల్లేదు మరి."

"హా, హా. ఎన్నాళ్ళేమిటి కోర్సు? పైగా నాకు గిన్నెలు కడగడానికి కావాల్సినంత తెలివితేటలున్నాయో లేదో పరీక్ష పెట్టకుండా కోర్సులో చేర్చుకునేస్తారా?"

"ఏం చేస్తాను మరి. మామూలుగా familiarity breeds contempt అంటారు కానీ నిజానికి ఇలా ఎదురెదురుగా కొన్నాళ్ళు ఉంటే ఆత్మీయతలు ఏర్పడడానికే ఎక్కువ అవకాశం అని నా నమ్మకం. నువ్విక్కడ నాలుగు వారాలుండేసరికి నాకు బాగా అలవాటయిపోయేవు. అంచేత నీ ఐక్యూ స్థాయిని లెక్కలోకి తీసుకోను."

"మీపనులు మీరే స్వయంగా చేసుకోవడం మీకు ఇష్టం."

"ఏమో, నాకు చిన్నప్పట్నుంచీ అదే అలవాటు. ఎవరికీ పని చెప్పేదాన్ని కాదు. నాఅంతట నేను చేసుకోగలిగితే సరి. లేకపోతే అది ఏమైనా సరే లేకుండా జరుపుకోడమే. పైవాళ్ళకి చేసేను కానీ ఎవరిచేతా చేయించుకోలేదు. అంచేతే నువ్వు చేస్తుంటే, నీకు ఇష్టమే అని తెలిసినా, మనసొప్పడం లేదు."

మళ్ళీ హాల్లోకి వచ్చేరిద్దరూ.

"ఊరికే హాస్యానికన్నాను కానీ నువ్వు మీయింటికి వెళ్తానంటే నేనెలా కాదంటాను?" అంది పెద్దక్క వెనకటి సంభాషణ మళ్లీ ముందుకి తెస్తూ.

"నాకేం తోచడం లేదండీ. అతనన్నది కూడా నిజమే. ఎన్నాళ్లుంటాను మీయింట్లో? మీరు పొమ్మనరనుకోండి. కానీ ఎవరి మర్యాదలు వాళ్ళు నిలబెట్టుకోవాలి కదా. మంచిగా ఉండగానే నేను బయట పడితే, నామర్యాద నిలుస్తుంది."

"అలా అనకు. మంచితనం ఎలాగైనా నిలబెట్టుకోవచ్చు. నీకు ఏమి కావాలన్నది ప్రధానం. సుందరం ఏమన్నాడో నువ్వు చెప్పలేదు. అతను నిన్ను రమ్మంటున్నాడు, బావుంది. మరి నువ్వు ఏమనుకుంటున్నావు? నువ్వు మాయింట్లో ఉంటే నాకేమీ ఇబ్బంది లేదు. నీయిష్టం వచ్చినన్నాళ్లు స్వేచ్ఛగా ఉండు. ఆవిషయంలో మాత్రం నీకెలాటి అనుమానాలూ అఖ్ఖర్లేదు. మళ్ళీ అతనిదగ్గరికి వెళ్ళడమే నీకు ఇష్టమయితే అలాగే, తప్పకుండా వెళ్ళు. అంతే కానీ నీకు ఉండడానికి ఇల్లు లేదని మాత్రం వెళ్ళకు. అదీ నేను చెప్పేదీ, నాక్కావలసిందీను."

ఆవిడమాటలు వింటుంటే లీలకళ్లు చెమ్మగిల్లేయి. ఇంతకాలం ఆచిపెట్టుకున్న దుఃఖం ఉప్పెనగా ముంచుకొచ్చింది.

పెద్దక్క మాటాడకుండా చూస్తూ కూర్చుంది లీల సంబాళించుకునేవరకూ.

"మీకాలంలో ఈ సందిగ్ధావస్థ ఉండేది కాదేమో. చిన్నతనంలోనే పెళ్ళయిపోడంతో ఒకరికొకరు అలవాటయిపోతారు."

"… … …"

"ఎందుకు నవ్వుతున్నారు?"

"పాతకాలపుహాస్యం ఒకటి జ్ఞాపకం వచ్చి. విన్నావా? వెనకటికెవరో 'సిగరెట్లు మానేయడం చాలా తేలిక. నేను చాలాసార్లు మానేసేను,' అన్నాట్ట."

"?"

"నేను చాలాసార్లు వదిలేసేను మావారిని."

"హోహ్హొహ్హొ. ఎలా చేసేరేమిటి?"

"పన్నెండోయేటే పెళ్ళయింది కదా. పధ్నాలుగేళ్ళకి కాపురానికెళ్ళేను. పుట్టిల్లు పొరుగూరే. అరణాలు బస్సు ఛార్జీలు. చీటికి మాటికి పుట్టింటికి పోతానంటూ బస్సెక్కేసేదాన్ని."

"మీ అత్తవారూరుకున్నారా?"

"చెప్పేను కదా చిన్నతనం. మొదట్లో కొంతకాలం మాఅమ్మో, అన్నయ్యో బుద్ధి చెప్పి మళ్ళీ తీసుకొచ్చి అత్తారింట్లో దిగబెట్టేవారు. ఆతరవాత కొన్నాళ్ళు మాఆయనే వచ్చి బతిమాలి తీసుకెళ్ళేరు. సుమారు ఓ ఐదారేళ్ళు అలా గడిచిందేమో. ఆ తరవాత మాఅమ్మ పోవడం, మానాన్నగారు మంచాన పడ్డం, అటు అత్తారింట్లో అత్తగారికి ఓపిక తగ్గడం – వీటన్నిటితో నాకు బాధ్యతలు అర్థమయి కుదురుగా కాపురం చేసుకోడం మొదలు పెట్టేను."

"హుమ్. అదీ మెచ్చదగ్గమాటే."

"ఏది?"

"అదే, మీకు పోవడానికి పుట్టిల్లుంది. మీఅమ్మా, అన్నయ్యా, అత్తగారూ మొత్తం ఇంట్లో పెద్దలు కలగజేసుకుని కాపురం నిలబెట్టేరు."

"అదీ అంత తేలిగ్గా కుదరలేదులే. మాఅమ్మ పోయింతరవాత మానాన్నగారు నన్ను అత్తవారింటికి తీసుకొచ్చి, ఇంక మీరే దానికి తల్లీ, తండ్రీ అన్నీను, మీరే చూసుకోవాలమ్మా అంటూ నన్ను మాఅత్తగారికి ఒప్పగించి వెళ్లిపోయేరు."

"అప్పటికి మీకెన్నేళ్ళుంటాయేమిటి?"

"ఇరవైలు దాటేయి. కానీ అక్కడితో అయిపోలేదు. నాకు బుద్ధి కుదిరి నేను స్థిరపడేవేళకి మాఆయనకి వొచ్చేయి ఎక్కడలేని అలవాట్లూను. మిడిల్ స్కూల్లో ఉద్యోగం వదిలేసి, బొంబాయిలో బిజినెస్ అనీ, మద్రాసులో సినిమాలనీ ఇంట్లో చెప్పీ చెప్పకా ఉడాయించేసేవారు. ఆయనగారు నానగలు ఒలుచుకుపోవడం, మావదిన పునిస్త్రీ బోసిచేతులతో ఉండడమేమిటని మళ్ళీ గాజులూ, గొలుసులూ చేయించడం, ఆయన మళ్ళీ అవి ఊడ్చుకుపోవడం – ఇలా కొంతకాలం అయింది. మామామగారు పోయేవరకూ అలా జరిగింది. ఆయన పోతూ, పోతూ నాచేత ప్రమాణం చేయించుకున్నారు.  వాళ్ళబ్బాయికి స్థిరం లేకపోతే నాకయినా ఉండాలనీ, కాపురం నిలబెట్టుకోడం నాచేతుల్లోనే ఉందనీ, ఆడది ఇంటికి మూలస్తంభంలాటిదనీ, ఆడదానికుండే ఆత్మబలం మొగాళ్ళకుండదనీ ... ఇలా ఏవేవో చెప్పి నేను మాఆయన్ని వదిలి పెట్టి పోనని మాట తీసుకున్నారు."

"బాగానే ఉంది మీకథ. మీమామగారు  స్థిరంలేనివాడితో కాపురం చేసుకోమని మీకు చెప్పడంవేమిటి, తన కొడుక్కి చెప్పాలి గానీ. మరి మీకు అనిపించలేదా ఆయన తనకర్తవ్యం మీమీద రుద్దేస్తున్నారని?"

"అదే మరి. మీకూ మాకూ – అంటే అదే మీతరంవాళ్ళకీ నాతరంవాళ్ళకీ తేడా. నీ ప్రశ్న మీతరంలో వచ్చింది. మాతరంలో మేం అలా తోచలేదు మరి."

"పంతానికి చేసేరా?"

"పంతం అనుకో, పట్టుదల అనుకో, ఆనాటి సంప్రదాయం అనుకో. ఆనాడు జరిగినసంగతి అది. అప్పట్లో అది తప్పని నాకు అనిపించడంలేదు."

"నేనూ ఓ మనిషినే. మనిషిగా నన్ను గౌరవించలేని మనిషితో కాపురం ఎలా చేస్తాను అని మీకు అనిపించలేదంటే నాకేం అనాలో తెలీడంలేదు."

"నేనూ ఓ మనిషిని అని అనుకునే చేసేను. ఓ మనిషిగా నాకాపురం నిలబెట్టుకోగల బలం నాకుందని అనుకుని చేసేనేమో. ఒకరకంగా ఋజువు చేసుకున్నాను కూడా. అసలు ఇవన్నీ

మాటల్లో చెప్తుంటే వింతగా ఉంది, నాకే వింతగా వినిపిస్తోంది. అప్పట్లో మాత్రం మాకు అదంతా నిత్యజీవితంలో భాగం. అంతే."

"మీమామగారు మిమ్మల్ని brainwash చేసేసారు," అంది లీల కొంటెనవ్వుతో.

పెద్దక్క నవ్వింది, "ఏవో ఘనాపాఠీ గ్రంథాలే చదివినట్టున్నావు," అంటూ. "సరేలే. నామాట ఒదిలెయ్. నీతరంవాళ్ళకి ఇంట్లోవాళ్ళు ఏం చెప్పినా పనికిరాదు. అది మీ స్వవిషయం, ఇతరులు జోక్యం కలగజేసుకోరాదు అంటారు. మీ వ్యక్తిత్వానికేదో పెద్ద ద్రోహం జరిగిపోయినట్టు. మళ్ళీ ముక్కూ మొహం తెలీని థెరపిస్టులతో చెప్పుకుంటారు గంటకి రెండొందలిచ్చి."

లీల మాటాడలేదు.

మళ్లీ పెద్దక్కే అడిగింది, "మీరు వెళ్లేరా?"

లీల కొంచెంసేపు ఊరుకుంది. తరవాత అంది మెల్లిగా అంది, "అదీ అయింది. చేసేరా అని 'రా' పెట్టకండి. తను 'నాకే తెరపీలు అఖ్ఖర్లేదు. నీకే అవసరంలాగుంది. నువ్వెళ్ళు' అన్నాడు."

"?"

లీల అవునన్నట్టు తలూపింది.

పెద్దక్క ఏమయిందని అడగలేదు. ఎందుకు అడగడం? కనిపిస్తూనే ఉంది, అనుకుంది మనసులోనే నిట్టూర్చి.

OOO

ప్రభాస్రావు, శివానీ ఇండియాకి బయల్దేరేరు. వెళ్ళేముందు, రాజేషు మూడు వేలిచ్చేడు షష్టిపూర్తికి కావలసిన సంభారాలు కొనడానికి. "చాలదేమో, మరో రెండు వేలియ్యి," అన్నాడు ప్రభాస్రావు.

"చాలదంటారా? డాలరుకి 8 రూపాయలు. మన లెక్కప్రకారం అది సరిపోవాలి, చూడండి," అన్నాడు రాజేషు.

"ఇదేఁవేనా మళ్ళీ మళ్ళీ వచ్చే శుభకార్యమా? నాజీవితంలో ఇదే కదా పెద్ద కార్యం. డబ్బుకి మొహం చూసుకుంటావా?" అన్నారాయన చిరాగ్గా.

“అది కాదండీ, మళ్ళీ ఇక్కడ కూడా ఖర్చులు ఉన్నాయి కదా. చూడండి. అక్కడికి వెళ్ళేక, సరిపోకపోతే ఏదో ఏర్పాటు చేస్తానులెండి.”

ప్రభాస్రావు చిరచిరలాడుతూ అక్కడ్నుంచి లేచిపోయేడు. పక్కగదిలో ఉన్న శివానితో, “చూసేవా నీకొడుకు ఘనకార్యం. వీడికి చదువు చెప్పించి, ఇంతవాడ్ని చేసినందుకు కృతజ్ఞత ఉండఖ్ఖర్లేదూ? మనబతుకుల్లో వచ్చే ఒఖ్ఖ శుభకార్యానికీ ఖర్చుకి మొహం చూసుకుంటున్నాడు” అన్నారాయన ధుమధుమలాడుతూ. “మానాన్నగారు లేరు కానీ ఉంటే ఇంతకి పదింతలు చేసేవాణ్ణి కానా?”

“పోనిద్దురూ. వాడితాహతుకి తగ్గట్టు వాడు చేస్తున్నాడే కానీ అస్సలు చెయ్యననలేదు కదా. ఈకాలంలో ఈదేశంలో ఉన్నవాడు. అంతకంటె మనం ఆశించకూడదు. ... అసలైనా అడుగులోనే హంసపాదు. ఇంకా ఏదీ మొదలయినా కాలేదు. ఆదిలోనే మనం రచ్చ చేస్తే ఏం బాగుంటుంది,” అని ఆయన్ని సమాధానపరచడానికి చూసిందావిడ.

ప్రభాస్రావు పోనివ్వలేదు. విమానం ఎక్కేలోపున పెద్దకొడుకు డబ్బుకి మొహం చూసుకుంటున్నాడని ఊళ్ళో ఒకరిద్దరి స్నేహితులతో అనకుండా ఉండలేకపోయేడు.

000

ప్రభాస్రావు ఇండియాలో బంధుమిత్రులనీ పిలిచి తన షష్టిపూర్తి సందర్భంగా ఇండియా వస్తున్నాననీ, తనకుమారులు అమెరికాలో షష్టపూర్తిఉత్సవం ఘనంగా జరపడానికి నిశ్చయించేరనీ, ఈవిషయం తనకి ఎంతో గర్వంగా ఉందనీ తెలియజేసేడు.

ఇండియాలో దిగేక, ఎక్కడెక్కడి పరిచయాలూ పునరుద్ధరించుకుని వాళ్ళందరికీ తెలియజేసేడు తనపుత్రులు జరపబోతున్న శుభసుందర్భంగురించి. పెద్దకొడుకు తనకి పుష్కలంగా డబ్బిచ్చి కావలసిన సంబారాలన్నీ కొనుక్కురమ్మన్నాడనీ, డబ్బుకి వెనుదీయవద్దని పదే పదే చెప్పేడనీ కూడా వాళ్ళందరికీ నొక్కి నొక్కి చెప్పేడు.

విశాఖపట్నంలో ప్రభాస్రావుకి ఆత్మీయుడయిన వరాహనరసింహం, “మేం అమెరికా రాలేం కనక ఇక్కడ మాశక్తికొద్దీ చిన్న షష్టిపూర్తి చేస్తాం,” అన్నాడు ఉత్సాహంగా.

ప్రభాస్రావు రవంత మొహమాటపడి, “ఎందుకులెద్దూ నీకు శ్రమ,” అన్నాడు.

వరాహనరసింహం, “శ్రమేంవుంది. కనీసం అలాగేనా మన పాత స్నేహితులనందర్నీ మరోమారు కలవొచ్చు,” అంటూ మరింక ప్రభాస్రావుని మాటాడనియ్యలేదు.

వీళ్ళుండేది రెండు వారాలే కనక ఇక్కడ రెండు రోజులుండి, మూడోరోజు బయల్దేరి మద్రాసు, హైదరాబాదు వెళ్ళి చీరెలూ, నగలూ కొనుక్కురావడానికీ, ఈలోపున వరాహనరసింహం విశాఖలో వీలయిన ఏర్పాట్లు చెయ్యడానికీ నిశ్చయమయిపోయింది. ఆయనే ఓ వేదపండితుడిని పట్టుకుని ఆనాటికి ఎనిమిదోరోజు సకల శుభలక్షణాలూ కలిగిన మంచి రోజు ఉందనిపించేడు.

ప్రభాస్రావు సంతృప్తిగా తల పంకించి, “చూసేవా నా స్నేహితులు. నేనంటే ఎంత అభిమానంవో,” అన్నాడు శివానితో.

ఆవిడ కూడా ఆనందం వెలిబుచ్చింది.

బజారుకి బయల్దేరేముందు, “వెండి ఆవులు ఒక్కొక్కటి సుమారుగా ఎంతుంటాయేమిటి?” అనడిగేడు.

“ఆవులంటే చెప్పలేను కానీ విఘ్నేశ్వరుడూ, వెంకటేశ్వరస్వామి వెండి రేకులమీద ముద్రలు చూసేను. ఐదారు వేలుండొచ్చు. ఎన్ని కావాలేమిటి?” అనడిగేడు భాస్కర్రావు.

“ఆహ్వానాలు నూటయాభై వరకూ పంపుతున్నాం. కనీసం వందమందయినా వస్తారని మాఆశ.”

“అందరికీ ఇస్తావా?”

“ఒకొకటి ఐదారువేలవుతుందంటే, మనం తెచ్చిన సొమ్ములో సగం వీటికే అయిపోతుంది,” శివాని అంది హెచ్చరికగా.

భాస్కర్రావు ఇప్పుడే వస్తానంటూ పక్కగదిలోకి వెళ్ళిపోయేడు.

“అయితే ఏం. కావలిస్తే మళ్ళీ పంపుతానన్నాడు కదా. లేదంటే నా డబ్బు ఖర్చు పెడతాను. చెప్పేను కదా మనజీవితంలో జరిగే పెద్ద పండుగ, పెళ్ళంత సంబరం.”

“అది కాదండీ. బాగా దగ్గరవాళ్ళకి ఓ పదిమందికి ఇద్దాం. మిగతావారికి వేరే చూద్దాం.”

“చీరెలు ఎవరెవరికి పెడదాం అనుకుంటున్నావు?”

“మీ అక్కగారికి మంచి కంచి పట్టుచీరె పెట్టాలి. అక్కడ ఉన్నవాళ్ళు సిరిగారికీ, పెద్దక్కగారికీ, లీలకీ పట్టు చీరెలు పెడితే బాగుంటుంది.”

“లీలకెందుకూ? వంటలక్కకి పట్టుచీరె హా హా కాకిముక్కుకి దొండపండు,” ప్రభాస్రావు గలగల నవ్వేడు తన చమత్కారానికి తానే మురిసిపోతూ.

శివాని తృళ్ళిపడి ఆయనవేపు చురుగ్గా చూసింది. ఆ హాస్యానికి జుగుప్స కలిగింది ఆవిడకి. ఈయనగారికి ఎదుటిమనిషిని తీసిపారేస్తూ మాటాడ్డం అలవాటే అని తెలిసు కానీ లీలగురించి ఇంత హీనంగా మాటాడగలరని అనుకోలేదు ఆవిడ. అంతో ఇంతో పరిచయం ఉన్న మనిషి, కష్టాల్లో ఉన్నమనిషినిగురించి అలా అనడం దారుణం. “అదేం మాట. అయినింటి ఆడబడుచు. పరువు గల కుటుంబం. ఈనాటికి ఒక కష్టం వచ్చింది. అదీ ఎక్కడో వంట చేయడం కాదు. పెద్దక్కగారికి అవుసరం. సాయం చేస్తున్నారు. ఆవిడది అంత నికృష్టపుబతుకు అనుకుంటే, అసలెందుకు పిలవడం?” అందావిడ రుసరుసలాడుతూ.

“ఏం, ఉన్నమాటే కదా అన్నాను."

"అవును ఉన్నమాటే. అసలు వంట అంటే అంత తేలికేమిటి మీకు? ఇంటికి రండి. నాలుగు రోజులు చప్పిడిపిండీ మాడుపెచ్చులూ వడ్డిస్తే తెలుస్తుంది వంటవిలువా, వంట చేసేవారి విలువాను."

"ఏదో మాటా మాటా వచ్చిందే అనుకుందాం. మనకి మాత్రం రాడం లేదేమిటి కోపాలూ, తాపాలూ. అంతమాత్రాన మొగుణ్ణి వదిలేసిపోవడమేనా?” అన్నాడు ప్రభాస్రావు కరుగ్గా.

శివానికి ఇప్పుడు తెలిసింది సంపూర్ణంగా లీలవిషయంలో ఆయనగారి కోపకారణం. తెలిసినతరవాత మాట పొడిగించడానికి ఆవిడకి మనసొప్పిలేదు. పొడిగించినకొద్దీ మరిన్ని అవాచ్యాలే వినవలసి వస్తుంది.

ప్రభాస్రావు ఏదో నోటికొచ్చినమాట అనేసేడు కానీ ఇల్లాలికి అంత కోపం వస్తుంది అనుకోలేదు. “సరేలే. ఏదో అన్నాను కానీ ఏదో ఒకటి తెముల్చు ఏ చీరె ఎవరికో,” అన్నాడు మాట మారుస్తూ.

“తేల్చడానికేంవుంది. అయినా ఇక్కడ ఊరికే చూడ్డమే కానీ కొనడం మద్రాసులో అన్నారు కదా,” అందావిడ లేస్తూ.

మరో గంటయేక, కాఫీలు అయేక, వరాహనరసింహం వాళ్ళిద్దర్నీ ప్రముఖ బజారుకి తీసుకెళ్ళేడు శుభలేఖలు ఎంచుకుని ముద్రింపించడానికి ముగ్గురు ఆర్టిస్టులని సంప్రదించి, మూడో ముద్రణాలయంలో పని ఒప్పజెప్పి అయిందనిపించుకున్నారు. ప్రభాస్రావు తిరిగి వెళ్ళిపోయేవాళకి అవి తయారవాలంటే, మరో ఐదు వందలు ఎక్కువ అవుతుందన్నాడు ఆర్టిస్టు. ప్రభాస్రావు సరేనని చెప్పి అనుకున్న రోజుకి మాత్రం ఇచ్చితీరాలని గట్టిగా చెప్పి ఇంటికి బయల్దేరేరు.

"మద్రాసుకి వెళ్తున్నారు సరే కానీ ఎలాగా బజారులోనే ఉన్నాం ఇక్కడ కూడా చీరెలూ, నగలూ ఎలా ఉన్నాయో చూడరాదూ," అన్నాడు వరాహనరసింహం.

OOO

మద్రాసులో ప్రభాస్రావు కాలేజీమిత్రుడు భాస్కర్రావింట్లో దిగేడు. అతని మనస్ఫూర్తిగా ప్రభాస్రావుని అభినందించేడు.

"నీక్కూడా నిండి ఉండాలే అరవై. నాకు చెప్పేవే కావు, ఫొటోలు చూపించు, కనీసం అవైనా చూసి ఆనందిస్తాను," అన్నాడు ప్రభాస్రావు.

"లేదులే. మాయింట్లో ఆనవాయితీ లేదు. పైగా నాకు ఒంట్లో అంత బాగుండడంలేదు కూడాను," అన్నాడు భాస్కర్రావు.

"బాగులేదంటే ఏంటయిందేంటి? బాగానే కనిపిస్తున్నావు."

భాస్కర్రావు నీరసంగా నవ్వేడు, "అదే మరి, కనిపించని రోగాలు. గుండెదడ. డాక్టరు విశ్రాంతి కావాలంటాడు. ఎక్కడ విశ్రాంతి. అబ్బాయిలిద్దరూ, అమ్మాయిలిద్దరూ ఎంతసేపూ వాళ్ళగొడవలే కానీ ఇంటిసంగతీ, వ్యాపారంసంగతీ పట్టించుకోరు. నేనొక్కణ్ణీ చూసుకోలేక ఛస్తున్నాను."

"అదే మరి. అరవై దాటుతూనే ఉగ్రరథుడు అనే రాక్షసుడు మనకి ఇలాటి శారీరకబాధలు కలిగించి మృత్యువాత పడేస్తాడట. ఆయనవాత పడకుండా తప్పించుకోడానికి శాంతి పూజ చేయించాలని శాస్త్రం. ఏదో మంచిరోజు చూసి కనీసం పార్థసారథిగుడిలో శాంతిహోమం చేయించు," అన్నాడు ప్రభాస్రావు.

"చూద్దాంలే. చెప్పేను కదా మావాళ్ళకి ఇలాటివాటిలో నమ్మకాలు లేవు."

"అదేమిటి, నేను చెప్తానుండు. ఏదీ మీ పెద్దాడ్ని పిలు."

"పోన్లెద్దూ. ఎందుకొచ్చిన గొడవ. వాళ్ళతో పేచీలు పెట్టుకోడం నాకిష్టంలేదు. నువ్వూరుకో," అన్నాడు భాస్కర్రావు. ప్రభాస్రావు ఉత్సాహం చూస్తుంటే అతనికి మనసులో ఏమూలో తనకి కూడా అలా జరిగితే బాగుండు అనిపించింది కానీ జరగదు.

వెండి, బంగారం దుకాణానికి వెళ్ళేరు. ధరలు మండిపోతున్నాయి. ఇవాళ ఉన్న ధరలు రేపు ఉంటాయన్న నమ్మకం  లేదు. ఊళ్ళోనే ఉన్న భాస్కర్రావు ఆశ్చర్యపోయేడు. ఇంక శివానిమాట చెప్పనే అఖ్ఖర్లేదు. ప్రభాస్రావుకి ఆ ధరలు ఎప్పుడూ తెలీదు కనక అతనికి అన్నీ ఒక్కలాగే ఉన్నాయి. పైగా చేతినిండా డబ్బుతో వచ్చేడు కనక అతనికి చీమ కుట్టినట్టయినా లేదు.

చీరెలదగ్గర యథాప్రకారం భార్యాభర్తలకి ఏకాభిప్రాయం కుదరలేదు. కొట్టొచ్చినట్టు పెద్ద పెద్ద బుటాలున్న బెనారెస్ పట్టు చీరెలూ, జానెడు జరీ అంచు వెంకటగిరి చీరెలు, పొందూరు ఖద్దరు చీరెలూ తీస్తారాయన. అంత హడావుడిగా ఇప్పుడెవరూ కట్టడం లేదంటుందావిడ, అందులోనూ అమెరికాలో.

"మన తాహతుకి తగినట్టుండాలి కదా. వాళ్ళు పెద్ద పెద్ద బహుమానాలు తెస్తే మనం కంటికానని సాదా నూలు చీరెలు పెడితే వాళ్ళేం అనుకుంటారు?"

"కాలేజీలకి వెళ్లే ఆడపిల్లలు చీరెలేం కడతారు? వాళ్ళకి సల్వార్ కమీజులు కొందాం."

"ఎంబ్రాయిడరీ బ్రొకేడ్ కొందాం. ఘనంగా ఉంటుంది."

"మరీ అంత కొట్టొచ్చినట్టుంటే ఏం బాగుంటుంది. కాస్త మామూలుగా ఉండేవయితే చిన్నచిన్న పార్టీలకి వేసుకుంటారు సరదాగా."

మొత్తంమీద మూడు రోజులపాటు ఎనిమిది దుకాణాలు తిరిగి చీరెలూ, సల్వార్ కమీజులూ కొనడం అయిందనిపించేరు. మగవారికి తరగతులవారీగా ఖరీదైనవీ, మధ్యస్తం అయినవీ షెర్వానీ, కుర్తాలు కొన్నారు. తరవాత నగల దుకాణాలకి వెళ్లి, అతిథులందరికీ ఇవ్వడానికి కావలసిన పట్టు సంచీలు, వాటిలో పెట్టివ్వడానికి వెండి గోవులు, కుంకుమ భరిణలు, అద్దాలూ, దంతపు దువ్వెనలాటివి కొన్నారు. వీటిలో తరతమ తరగతులు లేవు. హమ్మయ్య.

వాళ్ళిద్దర్నీ చూస్తూ భాస్కర్రావు, "హ్మ్. డాలర్లు," అనుకున్నాడు.

భాస్కర్రావు పైకి అనకపోయినా, అలా అనుకునే అవకాశం ఉన్నట్టు పసిగట్టిన ప్రభాస్రావు, "మా పెద్దవాడు మరీ మరీ చెప్పేడు, డబ్బుకి వెనుదీయకండి. మీకు కావలసినవన్నీ కొనండి అని," అన్నాడు.

శివాని ఆయనవేపు అర్థవంతంగా చూసి మొహం పక్కకి తిప్పుకుంది. అమెరికాలో మిత్రులతో కొడుకు డబ్బుకి మొహం చూసకుంటున్నాడు అన్నది కూడా ఈయనే మరి.

ఇంటికొచ్చేసరికి తొమ్మిదయింది. భాస్కర్రావు భార్య కనకమ్మ వంట పూర్తి చేసి, రాగానే, "రండి, ఇప్పటికే ఆలస్యం అయిపోయింది, భోజనాలు చేసి మాటాడుకుందురు గానీ," అంటూ బల్లమీద కంచాలూ, వంటకాలూ సిద్ధం చేసింది.

"ఏంటండీ ఇంత పెద్ద పని పెట్టుకున్నారు. ఏదో ఓ కూరా, చారూ చేస్తే సరిపోను," అంది శివాని బల్ల నిండా పరుచుకున్న పదార్థాలు చూస్తూ.

"ఏం వంటకాల్లెండి. ఏదో పాయసం, గారెలే కదా. రాక రాక వచ్చేరు. అందులోనూ షష్టిపూర్తి అంటున్నారు. మరో రెండు రోజులుంటే నలుగురిని పిలిచి పండుగ చేద్దుం అని మావారు కూడా నొచ్చుకున్నారు."

తింటున్నంతసేపూ కనకమ్మగారి వంటలు తెగ మెచ్చుకున్నాడు ప్రభాస్రావు. వంకాయకూర అద్భుతం అన్నాడు. కందిపచ్చడి అమోఘం అన్నాడు. పాయసం ఇంత రుచిగా ఉంటుందని తెలీదన్నాడు. పులిహోర రుచి నాలుకమీద నాలుగు నెలలవరకూ ఉంటుందన్నాడు. శివాని తలొంచుకుని వింటోంది. కనకమ్మగారికి కూడా అది కొంచెం అతిగానే అనిపించింది. ఆవిడ ఏదో పని ఉన్నట్టు లోపలికి వెళ్లిపోయింది.

శివాని గొంతు బాగా తగ్గించి ఆయనకే వినిపించేట్టు అంది, "ఇక్కడ ఓ ఆర్నెల్లుండి వంటలు నేర్చుకు రానా?"

ప్రభాస్రావు అవిడవేపు కోరచూపులు చూసేడు.

ఆయన లీలగురించి అన్నమాట శివానిమనసులో ఇంకా చిటపటలాడుతూనే ఉంది. ఇష్టం అయితే మృష్టాన్నం, పంచభక్ష్యపరమాన్నాలు. లేకపోతే వంట, అంతే! కనకమ్మ అన్నపూర్ణ. లీల వంటలక్క!

భోజనాలు అయేయి. అందరూ హాల్లోకి వచ్చేరు. వాళ్ళు కొన్న బంగారం, వెండి నగలు చూపిస్తూ శివాని మండిపోతున్న ధరలూ, వస్తువుల నాణ్యతగురించి మాటాడుతుంటే, కనకమ్మ అంది, “నాచిన్నప్పుడు మాఅమ్మ కంసాలి వీరాచారిని ఇంటికి పిలిపించి నగలు చేయించేది. అతను చిన్న కొలిమీ, కమ్మెచ్చు అవన్నీ సంచీలో వేసుకు వచ్చి మాఅరుగుమీద కూచుని, బంగారం కరిగించి, కమ్మచ్చులో పోసి సాగ్గొడుతుంటే చూడ్డానికి నాకు భలే సరదాగా ఉండేది. అలా కళ్ళముందు ఆయన నగలు చేస్తుంటే బంగారం కల్తీ చెయ్యడానికి ఆస్కారం ఉండదని. కానీ మాఅమ్మ నవ్వేది."

“నవ్వెందుకూ? నిజమే కదా అలా నిఘా వేసి ఉంచడం అవుసరం.”

“ఎందుకంటే మాఅమ్మ ఆయనకి కాఫీ ఇచ్చేది. ఆయన పని చేస్తూ కబుర్లు చెప్తూ ఎప్పుడు కాఫీ తాగేసేవాడో మేం ఎప్పుడూ కనిపెట్టలేకపోయేం. అందుకు మాఅమ్మ అనేది. చూడు మనం అక్కడే కూచున్నాం. అతను ఎప్పుడు కాఫీ తాగేసేడో చూడనే లేదు. మరి అతనికి బంగారం కల్తీ చెయ్యడం ఏం కష్టం అని”

శివాని కూడా నవ్వింది. “నిజమే. ఆరోజుల్లో నమ్మకాలు అలాటివి. మేం కూడా అలాగే విశాఖపట్నం మెయిన్ రోడ్డుమీద నగలకొట్లో ఏదైనా కొంటే. ఆ పక్కనే రెండు కొట్లకవతల ధర్మకాటా ఉండేది. అక్కడికెళ్ళి నగ పాళా బంగారం అవునో కాదో చూపించి, కొనేవాళ్లం. ధర్మకాటావాడికీ ఈ నగలకొట్టువాడికీ ఏ సంబందం లేదంటారు కానీ ఒకేరకం వ్యాపారంలో ఉన్నవాళ్ళు ఆమాత్రం సంబంధాలు పెట్టుకోకుండా ఉంటారేమిటి? వాళ్ళిద్దరూ కుమ్మక్కయి, మోసం చేస్తారేమో అని అనుకునేవాళ్ళం కానీ మళ్ళీ కొనడానికెళ్తే అదే వరస.”

మర్నాడు పొద్దున్నే లేచి, స్నానాలూ, టిఫిన్లూ అయేక, ప్రబాస్రావు, శివాని దంపతులు బయల్దేరబోతుంటే, వారిద్దరినీ సోఫాలో కూచోమని చెప్పి, భాస్కర్రావు దంపతులు వాళ్లిద్దరికీ తాంబూలం, చీరె, రవికలగుడ్డ, సూటుగుడ్డలు  ఇచ్చేరు. ఇవన్నీ ఎందుకండీ ఇప్పుడు అంటూనే ఇద్దరూ పుచ్చుకున్నారు.

రైలెక్కుతూంటే, ఇద్దరికీ కళ్ళు చెమర్చేయి. భాస్కర్రావు మళ్ళీ వచ్చినప్పుడు వారంరోజులు ఉండేలా చూసుకు రమ్మని మరీ మరీ చెప్పేడు. అలాగే, తప్పకుండానూ అంటూ ప్రభాస్రావు వాగ్దానం చేసి శలవు పుచ్చుకున్నాడు.

000

చీరెలబేరంవేళ ప్రభాస్రావు లీలని అంత తీసిపారేసినట్టు మాట్లాడ్డం శివాని మనసులో ముల్లై కెలుకుతూనే ఉంది. ఆయనగారు ఒక మనిషిని అటు నెత్తినెక్కించుకోడానికీ ఇటు కాల రాచేయడానికీ సమర్థుడే అయినా అంతో ఇంతో పరిచయం ఉన్న మనిషిని, మనవాళ్ళు అనుకున్న మనిషిని, పరువుగా బతుకుతూ మంచి రోజులు అనుభవించిన మనిషిని అలా ఈసడించి పారేయడం శివానిమనసుకి గట్టిగా తగిలింది.

అమెరికాకి తిరిగొచ్చేక లీలని ఓమారు పిలిచి మాటాడితే బాగుండును అనిపించింది. షష్టిపూర్తికి సుందరం రావడం ఖాయం. తమకి దూరపు బంధువయిన మహాకవిగారు వస్తున్నారు. షష్టిపూర్తిపేరుతో వీసా సంపాదించి అమెరికా పర్యటించడానికి అవకాశంకోసం చాలాకాలంగా ఎదురు చూస్తున్నారాయన. ప్రభాస్రావు ఆయన్ని పిలిచిందే తడవు, "అయ్యో, చిన్నప్పట్నుంచీ నిన్ను ఎరుగుదును. నువ్వు షష్టిపూర్తి చేసుకుంటుంటే చూడకుండానా? తప్పకుండా వస్తాను. నీమీద పద్యాలు రాసి తీసుకొస్తాన"ని మాటిచ్చేరాయన. ఆయనకోసం సాహిత్యసభ ఏర్పాటు చేస్తానని సుందరం మాటిచ్చేడు.

శివానికి ఇన్ని ఆలోచనలూ ఝుమ్మని లేచేయి తల్లో లీలమాట గుర్తు రాగానే. ఒక క్షణంపాటు, "నీకు కష్టం అనిపిస్తే రాకు, నేనేం అనుకోను," అని చెప్దాం అనుకుంది. ఆఖరికి ఏదో ఓటి మాటాడొచ్చులే అనుకుంటూ పిలిచింది.

లీలే ఫోను తీసి, "హలో" అంది.

"లీలేనా," అనడిగి, "నేనమ్మా, శివానిని."

"ఓ శివానిగారా? బాగున్నారా? ఇండియానుంచి ఎప్పుడొచ్చేరండీ?"

"వారం రోజులయిందమ్మా. ఎప్పటికప్పుడు పిలుద్దాం అనుకుంటూనే అలానే అయిపోతోంది."

"అవున్లెండి, jetlag, ఇంటికి రాగానే పేరుకుపోయిన పన్లూ … ఊళ్ళో మూడువారాలు లేకపోతే చాలానే ఉంటాయి కదా."

పది క్షణాలపాటు నిశ్శబ్దం. ఆవిడ ఎందుకు పిలిచిందో లీలకి అయోమయంగా ఉంది. ఏం చెప్తుందో అని ఎదురు చూస్తోంది.

పిలవాలనిపించి పిలిచిందే కాని ఏం మాటాడాలో తెలీడం లేదు శివానికి.

"బాగున్నావా? నీకేమైనా కావలిస్తే అడుగు, మొహమాటపడకు," అందావిడ మళ్ళీ.

“నాకేం కావాలండీ. బాగానే ఉందిక్కడ.”

“అక్కడ నీగురించి అందరూ అడిగేరు.”

మళ్ళీ లీలకి సందేహం. ఏమని జవాబు చెప్పడం? “ఎవరడిగేరు?”

“మీ పెద్దమ్మ కోడలు, మా పక్కింటావిడ, ఇంకా ఎవరో ఏదో అన్నారు. నువ్వు బాగానే ఉన్నావని చెప్పేను.”

“మీ పక్కింటావిడా? ఎవరూ?”

“నీచిన్నతనంలో గుంటూరులో మీయింటికెదురింట్లో ఉండేవాళ్ళుట. నిన్ను తెలుసంది.”

“మ్. ఆ.. ఏమోలెండి. నాచిన్నతనంలో చాలా ఊళ్ళు తిరిగేం.”

“అంతేలే. నువ్వు ఆరోజుల్లో వాళ్ళింట్లో బాగా చనువుగా తిరిగేదానివి అంది. నీకూ సుందరానికీ పడ్డంలేదని విని చాలా బాధ పడ్డానని చెప్పింది. బాగానే ఉన్నారని చెప్పేను.”

లీల మాటాడలేదు.

ఆవిడే మళ్ళీ అందుకుని, “అన్నట్టు ఎవరో సుందరంస్నేహితుడుట రామ్మూర్తి అని. లీలేమిటి గొప్ప స్త్రీవాది అయిపోయింది అన్నారు. నాకు మాచెడ్డ కోపం వచ్చింది. అవునండీ, మేం ఏంవన్నా స్త్రీవాదులం, మీమగాళ్ళు ఏంవన్నా సాంప్రదాయం అంటూ గట్టిగా పెట్టేసేను.”

అప్పటికీ లీలకి ఏం మాటాడడానికీ తోచలేదు. కొంచెం చిరాకేసింది కూడా.

"దానికేం గానీ, షష్ఠిపూర్తి అని చెప్పడానికి పిలిచేను."

"అవునండి. ప్రభాస్రావుగారు చెప్పేరు."

"వస్తున్నవా? వస్తావనే అనుకుంటున్నాం. తప్పకుండా రావాలి."

"ఆలోచించి చెప్తానండి."

ఒక్క నిముషం నిశ్శబ్దం అవతలివేపు.

"తప్పకుండా రావాలి."

"అలాగేనండి. ఎవరో తలుపు తడుతున్నారు. తరవాత చెప్తాను, ఉంటాను మరి," అంటూ ఫోను పెట్టేసింది లీల.

శివాని, "సరే అలాగే తరవాత మాటాడదాం," అని ఫోను పెట్టేసింది. 'నువ్వు రాకపోతే నేనేమీ అనుకోను' అని చెప్పాలనుకున్న మాట నోట్లోనే ఉండిపోయింది.

లీల ఫోను పెట్టేసి, ఆలోచిస్తూ కూర్చుండిపోయింది చాలాసేపు. 'నేను రాకపోతే మీరేమీ అనుకోరు కదా' అని చెప్పాలనుకున్నమాట లీలనోట్లోనే ఉండిపోయింది. అసలు లీలకి ఆవిడ అదే చెప్పాలనుకుందేమో అని అనిపించింది.

పెద్దక్క గదిలోకి వచ్చి, "ఏమయింది? ఎవరు ఫోనులో?" అని అడిగింది లీల మొహంలోకి పరీక్షగా చూస్తూ.

"శివానిగారు."

"శివానా? ఇండియానించి వచ్చేసేరా?"

"ఆఁ, వచ్చి వారం రోజులయిందిట."

"ఏమిటిటా విశేషాలు?"

"హు, విశేషాలు, మ్. ఏమో. నాకు సరిగ్గా అర్థం కాలేదు. ఏదో చెప్పాలని పిలిచినట్టుంది. ఇండియాలో వాళ్ళూ వీళ్ళూ నాగురించి అడిగేరు అంటూ మొదలెడితే నేనే ఆపేసేను పనుందని చెప్పి."

పెద్దక్క జవాబు చెప్పలేదు. ఏముంటుంది కనక చెప్పడానికి మాత్రం? ఏం చెప్పినా తెచ్చిపెట్టుకున్నట్టే ఉంటుంది కానీ సహజంగా ఉండదు మరి.

సిరి వచ్చింది అంతలో ఏం చేస్తున్నారంటూ.

లీల లేచి, రండి అంటూ ఆహ్వానించింది ఆసమయంలో ఆవిడ రాకతో హాయిగా ఉంది. లోపలికి వెళ్ళి టీలూ, జంతికలూ తెచ్చి, వాళ్ళిద్దరిముందూ పెట్టి, తను మరో కప్పు పుచ్చుకుని కూర్చుంటూ అంది, "నాకో సందేహం. నేను, నేనేమిటిలెండి ఏ ఆడమనిషయినా నోరు విప్పితే, స్త్రీవాదం, స్త్రీవాదం అంటూ దెప్పిపొడుస్తారు. అదేమిటో నాకు మహా అయోమయంగా ఉంది. ఆఖరికి భర్తనో మరో మగవాడినో 'కాస్త మంచినీళ్లు తెచ్చిపెడుదురూ,' అన్నా స్త్రీవాదమే."

సిరి, పెద్దక్క నవ్వేరు.

లీల మళ్ళీ ఇద్దర్నీ చూస్తూ, "లేదండీ, నిజంగానే అడుగుతున్నా స్త్రీవాదం అంటే ఏమిటి? ఎలా వచ్చింది? మనకి పాశ్చాత్యులు నాగరికులనీ, వాళ్ళని అనుకరించడమే నాగరికత అనీ

గొప్పనమ్మకం ఏర్పడి రెండు వందల ఏళ్ళయిపోయింది. నాచిన్నప్పట్నుంచీ ఇంగ్లీషు మాటాడ్డం నాగరికత. తిండీ, బట్టా ఇంగ్లీషు పద్ధతుల్లో ఉంటేనే నాగరీకులం. నాకు ఇప్పటికీ గుర్తే. తిరపతిలో రోడ్డుమీద పోతూ రామాలయంముందు కొందరు చెప్పులొదిలేసి ఓమారు చెంపలేసుకుని గబగబా నడిచిపోయేవాళ్ళు. కానీ అలా చేసేముందు ఓమాటు చుట్టూ చూసేవారు. ఎవరైనా చూస్తే హేళన చేస్తారని. అంటే దైవభక్తి కూడా అనాగరితకిందే లెక్క. తీరా ఇక్కడికొచ్చేక చూస్తే వీళ్ళకున్న భక్తేమీ తక్కువ కాదు సరి కదా చూడండి, కాథలిజంపేరుతో వీళ్లు చేసే చట్టాలూ, ఆడవాళ్ళనీ, నల్లవాళ్ళనీ, చికానోలనీ, డబ్బు లేనివాళ్ళనీ చూసే విధానం. ఇవన్నీ మనవాళ్ళు మతంపేరుతో చేసే అరాచకాలకి ఏమాత్రం తీసిపోవు కదా. మనం మతంపేరుతో ఎన్ని నియమాలు విధించేమో వీళ్ళు చట్టం పేరుతో అంతకు పదింతలు నియమాలు పెడుతున్నారు. ఆ నియమాలు పెట్టగల సమర్థులు డబ్బు గలవారు," అంది లీల ఆవేశంగా.

నాగరికప్రపంచంలో సాటిమనిషిగురించి ఎంత హీనంగా మాటాడగలరో చూస్తే తల తిరిగిపోతోంది. ముఖ్యంగా ఈదేశంలో స్త్రీలప్రతిపత్తి నేతిబీరకాయ. చట్టాలయితే ఎడా పెడా చేసేస్తున్నారు కానీ నిత్యజీవితంలో చాలామంది జీవితాలు కనాకష్టంగానే ఉన్నాయి. పైగా మనదేశంలో స్త్రీలకి గౌరవం లేదని ఉపన్యాసాలు, వ్యాసాలు. ఆశ్చర్యం ఇక్కడిస్త్రీల స్థానాన్ని సమర్థించే ఆడవారు రిపబ్లికనులలో చాలామంది ఉన్నారు.

"ఏంటి కథ, ఇవాళ రాజకీయాలమీదికి పోయింది బండి," అంది సిరి నవ్వుతూ.

"ఏంటోలెండి, పన్లేకే అనుకోండి. నాకిప్పుడు మహా కుతూహలంగా ఉంది ఈ స్త్రీవాదం. దాన్నిగురించి కాస్త చెబుదురూ," అంది లీల నవ్వుతూ.

"అబ్బో, అదొక మహాసాగరం. అంత తేలిగ్గా చెప్పలేం. నాక్కూడా అట్టే తెలీదు. అడిగేవు కనక నేను గమనించింది చెప్తాను. ఆతరవాత నువ్వు పుస్తకాలు చదివీ, సుందరంవంటి ప్రజ్ఞానిధులతో మాటాడి మిగతాది తెలుసుకో. సావధానచిత్తంతో విను." అంటూ సర్దుకు కూర్చుని మొదలు పెట్టింది సిరి.

"సుమారుగా పద్దెనిమిదో శతాబ్దం మధ్యలో- అప్పటికి స్త్రీవాదం అన్నపదం వాడుకలో లేదు కానీ ఫ్రాన్సులో కార్మికులతిరుగుబాటు వచ్చింది. ఆ కార్మికులని నిరసిస్తూ Edmund Blake ఓ పుస్తకం రాసేడు. దాన్ని పూర్వపక్షం చేస్తూ, బ్రిటిష్ రచయిత్రి Mary Wollstonecraft మరో పుస్తకం Rights of Woman అని రాసి ప్రచురించింది 1790లో. ఆతరవాత మరో రెండేళ్ళకి

Vindication of Rights of Women అని మరో పుస్తకం రాసింది. సమాజంలోనూ, ఇంట్లోనూ స్త్రీలస్థానం, హక్కుల న్యాయాన్యాయవిచారణ చేస్తూ రాసిన ఈ పుస్తకం అనేకమంది మేధావులదృష్టిని ఆకట్టుకుంది. తన తండ్రి తల్లిని హింసించడం, ఆడవారిపట్ల హేయంగా ప్రవర్తించడంలాటివి ఆమె స్వయంగా చూడ్డం, పదిహేడేళ్ళకే స్వయంశక్తితో చదువుకోడం, బతుకుతెరువు చూసుకోడంతో ఆమెకి సమాజాన్నిగురించిన అవగాహన ఏర్పడింది. తన చుట్టూ ఉన్న సమాజాన్ని సూక్ష్మంగా పరిశీలించి, విశ్లేషించి స్త్రీల పరిస్థితి మెరుగుపరచడానికి ఉద్యమించింది. స్త్రీలకి చదువు, ఉద్యోగాలు, వివాహచట్టాలలో అన్యాయాలూ లాటి విషయాల్లో విశేషంగా కృషి చేసింది. అయితే మనం ముఖ్యంగా గమనించవలసినవిషయం – స్త్రీస్థానం సమాజంలోనూ, ఇంట్లోనూ కూడా ఘనమైనదే, గౌరవించదగ్గదే అని ఆమె అభిప్రాయం. దీన్ని తొలిదశ స్త్రీవాదంగా పరిగణించేరు తరవాత అంటే "స్త్రీవాదం" అన్న పేరు ప్రచారంలోకి వచ్చినతరవాత. ఈదశలో ఈ సమస్యలచర్చ కేవలం మధ్యతరగతి స్త్రీలకి మాత్రమే పరిమితమయింది, అది కూడా బ్రిటన్లోనే. ఒక దశాబ్దం తరవాత, 1900-1918 మధ్యలో మేధావంతులయిన స్త్రీలు అమెరికాలో వోటు హక్కులకోసం అలజడి లేవదీశారు. క్రమంగా ఇతర అంశాలు కూడా వారి పోరాటంలో చోటు చేసుకున్నాయి. కొంతవరకూ సాధించేరు కూడాను – ఆడవారికి పైచదువులూ, హైస్కూల్ విద్యావిధానంలో ఆడపిల్లలకి అనుగుణమైన మార్పులు, వివాహితులకి ఆస్తిహక్కులు, అలాగే దంపతులు విడిపోయినప్పుడు పిల్లల సంరక్షణలో స్త్రీలస్థానం లాటివి. వోటు హక్కులు మాత్రం మొదటి ప్రపంచయుద్ధం వరకూ రాలేదు.

వోటు హక్కులవిషయంలో మనం ప్రత్యేకంగా చెప్పుకోవలసింది ఇక్కడ ఉన్న తరతమబేధాలు. మనకి 1947తరవాత స్వరాజ్యం వచ్చేవరకూ ఓటుమాటే లేదనుకో. కానీ వోటు హక్కంటూ వచ్చినప్పుడు, అందరికీ ఆడవారికీ మగవారికీ ఒక్కసారే వచ్చింది. అమెరికాలో అలా కాదు. ముందు ఉన్నతవర్గాలలో శ్వేతజాతి స్త్రీలకి మాత్రమే వచ్చింది. ఆతరవాత క్రమంగా, స్త్రీఉద్యమాలవల్ల నల్లవారికీ, వారిలో స్త్రీలకీ, బీదవారికీ … అలా అంచెలంచెలుగా హక్కులకోసం పోరాడవలసి వచ్చింది.

రెండవప్రపంచయుద్ధం సమయంలో మగవారంతా యుద్ధరంగానికి వెళ్ళిపోయినప్పుడు, దేశంలో కర్మాగారాల్లోనూ, ఇతర వ్యాపారాల్లోనూ పని కుంటుపడడంతో స్త్రీలకి ఆ ఉద్యోగాలు ఇచ్చేరు. ఇది రెండోదశలో చెప్పుకోదగ్గ మలుపు. ఆరోజుల్లోనే స్త్రీలు ఉద్యోగాల్లో అసాధారణ ప్రతిభ చూపించి, తాము మగవారికి ఏమాత్రమూ తీసిపోమనీ, ఇంకా కొన్నిచోట్ల మగవారికంటే

మెరుగ్గానే చేయగలమనీ కూడా నిరూపించుకున్నారు. 60వ దశకంలో Betty Friedan ప్రచురించిన పుస్తకం Feminine Mystique దేశంలో సంచలనం లేపింది. "స్త్రీలకి కేవలం మాతృత్వం, గృహిణిబాధ్యతలు మాత్రమే పరిపూర్ణమయిన సంతృప్తిని కలిగిస్తాయన్నది భ్రమ" అని ఆమె వాదం. ఈకాలంలో స్త్రీలు రాజకీయాల్లో కూడా పాల్గొనడం ప్రారంభించేరు. మధ్యతరగతి స్త్రీ స్థితిగతులతో మొదలయిన ఉద్యమం దిగువతరగతి స్త్రీలసమస్యలు కూడా తీసుకుంది. దీనికి ప్రధానకారణం ఫోర్డ్ కంపెనీలో పని చేస్తున్న స్త్రీలు తమకి మగవారితో సమానంగా జీతాలు ఇవ్వాలని సమ్మె ప్రారంభించడం. ఇది జరిగింది 1968లో. అప్పటికి బెటీ ఫ్రీడాన్ పుస్తకం వచ్చి ఐదేళ్ళయింది. అది ప్రజలలో గట్టిగా ఆలోచించేలా చేసింది. క్రమంగా ఇంటా బయటా కూడా స్త్రీలకి సంబంధించిన ఇతరవిషయాలు – స్త్రీల ఆరోగ్యసమస్యలు, ముఖ్యంగా గర్భధారణకి సంబంధించిన అంశాలలోనూ తదితరవిషయాల్లోనూ స్త్రీలకి సంపూర్ణ అధికారంవంటివి ఈ ఫెమినిస్టు ఉద్యమం రెండో దశలో చోటు చేసుకున్నాయి. ఈదశలో ప్రముఖ స్థానం వహించింది గ్లోరియా స్టైనమ్ (Gloria Steinem). కాస్త విపరీతధోరణి మొదలయింది కూడా ఇక్కడే. ఈవిడపేరుమీదుగా ప్రాచుర్యంలోకి వచ్చిన ఒక వాక్యం "మగవాడిఅండ లేని ఆడమనిషి జీవితం సైకిలులేని చేపబతుకులాటిది" అన్నది. ఆ తరవాత ఆ వాక్యం తాను సృష్టించింది కాదని స్టైనమ్ చెప్పినా, స్థూలంగా మగవారిపట్ల ఆమె ధోరణివల్ల ఆ వాక్యం ఆమెదిగానే ప్రచారంలో ఉంది. ఇంతకీ స్త్రీలు తమ తిరుగుబాటుధోరణిని ఎంతవరకూ తీసుకుపోయేరో తెలుస్తుంది ఇక్కడ. ఆరోజుల్లోనే ప్రస్తుతం ప్రజలు మాటాడుతున్నది "మగభాష" అనీ, ఆడవాళ్ళకి వేరే భాష కావాలనీ వాదించేరు. Woman అన్న పదంలో man ఉందని దానికి ప్రతిగా womyn అని మార్చడంలాటివి కూడా చేసేరు. 69, 70 దశకాల్లో ఇది ఉధృతంగా సాగింది. ఆ ఊపులోనే గ్లోరియా స్టైనమ్ పెళ్ళికి విముఖత చూపింది కూడా.

క్రమంగా ఆ ఉధృతం చల్లబడి, 80లు వచ్చేసరికి ఉద్యమం మరొక మలుపు తిరిగింది. ప్రముఖ రచయిత్రి ఆలిస్ వాకర్ (Alice Walker) కూతురు రెబెకా వాకర్ (Rebecca Walker) "నేను మూడో మలుపుని" (1982) అన్న శీర్షికతో వ్యాసం రాసి గ్లోరియా స్టైనమ్ నడుపుతున్న Ms Magazine లో ప్రచురించింది. ఆ వ్యాసం అనేకమంది ప్రముఖులనీ, ముఖ్యంగా ఆనాటి యువతనీ ఆకట్టుకుంది. స్త్రీలు ఎదుర్కొంటున్న అసమానత్వం - వయసు, లింగబేధం, జాతివివక్షతలు, గే, లెస్బియన్ జీవనవిధానం, దారిద్ర్యం, స్త్రీల విద్యాస్థాయి వంటి అనేక కోణాలు ఆమె ఎత్తి చూపి, సకల రంగాల్లోనూ అందరికీ సమస్థాయి ఉండాలి వంటి అంశాలు ఈ మూడోదశ స్త్రీవాదనలో ప్రముఖంగా చోటు చేసుకున్నాయి. ఈదశలో వెనకటి ఔద్ధత్యం తగ్గి,

అందరం మనుషులమే అంటూ కొంత సమతూకంతో ఆలోచించడం కూడా మొదలయింది. ఇది అమెరికా, బ్రిటన్, యూరపులలో నడిచిన కథ.

ఈ విషయాలన్నీ కొంతవరకూ మన సమాజంలో స్త్రీలకీ వర్తిస్తాయి అనిపించినా మనకీ వారికీ ఉన్న తేడాలు కూడా మనం లెక్కలోకి తీసుకోవాలి, కేవలం హక్కులగురించే పోరాటం చేస్తే పులిని చూసి నక్క వాతలు పెట్టుకోడంలాటిదే. అసలు మనదేశంలో స్త్రీలహక్కులగురించి మరోదారిలో సాగింది."

"అయ్యో, అదేమిటండీ అలా అంటారు? కష్టం, హింస ఎక్కడ ఎవరికి ఎలా కలిగించినా తప్పే కదా," అంది లీల.

"అది కాదు నేనంటున్నది. హింస ఎక్కడయినా, ఎవరు ఎవరిని హింసించినా నేరమే. నేను అంటున్నది వ్యత్యాసాలు కూడా గమనించాలి అంటున్నాను. భౌగోళికంగా, సామాజికంగా, జనాభాదృష్ట్యా ఏర్పడిన కొన్ని సంప్రదాయాలు ఉన్నాయి మనకి. అవి కూడా మన జీవనవిధానాన్ని తీరిచి దిద్దుతాయి. ఇంతకుముందు ఒకసారి మాటాడుకున్నాం అనుకుంటా ఈవిషయాలు. మనకి కుటుంబం అంటే ఒక్క భార్యా, భర్తా, పసి పిల్లలు మాత్రమే కాదు కదా. నిజానికి బ్రిటన్లో కూడా మనసమాజంలో ఉన్నలాటి ఆనవాయితీలు పందొమ్మిదో శతాబ్దంలో కనిపిస్తాయి. జేన్ ఆస్టిన్ నవలలు చూడు. ఇరవయ్యవ శతాబ్దం తొలిపాదంలోనే మన స్త్రీలు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నారు అంటే మన స్త్రీలు అప్పటికే కొంత పురోభివృద్ధి సాధించినట్టే కదా. గాంధీకి సత్యాగ్రహం చేయాలన్న స్ఫూర్తి మన ఆడవారినుండే వచ్చింది అంటారు.

పాశ్చాత్యుల జీవనవిధానం మన జీవనవిధానం కంటె వేరు అయినా సమాజంలో హెచ్చుతగ్గులు ఉన్నాయి. అవి భిన్నంగా కనిపించవచ్చు కానీ క్రియాశీలకం కాదు. వారిబాధలు వారు ఎదుర్కొన్న విధానం మనకి ఆ క్షణానికి ఘనంగా కనిపించవచ్చు కానీ ఆచరణీయం కాదు. ఎంచేతంటే మన జీవనవిధానం వేరు. మన సామాజికపరిస్థితులు, కుటుంబపరిస్థితులు, మన వాతావరణం – వీటన్నటి ప్రభావం మన బతుకులమీద ఉంది. మన కుటుంబాలలో స్త్రీకి ఉన్న స్థానం వేరు.

ఇల్లిందల సరస్వతీదేవిగారు 'భారతనారి - నాడూ నేడూ' అని ఒక చిన్న పుస్తకం రాసేరు. పుస్తకరూపంలో ఉన్న సుదీర్ఘవ్యాసం అనొచ్చు. చారిత్ర్యకంగా వేదకాలంనుండీ ఇప్పటివరకూ మనదేశంలో స్త్రీలస్థానం ఎలా ఉండేదో, మనకాలం వచ్చేసరికి ఎలా మారుతూ వచ్చిందో అద్భుతంగా వివరించేరు సరస్వతీదేవిగారు. ఈరోజుల్లో ఏ హక్కులకోసం పోరాడుతున్నారో అవి

వేదకాలంలో ఉండేవిట. 'న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అంటూ మనువు ధర్మసూత్రం వల్లిస్తారు కానీ ఇంట్లోనూ సమాజంలోనూ శ్రుతి, స్మృతులలో ప్రవచించిన సూత్రాలగురించి మాటాడరు మనవాళ్లు. వేదకాలంలో స్త్రీలు విద్యావంతులు, యాజ్ఞవల్క్యుడు స్త్రీలకి ఆస్తిహక్కులు, దత్తత తీసుకునే అధికారం ఉన్నాయంటాడు. అసలు అంతకుముందే కౌటిల్యుడు క్రీ.పూ. 4వ శతాబ్దంలోనే స్త్రీలు వివాహం రద్దు చేసుకోవచ్చునని నిర్ణయించేడు. కొన్ని ప్రత్యేక పరిస్థితులలో పునర్వివాహానికి కూడా వీలు కల్పించేడాయన.

అసలు "వివాహసంస్థ విషయంలో కూడా పాశ్చాత్యులకీ మనకీ కొండంత తేడా ఉంది. వాళ్ళది విషయలోలుత పురస్కరించుకుని ఏర్పడ్డది. భారతదేశంలో ధర్మము మూలహేతువు," అంటారు సరస్వతీదేవిగారు. విషయలోలుత అంటే భౌతికం అన్న అర్థంలో కావచ్చు. వాళ్లకి వివాహం తను, భార్య, పిల్లలకి పరిమితం. మనకి వివాహం మూడుతరాలకి విస్తరించింది. సామాజికధర్మం కూడా. సంఘసంక్షేమవిషయంలో కూడా గృహస్థుడికి బాధ్యత ఉంది. వివేకానందుడు ఉపన్యాసాలలో మనకీ పాశ్చాత్యులకీ దృష్టిలో తేడాగురించి చెప్తూ, 'మీరు స్త్రీని స్త్రీగా చూస్తారు, మేం స్త్రీని తల్లిగా పూజిస్తాం' అంటాడు అందుకే.

మధ్యకాలంలో మహమ్మదీయులకాలంలో స్థితిగతులు మారేయి ఆనాటి అరాచకాలమూలంగా. అసలు ఏ శాస్త్రాలయినా ఆయా కాలాల్లో పరిస్థితులనిబట్టి ఏర్పడతాయి కదా. మనకి స్వాతంత్ర్యం వచ్చేక రాజ్యాంగచట్టాలు తయారు చేసినప్పుడు స్త్రీలహక్కుల ప్రసక్తి వచ్చింది కానీ న్యాయం జరగలేదు. దానికి సరస్వతీదేవిగారు చెప్పిన కారణం ఆ చట్టాలు చేసినవారికి మనసంస్కృతిలో వేదకాలంనుండి స్త్రీలకి ఉన్న హక్కులగురించిన అవగాహన లేకపోవడం అంటారు. ఇంగ్లీషు చదువులు చదువుకున్న పండితులకి వేదకాలంలో స్త్రీలస్థానంగురించి తెలుసుకోగల సంస్కృత భాషాజ్ఞానం లేదు. వేదశాస్త్రాలు క్షుణ్ణంగా చదువుకున్న సంస్కృతపండితులకు ఆ వేదసూత్రాలను ఇంగ్లీషులో వివరించడానికి కావలసిన భాషాజ్ఞానం లేదు. దాంతో అంతా అస్తవ్యస్తం అయిపోయింది అని శకుంతలారావు శాస్త్రిగారి వాదనట.

"ఇక్కడి రాజకీయాల్లాగే ఉన్నాయి," అంది లీల నవ్వుతూ.

"నువ్వు సరస్వతీదేవిగారి పుస్తకం చదవాలి. నిజంగా అందులో ఎన్నో విషయాలు ఎంతో చక్కగా సోదాహరణంగా వివరించేరు. విషయం క్రమబద్ధంగా దిట్టంగా పొందుపరిచేరు అంత చిన్న పుస్తకంలోనూ."

"అలాగే చూస్తాను. ఇప్పుడు మీకు తోచింది చెప్పండి ఇప్పుడు మనం ఏం చెయ్యాలో," అంది.

"నావల్ల కాదులే. ఇప్పటికే అలసిపోయేను మాటాడి, మాటాడి. మరోమారు చూద్దాం."

"సరేలెండి. ఇవాళ్టికి ఊరుకుంటాను కానీ మిమ్మల్ని వదిలిపెట్టేది లేదు. ఇది పొడిగించవలసిందే," అంటూ లీల కూడా లేచింది.

000

ఇంటికి వచ్చేక లీల చాలాసేపు ముభావంగా ఉండిపోయింది. ప్రభాస్రావుగారింట్లో భోజనాలబల్లదగ్గర అమ్మలక్కల పలుకులు ములుకులై బాధిస్తున్నాయి ఆమెని.

చీరె మార్చుకుని ముందుగదిలోకి వస్తే, పెద్దక్క ఇంకా అక్కడే కూర్చునుంది. ఫలానా అని ఏం జరిగిందో స్పష్టంగా తెలియకపోయినా, ఎవరో ఏదో అని ఉంటారనీ, లీల బాధ పడుతోందనీ మాత్రం గ్రహించిందావిడ.

"రా, నీకోసమే ఎదురు చూస్తున్నాను," అంది లీలని చూడగానే.

"అయ్యో, నాకోసం కూర్చున్నారా? ఏం? ఏమైనా కావాలాండీ?" అంది లీల ఆతురతగా.

"అహఁ అదేంలేదులే. నాకేం అఖ్ఖర్లేదు కానీ నువ్వే ఏమనుకుంటున్నావో అని."

"ఏ విషయం? అనుకోడానికేం ఉంది?"

పెద్దక్క రెండు నిముషాలూరుకుని, "ప్రభాస్రావుగారింట్లో సుందరం కనిపించేడు. ఏమీ జరగనట్టు, పక్కనుంచి పోతూ, బాగున్నారాండి అని నావెనకనున్న గోడతో అనేసి, సమాధానంకోసం చూడకుండా వెళ్ళిపోయేడు. నీక్కూడా కనిపించేడేమో, ఏమైనా అన్నాడేమో అని ..."

"లేదు. నాతో ఏమీ అన్లేదు. దూరంనుంచి చూసేను కానీ మాటలేం లేవు."

000

సాయంత్రం ఆరుగంటలవేళ పేపరు చూస్తున్న లీల, టీవీ చూస్తున్న పెద్దక్క ఉలిక్కిపడ్డారు తలుపు తట్టిన చప్పుడయితే. ఈవేళప్పుడెవరా అనుకుంటూ తలుపు తీసింది లీల.

ఎదురుగా సుందరం నిల్చుని ఉన్నాడు.

లీల సందిగ్ధంగా పక్కకి తప్పుకుంది.

"ఎలా ఉన్నారండీ. చెయ్యి ఎలా ఉంది?" అని పెద్దక్కతో అంటూ చొరవగా లోపలికి వచ్చేడు సుందరం.

"బాగానే ఉంది. నయమవుతోంది నెమ్మదిగా. మీరెలా ఉన్నారు? ఆరోజు ప్రభాస్రావుగారింట్లో కనిపించేరు కానీ మాటాడ్డానికే పడలేదు. అంతా హడావుడి."

"అవునండీ. అదే. అందుకే ఇవాళ తీరిగ్గా మాటాడదాం అని వచ్చేను. మీకెలా ఉందో, ఏం చేస్తున్నారో అడుగుదాం అని. మీకేమైనా కావలిస్తే, నేను చేయగలిగింది ఏమైనా ఉంటే చెప్పండి, మొహమాటపడకండి," అన్నాడు సుందరం కలివిడిగా.

పెద్దక్క చిన్నగా నవ్వింది, "నాకేం కావాలి గానీ మీ సంగతి చెప్పండి. మీరేం చేస్తున్నారు? ప్రయాణాలూ, అవీ - వాటితో బాగా తలమునకలుగా ఉన్నారేమో?"

"నిజం చెప్పమంటారా? లీల లేక ఇల్లు చిన్నబోయిందండీ. అంతే కాదు. ఊళ్లో వాళ్లకి చెప్పలేక ఛస్తున్నాను. అక్కడికీ మీకు అవసరమని ఇక్కడికి పంపించేనని చెప్పేను కానీ వదిల్తేనా," అంటూ లీలవేపు తిరిగి, "నీతో కొంచెం మాటాడాలి," అన్నాడు.

"ఏం మాటాడాలి?" అంది లీల.

పెద్దక్క, "నిన్నంతా సందడితో నాకింకా అలసటగానే ఉంది. కొంచెంసేపు పడుకుంటాను," అంటూ లేచింది నెమ్మదిగా.

"అవునండీ, అంత జనం. నాకే నీరసం వచ్చింది. పడుకోండి. ఏమైనా కావలిస్తే మాత్రం నాకు తప్పకుండా ఫోను చెయ్యండి, మొహమాట పడకండి," అంటూ సుందరం మరోసారి ఆవిడయందు తనకి గల అభిమానం వ్యక్తం చేసేడు. తరవాత ఆవిడ మాట వినపడనంత దూరం వెళ్ళిపోయిందని నమ్మకం కుదిరేక, లీలవేపు తిరిగి, "మ్. చెప్పు," అన్నాడు.

"ఏం చెప్పను?"

"అదే ఎప్పుడొస్తావు ఇంటికి?"

లీల మాటాడలేదు.

"ఆవిడకి బాగానే ఉన్నట్టుంది కదా. పద. కారు సిద్ధంగా ఉంది."

లీల చిన్నగా నవ్వింది, "కారు లేకేమిటి ఇంతవరకూ ఇక్కడున్నది?"

"ఏమో, నాకేం తెలుసు. అసలు ఎందుకు అలా ఉన్నట్టుండి ఇల్లొదిలేసి వచ్చేసేవు?"

"ఉన్నట్టుండి ఏమిటి. నాలుగేళ్ళుగా చెప్తున్నాను నీవరస నాకు బాగులేదని."

"ఏం చెప్పేవు?"

"అలా అడిగితే నేనేం చెప్పను? నన్నో మనిషిలా చూడాలని నీకు తోచాలి గానీ."

"అదేమిటి అలా అంటావు. నీకు సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చేసేను కదా. నువ్వేం చేసినా ఎందుకిలా చేసేవని ఎప్పుడయినా అడిగేనా?"

"అలా అడిగే పరిస్థితులు వస్తే కదా. ఎంతసేపూ నువ్వూ, నీపనీ, నీ స్నేహితులే కానీ, నేనసలు ఆ ఇంట్లో మనిషిని అని నీకెప్పుడయినా అనిపించిందా?"

"నీవరస నాకర్థం కావడం లేదు. నువ్వు నీస్నేహితులతో కాలక్షేపం చేస్తే నేను కాదన్నానా?"

"పెళ్ళి చేసుకోడం స్నేహితులతో కాలక్షేపం చెయ్యడానికా? అయినా అసలు నేను కాలక్షేపం మాట కాదు అంటున్నది."

"సరే, ఏం మాటో మరోసారి చెప్పు. నేను మూర్ఖుణ్ణి. నాకు స్పష్టంగా చెప్తే కానీ తెలీదు."

"అదుగో, అలాటిమాటలే నాకు చిరాకు."

"చూడు లీలా, నీకు నాపద్ధతి నచ్చలేదు. నాక్కూడా నీపద్దతి, కనీసం కొన్ని విషయాల్లో నచ్చలేదనుకో. అవి నువ్వూ, నేనూ మాటాడుకోవాలి గానీ, ఇలా ఇల్లొదిలేసి వచ్చేస్తే ఎలా. సరే. అలా మాటడను. అయినా ఇవన్నీ తరవాత ఇంటికెళ్లేక తీరిగ్గా మాటాడుకుందాం. పద."

ఎదటిమనిషిని మనిషిగా చూడాలని చెప్పడం ఎలాగో తెలీలేదు లీలకి. కొంచెంసేపు ఆలోచించి, "ఆరోజు పీటర్ ఇంట్లో ఉన్నంతసేపూ హేళన చేస్తూనే ఉన్నావు. ఒకటి రెండుసార్లు అతనే మాట మార్చడానికి ప్రయత్నించేడు. అప్పటికీ నీతలకెక్కలేదు ఆ హాస్యాలు మితి మీరేయని. నీకు తెలీదేమిటి ఈదేశంలో భార్యాభర్తలు పేరేవాళ్లముందు అలా ఒకరినొకరు చులకన చేసుకోరని."

"ఒస్, అదా. మనసంగతి వేరు. మనిద్దరం పెళ్ళయిన మొదటిరోజునించీ హాస్యాలాడుకుంటూనే ఉన్నాం కదా. అది మన సాంప్రదాయంలోనే ఉంది. నువ్వే అంటావు కదా కాంతంకథలు ఎంతో బాగుంటాయని. దాన్నిండా ఆయన ఆవిడ్ని హేళన చేయడమే కదా."

"అందుకు ప్రతిగా ఆవిడమీద అలిగి, ఆయన వెళ్ళిపోయి అయ్యరుహోటల్లో తింటే ఏం జరిగింది?" అంది లీల. అది తల్చుకుని నవ్వింది.

లీల నవ్వినందుకు సుందరం సంతోషించాడు. అతనిదృష్టిలో ఆమె తనకి సుముఖంగానే ఉంది. మధ్యవాళ్ళెరో పెడుతున్నారు ఈ పీటముళ్ళు. అదీ అతనికి తోచినమాట.

కానీ లీల సుముఖంగా లేదు.

పాఠకులారా! వారిద్దరిమధ్య జరిగిన సంభాషణ సంపూర్ణమూగా వ్రాయుటకు ఈ కథకుడికి సమ్మతము కాదు. సూక్ష్మంగా లీలగారు తనకి ఏవిషయంలో బాధ కలిగిందో చెప్పిన ప్రతిసారీ, సుందరంగారు, "ఒస్, అంతేనా, సరే, అలాగే, నీయిష్టం వచ్చినట్టే చేస్తానం"టూ రావడం జరిగింది. వివరములు మీ ఊహలకే వదిలిపేయడమైనది.

రెండున్నరగంటలసేపు సాగేయి ఆ వాదోపవాదాలు. అస్త్రసన్యాసం చేసినవాడితో యుద్ధం చెయ్యడం ఎలా? అనిపించింది లీలకి.

మళ్ళీ సుందరమే అందుకున్నాడు. "నాకు తెలీకే అడుగుతున్నాననుకో. నీమటుకు నీకు షష్టిపూర్తిరోజున వాళ్ళింట్లో సుఖంగా అనిపించిందా? నువ్వు ఎంతమందికి సమాధానం చెప్పుకోవలసివచ్చింది? ఎంతమంది నిన్ను ఎన్ని మాటలన్నారు?"

"నీకెలా తెలుసు వాళ్ళేం అన్నారో?"

"ఎలా తెలియడమేమిటి, నాతోనూ అన్నారు. అక్కడికీ నేనే సర్ది చెప్పేను పెద్దక్కగారికి సాయం చెయ్యడానికి వచ్చేవనీ, మనిద్దరిమధ్యా ఎలాటి పొరపొచ్చాలూ లేవని. ... అయినా నువ్వే చెప్పు, ఎంతకాలం ఇలా వీళ్ళింట్లో ఉంటావు? ఆతరవాత ఎక్కడికెళ్తావు? ఏం చేస్తావు?"

సుందరంతో వచ్చిన చిక్కే ఇది. అతను ఏ పరిస్థితిలోనైనా తనమాటే సబబు అనిపించగలడు ఎదటివారిచేత. నిజమే. ఇక్కడ ఎంతకాలం ఉండగలదు? ఆతరవాత ఎక్కడికి వెళ్ళడం? ఏం చెయ్యడం? ఇంతకాలం ఉద్యోగం సద్యోగం లేనిమనిషి ఉద్యోగంవేట మొదలు పెట్టడం ఎలా? ఒకవేళ దొరికినా ఎలాటి ఉద్యోగం దొరుకుతుంది?

"నామాట విని, పద. చెప్పేను కదా. ఇంటికెళ్ళేక మాటాడుకుందాం. అప్పటికీ నీకు నమ్మకం లేకపోతే, వేరే దారి చూద్దాం. నిన్ను ఈదేశం నేనే తీసుకొచ్చేను కనక నీకోదారి చూపెట్టడం నాబాధ్యతే. నేనే చూసిపెడతాను."

లీల రెండు నిముషాలూరుకుని, "ఇప్పుడు కాదులే. రేపొస్తాను," అంది.

"ఏం, రాహుకాలం, వర్జ్యంలాటివేమైనా ఉన్నాయేమిటి ఇప్పుడు?" సుందరం నవ్వేడు.

"సుముహూర్తం కాదు నేను చూస్తున్నది, సమయం, మర్యాదా అయిన మార్గంకోసం. పెద్దక్క పడుకున్నారు. ఆవిడని లేపి వెళ్లిపోతున్నానని చెప్పనా, ఓ చీటీముక్క రాసి ఫ్రిజ్ మీద పెట్టి బయల్దేరనా?"

"సరే, రేపు వస్తాలే. నువ్వు సిద్ధం అయేక ఫోను చెయ్యి," అన్నాడు సుందరం లేస్తూ.

లీల సరేనన్నట్టు తలూపి, అతను వెళ్ళేక తలుపు వేసుకుని, ఆలోచిస్తూ తనగదిలోకి వెళ్ళిపోయింది. మంచంమీద పడుకునేసరికి నీరసం వచ్చింది. ఎలా చూసినా తను వెనక్కి వెళ్ళక తప్పేట్టు లేదు అతడిమాటలు నమ్మి కాదు ... పాముకి నాలుకలు రెండయితే, సుందరానికి పన్నెండు. కానీ ప్రస్తుతపరిస్థితుల్లో మరో దారి ఏదీ? ఇండియాలోనే ఉండి ఉంటే కథ వేరేగా ఉండేదేమో. ఆయనెవరో అన్నట్టు, పెళ్ళికి వచ్చినవాళ్ళందరూ సాక్షులు. దంపతులమధ్య ఏ తగువులొచ్చినా ఇంట్లోవాళ్లో పైవాళ్ళో ఎవరో ఒకరు కలగజేసుకుని ఇద్దరికీ బుద్ధి చెప్పి సంసారం కుదుటపడేలా చేస్తారు. అలాగని ఇప్పుడు ఇండియా వెళ్ళిపోవడానికీ లేదు. ప్చ్. అక్కడ ఎలా ఉంటుందో? ఎవరైనా ఆదుకోవచ్చు. మ్. అంటే అది కూడా మరొకరిమీద ఆధారపడడమే కదా. అక్కడ మరోరకం పొరపొచ్చాలు రావని హామీ ఏముంది? పైగా అక్కడ బాగులేదని ఇక్కడా, ఇక్కడ బాగులేదని అక్కడా – అలా తిరగడం సాధ్యమా ఇంత దూరంలో ఉన్నప్పుడు. ఇదేమైనా విశాఖపట్నం, గాజువాకానా?

సుందరం మారకపోవచ్చు. అతనిప్రవర్తన తనకి బాధ కలిగిస్తోందని అతనికి తెలియజేయడమే తన ఉద్దేశ్యం. అది కొంతవరకూ జరిగినట్టే ఉంది. తనకి తానై వచ్చేడు, తనని యింటికి రమ్మంటున్నాడు. అవునా? ... హుమ్. లీల నిట్టూర్చింది. గట్టిగా ఆమాట అనుకోలేకపోతోంది. తనకే నమ్మకం కలగడం లేదు. సుందరం మారడు. ఆవిడెవరో అన్నట్టు దృశ్యం నచ్చకపోతే దృష్టి మార్చుకోవాలి, మనమే. అంతే, తను ఆలోచించేవిధానం మార్చుకోవాలి. అంటే తన అభిప్రాయాలు, నమ్మకాలు, ఇష్టాయిష్టాలు మార్చుకోవాలి. దాని ఫలితాలు ఎలా ఉంటాయో ...

ఆలోచనలు ఒక కొలిక్కి రాకముందే కనురెప్పలు వాలిపోయేయి నిద్ర బరువుకి.

ooo

ఉదయం లేస్తూనే, లీల తనకీ, సుందరానికీ మధ్య జరిగిన సంభాషణ పెద్దక్కకి చెప్పి, "మీరేవంటారు?" అనడిగింది.

ఆవిడ సుదీర్ఘంగా నిట్టూర్చి అంది, “ఆమధ్య మనదేశంలో స్త్రీవాదంగురించి అడిగేవు. ఇప్పుడు చెప్తాను. ముందొకసారి చెప్పేను కదా మనవాళ్ళు స్త్రీవాదం అన్న పదం చాలా తేలిగ్గా, అర్థరహితంగా వాడుతున్నారని. ఒకసారి నువ్వే అన్నావు ఓ ఆడమనిషి ఓ మగాడిని కాస్త మంచినీళ్లు తెచ్చి పెట్టు అన్నా స్త్రీవాదమే అంటున్నారు అని. అంటే ఆడవాళ్ళమాటలో ఏమాత్రం నేనూ మనిషినే అన్నట్టు కనిపించినా స్త్రీవాదమే. ప్రతిఘటన లేకపోయినా వాళ్ళకి నచ్చని ఏపనీ ఏమాటా అయినా స్త్రీవాదమే.

అమెరికాలో స్త్రీవాదం స్త్రీల అస్తిత్వానికి చిహ్నంగా, బయటిప్రపంచంలో స్త్రీల రాజకీయ, ఆర్థికసమస్యలరూపంగా అవతరించింది. మనకి ఆ స్త్రీవాదం సరిపడదు. మనఇళ్లల్లో మందే ఆస్తి. మందీమార్బలం అంటాం. పదిమందిం ఒక పంచన బతుకుతాం. అందుచేత కోపాలూ, తాపాలూ కూడా ఎదుట ఎవరుంటే వారితో చెప్పేసుకుని మనసులు తేలిక పరిచేసుకోడానికి అవకాశం ఉంది. అది మనకి సహజసిద్ధంగా అమర్చిన మందు. అదీ మన జీవనసరళి. అసలు మన బంధుత్వాలలో పదాలే చూడు అత్తయ్య, మామయ్య, అక్కయ్య, బావమరిది, మేనగోడలు, వదిన, బావ … ఇవన్నీ వట్టి మాటలు కాదు. వాటిద్వారా ఆ యిద్దరు వ్యక్తులమధ్యా గల పరస్పరసాన్నిహిత్యం, గౌరవమర్యాదలూ, ఆదరాభిమానాలు కూడా వ్యక్తం చేస్తాం. అదొక ప్రత్యేకమైన గతిశీలత. చాపచుట్టగా కజిన్ అనో ఆంటీ, అంకుల్ అనో ఉద్దిష్టం కాదు. మన బంధుత్వాలలో భాగంగానే ప్రతివాళ్ళు ప్రతివాళ్ల బతుకుల్లోనూ జోక్యం కలగజేసుకోడం సహజంగా వచ్చింది.

నువ్వింందాకా అన్నావు ఇండియాలో అయితే ఎవరో ఒకరు కలగజేసుకుని నీసంసారం చక్కదిద్దేవారేమోనని. నాకలా అనిపించడంలేదు. వాళ్లలోనూ మార్పు వచ్చేసింది. ఎదటివారు కలగజేసుకోడం కొంతవరకూ ఇంకా ఉన్నా, మరొకపక్క ఆధునికత వచ్చి, నాజోలి నీకెందుకూ అని కూడా అంటున్నారు. అంటే వాళ్ళకి సౌఖ్యంగా ఉన్నంతసేపు బాగుంటుంది. చిరాకేస్తే, నా వ్యక్తిగతవిషయం, నీకెందుకూ అంటారు. తమాషా ఏమిటంటే వేరింటి కాపురాలు పెట్టినవాళ్ళే మళ్ళీ అవుసరం అయినప్పుడు, అమ్మా, నాన్నా అంటూ ఆ పంచకే చేర్తారు. స్థూలంగా మనవాళ్ళు పక్షికీ మృగానికీ చెందని జాతిగా తయారయేరు ఇప్పుడు.

సరే, ఆవాదాలన్నీ వదిలెయ్. వాస్తవం చూస్తే, మనదేశంలో స్త్రీలస్థాయి చాలావరకు మెరుగే. ఆమధ్య ఎక్కడో దొరికితే, అచ్చమాంబగారి అబలాసచ్చరిత్రరత్నమాల చదివేను. ఆవిడ చమత్కారం చూడు. పుస్తకానికి పేరులో అబల అని పెట్టేరు కానీ ఆవిడ చిత్రించిన స్త్రీలందరూ

అచంచలమైన ఆత్మవిశ్వాసం, అమేయమయిన ధైర్యసాహసాలూ ప్రదర్శించినవారే. అద్భుతంగా ఉన్నాయి ఆ కథలూ, ఆవిడ ప్రవచించిన తీరూ కూడా. ఆకథల్లో నాకు ద్యోతకమయింది ఏమిటంటే ఆ స్త్రీలు మగవాళ్ళంతా క్రూరులు, గృహహింస, వివక్ష అంటూ అరవలేదు. నిశ్శబ్దంగా తమ పని సాధించుకున్నారు. ఆవిడ తీసుకున్న కథలు చాలావరకూ 18, 19 శతాబ్దాలకి సంబంధించిన స్త్రీలవి. అంచేత ఆకాలంలో స్త్రీవిద్య, సహగమనం, వితంతువు కేశఖండనం వంటి అనేక సాంఘికసమస్యలమీద వ్యాఖ్యానించేరు. అవి స్త్రీలకథలుగా మాత్రమే కాక, అచ్చమాంబగారి అభ్యుదయభావాలు కూడా తెలుపుతాయి."

లీల ఆవాక్కై, పెద్దక్కవేపు చూస్తూ కూర్చుండిపోయింది.

ఆవిడ కూడా ఉలికిపడి, "హ్, ఈ గుడుగుడుకుంచం వదిలి, మొదటికొస్తాను. ఇంతకీ చెప్పొచ్చేదేమిటంటే, ప్రారబ్ధార్థములుజ్జగింపరు గదా ప్రజ్ఞానిధుల్. నీపరిస్థితేమిటో, నీసామర్థ్యమేమిటో, నీకు ఏది సుఖమో నీకు తెలిసినట్టు నాకూ తెలీదు, మరొకరికీ తెలీదు. నీకే తెలియాలి. నువ్వు మళ్ళీ ఆయింటికి వెళ్ళడమా, మానడమా అన్నది నువ్వు మాత్రమే చెప్పగలవు. చెయ్యగలవు. మరొకరితో ప్రమేయం కాదు. ఇండియాలో ఉంటే అమ్మానాన్నో, అన్నో తమ్ముడో ఆదుకుంటూరన్న భ్రమ వదిలెయ్. నువ్వక్కడ లేవిప్పుడు. ఒకవేళ ఎవరైనా ఆదుకున్నా, నీకే నచ్చకపోవచ్చు కొంతకాలం అయేక. ఆ రోజులు ఇప్పుడు లేవు. ఇప్పుడు అలా ఆలోచించడం అనవసరం. మొత్తం సమాజంలో, ఆలోచనలతీరులో, మనదృష్టిలో ఇంత ఉధృతంగా మార్పు వచ్చింతరవాత, అప్పుడున్నట్టు ఇప్పుడు లేదే అనుకుంటూ బాధ పడి ఏం లాభం? నువ్విప్పుడున్నది అమెరికాలో. సుందరం కూడా తెలుగువాడే అయినా, అతనిలో ఇంకా ఆ పాతవాసనలు పోలేదు. అప్పుడప్పుడవి పైకి తన్నుకొచ్చినా, అతను కూడా అమెరికావాసానికే ఎక్కువ అలవాటు పడ్డాడు."

"అలాగని అమెరికనులు భార్యలని ఆదిరంచే విధానమూ అలవాటవలేదతనకి," అంది లీల.

"అదే మరి. సంధిసమయం. మనకి యుగసంధి మాత్రమే కాక విలువలు, భావాలూ కూడా సందిగ్ధం అయిపోయేయి, దేశాంతరం కూడా కనక. అందుకే వివాహం అంటే మనదృష్టిలో ఉన్న అభిప్రాయాలు కూడా మారిపోయేయి. పూర్వం అది తిరుగులేని శాశ్వతబంధం. అందులో వెనక్కి తిరగడం లేదు. ఇప్పుడు సంసారం సవ్యంగా లేకపోతే విడిపోడానికి అవకాశం ఉంది అన్న స్పృహతో ప్రారంభిస్తున్నారు వైవాహికజీవితం."

లీల ఉలికిపడింది, "అదేమిటండీ, అలా అంటారు? విడిపోవచ్చులే అనుకుంటూ చేసుకుంటారా పెళ్ళి ఎవరైనా?"

"అహఁ, కాదు, నేనలా అనడంలేదు. కానీ ఓరవేసిన వాకిలిలా అలా చిన్న సందు ఉందన్న స్పృహ అంతరాంతరాల ఏమూలో ఉంటుందేమో. సమాజంలో అలా జరగడం చూస్తున్నాం కదా. పైగా ఈమధ్యనే వింటున్నా పెళ్లికి ముందే ఒప్పందాలు రాసుకోడం. అదీ అసలైన విషాదం అమెరికాలో తెలుగుపడుచుల జీవితాల్లో. ఇది కూడా మారొచ్చు కొంతకాలానికి. కానీ ప్రస్తుతం నువ్వు చెయ్యగలిగింది - నీకు నువ్వే ఆలోచించుకుని, నీకు ఏది సాధ్యం అనిపిస్తే అది చెయ్యడమే," అంటూ ఆగింది పెద్దక్క.

లీల తలొంచుకుని ఆవిడమాటలు నెమరు వేసుకుంటూ, అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తోంది.

"ఈ తలుపులు నీకోసం సదా తెరిచే ఉంటాయని నేనిప్పుడు చెప్తే, ఇందాకా చెప్పిన ఓరవాకిలిలా ఉంటుంది కానీ మరిచిపోకు," అంటూ పెద్దక్క కాఫీకప్పులు రెండూ తీసుకుని సింకువేపు నడిచింది.

లీల నవ్వేసి, " మీతలుపులు తెరిచే ఉంటాయన్నసంగతి నేను మర్చిపోతానులెండి," అంది.

ఆ తరవాత ఆవిడవేపే చూస్తూ ఆలోచించుకోసాగింది. ఈవిడ తనకేమవుతుందని ఇలా తనని ఆదుకోడానికి? నిజానికి ఆవిడకి తనఅవసరం తీరిపోయి చాలాకాలమే అయింది. తనకీ ఆవిడకీ అలవాట్లలో చాలా వ్యత్యాసం ఉంది. ఎన్నో తేడాలున్నాయి. అయినా ఆవిడెప్పుడూ ఎలాటి అసంతృప్తి ఛాయామాత్రంగానైనా వెలిబుచ్చలేదు. సుందరం అన్నమాట గుర్తొచ్చింది. ఇక్కడ మాత్రం ఇంటిపని చెయ్యడం లేదా అన్నాడు. హుం. …

లీల ఆలోచనలు ఓ కొలిక్కి రాకముందే, ఆ మధ్యాహ్నంపూట సుందరం ఫోన్ చేసేడు, "రానా? సిద్ధంగా ఉన్నావా?" అంటూ.

"ఆఁ" అంది లీల నిర్లిప్తంగా.

జీవితంలో రెండోసారి కళ్ళు మూసుకుని గోతిలోకి దూకుతున్న అనుభూతి కలిగిందామెకి.

000

4 నెలలతరవాత మళ్లీ తనకి సుపరిచితమైన ఆ ఇంట్లో అడుగు పెడుతుంటే రకరకాల ఆలోచనలు కలగాపులగంగా సుళ్ళు తిరగేయి లీలమనసులో. ముందుగదిలో ఒక్కక్షణం ఆగి వెనకగదిలోకి వెళ్లింది.

సుందరం సూట్కేసు తీసుకొచ్చి లోపల పెట్టి, "కాఫీ పెట్టనా?" అన్నాడు.

లీల, "నేను పెడతాలే," అంది వంటింట్లోకి నడుస్తూ.

వంటింట్లో చుట్టూ ఓమారు కలియజూసి, ఫ్రిజ్ చూసి, చిన్నగా నవ్వి, గిరుక్కున వెనక్కి తిరిగి వెనక నుంచున్న సుందరాన్ని ఢీకొంది.

"ఏంటి?" అన్నాడు సుందరం.

"వంటిల్లు అద్దంలా మెరిసిపడుతోంది షోరూంలా. ఏం తిన్నావేమిటి ఈ నాలుగు నెల్లూ?" అంది.

"అదేమిటి, అలా అంటావు, నువ్వొస్తున్నావని ఇల్లంతా శుభ్రం చేసి పెట్టేను, ఇల్లు చూసి ఇంటివాడిని చూడమన్నారు," అన్నాడు సుందరం.

"సరే. పద. పాలయినా తెస్తేనే కాఫీనీళ్ళు."

"పద, నువ్వే చూసుకుందువు గానీ ఇంకా ఏమేం కావాలో."

ఇద్దరూ బజారుకెళ్ళేరు, లీల కూరలు సంచీల్లో వేసి బండిలో పెడుతుంటే, "కొంచెం ఎక్కువే కొను. కవిగారు వస్తున్నారు శనివారం. ఆయన్ని చూడ్డానికి ఇంకా ఎవరైనా వస్తారేమో," అన్నాడు సుందరం.

"మనం ఎంతమందిని పిలిచేమేమిటి?" అంది లీల "మనం" ఒత్తి పలుకుతూ. ఇతడు ఏమీ మారలేదు.

"ఎంతో మంది లేర్లే. మహా ఐతే ఐదారుగురు ఉంటారు. అయినా ఆవేళకి ఒకరిద్దరు రాలేకపోవచ్చు కూడా."

ప్రభాస్రావింటికొచ్చిన కవిగారు డెట్రాయిట్, షికాగో, న్యూయార్కు, హ్యూస్టన్ మొదలుగా గల సాహితీక్షేత్రాలు సందర్శించుకుని, తెలుగు సాహిత్యాభిమానులూ, సాహితీప్రియులూ కప్పిన శాలువాలు మూట గట్టుకుని, తిరిగొచ్చేరు.

ఆ మర్నాడు సుందరం వెళ్ళి కవిగారిని తమయింటికి తీసుకొచ్చేడు. "ఈవారం మనింట్లోనే ఉంటారు," అన్నాడు అదేమంత పెద్దవిషయం కానట్టు.

లీల మూడ్ ఒక అంగుళం కిందకి జారింది.

శనివారం సుందరం ఇంట్లో కొందరు మిత్రులని కలుసుకోడానికీ, ఆదివారం కమ్యూనిటీ సెంటరులో తెలుగు సాహిత్యసభ సంబరాలు జరపడానికీ ఏర్పాటయిందని కూడా అప్పుడే చెప్పేడు.

000

శనివారంసాయంత్రం సుందరం నలుగురు సాహితీప్రియులనీ, సాహితీబంధువులనీ, సాహిత్యాభిమానులనీ, సాహిత్యసేవకులనీ ఆహ్వానించేడు కవిగారితో ముఖాముఖీ అంటూ. ఆ మిత్రులు మరో నలుగుర్ని పిలుచుకొచ్చేరు. వాళ్ళు తెలుగుసాహిత్యం అంటే చెవి కోసుకుంటార్ట, కవిగారిని చూసి, వారి భాషణలు విని ధన్యులు కావలెనని వారి అభిలాష.

లీల పకోడీలు, టీ చేసి, వాటితో పాటు చిప్పులూ, డిప్పులూ అమర్చింది బేస్మెంటులో బల్లమీద. సుందరం ఇంట్లో ఉన్న కుర్చీలూ, మరో నాలుగు కుర్చీలు అద్దెకి తెచ్చి గది సర్దేడు.

ఆహూతులు కాయితప్పళ్ళెలలో రెండేసి పకోడీలు పెట్టుకుని, ఫోంకప్పుల్లో టీవో నీళ్ళో నింపుకుని తలో కుర్చీలోనూ సర్దుకున్నారు. ఒకరిద్దరు నేలమీద చతికిలపడ్డారు చక్కగా మనూళ్ళో ఉన్నట్టుంది అంటూ.

"సమకాలీన సాహిత్యంపై మీ అభిప్రాయం ఏమిటండీ?" అనడిగేడు ఓ అబ్బాయి.

"సమకాలీన సమాజాన్ని ప్రతిబింబిస్తోంది," అన్నారు కవిగారు.

"అది ప్రతిభావంతంగా చేస్తోందంటారా?"

"అది చరిత్ర చెప్పాలి."

"మీరేమనుకుంటున్నారు?"

"సమకాలీన సమాజాన్ని ప్రతిబింబిస్తోందనుకుంటున్నాను."

"మీరచనలగురించి కొంచెం చెప్పండి. మీమీద ఏ రచయితలప్రభావం ఉందంటారు?"

"ఏ ఒక్కరి ప్రభావమో అంటే చెప్పలేను. నేను మానతావాదిని. యం.యన్. రాయ్, రసెల్ రచనలు అభిమానిస్తాను."

"ఏ వాదాలూ లేనివాళ్ళందరూ మానవతావాదులే," అన్నాడు ఆర్నెల్లక్రితం అమెరికా వచ్చిన ఇంజినీరు. సుందరంలాగే అనేకానేక పుస్తకాలు పఠించి, రెండో మూడో రాసి, మరియు స్నేహితులకి తనపుస్తకాలు ఉదారంగా పంచిపెడుతున్న, మరియు పండితుణ్ణి అనుకుంటున్న "టెల్గూలవరు" అతడు.

అక్కడున్నవారందరి పేర్లూ చెప్పడం అనవసరం. అందరూ తలో మాటా అన్నారు కనక సుమారుగా ఆ సంభాషణ ఇలా సాగింది అని చెప్తే చాలు. ఎవరు ఏమాటన్నా ఒకటే అనుకోండి.

"కాదండీ. అన్నివాదాల్లోనూ గల మానవీయ విలువలసాముదాయిక వ్యవసాయం మానవతావాదం."

"అదెలా సాధ్యం? అభిప్రాయాల్లో తేడాలవల్లే కదా ఇన్ని వాదాలు వచ్చింది."

"మానవతావాదంలో వ్యక్తికే ప్రాధాన్యత. మానవుడు తనభావాలకీ, చేష్టలకీ కూడా తనే బాధ్యుడు."

"మరి అతడికి సంఘంతో పని లేదా?"

"పని లేదని కాదు. మనిషి సంఘజీవి. తను ఆచరించే కర్మలకి బాధ్యత వహిస్తూ, సామాజికాభివృద్ధికి తోడ్పడాలి."

"మరి మన మతం చెప్తున్నది కూడా అదే కదండీ. కర్మణ్యేవాధికారస్తే అంటే అదే కదా,"

"కానీ, అక్కడ నీకర్మ నువ్వు చెయ్యకపోతే "నీఖర్మ! నరకానికి పోతావు" అంటున్నారు. స్వర్గం చేరుకోడానికి అంటూ ఆశ పెట్టడం, నరకం తప్పించుకోడానికి అంటూ భయపెట్టడం జరుగుతోంది అక్కడ. మానతావాదంలో స్వర్గనరకాల ప్రసక్తి లేదు."

"స్వర్గనరకాల ప్రసక్తి లేదు కానీ, నావల్ల సంఘానికి మేలు జరగడంలేదని నిందించడం ఉంది కదండీ."

"ఎవరు నిందిస్తారు?"

"ఎవరేమిటి, మీరే అనొచ్చు. మనిషి జన్మ ఎత్తింతరవాత, సంఘానికి కొంచెమయినా గట్టి మేల్ తలపెట్టవోయ్ అన్నారు కదా గురజాడగారు. మనమంతా సంఘంలో భాగస్థులం. అందరికీ సంఘంలో బాధ్యత ఉందంటున్నారు."

"కాదూ మరి. నీకేదైనా అవసరం వస్తే నువ్వు ఎవరో ఒకర్ని సాయం అడవేమిటి?"

"మనమతం చెప్తున్నది కూడా అదే కదా. సంఘం శరణం గచ్చామి అన్నా, నీకర్తవ్యం నువ్వు చెయ్యాలి అన్నా."

"మన మతంలో మౌఢ్యం, బ్రాహ్మణాధిపత్యం మేం గర్హిస్తున్నది."

"ఇంకా ఎక్కడుందండీ బ్రాహ్మణాధిపత్యం? ఏ రంగంలో చూసినా రెడ్డిగారు, రాజుగారు, చౌదరిగారు, నాయుడుగారు … ఇవే కదా కనిపించే పేర్లు. అంతర్జాతీయ తెలుగుసంఘాలు కూడా ఈ పరిధులలోనే ఇరుక్కుని ఆధిపత్యాలు చెలాయిస్తున్నాయన్నది జగమెరిగిన రహస్యం కదా. ఎక్కడున్నారు బ్రాహ్మణులు? ఏం చేస్తున్నారు? గృహప్రవేశాలకీ, సత్యనారాయణవ్రతాలకీ తప్ప."

"సాహిత్యం సర్వమానవసౌభ్రాతృత్వానికి కృషి చెయ్యాలి."

"అది జరగడంలేదనే నేనంటున్నది. ఎవరికి వారు తమపేరు పేపర్లో వచ్చిందో లేదో, తమఫొటో వచ్చిందో లేదో చూసుకోడంతోనే సరిపోతోంది."

"అసలీమధ్య సభలు మరీ దారుణం అయిపోయేయి. గంట ఆలస్యంగా మొదలు పెడతారు. ఎవరికి వారు తమకి తోచిందేదో చెప్పుకు పోతుంటారు, సంతర్పణ వడ్డనలలాగే. శ్రోతలు తమపనుల్లో తాముంటారు ఐఫోనులు చూసుకుంటూ."

"తలుపులు."

"తలుపులా? రివాల్వింగ్ డోర్ అనా?"

"అహఁ అది కాదు. మీకు తెలీదేమో. మాఊళ్లో జాతరలూ, సంబరాలూ ఏవో జరుగుతుంటాయి. అప్పుడు డప్పులు వాయించేవాళ్ళుంటారు. ఏ సంబరం అయినా వాళ్ళపాటికి వాళ్ళు దరువులేసుకుంటూ పోతారు. అలా కొలుపులు జరుగుతుంటాయి, తలుపులు మోగుతుంటాయి అనడం పరిపాటి అయిపోయింది," అన్నాడు ఓ అబ్బాయి.

"శ్రీరామరాజ్యం చూసేరా?"

"బాపూ, రమణ కదా, బాగుంది. మీరు చూసేరా?"

"బాగుంది కానీ పద్యాలు రెండో మూడో పెడితే పౌరాణికం కళ వచ్చేది."

"ఈరోజుల్లో పద్యాలు ఎవరిక్కావాలండీ? ఎవరికి అర్థమవుతాయి కనక."

"అలా అనకండి. పేటిఅందం వాటిదే. కొందరైనా ఉంటారు అర్థం చేసుకుని ఆనందించేవాళ్ళు. అసలు పద్యాలు అర్థం కాకపోయినా వినసొంపుగా ఉండి ఎలాటివారికైనా అలరిస్తుంది కదా. సంగీతంలో మహత్యమే అది."

"ఏమోలెండి. నాకు మాత్రం గట్టిగా నాలుగువాక్యాలు తెలుగులో మాటాడగలిగినవాళ్ళూ, అర్థం చేసుకుని ఆనందించేవారూ కనిపించడంలేదు. అన్నట్టు నయనతార సీత అంటే ఇహ చూసినట్టే అనుకున్నారా మీరు కూడా నాలాగే."

"హాహా. అనుకున్నా కానీ చూసేక అది పొరపాటు అని తెలిసొచ్చింది."

"మనం అనుకుంటున్న మొదటిమాట వదిలేసేరు. మనుధర్మశాస్త్రాలయినా, వివేకానందుడిబోధనలయినా, మరో స్వాములారయినా, మనిషి మనిషికి అండగా నిలవాలనే కదా చెప్తున్నారు. దానికీ బ్రాహ్మణ్యానికీ సంబంధం ఏమిటి?"

"బ్రాహ్మణులు తమ ఆధిపత్యం చెలాయించడంవల్లే కదా ఇతరకులాలవారికి చదువు, దానివల్ల వచ్చే లాభాలూ లేకుండా పోయేయి."

"ఇప్పుడు ఇతరకులాలవారు తమకులాలకి చేస్తున్నదీ అదే కదా. పేరు మారింది కానీ తత్వం మారలేదు."

"అది కూడా పోవాలండీ. మానవతావాదులు దానికోసమే పాటుపడుతున్నారు."

"పోవాలి అని నియమాలు మాటాడుతున్నారు మీరు. వాస్తవంలో అది జరగడంలేదు అంటున్నాను నేను."

"పోనీ, మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి."

"శిబి, దధీచీ, పోనీ పుక్కిటిపురాణాలనుకోండి."

"ఆకథలన్నీ ప్రతీకాత్మకంగా చెప్పినవి. అలాగే గ్రహించాలి. వాటిలో ప్రధానాంశం దానగుణం."

“నిజమే, కానీ అది వారికి సమ్మతం కాదు కదా. అంచేత ఈనాటి ఆస్తికులనే తీసుకుందాం. అచ్చమాంబ, డొక్కా సీతమ్మ, విశ్వనాథ సత్యనారాయణ – అంటే వీళ్లపేర్లు అందరికీ తెలుసు కనక చెప్తున్నా కానీ అనేకమంది సామాన్యులు ఎంతోమంది గుప్తదానాలు చేస్తున్నారు. డొక్కా సీతమ్మగారు ప్రతి రాత్రీ లాంతరు పుచ్చుకు ఊరంతా తిరిగి, పడుకున్నవారిని లేపి మరీ అడిగేవారుట భోజనం చేసేవా అని. హిందూధర్మంలో గృహస్థు ఆదాయంలో నాలుగోవంతు ధర్మకార్యాలకి వినియోగించాలని బోధిస్తున్నాయి. మీలెక్కప్రకారం వారంతా మూర్ఖులేనా?”

“నేను అందర్నీ మూర్ఖులనడం లేదు. కానీ అధికారం గల ఆస్తికులు వారి మూర్ఖత్వంతో దేశం మొత్తానికి దౌర్భాగ్యం తెచ్చి పెట్టేరు కదా. నేనూ చెప్తాను ఓ కథ. త్రిపురనేని రామస్వామిగారు చిన్నతనంలో స్కూలికి ఆలస్యంగా వెళ్తే, వాళ్ళ మాస్టారు ఎందుకు ఆలస్యమయిందని అడిగేరట. రామస్వామిగారు స్నానం చేస్తూ ఆలస్యం అయిందని చెప్పేరుట. ఆ మాస్టారు వెంటనే శూద్రులకు ప్రాతఃస్నానాలు కూడానా అన్నారుట. అది రామస్వామిగారి మనసులో గట్టిగా నాటుకుని, పెద్దయేక బ్రాహ్మణకర్మలమీద, ఆచారాలమీద తిరుగుబాటుకి బాట వేసింది.”

“ఆ మాస్టారు అలా అనడం తప్పే. నేనూ ఒప్పుకుంటాను. నేను ఇదివరకే విన్నాను ఈ కథ. ఇప్పుడు మీరు చెప్తుంటే నాకు మరో సందేహం వస్తోంది. రామస్వామిగారికి రోజూ స్నానం చేసే అలవాటుంటే, ఆ ఒక్కరోజు క్లాసుకి ఆలస్యంగా రావడానికి కారణం స్నానం అయిఉంటుందా? పోనీ, అది ఒదిలెయ్యండి. ఒక బ్రాహ్మణుడు ఒక తప్పు మాట అన్నాడని, మొత్తం బ్రాహ్మణ జాతికంతటినీ తప్పు పట్టడం న్యాయంగా మీకు కనిపిస్తోందా? కొందరు బ్రాహ్మణీకానికి వక్రభాష్యాలు చెప్పి, దాన్ని దుర్వినియోగం చేసేరు. మీరు వారిమీద మాత్రమే ధ్వజమెత్తడం న్యాయం కానీ బ్రాహ్మణులందర్నీ అంటే ఎలా?”

“బ్రాహ్మణులంటే కోపం అనడం లేదు మేము. మాకు బ్రాహ్మణీకం అంటేనే కోపం.”

“అది కూడా సరి కాదు అంటున్నాను నేను. బ్రాహ్మణీకం కానీ మరొకటి కానీ ప్రతి వాదమూ మొదట్లో లోకకల్యాణం దృష్టిలో పెట్టుకునే సృష్టించిందే. రెండోది, అసలు ఇప్పుడెక్కడుంది బ్రాహ్మణీకం? కొందరు ఇళ్ళల్లో పూజలూ, వ్రతాలూ చేసుకుంటూ ఉండొచ్చు కానీ బ్రాహ్మణీకం పేరుమీదుగా సమాజంలో జరిపించుకోగల ఆధిపత్యం పోయి చాలాకాలం అయింది కదా. ఇంకా ఖచ్చితంగా విడమరిచి చెప్పాలంటే, అబ్రాహ్మణులు చెలాయిస్తున్న ఆధిపత్యానికీ పూర్వం బ్రాహ్మణులు చెలాయించేరు అంటున్న ఆధిపత్యానికీ తేడా ఏమిటి?”

“సరే, మీమాటే నిజం అనుకుందాం. ఎందుకిలా జరిగిందంటారు? ఎక్కడొచ్చింది తకరారు?”

"ఎప్పుడు ఎలా మొదలయిందో చెప్పడం కష్టం కానీ, వ్యక్తిధర్మాలు, సాంఘికధర్మాలూ ఏకాలంలోనూ, ఏదేశంలోనూ ఉన్నాయి, ఏ శాస్త్రం తీసుకున్నా అవే మౌలికసూత్రాలుగా కనిపిస్తాయి. మధ్యలో ఎప్పుడో "వ్యక్తిధర్మం" పోయి "వ్యక్తివిజయం" ఘనం అయిపోయింది. పూర్వం వ్యక్తిధర్మాలకి విలువ. ఇప్పుడు వ్యక్తిహక్కులకి విలువ. ఎదుటి మనిషిని పొడిచి చంపేస్తే, చచ్చినవాడికి జరగాల్సిన న్యాయం కంటే, వాడిహక్కులు రక్షించడంకంటే, చంపినమనిషి హక్కులు రక్షించడానికి హైరాన పడుతున్నాయి మన చట్టాలన్నీ."

లీల లేచి పళ్లేలూ, కప్పులూ తీస్తుంటే, ఇందాకా "తలుపులు" వివరించిన అబ్బాయి కూడా అందుకున్నాడు సాయంగా.

సుందరం, "మీరెందుకండీ, నేను తీస్తాను లెండి," అన్నాడు.

ఆ అబ్బాయి "ఫరవాలేదులెండి" అంటూ మిగతా కప్పులు కూడా తీసుకుని లీలవెనక వంటింట్లోకి నడిచేడు. "ఏమైనా సాయం చెయ్యమంటారా?"

"ఏం లేదండీ. అయిపోయింది. ఇవి కొంచెం వెచ్చబెట్టేస్తే, భోజనాలు సిద్ధం" అని లీల, "మీపేరేమిటన్నారు" అనడిగింది. అంతమందిలో అతనొక్కడు అలా చనువుగా సాయం చేస్తాననడం కాస్త ఆశ్చర్యంగా అనిపించింది. కొత్తవాడు కూడా.

"అహ్మద్" అని, "మీ పిలుపు లేకుండా వచ్చేను. మీరేమనుకుంటారో," అన్నాడు సంకోచిస్తూ.

లీల చిన్నగా నవ్వింది, "ఫరవాలేదులెండి ఇంతమందిలో మీరొక్కరు ఎక్కువయిపోతారేమిటి."

"ఏంటోనండీ. మాకసలు ఈ పిలుపులు అవీ ఏం లేవు అప్పట్లో ... ఊళ్ళో ఎవరింట్లోనో ఏదైనా జరిగిందంటే ఆ టముకులోడు ఊరంతా డప్పు కొట్టుకుంటూ పోతాడు... ఫలానా ఇంట్లో భోజనాలు అంటూ."

"అవును, శుభలేఖల్లో కూడా బంధుమిత్రసపరివార సమేతంగా అని ఉంటుంది కదా."

"అదే .. సపరివారంగా ... ఇప్పుడేమో అక్కచెల్లెళ్ళు, అన్నదమ్ముల ఇళ్ళకి వెళ్ళాలంటే కూడా ఎప్పుడు రావచ్చు, ఎంతసేపుండొచ్చు అని అడిగాల."

లీల ఉలికిపాటు కప్పిపుచ్చుకుని అతనివేపు చూసింది.

అతను ఏదో ఆలోచిస్తున్నాడు వెనకటిరోజులు గుర్తొచ్చి.

"మీవయసువాళ్ళలో ఇలా వెనకటిరోజులు తలుచుకు విచారించడం తక్కువే. మీ అమ్మమ్మా, తాతయ్యలదగ్గర పెరిగేరేమిటి మీరు. మీకింత సాంప్రదాయాలమీద ఆసక్తి ఎలా వచ్చింది?"

"అదేం లేదండీ. మాయింట్లో మాఅమ్మా, నాన్నలే … వాళ్ళు అలానే ఉండేవాళ్ళు. మాది చిన్న పల్లె. అందరూ అందరికీ తెలిసినోళ్ళే. వాళ్ళు వేరూ, మనం వేరూ అనుకునేవాళ్ళం కాదు."

ఇద్దరూ కొంచెంసేపు మాటాడలేదు. లీల ఒకొక గిన్నె తీసి అవెన్లో పెడుతుంటే, కాస్త దూరంగా చూస్తూ నిలుచున్నాడు అహ్మద్.

"అసలు ఈ కులాలూ అవీ నిజంగా ఎప్పుడు పోతాయో?" అన్నాడు సాలోచనగా.

లీల ప్చ్ అంది, "పోతాయనుకోను, పోవాలి, పోవాలి అంటూ ఒట్టి అరుపులే కానీ నిజంగా పోవాలని ఎవరికీ ఉన్నట్టు లేదు. ఇందాకా ఆయనెవరో చెప్పినట్టు, ఒక కులం ఆధిపత్యం పోతే మరో కులం ఆధిపత్యం వస్తోంది. పైగా అవసరాలొచ్చినప్పుడు, మళ్లీ ఆకులంపేరే చెప్పుకు పబ్బం గడుపుకుంటున్నారు గానీ ఆదిపత్యం పోవడం అన్నది ఎక్కడా లేదు."

"ఏంచేతంటారు?"

"ఇందాకా ఆయనెవరో అన్నారు. వ్యక్తిధర్మం పోయి, వ్యక్తివిజయమే ధ్యేయం అయిపోయింది. మనకి ముఖ్యంగా హిందూ సంప్రదాయంలో మనిషికంటే కుటుంబం, కుటుంబంకంటె సమాజం ఎక్కువయినవి. ఎదురుగా మరో మనిషి ఉంటే, ఆమనిషికి ఇచ్చి, తరవాత తింటాం మనం. ఇప్పుడు అలా కాదు. నేను తిన్నతరవాత మిగిల్తే అవతలివాడికి ఇస్తాను, అది కూడా నాకు రేపటికి దాచుకోవాలి అన్న అలోచన లేకపోతేనే. ఎప్పుడయితే, కుటుంబంలో, సమాజంలో నా ప్రతిపత్తి నిర్ధారించుకోవాలి అన్న తపన మొదలయిందో అప్పుడే అహంకారం పెచ్చు రేగిపోతుంది. అహంభావం వేరు. అహంకారం వేరు. అహంభావంలో "నేను ఉన్నాను. ఈ 'నేను'ద్వారా, కుటుంబానికీ, సమాజానికీ నేను సేవ చేస్తున్నాను అన్న స్పృహ కలుగుతుంది. కలగాలి. అహంకారంలో నేను ఉన్నాను. నేను ఉన్నానని లోకుం గుర్తించాలి అన్న తపన ఉంటుంది. అది అనర్థాలకి దారి తీస్తుంది."

"వంటయిందా?" అంటూ సుందరం ప్రవేశించడంతో ఆ చర్చ అక్కడికి ఆగింది.

లీలకి అహ్మదుతో మాటాడ్డం తృప్తినిచ్చింది. అతను బయల్దేరుతుంటే, "వీలయినప్పుడు వస్తుండండి," అని చెప్పింది.

“అలాగేనండీ,” అన్నాడతను.

000

కీలుబొమ్మలు నవల చదువుతున్న పెద్దక్క ఠప్మని ఏదో కింద పడ్డ చప్పుడు వినిపించి, ఉలిక్కి పడి చుట్టూ చూసింది. ఏదీ కింద పడ్డ జాడ లేదు. వంటింట్లోకి వెళ్ళి చూసింది. అక్కడా గిన్నెలూ, పళ్ళేలూ ఎక్కడివక్కడే ఉన్నాయి. దట్ … దట్….

చప్పుళ్ళు కిటికివేపునించి వస్తున్నాయి. కిటికీదగ్గరికి వెళ్ళి చూసింది. ఎదురుగా ఏటిమీద నీళ్లు ఎగిరెగిరి పడుతున్నాయి. చేపలేమో? … దట్, దట్ లు ఎక్కువవుతున్నాయి. హో … ఉరుములు … తటిల్లతలు వరసగా రెండు అట్టహాసంగా మెరిసి ఆకాశంలో గుప్పున వెలిగేయి రెండు క్షణాలు.

కింద పచ్చలతివాసీలా పరుచుకున్న పచ్చగడ్డిమీద తెల్లగా వడగళ్ళు! ఉసిరికాయలంతేసి ఉన్నాయి … వడగళ్ళవాన!

పెద్దక్క గిరుక్కున వెనుదిరిగి టీవీ వెలిగించింది. తుఫానుపండితుడు విద్యుత్ బెత్తం పుచ్చుకుని తెరమీద టెక్సస్ బొమ్మలో ఎరుపు, పసుపు, పచ్చరంగులు గుర్తులతో ఎక్కడ ఎంత వాన పడుతోందో, ఎంత గాలి, ఎన్నివందల మైళ్ళవేగంతో వీస్తోందో వివరిస్తున్నాడు. సుడిగాలి, కుప్పకూల్తున్న ఇళ్ళు, ఎగిరిపోతున్న ట్రక్కులు … టోర్నెడో, తుఫాను, ఆరువందల పౌనుల ట్రక్కు గాలిపటంలా రెండువందల అడుగులు లేచి రెండువందల గజాలు పరుగెత్తి నేలకొరిగింది. ట్రైలర్లు, ఇళ్ళు, కార్లు కలగాపులగంగా ఎగిరి పడుతున్నాయి. బంగాళాఖాతంలో భీభత్సం మరోసారి దర్శించినట్టుంది. గోదావరిబ్రిడ్జిమీద హౌరామెయిలు కూలిపోయిననాటి జ్ఞాపకాలు. ఎదురుగా ఏటిలో టుప్పు టుప్పుమంటూ తుళ్లిపడుతున్న వడగళ్లు గోదావరిమీద లాంచిహోరుకి ఎగిరిపడే చేపపిల్లల్లా. జాలారిపేటలో బెస్తవాళ్ళగుడిసెలు ఎగిరిపోతున్న దృశ్యం … మనసులో గందరగోళం. ఎదుట భయంకరంగా విజృంభిస్తున్న ప్రకృతిలో అసమానసౌందర్యం. గబగబ కెమెరా తీసి నీటిమీద టుప్పుటుప్పుంటూ తుళ్లిపడుతున్న వడగళ్ళని పట్టాలన్న ఆరాటం. టీవీలో తుఫానుపండితుడి అరుపులు భద్రంగా ఉండే మూలలకి వెళ్ళి దాక్కోమని. ఆవిడ మాత్రం వరండాలోకెళ్ళి, కెమెరా తడవకుండా జాగ్రత్త పడుతూ, పాదాలమీద పడుతున్న వడగళ్ళకి ఉలికిపడుతూ క్లిక్ క్లిక్ మనిపించింది…. ప్చ్… ఈ సౌందర్యం ఈ గాజుకంటికెలా అనుతుంది? పెద్దక్కకి క్షణకాలం నిరాశ కలిగింది.

ఊళ్ళోనూ, విస్కాన్సిన్లోనూ ఉన్న స్నేహితురాళ్ళు పిలిచేరు తనక్షేమం కనుక్కుని, జాగ్రత్తగా ఉండమని హెచ్చరిస్తూ. ఆవిడకి దాక్కోవాలని లేదు. నిజానికి ఈ చుట్టుపట్ల టోర్నెడో హెచ్చరిక లేదు. ఆ భీభత్సానికి ముప్పైమైళ్ళ దూరంలో ఉంది తను.

తిరిగి గదిలోకొచ్చి సోఫాలో కూర్చుంది ప్రభారావుగారింట్లో కలిసినవ్యక్తులనీ, వారి తత్వాలనీ, ఆడిన నాటకాలగురించీ ఆలోచిస్తూ. లీల తనయింటికి వెళ్ళిపోయింది. ఎలా ఉందో! సుందరం మొదట ఆమెని ఎందుకు వెళ్ళనిచ్చేడో, మళ్ళీ ఎందుకు రమ్మన్నాడో ... విషి, అరవింద ఏమవుతారో. పట్టి చూస్తే లీలకి తను ఆదర్శం అయిందేమో అనిపించింది. అరవిందకి లీల ఆదర్శంలా ఉంది. లీల కూడా అలాగే అనుకుంటోంది కాబోలు. మరి అరవిందకోసం తాను సుందరందగ్గరికి వెళ్లడానికి సిద్ధపడిందా? హాహ్. ఈ కారణకార్యసంబంధాలు ... సిరిని అడగాలి. అరవింద వాళ్ళమ్మతో ఈ సంగతులు మాటాడుతున్నట్టు కనిపించదు, ఎంచేతో మరి. రామలక్ష్మికి సుమారుగా తనవయసే ఉంటుంది మరి అంత చాదస్తంగా మాటాడుతుందేం? ఆవిడకి మాత్రం తెలీదూ లోకం ఎంత మారిపోయిందో.

ఆరోజు రామలక్ష్మి మాటలు గుర్తుకొచ్చేయి. పెద్దక్క ఆలోచనలో పడిపోయింది.

000

షష్టిపూర్తివేడుకలు చల్లారేక, వచ్చినవాళ్లు వాళ్లఇళ్లకి వెళ్ళిపోయేక, ఓరోజు భోజనాలయేక, ఆయాసపడుతూ సోఫాలో వెనక్కి వాలి తీరిగ్గా కబుర్లు మొదలెట్టింది రామలక్ష్మి.

''మళ్ళీ మళ్లీ ఎక్కడొస్తాను. ఆ మూడు ముళ్లూ ఇప్పుడే వేసేయకూడదూ?'' అంది విషితో.

ఆ అబ్బాయి తెల్లబోయి, ''మూడు ముళ్ళూ ఆరు ముళ్ళూ ఏమిటి, ఎక్కడ వేయడం?'' అన్నాడు.

''అలా తెల్లమొహం వేస్తావేమిటి? మీనాన్న చెప్పేడు ఆ పిల్ల మనింటికోడలని.''

''హాఁ?''

''ఒఖ్ఖ నాతోనే ఏంటి, ఇంకా కొందరితో అంటుంటే కూడా విన్నాను.''

విషికి కోపం నషాళానికంటింది. ఆ క్షణంలో అతనిఎదుట ఆ తండ్రి ఉంటే, ''ఎందుకలా చెప్పేరూ?'' అని అరవకపోయినా, కనీసం అలాటిదే మరేదో అని ఉండేవాడేమో నసుగుతూనే. కానీ ఆయనక్కడ లేడు. ఆయన ఎక్కడున్నాడో వెతికి పట్టుకుని, ''ఎందుకలా చెప్పేవు?'' అని అడిగే దమ్ముల్లేవు అతనికి. పోనీ, అలాగని ఊరుకుంటే, ఈ అత్తమ్మ వెళ్ళి ఇండియా అంతటా

చాటేస్తుంది. లేదు, ఏదో హాస్యానికనుంటారు అనుకోడానికి లేదు. ఇంకా కొందరితో అన్నారంటోంది ఈవిడ. అంతమందితో హాస్యాలేమిటి? అసలిప్పటికే వాళ్లు మిగతా దేశీజనానికి అందించేసి ఉంటారు ఈ ఉప్పు!

విషి కుతకుత ఉడికిపోతూ వీధిలోకి వెళ్లిపోయేడు.

000

తమక్లాసులో మకుటంలేని మహరాజు జెస్సీ. అతనితండ్రి షోకు కారులు అమ్మే కంపెనీకి యజమాని. ఊరిపెద్దలందరితోనూ సత్సంబంధాలున్నాయి ఆయనకి. అంచేత సహజంగానే సహాధ్యాయులందరూ జెస్సీతో స్నేహానికి ఎంతో ఉత్సాహం చూపుతారు. అతను వాళ్ళనాన్న కంపెనీలో కొత్తగా వచ్చిన కార్లగురించి మాటాడుతుంటే పాములవాడు నాగస్వరం ఊదుతున్నట్టుంటుంది సాటి పిల్లలకి. అతనిపిలుపుని కాదనేవాళ్ళు లేరు ఆప్రాంతాల్లో. కాదనడం అనర్థకం.

జెస్సీ తన పుట్టినరోజు పార్టీకీ విషినీ, అరవిందనీ పిలుద్దామా వద్దా అన్న తర్జనభర్జనలో కొంతకాలం వెచ్చించేడు. అతనికి తెలిసినంతవరకూ వీళ్ళిద్దరూ బ్రేకప్పూ మేకప్పుల మధ్య ఊగిసలాడున్నారు. ప్రస్తుతం బ్రేకప్పా మేకప్పా అన్నది సరిగా తెలీడంలేదు. బ్రేకప్పయితే తాను ఇద్దర్నీ పిలిచి మళ్లీ వాళ్లు కలుసుకనేస్థితి కల్పించినవాడు కాగలడు. కలిసిఉన్న స్థితి అయితే బాధే లేదు. రకరకాల ఆలోచనలు చేసి, ఆఖరికి వాళ్లే తేల్చుకుంటారులే అనుకున్నాడు. పిలుపులు వెళ్లేయి.

000

అరవింద తమయింటికి వచ్చినందుకు సంతోషంతోనూ, వాళ్ళనాన్న ఆ అమ్మాయిని తమకోడలుగా ప్రచారం చేసినందుకు కోపంతోనూ ఉడికిపోతోంది విషి హృదయం. పైగా ఆ విషయం అరవిందకి తెలుసోతెలీదో తెలీదు. అది మరో బాధ. పోనీ, అడిగి చూద్దాం అంటే, ఏమని అడగడం? "ఆమాట నిజం కాదని నువ్వెందుకు చెప్పలేదూ?" అని అరు అడిగితే ఏం చెప్పడం? మరోపక్క నిజం కాదని ఆ జనాలనే పిలిచి చెప్దాం అంటే ఆయన ఎవరికి చెప్పేరో తెలిస్తే కదా, పిలిచి పట్టించుకోకండి అని చెప్పడానికి. ...

000

"ఏళ్ళొచ్చినా పోకిరీవేషాలు పోలేద"న్న ఆడబడుచుమాటలు శివానీని కొరుక్కుతినేస్తున్నాయి. ఇంటికొచ్చిన ఆడబడుచు! ఆవిడ్ని ఏమీ అన్లేకా ఊరుకోలేకా గిజగిజలాడిపోతోంది ఆవిడ. ఆవిడ

అన్నందుకు కాదు కానీ అందులో ఏదో నిజం పొడగట్టి మరింత వేగిపోతోంది మనసు - మొగుడు కొట్టినందుక్కాదు ఆడబడుచు నవ్వినందుకు అన్నసామెతగా ఉంది. ... ఈయనకైనా బుద్ధుండొద్దూ. చిన్నా, పెద్దా, తెలిసినవాళ్ళు, అట్టే తెలీనివాళ్లూ, దగ్గరవాళ్ళూ, దూరంవాళ్ళూ ఇంతమంది ఉన్నారు అక్కడ. ఎంత స్థానికులు అనుకున్నా మన పరిస్థితులు ఏమిటో, సందర్భం ఏమిటో చూసుకోనక్ఖర్లేదూ ... అసలు అమెరికా అంటేనే మనవాళ్లకి, ముఖ్యంగా ఇండియానించి కొత్తగా దిగిన కొత్తసరుకుకి చిన్నచూపు. ఇక్కడున్నవాళ్ళకి నీతీ జాతీ లేదని. ఇహ ఇక్కడున్న మనవాళ్ళ మాట చెప్పుకోవాలీ? ఇక్కడ స్థిరపడ్డ కొందర్ని చూస్తే ఇక్ష్వాకుల కాలంలోంచి ఊడిపడ్డట్టు కనిపిస్తారు. ఆమాటా తీరూ చూస్తే ఇంత చాదస్తంగా ఎవరైనా ఉండగలరా అని ఆశ్చర్యపోతాం. ఇండియాలోనే ఇలా లేదు అంటారు వీళ్ళే మళ్లీ. ఇక్కడేమో అయినవాళ్ళనీ కానివాళ్ళనీ నోటికొచ్చినన్నట్టు మాటలనడం, వాళ్ళిలా వీళ్ళిలా అంటూ ఎకసక్కాలూ, ఎక్కడెక్కడివాళ్ల ఆరాలు ఎక్కతీసి హాహాహాహా అని నవ్వుకుంటూ వీళ్ళాడుకునే నొల్లు కబుర్లు - చూస్తుంటే ఒళ్లు మండిపోతుంది. ఆ మానవులు మనం ఆడే మాట, చేసే పనీ ఎవరికి ఎక్కడ ఎలా తగుల్తుందో అనైనా చూసుకోరు. నవనాగరీకం అంతా బట్టల్లోనూ నగల్లోనే.

టీవీలో Pen State Coach శాండస్కీ దౌర్జన్యం ఘోరాతిఘోరంగా వర్ణిస్తున్నాడు రిపోర్టరు. రామలక్ష్మికి అర్థం కాలేదు. "ఏంవంటాడాయన?" అనడిగింది మరదల్ని.

శివాని నాలుగు ముక్కల్లో ఆ కోచ్ పదిమంది మగపిల్లలమీద జరిపిన అత్యాచారాలు అంది.

"అంతేనా, ఈయనేం చేసేడో, వాళ్ళేం అనుకున్నారో. దానికింత గొడవేంటి?" అందావిడ.

శివాని ఆశ్చర్యంగా వదినగారివేపు చూసి, "చిన్నపిల్లలమీద అత్యాచారం దారుణం కాదా?" అంది.

"పాపం, ఆయనేదో ఆ క్షణానికి ఏదో చేసేడే అనుకో. అసలు ఆయనేం చేసేడో వాళ్లేం అర్థం చేసుకున్నారో. పైగా పిల్లలు అబద్ధాలు ఆడతారు. నేను చాలా మందినే చూసేను. దొంగవేషాలు స్కూలుపని తప్పించుకోడానికి. అసలు తల్లిదండ్రులు చెప్పక్కర్లేదూ జాగ్రత్తగా ఉండాలని."

"బుద్ధి ఉండాల్సింది పెద్దలకి. పిల్లలన్నంటారేమిటి?" అంది శివాని చురుగ్గా వదినగారివేపు చూసి.

ఆవిడకి పాతకథలు గుర్తుకొచ్చేయి. ఈ వదినగారు వాళ్ళాయనసంగతి మరిచిపోయేరా? తను మరిచిపోయింది అనుకుంటున్నారా? పాపం, తాయారు మెట్రిక్ పరీక్ష రాయడానికి వచ్చింది. ఆ నాలుగురోజులు వీళ్ళింట్లో పెట్టుకోమని తండ్రి తమయింటికి తీసుకొచ్చేరు. ఆ పిల్ల వచ్చిందగ్గర్నుంచి అన్నయ్యగారి ఆరాటం అంతా ఇంతానా? ఆపిల్లకేం కావాలో చూడు, చూడు

అంటూ ఇటు భార్యకీ, నీకేం కావాల్సినా నాకు చెప్పు అంటూ అటు ఆ పిల్లకీ చెప్తూ ఒఖ్ఖలా తైతక్కలాడేరు రాత్రీ పగలూ. రెండోరోజుకి మరింత రెచ్చిపోయేరు. తింటున్న జాంపండు ఆపిల్లకిచ్చి, "ఫరవాలేదులే. మనలో మనకి ఎంగిలేమిటి? ఇలా రా, పక్కన కూర్చో, కూతురులాటిదానివి," అంటూ మీద మీద పడిపోడం, ముద్దు పెట్టుకోడం, ఒళ్ళంతా తడమడం చేస్తుంటే, పాపం, ఆ పిల్లకి ఏం చెయ్యాలో తెలీక అల్లాడిపోయింది. రామలక్ష్మితో చెప్తే, ఆవిడ ఆ పిల్లనే కేకలేసింది, "ఛూ, ఎంతకి తెగించేవు. సాక్షాత్తూ శ్రీరామచంద్రమూర్తిలాటి పుణ్యాత్ముడు. ఆయన్ని అనడానికి నీకెలా నోరొచ్చింది. మాకు ఆడపిల్లల్లేరని నిన్ను దగ్గరికి తీసుకుని ముద్దు చేస్తుంటే, నీకు చేదయిపోయిందా? మంచిపనే చేసేవు తల్లీ, నాలుగు రోజులే కదా అని, మీనాన్న బతిమాల్తే సరేనని ఇంట్లో పెట్టుకుంటే మంచి మర్యాదే చేసేవు," అంటూ దులిపేసింది. ఆ అమ్మాయి వచ్చి తనతో చెప్పుకుని ఏడుస్తుంటే, ఏం చెయ్యడానికీ తోచక, "మరో రెండ్రోజులే కదా. వచ్చి నాగదిలో పడుకో," అని సలహా ఇచ్చింది శివాని. అప్పటికీ రామలక్ష్మి ఊరుకోక, "సావిట్లో పడుకోమంటే, మరదలిగదిలో దూరేవేం?" అని నిలదీసింది. "నాకు కొన్ని పాఠాలు అర్థం కావడంలేదండి. పిన్నిగారు చెబుతానంటే వాళ్లగదికి వెళ్ళేను," అని చెప్పుకుందిట.

ఆ తరవాత ఆర్నెల్లవరకూ రామలక్ష్మి అడిగినవాళ్ళకీ అడగనివాళ్ళకీ చెప్తూనే వచ్చింది ఆ తాయారు ఎంత టక్కులాడి ఆటలాడిందో, అపర శ్రీరామచంద్రమూర్తివంటి ఉత్తముడిమీద ఎలాటి అపనిందలు వేసిందో.

ఆ రామలక్ష్మే ఈనాడు తమ్ముడిని తప్పు పడుతోంది. ఆశ్చర్యం ఎక్కడంటే సాండస్కీ అంటే సానుభూతి తెల్లతోలు కనకా? మనవాళ్లకి కూడా తెల్లతోలంటే భక్తే. శివాని నిట్టూర్చింది. సైంధవుడినించీ సాండస్కీవరకూ యుగాలు మారినా, దేశాలూ, జాతులూ మారినా దౌర్జన్యానికి మార్పు లేదు. మానవులలో దుష్టగుణం ఎప్పుడూ ఉంటూనే ఉంది. ఉంటుంది కూడా. "Sorrows of Satan లో చెప్పినట్టు, సాతాను విచారిస్తున్నాడు, "నన్ను నువ్వు అదుపులో పెట్టగలిగితే నన్నూ, నిన్నూ కూడా రక్షించుకోవచ్చు," అని.

పాపం, అరవింద! ఆ అమ్మాయి ఈ ఉచ్చులో చిక్కుకున్నందుకు శివానికి జాలేసింది. లక్షణమైన పిల్ల, చక్కగా చదువుకుంటోంది, ఇప్పట్నించే ఎందుకు ఆ అమ్మాయిని ఈ పెళ్ళిపేరుతో హైరాన పెట్టడం? తనసంగతీ ఇంతే అయింది అప్పట్లో. హాయిగా చదువుకుంటుంటే ఈయనగారు వచ్చి ప్రేమా దోమా అంటూ ఊదరపెట్టేస్తుంటే, నాన్నగారు కూడా ఆయనకే వత్తాసు పలికి పెళ్ళి

జరిపించేసేరు. చదువుకుంటానంటూ తను పెట్టిన రాగాలు ఎవరికీ పట్టలేదు. ఆఖరికి అమ్మ కూడా ఆడపిల్లకి పెళ్లే ప్రధానం, ఎప్పటికేనా పెళ్ళి చేసుకుని స్థిరవలసిందే అంటూ అటే మొగ్గింది.

000

ప్రభాస్రావుఇంట్లో జరిగిన నాటకం అరవిందకి తల్చుకున్నకొద్దీ చిరాకు ఎక్కువయిపోతోంది.

ప్రభాస్రావు తనకి ముత్యాలదండ ఇవ్వడం, తనతో డాన్సు చెయ్యడం, దానిమీద రామలక్ష్మి వ్యాఖ్యానం - ఇందులో తనతప్పేమిటో, అసలు అందులో తనవంతు ఎంతో, అదేమిటో అర్థం కాక సతమతమవుతోంది.

"నువ్వెందుకు వేరే బహుమానం తీసుకొచ్చేవూ ఆయనకోసం. మీ అమ్మా, నాన్నగారూ ఏదో తెచ్చేరు కదా. నువ్వూ ఆ కుటుంబంలో మనిషివే కదా," అంటూ ఎగిరిపడ్డాడు విషి.

"నేనంతగా ఆలోచించలేదు. ఆయన మాఅమ్మానాన్నలని పిలిచినతరవాత మళ్ళీ నన్ను ఫోనులో పిలిచి చెప్పేరు. ఆరోజు బజారులో తిరుగుతుంటే ఆ పుస్తకం కనిపించింది. మీఅమ్మకీ నాన్నగారికీ కూడా బాగుంటుందని కొన్నాను. అంతమాత్రాన నాకేవో కుళ్లు బుద్ధులున్నట్టు మాట్లాడతావేమిటి?" అని విసుక్కుంది అరవింద.

"నువ్వు అస్తమానం ఆయనతో ఫోనులో మాటాడుతున్నావు కనక ఆయన నీకు ప్రత్యేకంగా ఫోను చేసేరు."

"ఇది మరీ బాగుంది. ఆయన పిలిస్తే ఫోను తియ్యకుండా ఊరుకోమంటావా? అప్పుడు నువ్వే అంటావు, నాకు మర్యాద తెలీదని."

"నేనెందుకంటాను? నువ్వు నా స్నేహితురాలివా, ఆయనస్నేహితురాలివా?"

ఘ్ఁఘ్ఁఘ్ఁఁఁ అరవింద పెదిమలు బిగించి గర్జిస్తూ చేతులు గాల్లోకి విసిరి అతడిమాటపట్ల తనఅసంతృప్తిని తెలియజేసింది.

విషి వదల్లేదు, "ఆ ముత్యాలదండ ఎందుకు పుచ్చుకున్నావు?"

"ఎందుకిచ్చేరూ అని మీనాన్నగారినే అడగరాదా?"

"ఆయనకేం తెలుస్తాయి నీసైగలు. కనిపించే అర్థాలు చూసి ఏదో అనుకుంటారాయన. ఆయన ఇక్కడ పుట్టి పెరిగినవాడా? నీకే తెలియాలి నీమాటలతోనూ, చేతలతోనూ ఆయన్నెలా కవ్విస్తున్నావో."

అరవింద రెండోసారి కళ్ళలో ఎరుపుజీరలు ఝుళిపిస్తూ, ''ఫో, అవతలికి ఫో'' అని అతన్ని కసిరి, తనే లేచి బయటికి వెళ్లిపోయిందారోజు.

ఇప్పుడు ఆపిల్లని అదే మరింత బాధిస్తోంది. తను మాటల్లో గానీ చేతల్లో గానీ ఆయనకి తప్పుడు ఆలోచనలు కలగడానికి ఆస్కారమిచ్చిందా? ఎప్పుడు? ఎక్కడ? ఎలా?

ఇంకో వేపు నిజంగా తను విషితో స్థిరపడితే ఎలా ఉంటుందో అన్న ఆలోచన కూడా వచ్చింది. లీలక్కయ్య మళ్ళీ ఇంటికి వెళ్ళిపోయిందిట. ఎందుకో స్పష్టంగా తెలియకపోయినా బాగుందనే అనిపిస్తోంది. కానీ అసలు ఎందుకు వచ్చేసిందో, మళ్ళీ ఎందుకు వెళ్ళిందో తెలిస్తే బాగుండు. ఏమిటి ముందటికీ ఇప్పటికీ తేడా? సుందరంగారు క్షమాపణ చెప్పుకున్నారా? అసలు ఆయన క్షమాపణ చెప్పవలసిన అవుసరం ఉందా? అదేమయి ఉంటుంది? తను ఎందుకనుకోవాలి అలా? లేకపోతే, లీలక్కయ్య ఉత్తపుణ్యానికి ఎందుకు ఆ యింటినించి వచ్చేస్తుంది? ఆవిడేమంత తెలివితక్కువది కాదు. నిజంగా ఏం జరిగిందో? పెద్దక్కదగ్గర ఉంది కనక ఆవిడకి తెలుసేమో. తెలిస్తే మాత్రం తనకి చెప్తారా? అసలు అడగడం మాత్రం ఏం బావుంటుంది? అది కాదు, లీలక్కయ్యంటే తనకి ఎంతో గౌరవం. అంచేత ఆవిడ అసలేం జరిగిందో తెలిస్తే, తను నిర్ణయాలు చేసుకోడానికి ఉపయోగపడుతుందేమో ...

వీటన్నటికంటే అవశ్యం తను చేసుకోవలసిన నిర్ణయం - జెస్సీయింటికి వెళ్ళడమా, మానడమా. విషి తప్పకుండా వస్తాడు. అక్కడేం తగువులు పెడతాడో మళ్లీ.

అరవింద ముస్తాబవుతుంటే ఫోనొచ్చింది. స్నేహితురాలు కాథీ పిలిచింది జెస్సీ ఇంటికి వస్తున్నావా అని అడగడానికి.

''ఆలోచిస్తున్నా,'' అంది అరవింద కనుబొమ్మలు దిద్దుకుంటూ.

''ఏం?''

''విషి కూడా వస్తాడు కదా, మళ్ళీ ఏం గొడవ చేస్తాడో.''

''ఛ, పోదూ. నీకు రావాలనుందా లేదా అదీ ముఖ్యం.''

''నాకు రావాలనే ఉంది.''

''అయితే రా. నేను కూడా వస్తున్నా.''

''అంతేనంటావా?''

“అంతే మరి. అతనికి తెలియాలి. నీకిష్టం వచ్చినట్టు నువ్వుండే అధికారం నీకుంది. దాన్ని గౌరవించే జ్ఞానం అతనికుండాలి.”

“సరే. ఆరుగంటలకి రానా?”

“ఏ డ్రెస్సు వేసుకుంటున్నావు.”

“మొన్న ఆదివారం కొన్నాం కదా. అదే అనుకుంటున్నా. నువ్వు?”

“ఆ, అది బాగుంటుంది. ఆ ముత్యాలదండ కూడా వేసుకుంటావా?”

“ఏమో. చూస్తున్నా.”

“చూడ్డం ఏమిటి? వేసుకో. దానికి సరిగ్గా నప్పుతుందని అప్పుడే అనుకున్నాం కదా.”

“విషి ...”

“హెయ్. మళ్ళీ అదే మాటా. చెప్పేను కదా. అతనికి తెలియాలి నీయిష్టాయిష్టాలేమిటో.”

“అవుననుకో.”

“అనుకోడాలూ లేదు, ఆడుకోడాలూ లేదు. వేసుకు రా. అటో యిటో తేలిపోతుంది.”

“అదీ నిజమే. తుమ్మితే ఊడిపోయే ముక్కులా ఎంతకని పట్టుక్కూచుంటాం. ఇప్పుడే తేల్చేసుకుంటే గొడవొదిలిపోతుంది.”

ఇద్దరూ మరో పావుగంట తమ అలంకరణలగురించీ, మిగతావారి అలంకరణలగురించి మాటాడుకుని, సరేనంటే, సరేననుకుని ఫోనులు మూసేసేరు.

000

జెస్సీ ఇంట్లో పార్టీ ఘనంగానే ఏర్పాటు చేసేడు. సమయానికి అతని అమ్మా, నాన్నా న్యూయార్క్ వెళ్ళడంచేత ఇల్లంతా అతడి అన్నగారిహయాంలోకి వచ్చేసింది ఆపూట. తదనుగుణంగా పెద్ద ఎత్తున పార్టీ ఏర్పాటు చేసేరు ఇద్దరూ కలిసి. “మేం వచ్చేక మళ్ళీ పండుగ చేద్దాం, ఇప్పుడు నీక్కావలసినట్టు చేసుకో,” అని చెప్పేట్ట తండ్రి.

సాయంత్రం అయిదున్నరయింది. ఒకొకళ్ళే స్నేహితులతోనూ, స్నేహితురాళ్లతోనూ వస్తున్నారు. తినడానికి రకరకాల తినుబండారాలూ, తాగడానికి పంచీ గదిలో ఓ పక్కన ఉన్నాయి. సంగీతం గదంతా ఆక్రమించుకుంది నాలుగుమూలలా అమర్చిన సౌండు సిస్టముద్వారా.

విషి రాగానే అతనికళ్ళలో మొట్టమొదట సూదిలా గుచ్చుకున్నది అరవింద వేసుకున్న సన్నని ముత్యాలగొలుసు. దగ్గరకొచ్చి అతను ఏదో అనేలోపున పక్కనున్న కాథీ "అరూ ఎంత అందంగా ఉందో, ఆ ముత్యాలగొలుసుతో కళ్లు చెదిరేలా లేదూ," అంది.

"మ్ లేదు," అన్నాడు విషి.

"నాకు బావున్నందుకైనా బాగుందిలే అనొచ్చు కదా," అంది అరవింద.

"నాకు బాగుండదని తెలిసీ ఎందుకు వేసుకొచ్చేవు, నన్ను కవ్వించడానికి కాకపోతే."

"నీకు నాయిష్టాయిష్టాలు కూడా తెలుస్తాయని. మనం స్నేహంగా ఉండాలంటే నీకు నాయిష్టాలు కూడా తెలియాలి కదా."

"నీయిష్టాలు తెలుస్తూనే ఉన్నాయి."

"సరేలే. తరవాత మాటాడుకుందాం, ఇక్కడేమిటి."

"హు"మ్మని విసుక్కుంటూ విషి పంచ్ కుండవేపు వెళ్ళిపోయేడు.

అరవింద ఆ గొడవొదిలేసి  పక్కనున్న మరో అమ్మాయితో కబుర్లు మొదలుపెట్టింది.

విషి మాత్రం వాళ్ళవేపు చూపులతూపులు విసుర్తూ, బుసలు కొడుతూ, మింగలేక కక్కలేక మల్లగుల్లాలు పడుతున్నాడు.

వీళ్ళిద్దర్నీ ఆదినించీ గమనిస్తున్న బెటీ విషిదగ్గరకొచ్చి "హెయ్" అంది. విషి యాంత్రికంగా హెయ్ అన్నాడు జవాబుగా. ఆ తరవాత బెటీవేపు చూసేడు. చేతిలో ఉన్న పంచి కప్పు అందిస్తూ, "ఇంద" అన్నాడు. బెటీ కొంటెగా అరవిందని చూస్తూ అతనిభుజాలమీదకి విలాసంగా వంగింది. విషి మరింత దగ్గరగా జరుగుతూ అరవిందవేపు చూసేడు.

అరవింద తనలోకంలో ఉంది. ఆ అమ్మాయిచుట్టూ మరో నలుగురు చేరేరు. అందరూ కబుర్లలో మునిగిపోయి ఉన్నారు. ఏ అమ్మాయికి ఏ అబ్బాయిమీద మనసుంది, ఏ అబ్బాయి క్యూటు, ఎవరు డోర్కు, ఎవరంటే ఎవరు పడి చస్తారూ, ఏ పిల్ల ఏ బ్లౌజు ఎవరికోసం ధరించింది ... హుషారుగా గలగల నవ్వులతో సాగిపోతున్నాయి.

విషికి మరింత రోషం పొడుచుకొచ్చింది. అరుకి తనమీద ప్రేమ ఉంటే, తనదగ్గరకొచ్చి క్షమాపణలు చెప్పుకుని, తనని శాంతపరచాలి కానీ ఏమీ జరగనట్టు, తనకేమీ తెలీనట్టు అంత హాయిగా స్నేహితులతో కబుర్లు చెప్పుకుంటూ ఊరుకుంటుందా?

బెటీవేపు చూసేడు. ఈ అమ్మాయికి తనంటే ఇష్టం. ఆ ఇష్టాన్ని అనేక సమయాల్లో అనేకవిధాల తెలియజేస్తూనే ఉంది. క్లాసులో తనపక్కనే కూర్చోడానికి తాపత్రయపడుతుంది. తనకి కాయితాలూ, పుస్తకాలూ అందిస్తూ ఉంటుంది. టీచరు ప్రశ్నలడిగినప్పుడు, రహస్యంగా జవాబులందిస్తుంది.

విషి మరోమారు అరవిందవేపు చూసేడు. అటూ ఇటూ చూస్తున్న అరవింద విషివేపు చూసి చిన్నగా తలూపింది. విషి బెటీభుజంమీద చెయ్యేసి, గలగల నవ్వుతూ ఏదో చెప్పడం మొదలెట్టేడు. బెటీకి కొంచెం తికమక అయింది కానీ వెంటనే అతనిధోరణి తెలిసిపోయింది. అతణ్ణి గట్టిగా కౌగలించుకుని, పక్కకి లాగింది రా డాన్సు చేద్దాం అంటూ. విషి బెటీయే తనలోకం అన్నంతగా ఆపిల్లకి చుట్టుకుపోయేడు. రాను రాను హాల్లో గోల పెచ్చు రేగిపోతోంది.

జెస్సీ హె, హె అంటూ మేకల్ని తోలినట్టు అరుస్తూ వాళ్ళని శాంతపరచడానికి ప్రయత్నించేడు కానీ ఎవరూ వినిపించుకోడంలేదు.

అరవిందకి కూడా కాస్త భయం వేసింది. కాథీతో ఆమాటే అంది, "పద. మాయింటికెళ్ళిపోదాం. ఇక్కడ ఉంటే పరువు దక్కేట్టు లేదు." ఇద్దరూ బయటికెళ్ళిపోయేరు.

హాల్లో గోలతో ఇల్లు అదిరిపోతోంది గాలివానకి ఊగినట్టు. పక్కింటాయన ఫోనులో జెస్సీని పిలిచి, వాళ్ళ అరుపులతో తమకి నిద్రాభంగమవుతోందనీ, కాస్త అదుపులో పెట్టమనీ చెప్పేడు. జెస్సీ సరేనన్నాడు కానీ అతను చెయ్యగలిగిందేమీ లేదు. ఎవరూ అతనిమాట వినిపించుకోడం లేదు.

ఒంటిగంట దాటింది.

వాకిట్లో సైరన్లు వినిపించేయి. పోలీసులు తలుపు తట్టేరు. జెస్సీ తీసి, "ఏంటి?" అన్నాడు.

"Disturbance అని ఇరుగూపొరుగూ ఫిర్యాదు చేసేరు. ఇంట్లో పెద్దవాళ్ళెవరూ లేరా?" అనడిగేడు ఆ పోలీసు.

తనకి మైనారిటీ తీరిందనీ తానే పెద్దననీ చెప్పేడు.

"సరే నువ్వు కూడా పద," అని పోలీసులు జెస్సీనీ, మరోపదిమందినీ అరెస్టు చేసేరు. ఆ పదిమందిలో ఒకడు విషి.

"ఒంటిమీద చెయ్యెయ్యకు. నేనెవరో తెలుసా? మానాన్నతో చెప్పి నీ ఉద్యోగానికి స్వస్తి చెప్పించగలను," అన్నాడు మైకల్.

జెస్సీ బెదిరిపోతూ, "అలా మాటాడకు. అసలే వాళ్ళకి కోపంగా ఉంది," అంటూ అన్నని శాంతపరచబోయేడు.

"ష్, మాటాడకు. నేను వాళ్ళచేత గడ్డి తినిపించకపోతే చూడు."

"ఇప్పటికి నీమీద ఛార్జీలు Public disturbance, underage drinking, breaking curfew, serving alcohol to minors. దానికి resistence to surrender కూడా చేర్చమంటావా?," అన్నాడు పోలీసు.

దాంతో మైకల్ తగ్గిపోయేడు.

అందర్నీ ఆపూటకి జైలుగదుల్లోకి తోసి పోలీసులు వెళ్ళిపోయేరు. తెల్లారేక, కాఫీలు, డోనెట్లూ అయేక పోలీసులు అబ్బాయిలనీ, అమ్మాయిలని వాళ్ల అమ్మలకీ నాన్నలకీ ఫోన్ చెయ్యడానికి అనుమతిచ్చేరు.

000

పొద్దున్నే లేచి కాఫీ సేవిస్తూ టీవీలో వార్తలు చూస్తున్న ప్రభాస్రావు ఫోను మోగడంతో, "ఇంత పొద్దున్నే ఎవరా?" అనుకుంటూ ఫోను తీసేడు.

"నేనూ విషిని."

"పక్కమీంచే పిలుపులేమిటి, మంచం దిగి రాలేవూ?" అంటూ విసుక్కున్నాడు ప్రభాస్రావు.

"పక్కమీద లేను. పోలీసు స్టేషనునించి."

"హా" అంటూ ప్రభాస్రావు అరిచిన అరుపుకి వంటింట్లో ఉప్మా చేస్తున్న శివాని, స్నానం చేసి గదిలోకి వస్తున్న రామలక్ష్మి అదిరిపడి హాల్లోకి వచ్చేరు.

"ఏంటయింది?" అంది రామలక్ష్మి.

ప్రభాస్రావు భార్యవేపు ఉరిమి చూస్తూ, "నీ సుపుత్రుడు జైల్లోంచి పిలుస్తున్నాడు," అన్నాడు.

"ఆఁ జైలా?"

"ఏమైంది? అక్కడికెలా చేరేవు?" అనడిగేడు ప్రభాస్రావు ఫోనులో.

విషి రాత్రి పార్టీలో ఎవరో పంచిలో విస్కీ కలిపేరనీ, దాంతో గలాటా అయిందనీ చెప్పి, వచ్చి విడిపించమని అడిగేడు.

"అక్కడ మైకల్ లేడూ, పంచిలో విస్కీ కలుపుతుంటే చూస్తూ ఊరుకున్నాడా?"

"ఉన్నాడక్కడే కానీ చూడలేదు. తరవాత చెప్తాను. ముందు మీరొచ్చి నన్ను విడిపించండి," అన్నాడు విషి దాదాపు ఏడుపుగొంతుతో.

"దౌర్భాగ్యుడా, అసలు నువ్వీ తాగుడు ఎప్పుడు మొదలుపెట్టేవు?"

"నేను తాగలేదు. ముందు స్టేషనుకొచ్చి బెయిలిచ్చి విడిపించండి," అన్నాడు విషి మళ్లీ.

ఇటు శివానీ కూడా ప్రభాస్రావుని వెళ్లమని తొందర పెట్టింది.

తాగుడు, జైలు మాటలు వినగానే రామలక్ష్మి రాగాలందుకుంది, "ఏంటీ కుర్రాడు జైల్లో పడ్డాడా? ఎంత అప్రతిష్ఠ. ఎవరైనా వింటే మొహంమీద ఉమ్మేయరూ? వాళ్లడిగితే ఏం జవాబు చెప్పడం? మొహం ఎక్కడ పెట్టుకోడం? ఇంటా వంటా లేదు ఇలాటి నికృష్టపువేషాలు. మేమూ పిల్లల్ని పెంచేం. ఎక్కడయినా విన్నామా ఇలాటి రౌడీవేషాలు ..."

"అబ్బబ్బ, నోరు మూసుకో నువ్వు," ప్రభాస్రావు అరిచేడు.

"ఇది బాగుందిరా. కొడుకుని అదుపులో పెట్టుకోలేక నన్నంటావేమిటి?" అంటూ శోకన్నాలు మొదలెట్టిందావిడ.

"మీరు బయల్దేరండి," అంది శివాని.

ప్రభాస్రావు చిరచిరలాడుతూ బట్టలు మార్చుకుని బయల్దేరేడు.

రామలక్ష్మి శివానివేపు తిరిగింది, "మగమహరాజు. వాడికేం తెలుస్తుంది పిల్లలపెంపకం, నీకుండాలి గానీ. ఆడదానిచేతి అర్థం మగవాడిచేతి బిడ్డ అన్నారు. నువ్వేనా చూసుకోనక్కర్లేదు, పిల్లడేం చేస్తున్నాడో, ఎక్కడెక్కడ తిరుగుతున్నాడో."

శివాని కొడుకుగురించి ఆరాటపడుతోంది. ఆడబడుచువేపు ఓ చూపు విసిరి వెనుదిరిగి వంటింట్లోకి వెళ్ళిపోయిందావిడ.

ప్రభాస్రావుకి కారెక్కగానే మరోవిషయం స్ఫురించింది. అరవింద ఎక్కడుంది? ఆ పిల్ల కూడా జైల్లో ఉందా? ఎవరైనా విడిపించేరా? జేబులోంచి ఫోను తీసి, అరవిందని పిలిచేడు.

సగం నిద్రలో మగతగా ఫోనందుకుని, "హలో" అంది అరవింద.

"నేనే ప్రభాస్. ఎక్కడున్నావు?"

"ఏంటి?"

"నువ్వు కూడా జైల్లోంచేనా? నిన్నెవరు విడిపించేరు?"

"జైలా? జైలేంటి? ఎవరు జైల్లో ఉన్నారు?"

"నువ్వెక్కడినించి మాటాడుతున్నావు?"

"మాయింటినించే. ఏమైందసలు? నాకర్థం కావడంలేదు."

"రాత్రి నువ్వు పార్టీకి వెళ్ళలేదూ?"

"వెళ్ళేను కానీ ఎక్కువసేపు ఉండలేదు. ఏమయింది?" అరవిందకి చిరాకేస్తోంది. అసలుసంగతి చెప్పడేం?

అంతకి నాలుగింతలు కోపం వచ్చింది ప్రభాస్రావుకి. అబ్బాయిని పోలీసులకప్పజెప్పి, ఈపిల్ల తెలివిగా తప్పించుకు వచ్చేసింది. "ఏమైందా? మన ప్రబుద్ధుడు జైల్లో ఉన్నాడు. ఇదంతా నీనించే."

అరవిందకి నిద్రమత్తు వొదిలిపోయింది. నోట మాట రాక, పైకప్పుకేసి చూస్తూ, సెల్లు చెవికి ఆనించి ఓ పావుగంట వింది ఆ ప్రసారం.

ఆ అమ్మాయి తనమాటలు వినడం లేదేమోనని అనుమానం వచ్చిందాయనకి, "వెళ్ళు. నువ్వే వెళ్ళి వాణ్ణి విడిపించుకు రా. నువ్వు చేసుకున్న ఖర్మ," అన్నారాయన విసురుగా.

"వెళ్ళను," అనేసి అరవింద ఫోను బల్లమీద పడేసింది.

శివాని కిటికీలోంచి వాకిట్లో కదలని కారూ, కారులో కూర్చున్న ప్రభాస్రావునీ చూస్తోంది. చూస్తున్నకొద్దీ ఒళ్ళు మండిపోతోంది. ఆవిడ తేలిగ్గానే ఊహించింది అక్కడేం జరుగుతోందో. గబుక్కున లేచి కారుదగ్గరికెళ్ళి ముందుకి ఒంగి, సూటిగా చూస్తూ, "ముందెళ్ళి వాణ్ణి విడిపించుకు రండి," అంది శాంతంగా.

ప్రభాస్రావు ఉలికిపడి గిరుక్కున అటు తిరిగి ఆవిడవేపు చూసేడు తీక్షణంగా, ఫాలాక్షుడు మన్మథుడిని చూసినట్టు, ఖగపతి నాగరాజుని చూసినట్టు. అటు అరవిందా, ఇటు శివానీ - ఈ ఇద్దరాడాళ్ళ పొగరూ - హుమ్. వీళ్లకి తెలీదు, తను చెప్తే వినిపించుకోరు! చేతిలో సెల్లు ముడిచి, మొహం ముడుచుకుని రథాన్ని కదిలించేడు.

రథం రోడ్డెక్కేక, శివాని లోపలికొచ్చింది.

వదినగారు ఇంకా కళ్ళు తుడుచుకుంటూనే ఉంది, ‘‘యింటా వంటా లేదు, అసలు జైలెక్కడుందో కూడా తెలీదు మాఊళ్లో … అయినా పిల్లలపెంపకం మనచేతుల్లో ఉంది గానీ మొగాడు వాడికేం తెలుస్తుంది. ఆడవాళ్ళే చూసుకోవాలి. మానాయనమ్మ నడవలో మంచంమీద కూర్చుని మొత్తం సంసారం అంతా ఒక్కచేతిమీద నడిపించింది ఏకచ్ఛత్రాధిపత్యంగా. ఏడుగురన్నదమ్ములూ, ముగ్గురు అక్కచెల్లెళ్లూ. జమీందారీఫాయిలో జరిగింది. ఆవిడకున్న రాజసం ఆవిడకూతుళ్ళకే రాలేదు. మాఅమ్మ ఏకారణానో చిన్నబుచ్చుకుంటే కొడుకుతో, ‘ఏరా, అమ్మాయి చిన్నబుచ్చుకుంది,’ అనేది. అంతే. మానాన్న మాఅమ్మని బతిమాలి, బామాలి, నవ్వించేవరకూ వదిలేవారు కాదు. అందరికీ రాదు ఆ ఠీవి. ఇప్పుడు డబ్బు అయితే సంపాదిస్తున్నారు కానీ ఒక్కరికీ ఆ గుండెనిబ్బరం లేదు. వీడికి నాన్న ఇచ్చిన అలుసు. మాఅమ్మ కలగజేసుకుని వాడిచదువుమీద శ్రద్ధ పెట్టకపోతే విశాఖవీధుల్లో బలాదూర్ తిరుగుతూ ఉండేవాడు ఈసరికి."

విషిని జైల్లోంచి విడిపించి, దారిపొడుగునా ప్రభాస్రావు విషికి నీతులు చెప్తూనే ఉన్నాడు, ‘‘సరదాలకి కూడా ఓ హద్దుండాలి. ఉంటుంది. ఉంటుందన్న జ్ఞానం ఉండాలి మనిషన్నవాడికి. దేశం కాని దేశంలో ఉన్నాం. ఆ జెస్సీ, మైకల్ – వాళ్ళకి జరిగినట్టు మనకి జరగదు. మనం పరాయివాళ్ళం. నీకు చదువుతరవాతే ఈ గర్ల్ ఫ్రెండులూ, పార్టీలూ, సంబరాలూను. లేదూ చిల్లికానీకి కొర గాకుండా పోతావు తెలిసిందా? నారోజుల్లో మానాన్న చదువు అయితే గానీ గడప దాటనిచ్చేవాడు కాదు. మాఅమ్మ నాచేత భగవద్గీత కంఠతా పట్టించేసింది. అలాటి శిక్షణలో పెరిగేను కనకే … శిక్షణేమిటి కఠినశిక్షే అనుకో …’’

విషి లోపల్లోపల ఉడికిపోతూ, కిటికీలోంచి బయటికి చూస్తూ ఆ ముప్పై నిముషాలు గడిపేడు.

కారు ఇంటిముందు ఆగేక హమ్మయ్య అనిపించింది అతనికి.

గుమ్మంలో అడుగు పెడుతూనే, రామలక్ష్మి, ‘‘అక్కడ ఏ రౌడీల్తో గడిపేవో, స్నానం చేసి రా,’’ అంది.

శివాని, ’’రా, కాఫీ తాగి చేద్దు గానీ స్నానం,’’ అంది వంటింట్లోకి నడుస్తూ.

విషి తల్లిని అనుసరించేడు.

ప్రభాస్రావు టీవీ పెట్టుక్కూర్చున్నాడు.

“స్నానం చెయ్యకుండా తిండేమిటిరా. అయినా ఈ అలవాట్లేమిటో నాకర్థం కాదు. అంతా అడ్డగోలు యవ్వారం. శుభ్రంగా స్నానం చేసి, ఉతికి ఆరేసిన బట్టలేసుకుని తింటే మనసుకి ప్రశాంతంగా ఉంటుంది. తిన్నది ఒంట బడుతుంది," అని, ప్రభాస్ వేపు తిరిగి, "నాతో పంపించు. అక్కడ ఈ పాడు సావాసాలుండవు. చక్కగా చదువుకుంటాడు,” అంది రామలక్ష్మి.

“నీ పెంపకమే చెప్పుకోవాలి. సోమరిపోతుని చేసేవు. పనీ పాటూ లేకుండా ఇంట్లో కూచుని ...”

“పొలం చూసుకుంటున్నాడు. వాడికేం తక్కువ.”

“మరే, పంటలతో గాదెలు నిండిపోతున్నాయి. గాదెలమాట ఎలా ఉన్నా ఇల్లు నిండిపోతోంది యాడాదికో బిడ్డ.” ప్రభాస్రావు గలగల నవ్వేడు అక్కగారిమీద ఉన్న అక్కసంతా తీర్చుకుంటూ.

“నీకెందుకూ. వీణ్ణి పంపించు. చక్కగా రాజకుమారుడిలా తయారు చేసి పంపిస్తా.”

పట్టరాని ఉక్రోషంతో విషి తల్లివేపు చూసేడు, ఉప్మా తింటూ.

పోనిద్దూ అన్నట్టు ఆవిడ చేయి విసిరి, “తినేసి వెళ్ళి పడుకో,” అంది.

మేడ మెట్లెక్కుతున్న విషిని చూస్తూ, “ఆర్నెల్లవరకూ కిందకి రాకు,” అన్నాడు ప్రభాస్రావు.

అక్కగారిముందు తన ఆధిపత్యాన్ని ప్రదర్శించుకోడం అవశ్యం అనిపించిందాయనకి ఆక్షణంలో.

విషి తనగదిలో కూర్చుని ఉడికిపోతున్నాడు. తన వయసువాళ్ళు అందరూ ఎంత స్వేచ్ఛగా తిరుగుతారు. తనకి ఒక్కడికే  నాన్నపోరు. తనసలు ఎప్పుడూ ఎదురు చెప్పడు. ఇక్కడి పిల్లల్లా ఒక్కసారి కూడా  I hate you అనలేదు. అసలైనా ఇప్పుడేమయింది? తను జైల్లో పడడం తన తప్పా? అసలు తను ఆ పంచి తాగనేలేదు. తనమాట వినిపించుకోరాయన. పైగా తనింకా చిన్నవాడు. అసలు ఆయన అలా అరువెంట బడడం మాత్రం ఏం మర్యాదగా ఉంది అడిగేవాళ్ళు లేక గానీ. లేకపోవడమేం, ఉన్నారు. అమ్మ అడగాలి, అడగదు. అత్తయ్య అడుగుతోంది కానీ నాన్న వినరు. అసలు నాన్న అలా చేయకపోతే ఇంత దూరం రాకపోను.

000

కిందగదిలో ప్రభాస్రావు కూడా అదే స్థాయి ఒంటిమీద మంట అనుభవిస్తున్నాడు. గంటక్రితం వచ్చిన ఫోనుకాలు ఆయన్ని నిరస్తుడ్ని చేసింది.

ఏదో బీరకాయపీచు బంధువు ఒకాయన పిలిచి, "ఏంటి, మన విశ్వేశ్వరశర్మ జైల్లో పడ్డాట్ట. పొద్దున్నే ఈవార్త వింటూనే అదిరిపడ్డాను. ఎంత చెడ్డా మనం మనం ఒకటి. ఇవాళ మీవాడయింది, రేపు మావాడవుతుంది. మావాణ్ణి పిలిచి గట్టిగా చీవాట్లేసేను, ఇలాటి పెధవ్వేషాలు వేసేవంటే డొక్క చీరేస్తానని. ఇంతకీ, ఏం చేసేడేమిటి? అసలేమయింది? పోన్లే, ఇప్పుడదంతా ఎందుగ్గానీ సాయం కావలిస్తే చెప్పు, మొహమాటపడకు," అన్నాడు.

మరో అంజనీపుత్రుడు, "ఏమయ్యా, ప్రభాసూ, మనవాడేమిటి వార్తల్లోకెక్కేడు. ఏమైందేమిటి. ఏం లేదూ, హమ్మయ్య, నేనూ అదే అనుకున్నాలే, పిల్లలు ఏదో ఆటకాయితనం, దానికింత రాద్ధామేమిటి అనీ ... ఇంతకీ ఎందుకు పిలిచేనంటే ఊళ్ళో పెద్దతలకాయలు మనజేబులో ఉన్నారులే. వాళ్ళచెవిని ఓ మాటేస్తే, సర్వం క్షణంలో చక్కబడిపోతుంది, పాలత కడిగిన ముత్యమే అనుకో. ... కొమ్ములుతిరిగిన, అరివీరభయంకరులవంటి లాయర్లు కూడా ఉన్నారు. ఫోన్ చెయ్యమంటావా?"

అలా స్నేహితులూ, పరిచయస్తులూ, ఏ వీధిలోనో యాదాలాపంగా కలిసినవాళ్ళతో సహా పిలిచి, ఎడతెరిపి లేకుండా వరదలా భరోసాలమీద భరోసాలు ఇచ్చేస్తుంటే ప్రభాస్రావుకి కోపం ఓ పక్కా నిస్సహాయత మరో పక్కా తల తినేస్తుంటే, వినగలిగినంతసేపు విని, ఆ ఊ లాటి శబ్దాలతోనూ, "అబ్బే, ఒద్దొద్దు," "అంత ప్రమాదమేమీ లేదు", "ఇదేమీ మరణశిక్ష, ఆజన్మకారాగారవాసం కేసు కాదు," అంటూ జవాబులిచ్చుకుని ముగించేడు.

జవాబు చెప్పి ఫోను పెట్టేస్తున్న ముప్పై క్షణాల్లోనూ ఆవతలాయన మరోసారి, "ఏమాత్రం అవసరమైనా తప్పకుండా పిలు, ఆలోచించకు, మొహమాటపడకు," అని మూడుసార్లు చెప్పేడు. ప్రభాస్రావు మరోమారు సరే, అలాగే అని చెప్పక తప్పలేదు.

ఇలాటివే మరోరెండు కాలులొచ్చేక, ఆయనగారి కోపం పరాకాష్టనందుకుంది. వీళ్ళందరికీ తనమీద నిజంగా అంత ఆపేక్ష ఉందా, గొడ్డు గోతిలో పడిందని మురిసిపోతూ తనని హేళన చేయడమా అన్నది తెలీలేదు. అలా ఆయనకి సందేహం రాకపోడానికి కారణం లేకపోలేదు. ఈ పరిస్థితే అట్నుంచి ఇటయితే, నిజానికి ఇంతకుముందు ఇలా అయినప్పుడు, తను చేసిందీ ఇంతే. అవతలివాళ్ళు కష్టాల్లో ఉన్నారని తెలియగానే పరమోత్సాహంతో పలకరించడం. తీరా అవసరమై, ఆదుకుంటారా అని అడిగితే, "అయ్యో నువ్వు అడక్కడక్క అడిగేవు, ఏం చెయ్యను, సమయానికి ..." అంటూ ఏదో – ఒకటీ రెండూ కాదు – పది అవాంతరాలు చెప్తారు. ఇప్పుడు

వాళ్ళమీద అరవడమా, తనని ఈపరిస్థితిలో ఇరికించిన కొడుకుమీద అరవడమా – అన్న సందిగ్ధావస్థలో ఉన్నారు.

000

తమ్ముడిమొహం చూస్తూ ఎదటిసోఫాలో కూర్చున్న రామలక్ష్మికి ఆలోచనలు వేరుగా ఉన్నాయి. పాపం, వాడికెంత కష్టం ఒచ్చింది అని నొచ్చుకుంది. "నువ్వూరికే బాధ పడకు. అబ్బాయి ఇంటికొచ్చేడు కదా. ఆ పోలీసువాళ్ళకి తృణమో, పణమో ముట్టచెప్పి కేసు మాఫు చేయించీ. ఇంత బతుకూ బతికి ఇంటెనక చచ్చినట్టు, ఈనాటికీ అవస్థ రావాలీ నీకు. మనదసలు మచ్చలేని కుటుంబం. వెతికితే స్ఫటికరాయిలోనైనా మచ్చ కనిపిస్తుందేమో కానీ మన ఇంటా వంటా లేదు, ఇలాటి విడ్డూరం. ..."

"అబ్బబ్బ, నువ్వూరుకో," కసిరేడు ప్రభాస్రావు.

"మహ బావుంది. నన్ను కసుర్తావేమిటి, కొడుకుని అదుపులో పెట్టుకోలేక," అంటూ రామలక్ష్మి చటుక్కున లేచి, వంటింట్లోకి వెళ్ళింది.

గిన్నెలు తొలిచి dishwasherలో పెడుతున్న శివానితో తన ఉపన్యాసం కొనసాగించింది, "కొడుకు గుణవంతుడైతే వంశం అంటారు. చెడుసావాసాలు మరిగితే తల్లిపెంపకం అంటారు. తల్లివల్లే పిల్లలు గుణవంతులైనా దుర్మార్గులైనా.  ఆ చాకచక్యం తల్లికే ఉంటుంది. విషి ఈరోజు ఇలా తయారయేడంటే ...నీ తప్పు అనడంలేదులే. పాపం, నువ్వు మాత్రం ఏంచేస్తావు? దేశం కాని దేశం. నాఅన్నవాళ్ళెవరూ లేరు మాటసాయానికయినా, పని సాయానికైనా. ఆఖరికి చెప్పుకుని ఏడవడానికైనా లేరు."

శివాని "తలనొప్పిగా ఉంది. కొంచెంసేపు పడుకుంటాను," అంటూ తనగదిలోకి వెళ్లి ఆలోచనల్లో పడింది.

వదినగారిమాటల్లో ఏమైనా సత్యం ఉందేమోనన్న శంక తొలిచేస్తోంది ఇప్పుడు. తనదే తప్పా? తన పెంపకంలో లోపమే కారణమా విషి జైల్లో పడడానికి? తనేం చేసింది? వదినగారు చెప్పినట్టు అమ్మా, నాన్నా తనని పెంచినతీరు వేరు. తను పెరిగిన వాతావరణం వేరు. ఆనాటి పరిస్థితికీ ఈ పరిస్థితికీ పోలికెక్కడ? ఆరోజుల్లో పెద్దలు చెప్పింది వినడమే కానీ ఎదురు చెప్పడం అన్నది లేదు. నాయిష్టం, ఇది కావాలి, అది అక్ఖర్లేదు, ఇది తినను అది తింటాను అంటూ పేచీలు లేవు. ఇప్పుడు ప్రతిపూటా ఇంట్లో ప్రతి ఒక్కరినీ ఏం తింటావు, ఏం చెయ్యమంటావు అని అడగాలి.

ఇక్కడ కొందరిళ్లల్లో చూసింది పిల్లలు, తల్లి పెట్టిందే, మనవంటలే తినడం. వాళ్ళనిగురించి ప్రభాస్రావు ఏంవన్నాడు? వీళ్ళు మరీ ఇంత మడి గట్టుకు కూచుంటే బయట అమెరికనులతో ఎలా నెగ్గుకొస్తారు? నీటిలో దిగింతరవాత ఈత కొట్టాలి కానీ నేలమీద నడిచినట్టు నడవలేం కదా. ఈ సంఘంలోకి వచ్చి పడ్డాక, వీళ్ల ఆచారాలూ, మర్యాదలూ పాటిస్తేనే బతుకు. అసలు అలా పాటిస్తేనే అంతంత మాత్రంగా ఉంది. నిజానికి విషి మెరుగే వీళ్లతో పోలిస్తే. మరీ అంత రెచ్చిపోయి నువ్వెంత అంటే నువ్వెంత అంటూ తిరగబడడు. ఏదో ఓ పూట తెలిసీ ఓ చుక్క పుచ్చుకున్నాడనుకున్నా, సాటి కుర్రాళ్ళు తాగుతుంటే, ఈయనగారు చెప్పినట్టు మడి గట్టుక్కూచుంటాననగలడా? అలా అంటే వాడ్ని అక్కడ ఉండనిస్తారా? పైగా, ఆ పంచిలో స్కాచి కలిపేరని తనకి తెలీదంటున్నాడు. అది కూడా నిజమే అయిఉండొచ్చు కదా. పిల్లలు ఎంతకైనా తగుదురు. ఇక్కడ ఫన్ ఫన్ అంటూ చేసే ఆగడాలకి అంతే లేదు.

ఆవిడ ఒక నిశ్చయానికి వచ్చింది. హాల్లోకి వచ్చి మెట్లదగ్గర నిలబడి విషిని పిలిచింది. ముఖం ముడుచుకుని మెట్లు దిగేడు విషి.

"కొంచెం ఆ బెంగాలీ స్టోరుకి వెళ్లి రసగుల్లా తీసుకురా. తాజా కూరలు కూడా ఉంటే చూడు," అంది డబ్బు అందిస్తూ.

"ఇప్పుడు బజారుకెందుకూ, ఇంట్లో కూరల్లేవూ?" అన్నారు ప్రభాస్రావు చిరాగ్గా.

"రేపు తొలిఏకాదశి. అదే పాయసం, అదే గారెలు విసుగేస్తోంది. కొంచెం మార్పుకోసం," అందావిడ నిబ్బరంగా.

విషి డబ్బు పుచ్చుకు వెనుదిరిగేడు సందేహిస్తూనే.

శివాని ఇంకొంచెం దగ్గరకి వచ్చి, "ఆలస్యం అయినా ఫరవాలేదు," అంది.

విషి అమ్మముఖంలోకి తేరి చూసి, తలూపి జోళ్లేసుకుని, కారు తాళాలు తీసుకుని వెళ్లిపోయేడు.

ప్రభాస్రావు గుర్రుగా చూసేడు విషి వెళ్లినవేపు.

000

తలుపు తట్టిన చప్పుడు విని లేచి అరవింద తలుపు తీసి, విషిని చూసి ఉలిక్కిపడింది.

"రెండు నిముషాలు. నేను చెప్పవలసింది చెప్పేసి వెళ్లిపోతాను," అన్నాడు.

అరవింద కొత్తమనిషిని చూసినట్టు చూసింది. నిటారుగా రెండు చేతులూ వెనక్కి పెట్టుకు నిల్చున్నాడు. ముఖంలో మునుపటి గందరగోళం లేదు. ఒక స్థిరమైన నిశ్చయానికి వచ్చినవాడిలా, తానెవరో తనకి తెలిసినవాడిలా కనిపిస్తున్నాడు.

అరు కొంచెం ఆలోచించి, "రెండు నిముషాలు," అంది.

"రెండు నిముషాలు" అన్నాడు విషి, "ఇకమీదట నిన్ను బాధించను. నీఇష్టాయిష్టాలు ప్రశ్నించను."

"ఎవరు నువ్వు? నాకు తెలిసిన విషిలా లేవు."

"అది చెప్పడానికే వచ్చేను. రెండు నిముషాలే కనక జరిగిందంతా నీది పెట్టను. నేను చెప్పవలసింది చెప్పేసి వెళ్లిపోతాను."

"నేను జవాబులిచ్చుకోనక్కర్లేదా?"

"నేను అడగను. చెప్తే వింటాను."

అరవింద తలుపు తెరిచి, "రా" అంది విషికి దారిచ్చి.

విషి లోపలికి వచ్చి సోఫాఅంచున కూర్చుని, "రెండు నిముషాలే, అట్టేసేపుండను." అన్నాడు

"ఏమైంది?"

"అట్టే వివరాలొద్దు కానీ ఓరాత్రి జైలు, ఓ గంటసేపు మానాన్న ఉపన్యాసం, ఓపూట నాగదిలో నిర్బంధం నన్ను ఆలోచించుకునేలా చేసేయి. ఇంతకుముందు జరగలేదా ఇలాటివి అంటే జైలు తప్ప మిగిలినవి జరిగేయి. కానీ ఈసారి మాఅమ్మ అన్న ఒక్కమాట మాత్రం నాకు గట్టిగా తగిలింది ఛెళ్లుమని చెంపపెట్టులా." విషి ఆగేడు.

అరు చూస్తోంది ఇంకా ఏం చెప్తాడో అని.

"మేడమీద ఉన్న నన్ను మాఅమ్మ పిలిచి, బజారుకెళ్లమంది. అది మానాన్నకి సమ్మతం కాదని తెలిసీ వెళ్లమంది. అంతకంటె విచిత్రం 'ఆలస్యం అయినా ఫరవాలేదు' అన్నమాట. ఆవాక్యం నన్ను చాలాసేపు వెంటాడింది. తిన్నగా బజారుకెళ్లకుండా కొంచెంసేపు పార్కులో కూర్చుని ఆలోచించేను. ఆవాక్యంలో నాకు రెండు విషయాలు తోచేయి. మొదటిది - మానాన్నఆజ్ఞ కాదని ఆవిడ నన్ను బయటికి పంపడం. అంటే నాకు స్వేచ్ఛ నివ్వడం. రెండోది ఆలస్యం అయినా

ఫరవాలేదు అనడం. అంటే నామీద నమ్మకం. ఆవిడ నాకిచ్చిన స్వేచ్ఛని నేను సద్వినియోగం చేసుకుంటానన్న నమ్మకం."

విషి ఆగి చూసేడు అరుమాట కోసం. అరు చిన్నగా తలూపింది.

"ఇంతకుముందు ఇలాటివి చాలా జరిగేయి కానీ ఈసారి మాత్రం నాకు బలంగా తగిలింది. అప్పుడే అనుకున్నాను మాఅమ్మనమ్మకం నేను నిలబెట్టుకోవాలని. మాఅమ్మ నాకు స్వేచ్ఛ నిచ్చింది. నేను నీవిషయంలో అదే చెయ్యాలి. నువ్వు ఇలా ఉండాలని నేను చెప్పినంతకాలం నేను మానాన్నలా ప్రవర్తించేను. అది మార్చుకోవాలి అని నిశ్చయించుకున్నాను. ఇకమీదట నిన్ను అలా చేసేవెందుకు, ఇలా చెయ్యలేదెందుకు అంటూ పోరు పెట్టను. ఆమాట చెప్పడానికే వచ్చేను. అంతే," అన్నాడు విషి లేచి వెళ్ళడానికి సిద్ధమవుతూ.

అరు రెండు క్షణాలు ఊరుకుంది. అతను గడప దాటుతుంటే వెనకనించి "thanks," అంది.

విషి ఆగి, చేతిలో ఉన్న కోవా పేకెట్ చూస్తూ, "ఇది నీకు ఇవ్వాలనే తెచ్చేను. మునపట్లా ఏదో ఆశించి కాదు. కేవలం స్నేహభావంతోనే. తీసుకుంటానంటే ఇస్తాను. లేదంటే ఫరవాలేదు," అన్నాడు.

అరు అతనిముఖంలోకి పరీక్షగా చూసి, అది తీసుకుని మరోసారి thanks చెప్పింది.

విషి వెళ్లిపోయేక చాలాసేపు ఆలోచిస్తూ ఉండిపోయింది. నిజంగా మారిపోయేడా, ఇది మరొక నాటకమా, మళ్లీ మారకుండా ఉంటాడా?

లీలక్కతో మాట్లాడితే బాగుండు అనుకుంటుంటే ఫోనొచ్చింది. లీలదగ్గర్నుంచే!

"ఊరికే పిలిచేను. చాలారోజులయింది. ఎలా ఉన్నావు. ఏంచేస్తున్నవు," అంది లీల అట్నుంచి.

"భలే. నేనసలు ఇప్పుడే అనుకుంటున్నాను మీగురించి." అంది అరు సంతోషాన్ని గొంతులో ధ్వనిస్తూ.

"ఆహా. ఒక్కమాటే ఇద్దరికీ తోచడం శుభం. ఇంతకీ ఏమిటి సంగతులు?"

"చాలా ఉన్నాయి. మీకు మరే పనీ లేదంటే వస్తాను."

"రా. పనేం లేదు."

"మరి సుందరంగారేం అనుకుంటారో ఇలా వేళాపాళా లేకుండా వచ్చేస్తే,"

"ఏముంది అనుకోడానికి. అయినా ఇంట్లో లేడులే. రా."

"లేరా, అయితే పది నిముషాల్లో అక్కడుంటా."

లీల ఫోనులోకి చూసి, పక్కన పెట్టేసింది నిట్టూర్చి. సుందరం దేశంలో అందరికీ ఆప్తుడే కానీ అయినవాళ్లు పనికిరారు అతనికి. పోతే పోనీ. అందరూ అందరికీ నచ్చాలనేం లేదు కదా. కానీ కనీస మర్యాదలు పాటించవచ్చు కదా. అరు 'అయితే వస్తాను' అనడంలో ఆ అమ్మాయికి అతనంటే ఎలాటి అభిప్రాయం కలిగిందో తెలుస్తోంది. అదీ లీలకి బాధ అయింది.

000

కాలింగ్ బెల్ నొక్కి, తలుపు తీసిన లీలని  ఒక్క ఉదుటున కౌగలించుకుని, "అబ్బ ఎన్నాళ్లో అయినట్టుందక్కా" అంది.

లీల ఆ కౌగలింతకీ అక్కా అన్న పిలుపుకి కలిగిన ఆశ్చర్యం కప్పి పుచ్చుకుంటా, "రా, రా, నేనూ అదే అనుకుంటున్నా ఎన్నాళ్లో అయిందని," అంది.

ఇద్దరూ కూర్చున్నాక, లీల, "ఊఁ చెప్పు మరి. విశేషాలు, ఆ పెట్టేమిటి? బజారుకెళ్లి వస్తున్నావేమిటి, టీ పెట్టనా?" అంది చనువుగా.

ఇందాకా ధ్వనించిన హుషారు లేదు అరులో. తలొంచుకు తను తెచ్చిన అట్టపెట్టెవేపు చూస్తూ అంది, "కోవా. విషి తెచ్చి ఇచ్చేడు."

"ఏమంటాడు?"

"ఏదో చెప్తాడు. Boyfriend girlfriend గొడవలన్నీ వదిలేసి, ఊరికే స్నేహంగా ఉండాలని అనుకుంటున్నట్టుంది."

ఇంకా ఏమైనా చెప్తుందేమో అని కొంచెంసేపు చూసి, లీలే అడిగింది, "మరి నీకెలా ఉంది? నువ్వేం అనుకుంటున్నావు?"

"ఏమో. నాకేం తోచడం లేదు. నువ్వే చెప్పక్కా. మనుషులు అంత త్వరగా మారగలరా? విషిలో ఈమార్పు ఎంతకాలం ఉంటుందో ఎలా తెలుస్తుంది? "

లీల తల అడ్డంగా ఆడించింది చెప్పలేం అన్నట్టు చేత్తో సూచిస్తూ.

"అక్కా, నిన్ను అక్క అనే అనుకుంటున్నాను. అంచేత నేనొకటి అడుగుతాను నువ్వేం అనుకోనంటే."

లీల నవ్వింది. "అక్క అంటూ చుట్టరికం కలిపేసేవు. మరి నిన్ను నాచెల్లెల్లా చూడాలి కదా. సరే అడుగు."

" అది కాదు. నేను నిర్ణయం చేసుకోలేకుండా ఉన్నాను. నీవిషయం తెలిస్తే నాకేమైనా దారి దొరుకుతుందేమోనని."

"సరే అడగమన్నాను కదా."

"నువ్వు ఇక్కడినుంచి వెళ్లిపోయినప్పుడు నీకు సుందరంగారిలో ఏదో నచ్చనిది ఉండడంచేతే అనుకున్నాను. ఇప్పుడు మళ్లీ నువ్వు వెనక్కి వచ్చేసేవంటే నీకు నచ్చినదేదో ఉండాలి కదా. ఆరెండూ ఎలా సమన్వయం చేసుకున్నావని," అంది అరవింద.

లీల, "నువ్వింకా చిన్నదానివి. నీకు కనిపించిందే చూసి తీర్మానాలు చేసేస్తావు. ప్రతివిషయం, విషయందాకా ఎందుకూ, ప్రతిమాటకీ వివరణలు తెలుపు-నలుపూ విడివిడిగా నిర్ణయించేస్తావు. నాకేమో ఎంత తెలిసినా ఇంకా తెలీందేదో ఉన్నట్టే ఉంటుంది."

"ఎంచేతంటావు?"

"ఏమో మరి. బహుశా నా పెంపకం, నేను పెరిగినవాతావరణం అలాటిదేమో."

"అంటే దేనికీ స్పష్టమయిన అర్థాలు చెప్పుకోలేకపోవడం అంటావా? అదీ ఘనతేనా?"

లీల నవ్వింది. "చూసేవా, మళ్ళీ మరో నిర్ణయం చేసేసేవు. ఇదే నేనంటున్నదీ, నీకూ నాకూ, నాసంస్కృతికీ నీ సంస్కృతికీ తేడా."

అరవింద కూడా నవ్వి, "ఏం చెయ్యను నాకు తెలిసిందీ, అలవాటయిందీ అదే మరి. అంచేత మళ్ళీ అడుగుతున్నా చెప్పు. నీకు కనిపించిన తేడాలేమిటి?"

"ఏమో, అదే నేను చెప్పలేనంటున్నది. చిన్న ఉదాహరణ చెప్తాను. మనం కలుసుకుని ఆర్నెల్లు కూడా కాలేదు. నువ్వు చుట్టరికం కలిపేసి నన్ను అక్క అంటున్నావు. అదే అమెరికనులయితే అలా చుట్టరికాలు కలపరు. అది ఒకటి. రెండోది, నన్ను అక్కా అంటున్నావు కానీ సుందరాన్ని మటుకు సుందరంగారనే అంటున్నావు. ఎంచేత?"

అరవింద గతుక్కుమని, "నువ్వనేవరకూ నాకు తోచనేలేదు. అవును, ఆయన్ని చూస్తే ఆ బారెడు ఎడం అలా ఉన్నట్టే కనిపిస్తుంది కానీ అయినవారితో మాటాడుతున్నట్టుండదు. నీతో మాటాడుతుంటే నాకు అక్క లేదు కానీ ఉంటే ఇలా ఉండు అనిపిస్తుంది."

ఇద్దరూ కొంచెంసేపు మాటాడకుండా ఊరుకున్నారు. లీల లేచింది, టీ పెడతానంటూ. అరవింద ఆవిడవెనకే వంటింట్లోకి నడిచింది.

"నాకు ఈ విపితో ఏం చెయ్యాలో తెలీడం లేదు."

లీల తలూపింది, అంతే మరి. ఎంత చెట్టుకంత గాలి. చిన్నా, పెద్దా – అందరికీ ఎవరిబాధలు వాళ్ళకి భరించలేనంత ఘనంగా కనిపిస్తాయి. "ఇంకా ఇరవయ్యయినా దాటలేదు. ఇప్పట్నుంచీ ఎందుకింత గొడవ పడడం. ముందు చదువు కానీ. మనపద్ధతి అదీ. ఒకటి తరవాత ఒకటి. సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుభవాలు చదివేవు కదా. ఆయనేం చెప్పేరు. విద్య తరవాత వివాహం, గృహస్థధర్మాలూ, తరవాత సన్యాసం … అదీ వరస." ఈమాటలు లీల తనలో తను అనుకుంది. అరవిందతో అనవలసిన మాటలు కావివి. ఆ అమ్మాయికి ఇది అర్థం కావడం కష్టం. ఈ పద్ధతిలో పెరగలేదు మరి!

"అక్కా, పోనీ మరోమాట అడుగుతాను, చెప్పు. నీకు సంతోషంగా ఉందా? నువ్వు వెనక్కి మళ్ళీ సుందరంగారింటికి రావడానికి కారణం నిజంగా నీకు ఆయనతో జీవితం చాలా బాగుండడంచేతనేనా?"

లీలకి మళ్ళీ మన సంప్రదాయాలు గుర్తొచ్చేయి. ఇదే ఇండియాలో అయితే 17ఏళ్ళ అమ్మాయి రెట్టింపు వయసున్న పెద్దావిడతో ఇలాటి ప్రశ్న వెయ్యదు. కనీసం తను పెరిగిన సంప్రదాయంలో అది లేదు. కానీ, ఇంత చిన్నవయసులో అంత పెద్ద ఆలోచనలు చేస్తున్న పిల్లతో తన మనసులో కలకలం చెప్తే, కనీసం ఆపిల్లకి ఊరట కలుగుతుందేమో అనిపించింది ఆవిడకి.

"ఏమో, చెప్పేను కదా నా ఆలోచనలు మాటల్లో చెప్పలేను."

"ఎంచేత?"

"ఎంచేతంటే … ఏం చెప్పను? మాయింట్లో ఎవరూ అంతగా మాటాడకపోవడం కావచ్చు. నాకు కలిగిన ప్రశ్నలు, ఆలోచనలూ, ఊహలూ కథల్లో పెట్టడం కావచ్చు."

"పోనీ, కథ చెప్తున్నాననుకునే చెప్పు."

"ఆహా, గడుసుదనం," అంది లీల అరవింద బుగ్గమీద చిన్న చిటిక వేసి.

అరవింద "ఔచ్," అని, "నాఒంటిమీద చెయ్యేసేవు. అది child abuse," అంది చిలిపిగా కళ్లు చిట్లించి.

"అదుగో చూసేవా, మళ్ళీ …"

"ఏంటి?"

"ఇలాటి మాటలు నేను ఈదేశం వచ్చేవరకూ వినలేదు. అసలు మాయింట్లో మాఅమ్మకీ నాన్నగారికీ మేం ఎప్పుడూ ఎదురు చెప్పలేదు, ముప్పైలు దాటినా."

"ముప్పై తరవాత ఎదురు చెప్పొచ్చా?"

"కాదు. వాళ్ళు పోయేరు. ఉంటే జీవితాంతం అలాగే ఉండేవాళ్లం."

ఇద్దరూ నవ్వుకున్నారు.

"నిజానికి నాకు చాలా విషయాల్లో అసంతృప్తి. నేను కూడా చాలా ఆలోచించేను. ఎందుకిలా అయింది. నేనేం చేసేను. లేదా ఏం చెయ్యలేదు. ఏం చెయ్యగలను. ఒకొకప్పుడు అనిపిస్తుంది ఎక్కడి అక్కయ్యపాలెం, ఎక్కడి టెక్సస్. ఇక్కడికెలా ఎందుకొచ్చి పడ్డానో అని. నాకసలు మొదట్నుంచీ రెండు అలవాట్లు వచ్చేయి. వాటికి కారణాలు ఇదమిత్థమని ఖచ్చితంగా చెప్పలేను కానీ … ఒకటి, ఏ విషయంలోనూ అట్టే పట్టింపు లేకపోవడం, రెండోది, నాకు నేనై నాకిది కావాలని కోరుకోకపోవడం. అసలు ఎవరైనా ఇస్తే కూడా నానోట మొదట వచ్చే మాట ఒద్దనే. ఎందుకలా అంటానా అని ఇప్పుడు ఇక్కడికొచ్చేక, నీలాటివాళ్లని చూసి నేర్చుకుని, ఆలోచిస్తే అనిపించింది అది కూడా మన సాంప్రదాయంలో భాగమేనని. ఎవరైనా ఏదైనా ఇస్తే, తీసుకోడం ఆబ అనుకుంటారు. అది ప్రలోభం. ఒద్దనడం మర్యాద."

"వాళ్ళకి వాళ్ళయి ఇస్తుంటే ప్రలోభం ఎందుకవుతుంది?"

"ఏమో మరి. నేనూ అంత స్పష్టంగా చెప్పలేను. ఈమధ్య శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుభవాలూ, జ్ఞాపకాలూ చదువుతున్నాను. అందులో ఆయన కూడా వివరించేరు. భగవద్గీతలో కూడా ఉంది కదా

యోగీ యుఞ్జీత సతతమాత్మానం రహసి స్థితః |
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ||

అపరిగ్రహః అంటే పుచ్చుకోనిచ్ఛగించనివాడని అర్థం మరి."

"భగవద్గీత చదివేవా?"

‘‘చదివేనంటే చదివేను కానీ అదంతా అర్థమయిపోయిందని కాదు. ఇలా నా ప్రవర్తనకి అడ్డం పెట్టుకోడానికి పనికొస్తోంది అనుకో.’’

‘‘పోనీ ఈ పుచ్చుకోకపోడాలు తరవాత చూద్దాం. ముందు ఈ సంగతి చెప్పు. నువ్వు సుఖంగా ఉన్నావా?’’

‘‘అసలు సుఖం అంటే ఏమిటి?’’

‘‘అదే నాకు కావలసింది. సుఖం అంటే ఏమిటో నువ్వు చెప్పినతరవాత ఆలోచించుకుంటాను,’’ అంది అరవింద.

‘‘నామటుకు నాకు సుఖం అన్నది ఒక ప్రత్యేకపదార్థం కాదు ఇదుగో, ఇక్కడుంది, ఇక్కడ లేదు అనుకోడానికి. అది సాపేక్షకం. నాకు సుఖం అనిపించింది నీకు సుఖం కాకపోవచ్చు. నేను ఏ పరిస్థితిలో ఏ నిర్ణయం తీసుకుని ఎలా ప్రవర్తిస్తాను అన్నది నా మనస్తత్వంమీదా, పరిస్థితులమీద ఇంకా అనేక ఇతరవిషయాలమీదా ఆధారపడి ఉంటుంది కదా. అలాగే నీ నిర్ణయాలూను. అందుకే ఎవరూ మరొకరికి చెప్పలేరు ఇలా చెయ్యి అని. చెప్పకూడదు కూడాను. పోతే, అసలు మనం చేసే ప్రతి పనీ మనకి సుఖంగా ఉందా లేదా అని మాత్రమే ఆలోచించుకుంటూ చెయ్యం. మనచుట్టూ ఉన్న జనాలవిషయం కూడా ఆలోచించుకుని వాటన్నిటిమధ్య మనం చెయ్యగలిగిందేమిటి అని తర్కించుకుని ఓ నిర్ణయానికొస్తాం. నిజానికి అది నిర్ణయం అని కూడా అనలేం. ఎంచేతంటే నిర్ణయం అనగానే దానికి ఒక స్థిరత్వం ఏర్పడుతుంది. మన నిర్ణయాలు ఏరోజుకారోజు మారిపోతుంటాయి.’’

‘‘అంటే మనకి స్థిరమైన అభిప్రాయాలు ఉండడం సాధ్యం కాదా?’’

‘‘నాకలా అనిపిస్తోంది. అదొక కారణం కావచ్చు. చుట్టూ ఉన్న వ్యక్తులూ, పరిస్థితులూ మారిపోతూండడంచేత కూడా మనం ఎప్పటికప్పుడు మన ఆలోచనలు తిరగరాసుకుంటాం కదా. నేను ఈ యింటినించి వెళ్ళిపోయిన కారణాలు ఇప్పుడు కూడా ఉన్నాయి. అయినా వచ్చేసేను.’’

అవేమిటి అనడగడానికి అరవింద సంకోచించింది. దాదాపు రెండున్నరగంటలసేపు తానిక్కడ ఉంది. లీల ఎక్కడా తొణకలేదు. అదే ఆమె వ్యక్తిత్వమా? అలా అయితే తను మరో రెండున్నర గంటలు కాదు రెండున్నర ఏళ్ళున్నా తొణకదు ఆమె.

‘‘నీమాటలు వింటుంటే మా టీచరన్న మాటలు గుర్తొస్తున్నాయి.’’

‘‘ఏమిటది?’’

‘‘ఆయన ముప్ఫైయేళ్ళక్రితం మనదేశం వెళ్ళేరు తెలుగు నేర్చుకుని. మనవాళ్ళగురించి ఆయన్ని అడిగేను ఏంఅనుకుంటున్నారని. తీరిక అన్నారు ఒక్కమాటలో.’’

‘‘తీరికా?’’

‘‘అక్కడ ఎవరూ దేనికీ ఆతృత పడుతున్నట్టు కనిపించరు. ఏంవడిగినా చూద్దాం, అలాగే అంటారు తీరిగ్గా. ఎవరికీ ఏ విషయంలోనూ తొందర లేదు.’’

‘‘నిజమే. మనది వ్యావసాయిక దేశం కదా. పొలం దున్నాలి, విత్తు నాటాలి, నారు పోయాలి, మొక్క గింజ పట్టాలి ... రైతులు తొందరపడి వెంటనే పంటకి వచ్చేయాలంటే కుదరదు కదా. అవన్నీ ఆ వరసలో వాటిక్కావలసిన టైము తీసుకుంటూ జరుగుతాయంతే,’’ అంది లీల.

‘‘ఆయన మళ్ళీ కిందటేడు వెళ్ళొచ్చేరు. మళ్ళీ ఎలా ఉందని అడిగితే చాలా మారిపోయిందన్నారు. ఉరుకులూ. పరుగులూ, ... భాష కూడా. ఇప్పుడెవరూ తెలుగు నేర్చుకోనక్కర్లేదు తెలుగుదేశం వెళ్లడానికి. అక్కడ అందరూ ఇంగ్లీషే మాటాడుతున్నారు అన్నారు. ఆయనకి మళ్ళీ ఇండియా వెళ్ళాలన్న ఉత్సాహం చచ్చిపోయింది ఈ రెండో ప్రయాణంతో.’’

లీల నవ్వి ఊరుకుంది.

‘‘నీకు పెద్దక్క యింట్లో ఉన్నప్పుడు సంతోషంగా ఉందా?’’

లీల కొంచెం ఆలోచించి అంది, ‘‘ఇందాకా సుఖంగురించి అడిగేవు. అక్కడ ఉన్నప్పుడు, ఆ తరవాత ఇక్కడికి వచ్చేకా నాకు అర్థమయింది సుఖానికి ఎవరి నిర్వచనం వారిదే అనే. సుందరానికి ఎవరో ఒకరు చేసి పెట్టేస్తే చాలు. తను కడుపులో చల్ల కదలకుండా కూర్చున్నచోటినించి కదలకుండా వాళ్ళకీ వీళ్ళకీ చెప్పి పని చేయించేసుకుంటాడు. మరి చేసేవాళ్లు ఎందుకు చేస్తారూ అంటే వారికీ మరోరూపంలో గిట్టుబాటు అవుతుంది కనక. కొంతకాలం అయేక వారికి అర్థమవుతుంది, తాము ఇచ్చేది ఎక్కువా, పుచ్చుకునేది తక్కువా అని. వాళ్ళు విసుక్కోడంతో మొదలుపెట్టి, చివరికి ఏదో తగువు పెట్టుకుని వెళ్ళిపోతారు. అలా జరిగిన ప్రతిసారీ సుందరం తను చేస్తున్నది ఎంత హీనమో గుర్తిస్తాడనీ, మళ్ళీ అలా జరగదనీ అనుకున్నాను. అలా జనాన్ని ఉపయోగించుకోడం నాకు నచ్చదు. కానీ నేననుకున్నట్టు అవలేదు. అంతే కాదు. నాకు ఆశ్చర్యం ఎక్కడంటే అలా ఒకరు వెళ్ళిపోయిన ప్రతిసారీ అతనికి మరొకరు దొరుకుతారు. అంచేత అతను జన్మంతా అలాగే జరుపుకోగలడని అర్థమయింది. అది

అర్థం అయేక, నేను నాదారి చూసుకుందాం అనుకున్నాను. కానీ పెద్దక్కగారిదగ్గర చేరేక చూసేను. ఆమెకి సాయం చెయ్యడంలో నాకానందం కనిపించింది. కానీ ఆవిడకి అలా చేయించుకోడం ఇష్టంలేదు. తప్పనిసరి అయినంతవరకూ ఒప్పుకున్నారు కానీ ఆతరవాత సాగనివ్వలేదు. అప్పుడనిపించింది. సాయం అన్న పదానికి అర్థం తెలిసిన ఉత్తమురాలు ఆవిడ. అది అర్థం అయినతరవాత నేను అక్కడ ఉండడం న్యాయం కాదనిపించింది. ఇప్పుడు నాకాలక్షేపాలు నావి. తన కాలక్షేపాలు తనివి. ఇంటిపని కూడా నాకిష్టమయితే చేస్తాను లేకపోతే లేదు. నిస్సంగం అంటే పట్టించుకోకపోవడమే అన్న నిర్ణయానికి వచ్చేను.‘‘

‘‘అంటే నిస్సంగంగా ఉంటే ఎక్కడ ఉన్నా ఒకటే అంటావా?’’

‘‘అలాగే అనిపించింది నాకు. అయినా నువ్వే అన్నావు కదా ముందొకసారి. సుందరం మారలేదు. నేనే దృష్టి మార్చుకున్నానని,’’ అంది లీల చిన్నగా నవ్వి.

"హాహా. నీకు చెప్పడం తేలిగ్గానే అయిపోయింది. ఇప్పుడు నాగురించి అంటేనే తల బద్దలు కొట్టుకోవలసివస్తోంది," అరవింద అని, ‘‘మరి నువ్వు చదువుకున్నావు కదా. ఉద్యోగానికి ప్రయత్నించలేదా?’’ అని మరోప్రశ్న.

‘‘చేసేను. కానీ నాచదువుకి తగిన పనులేవీ దొరకలేదు. నిజానికి నాచదువువిషయంలో కూడా నాకు తృప్తి లేదు. ఏదో చదివేం అంటే చదివేం అనే కానీ ఈ చదువులు నిజంగా మనిషి పరిపూర్ణ వ్యక్తి కావడానికి అవసరమైన విద్య అందించడంలేదు. వ్యక్తిని వ్యక్తిగా తీర్చి దిద్దడం లేదు. ఒక్క ఆడవారే కాదు, మొగవారి చదువులు కూడా అంతే. కమ్మెచ్చులో పోసి తీసిన ‘‘మూస పనివాళ్ళ’’ని తయారు చేసే దేశమ్మీదకి తోలేస్తున్నారే కానీ మౌలికవిలువలని ఆదరించి అనుసరించేవారిని తయారు చేయడంలేదు.’’

‘‘ఇవాళ్టికి చాల్లే. నామాటలు ఇలా వింటూ కూర్చుంటే నీక్కూడా మతి పోతుంది. వెళ్లి చదువుకుంటావో ఏదో మరో పనికొచ్చే పని చూసుకుంటావో చూడు,’’ అంది లీల.

‘‘మతి పోయినా పోకపోయినా, పనులున్నాయిలే. మళ్ళీ వస్తాను,’’ అంటూ అరవింద లేచింది.

OOO

కనుబొమ్మలు ముడిచి దీర్ఘాలోచనలో మునిగి ఉన్నాన్నేను. ఈమధ్య ఊళ్ళోనూ, ఇంట్లోనూ జరిగిన రభసల్తో విసుగెత్తి పోయి ఉన్నాను. చేతిలో చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి కథలు గాధలు ఉంది. 20 పేజీలైనా చదివేనో లేదో మెదడు ఆలోచనలతో నిండిపోయింది.

సుందరం ఎదురుగా కూర్చుని నావేపు పరీక్షగా చూస్తున్నాడు.

"ఏంటి ఇలా వచ్చేరు?"

"ఏం రాకూడదా?"

"మనం ఇంతకుముందెప్పుడూ ఇలా ఎదురుపడి మాట్లాడుకోలేదు కదా అని. వొస్లేండి. ఇంతకీ ఏదైనా పనిమీద వచ్చేరా?"

"పని అవునో కాదో మిమ్మల్నో మాట అడగాలని వచ్చేను."

"అడగండి."

“మీరు నాపాత్రకి అన్యాయం చేస్తున్నారు."

"అదేమిటి అలా అంటారు. జరిగిందీ, చూసిందీ రాస్తున్నాను."

"అదే తప్పంటున్నాను. మీకు తెలీని సంగతులు చాలా ఉండొచ్చు. మీపాత్రచిత్రణ పాక్షికం. మీకు లీలంటే ఇష్టం అని అంతా నాదే తప్పని రాయడం అన్యాయం. నా కోణం సరిగ్గా చెప్పకుండానే ముగించేస్తారా? హ్. పాత్రహత్య కూడా బ్రహ్మహత్యలాటిదే,” అన్నాడతను నావేపు వొడిచేసేలా చూస్తూ.

నేను తెల్లబోయేను. తేరుకుని, “హో హో. ఆగండి. చంపడాలదాకా తీసుకెళ్ళిపోయేరేంటండీ. నాకసలా ఉద్దేశం లేదు. మీకెందుకలా తోచిందో కానీ,” అన్నాను. ఇంతా చేస్తే అతను కథలో ఓ పాత్రే కదా, కాయితప్పులిలా.

“కథా గిథా? మమ్మల్ని మీరు పుట్టించేరు. పుట్టించింతరవాత మేం కూడ జీవులమే మా ప్రపంచంలో. మాపాత్రలు పూర్తిగా ఆవిష్కరించకుండా ముగించేయడం అన్యాయం, అక్రమం. కొండొకచో దౌర్జన్యం కూడాను,” అన్నాడు సుందరం ఎదురుగా ఉన్న సోఫాలో వెనక్కి వాలి సుఖాసీనుడై.

నేను తగ్గేను. “అది కాదండీ. నాకు మీలాటివారితో పరిచయం లేకపోవడంచేత మీవ్యక్తిత్వం నిర్దుష్టంగా చిత్రించడానికి కావలసిన సరంజామా నాదగ్గర లేదు మరి. నేను చూసినంతవరకూ మీరు తర్కశాస్త్రంలో ప్రజ్ఞానిధి. అది నేను చిత్రించేను కదా," అన్నాను, చెళ్లపిళ్లవారి పుస్తకం గట్టిగా పట్టుకుని.

"ఇంద్రగంటి గోపాలశాస్త్రిగారిగురించి చదివేరు కాబోలు," అన్నాడు సుందరం, ఆపుస్తకంవైపే చూస్తూ, "నేను లీలతో తర్కానికి దిగలేదు కదా."

"వెంకటశాస్త్రిగారు తర్కశాస్త్రం అంటే తిమ్మిని బెమ్మిని చేయడం అంటారు. తర్కశాస్త్రానికి ఋతంతో పని లేదు. వాక్చాతుర్యంతో ఎదటివారిని నమ్మించడమే ప్రధానం. మీరు మీమాటలగారడీతో అరవిందని నమ్మించేరు విషిని పెళ్లి చేసుకోవాలని. అలాగే మీమాటలగారడీతోనే లీలని మీఇంటికి రప్పించుకున్నారు. అరవింద ఓ నిశ్చయానికి రాలేదు కానీ మీరు ఆ అమ్మాయిని గందరగోళంలో పడేసేరు. లీల ఇంటికి వచ్చింది. అదే కదా నేను రాసింది."

"నేను కూడా మరి ఈనాటి సమాజంలోని వాస్తవాలే కదా మాట్లాడేను. అందులో నేను చేసిన మాయ ఏముంది?"

"లీలకి నామాటమీద నమ్మకం కుదిర్తేనే కదా మళ్లీ వచ్చింది?"

"సరే బాబూ, ఎందుకొచ్చిన గొడవ. నాకు మీరు అర్థం కాలేదు. అంచేత మీరే చెప్పేయండి మీతత్వం ఏమిటో. అలాగే రాసేస్తాను," అన్నాను వినయంగా.

"వ్యాసుడు గణపతిచేత రాయించినట్టు మీచేత రాయించనా? ఖర్మ కాకపోతే నాపాత్ర నేనే చెప్పుకోవాలా?" అన్నాడు సుందరం శాంతించి.

"రచయితకి తెలీనప్పుడు పాత్రలే చెప్పాలి మరి."

సుందరం సోఫాలో సర్దుకుని కూర్చుని, సిగరెట్టు వెలిగించబోతూ, సిరివేపు చూసేడు ఫరవాలేదు కదా అన్నట్టు.

సిరి సరేనన్నట్టు తలూపి, "కానీండి, పొగ లేక బండి నడవదంటే," అంది నవ్వుతూ.

సుందరం సిగరెట్టు ముట్టించి, పెడమొహం పెట్టి పొగ అవతలివేపుకి ఊది, మొదలు పెట్టేడు, "అసలు మీకు నేనర్థం అవాలంటే మీకు మొత్తం మానవాళి చరిత్ర తెలియాలి."

నాకు గుండెలు గుభేలుమన్నాయి. "మీరిప్పుడు మానవజాతి చరిత్ర సమస్తం పాఠం పెడతారా?"

"లేదులెండి. మీలాగే నాకూ అవతల పనులున్నాయి. పొడిపొడిగా నాలుగు ముక్కల్లో చెప్పేస్తాను. ఓ నాలుగో అయిదో యుగాలవెనకనుంచీ 1950 వరకూ."

నేను సర్దుకు కూర్చున్నాను.

‘‘అసలు మొట్టమొదట మనం గ్రహించవలసింది అందరూ సమానమే అన్నది అర్థరహితం అని.’’

‘‘అంతవరకూ నేనూ ఒప్పుకుంటాను. మీరు చూడండి ఆరడుగుల మూడంగుళాలు. నేనేమో అయిదడుగులకి అరంగుళం తక్కువ.’’

‘‘హాహ్హాహ్, మీరు చాలా హాస్యంగా మాటాడతారు. దానికేం గానీ, నేనంటున్నది బౌద్ధికంగానూ, మానసికంగానూ మాత్రమే కాక శారీరకంగా, అంటే ఒడ్డూ పొడుగూ మాత్రమే కాదు – మెదడూ, మెదడులో నరాలూ, నరాలు ప్రసారం చేసే మనోవికారాలూ – ఇవన్నీ స్త్రీపురుషులకి వేరువేరుగా ఉంటాయని వైద్య శాస్త్రం నిరూపించింది కదా.’’

‘‘కదా అనకండి. నాకు తెలీదు. మీరేం చెప్తే అదే.’’

‘‘నేనే కాదు, చాలామంది శాస్త్రజ్ఞులు అనేక పరిశోధనలు చేసి సాధికారకంగా నిరూపించేరు. బౌద్ధుల కాలంలోనూ, ఇంకా అంతకుముందూ, ఆ తరవాత శాతవాహనులకాలంలోనూ కూడా స్త్రీల ప్రతిపత్తి ఘనంగా ఉండేది. మీకు తెలుసో, తెలీదో వేదకాలంనించీ స్త్రీలలో చదువుకున్నవారున్నారు. చదువే కాదు. ఆర్థికంగా కూడా వారికి మంచి స్థాయి ఉంది సమాజంలో. శాతవాహనులకాలంలో స్త్రీలు, రాజవంశంలోనే కాదు సామాన్యులు కూడా దానధర్మాలు చేసేరు. సత్రాలు కట్టించేరు అంటే వారికి ఇంటా బయటా కూడా ఆర్థిక స్వాతంత్ర్యం ఉన్నట్టే కదా. సభల్లో పాల్గొన్నారు. వేదసంహితలలో కూడా కొన్ని సూత్రాలు రాసినట్టు సాక్ష్యాలున్నాయి.’’

‘‘సుందరంగారూ, మీరు అందరూ సమానం కాదంటూ మొదలు పెట్టి అందరూ సమానులే అనో కొందరు కొంచెం ఎక్కువ సమానులనో ప్రతిపాదిస్తున్నారు,’’ అన్నాను.

‘‘ఉండండి వస్తున్నానక్కడికే. అసలు నాకు సుందరం అన్నపేరెలా వచ్చిందో తెలుసా?’’

‘‘ఎలా వచ్చింది?’’

‘‘మా అమ్మమ్మపేరు సౌందర్యవల్లి. ఆవిడపేరు నాకు పెట్టేరు. అసలు ఇది వేదకాలంనుంచీ ఉంది. కర్ణుడు కౌంతేయుడు. సుమిత్ర తనయుడు సౌమిత్రి. గౌతమీపుత్రశాతకర్ణి కూడా అంతే.’’

‘‘ఆహా, బాగుంది.’’

‘‘ఇంతకీ నేను చెప్పేది మన సంస్కృతీసాంప్రదాయాలంటే నాకు మాచెడ్డ గౌరవం. ఇక్కడ చూడండి అమెరికా కంటే నాగరిక దేశం లేదనీ, అసలు నాగరికత అంటే అమెరికావారిదగ్గర్నుంచే

నేర్చుకోవాలనీ అంటారు. వాళ్ళు అలా అనుకోడంలో తప్పులేదు. మనదేశం అంటే మనకీ అంతే. ఆర్యావర్తభూములలో పుణ్యభూమి అంటారు కదా. మన సంస్కృతి మనకి ఎంత గొప్పదంటే మనం వీళ్ళని అప్రాచ్యులు అంటాం. మీకు జ్ఞాపకం ఉందా లండను వెళ్ళి వచ్చినవాళ్ళని ప్రాయశ్చిత్తం చేసుకుంటే తప్ప ఇంట్లోకి రానిచ్చేవారు కారు. మీరు The Moral and Intellectual Diversity of Races With Particular Reference to Their Respective Influence in the Civil and Political History of Mankind అన్న పుస్తకం చదివేరా? Arthur, T. S. (Timothy Shay) comte de Gobineau రాసింది నూటయాభై ఏళ్ళక్రితం. అందులో మానవజాతి చరిత్రగురించి సిద్ధాంతీకరించిన విషయాలు ఇప్పటికీ ఆదరణీయమే."

"లేదు, నేను చూడలేదు. ఏమంటారేమిటి?"

"అది తరవాత చెప్తాను. ప్రధానంగా ఆయన చెప్పేది ఆర్యసంస్కృతి speculative, చైనావారిది utilitarian. యూరోపియనులది ఈ రెంటి మిశ్రమం అని. అంటే మనం ఆర్యసంస్కృతికి చెందినవారం – మనకొక ప్రత్యేకమైన ధర్మం, తత్త్వం ఉంది. H. G. Wells Mankind in the making చూసేరా?"

"లేదు."

"పోనీ భారతం, రామాయణం, ... ఏమైనా చదివేరా?"

"లేదు, లేదు, మహాప్రభో. నేనేమీ చదవలేదు. నాకేమీ తెలీదు అన్న ప్రాతిపదికతో మీరు చెప్పదలుచుకున్నది కానివ్వండి. కొంచెం fast forward చెయ్యండి," అన్నాను నావిసుగు దాచుకుని.

"అదే చెప్తున్నా. మనసంప్రదాయంలో గార్హ్యస్థధర్మానికి ఒక ప్రత్యేకత ఉంది. అది వైయక్తికమే కాదు, సామాజికం కూడా. అక్కడ గృహస్థు అంటే భర్త ఒక్కడే కాడు. భార్యకి కూడా అందులో పాలుంది. ఇద్దరూ తమతమ ధర్మాలని పాటించాలి. పాటిస్తేనే సమాజశ్రేయస్సు. మీరు జాగ్రత్తగా పరిశీలిస్తే ఈవిషయం మీక్కూడా బోధపడుతుంది. మనయిళ్ళలో స్త్రీలు ఎంతో భక్తిప్రపత్తులు ప్రదర్శిస్తూనే తమ పనులు సాధించుకుంటారు. రామాయణంలో సీత చూడండి. రాముడు అగ్నిప్రవేశం చెయ్యమంటే నేను చెయ్యను అన్లేదు. అగ్నిప్రవేశం చేసి, తన పాతివ్రత్యాన్ని నిరూపించుకుంది. అసలది ప్రాతివ్రత్యం నిరూపించుకోడం కాదు. అదొక సవాలు. తానేమైనా చేయగలదు అని నిరూపించింది. రాముడు సంతుష్టుడయి, సరే పద రాజధానికి పోదాం అన్నప్పుడు మాత్రం, నేను రాను, నాపాత్ర ముగిసింది అంటూ భూదేవిలో కలిసిపోయింది.

భారతంలో ధర్మరాజు జూదంలో ఓడిపోయినతరవాత, సైంధవుడు ద్రౌపదిని సభలోకి తీసుకురావడానికి వెళ్తే, 'నన్నోడి తన్నోడెనా, తన్నోడి నన్నోడెనా?' అన్న ధర్మసందేహం వెలిబుచ్చింది కానీ పంచపాండవులతో అడవులకి వెళ్ళడానికి వెనుదీయలేదు. అచ్చమాంబగారు ఆనాటి సమాజనీతిననుసరించి ఘోషా పాటిస్తూనే సామాజసేవ చేసేరు. అంటే మనస్త్రీలు మొదట్నుంచీ సమాజం విధించిన నిబంధనలు పాటిస్తూనే తమ ఆశయాలు నెరవేర్చుకునే సుళువులు చూసుకున్నారు. స్త్రీవాదంలో ఔద్ధ్యతం ఇప్పుడొచ్చింది కానీ మనవాళ్ళు ముచ్చెల్లా పైకి కనిపించకుండానే తమకి కావలసినవి సాధించుకున్నారు. ఆ బలం తీరు వేరు. ఇక్కడయితే దాన్ని passive aggressive అంటారు కానీ మనకి అది ఆదరణీయమూ, ఆచరణీయమూను. ఒక్కమాటలో చెప్పాలంటే తెలుగుపడుచులకి అద్భుతమైన తెలివితేటలు ఉన్నాయి. నాకది ఘనమైన విషయంగానే అనిపిస్తుంది. నేను స్త్రీలని గౌరవిస్తాను. లీల కానీండీ, మీరు కానీండి, మాఅమ్మ కానీండి మీరందరూ అంటే నాకు అపరిమితమయిన గౌరవం. అసలు ప్రపంచంలో ఈ ఎక్కువతక్కువలన్నీ కొందరు పండితులు సృష్టించేరు కానీ ప్రతి యుగంలోనూ, ప్రతి తరంలోనూ మగవారు ఆడవారికి ఎంతో గౌరవమర్యాదలిస్తున్నారు."

"ఇదా మీ పాత్రచిత్రణ?" అన్నాను చిరాకునణుచుకుంటూ.

"నేను లీలని గౌరవించడం లేదన్నట్టు మీరు నన్ను చిత్రించేరు. నేనెవరో, ఎలాంటివాణ్ణో, నాప్రవృత్తేమిటో, నా పరిస్థితులేమిటో ఆలోచించకుండా మీరెలా ఆ నిర్ణయానికొచ్చేరు అని నేను ప్రశ్నిస్తున్నాను," అన్నాడు సుందరం తన నిజరూపం ప్రదర్శిస్తూ.

"నేనలా అన్లేదు. ఆరోజు జరిగినసంగతి జరిగినట్టు రాసేను. కనీసం నాకు తెలిసినవిషయాలు నేను రాసేను. మీరు చెప్పండిప్పుడు మీతరఫున మీరు చెప్పేదేమిటో."

"అదే నేనంటున్నా. మీరు విస్తృతపరిధిలో మరింత లోతుగా ఆలోచించడం నేర్చుకోవాలి. ఏదో ఒక సంఘటన తీసుకుని అదే ఆదీ అంతమూ అనుకుంటూ నిర్ణయాలు చేసీకూడదు."

తెల్లబోయేను మళ్ళీ. ఇదే మాట లీల కూడా అంది పూర్వం. నాకంటే వీళ్ళిద్దరికే ఎక్కువ తెలుసులా ఉంది. "సరే, మీరే వివరించండి స్వామీ ఆ విస్తృతపరిధి," అన్నాను మిక్కిలి భక్తితో.

"మీకు వేళాకోళంగా ఉన్నట్టుంది. రెండు నిండు జీవితాలు చిత్రిస్తున్నప్పుడు కాస్త ఒళ్ళు దగ్గర పెట్టుకు చేస్తే బాగుంటుంది," అన్నాడు సుందరం ఆచార్యోత్తమకళలు మొహాన పులుముకుని.

''చెప్తున్నా కదా, నాకు ఆ ఆచార్య లక్షణాలు తక్కువ. అంచేత నేనిలాటివాణ్ణి, నా ప్రవృత్తి ఇదీ అని మీరే చెప్పేస్తే అది రాసి సుఖపడతాను.''

''నిజం చెప్పమంటారా?''

''దానికోసమే కదా గంటనించీ ఎదురు చూస్తున్నది.''

''లీలని అర్థం చేసుకోడం చాలా కష్టం. తనకేం కావాలో, ఏం అక్కర్లేదో, ఏం ఆలోచిస్తోందో ఏదీ చెప్పదు. నోట ముత్యాలు రాలిపోతాయని భయమో ఏమో. అంచేత మీలాగే నేను కూడా ముందు జరిగినవి జ్ఞాపకం చేసుకుని, ఇది కావాలి కాబోలు, ఇది ఇష్టమే అయిఉంటుంది అనుకుని చేస్తాను. అసలు నిజం చెప్పాలంటే నేను చేసేదేదో చేసింతరవాత కూడా తనకి నచ్చిందో లేదో నాకు తెలీదు.''

''అలా అంటారేమిటి. తనకి నచ్చనివిషయాలు చెప్పేనని చెప్పిందే,'' అన్నాను జాగ్రత్తగా.

''ఊమ్. ఆఁ … చెప్పిందేమో కానీ నిజంగా నచ్చలేదు అన్నట్టుండదండీ … న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి అని ఎందుకన్నారో తెలుసా?''

''తమరే శలవీయండి.''

''ముందు చెప్పేను కదా. శారీరకధర్మాలూ, మేధాసంపత్తీ కూడా స్త్రీలకి లేవనను కానీ అవి వేరు విధంగా ప్రవర్తిస్తాయి. స్త్రీలకి పరిపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వడంలో నన్ను మించినవారు లేరు.''

నాకు కొంత టైం పట్టింది నాప్రశ్న మాటల్లో పెట్టడానికి. ''సంపూర్ణ స్వాతంత్ర్యం ఇవ్వడం అంటే ఏమిటి చేసేరు?'' అన్నాను.

నా అనుమానం సంపూర్ణస్వాతంత్ర్యం పేరుతో లీలని పూర్తిగా పట్టించుకోడం మానీసేడని. నిజానికి సంపూర్ణస్వాతంత్ర్యం ఇవ్వడానికీ పూర్తిగా నిర్లక్ష్యం చెయ్యడానికీ మధ్య గల తేడా లీలామాత్రం. మాటల్లో చెప్పడం కష్టం.

''ఆమె అవసరాలకి తగ్గట్టు సహాయం చేస్తూ ఆమెని పరిరక్షించుకోడం భర్తగా నాధర్మం. నేనలా లీలని ఎంతో అప్రమత్తతతో పరిరక్షించుకోడానికి తాపత్రయపడ్డాను. ఒకసారి ఏమైందో తెలుసా. పెళ్ళయిన కొత్తలో ఏదో ఊరు వెళ్ళేం. హోటల్లో దిగేం. తెల్లవారు ఝాము ఐదుగంటలకి లేస్తుంది తను. మాహోటల్లో ఏడు గంటలు దాటితే కానీ కాఫీ రాదు. తను ఐదుగంటలకి ఇంకా చీకటి ఉండగానే లేచి బయట గాస్ స్టేషనుకి వెళ్ళి కాఫీ తెచ్చుకుంది. అలా అంత రాత్రప్పుడు ఒక్కత్తీ బయటికి వెళ్తే ఎంత ప్రమాదం చెప్పండి. నేనదే అంటే తను నవ్వేసి, క్షేమంగా వచ్చేసేను కదా

అంది. మీ ఇందాకటి ప్రశ్నకి ఇదీ జవాబు. మొదట్లో బయటికి వెళ్ళవలసినప్పుడల్లా నేనే వెళ్ళేను. ఇంట్లో తనేం చేసుకున్నా నేను ప్రశ్నించలేదు. అదన్నమాట సంపూర్ణస్వాతంత్ర్యం ఇవ్వడమంటే.''

''మరి మీరిద్దరూ కూర్చుని ఈవిషయాలు చక్కగా, ప్రశాంతంగా తెలివితేటలు గలవారివలె చర్చించుకోవచ్చు కదా.''

''ఊహుఁ. లాభం లేదు. ఆడవాళ్లమెదళ్ళు చిన్నవి. వాళ్లకి విస్తృతపరిధిలో ఆలోచించడం చేతకాదు.'' అంటూ లేచి మాయమయిపోయేడు.

ఉలిక్కిపడి చుట్టూ చూసేను. ఎదురుగా సోఫాలో సిరి నవ్వుతూ నావేపు చూస్తూ ...

''ఏడీ?'' అన్నాను గాభరాగా చుట్టూ చూస్తూ.

''సుందరమేనా?''

''ఆఁ. సుందరమే. అతనే కదా ఇప్పటివరకూ మాటాడుతున్నది.''

సిరి గట్టిగా నవ్వి, ''ఏమంటాడేమిటి?''

''నన్నడుగుతావేమిటి నువ్వూ విన్నావు కదా.''

''ఏం వినడం. అసలు ఈ కలవరింతలంటే నాకందుకే చిరాకు. నువ్వు మాటాడినవి వినిపిస్తాయి కానీ నీకలలో అవతలివారిమాటలు నాకు వినిపించవు కదా.''

''సుందరం ఇక్కడికి రాలేదూ?''

''వచ్చే ఉంటాడులే. నాక్కనపించలేదంతే. ఇంతకీ ఏమంటాడు?''

తల అడ్డంగా ఊపేను, ''ఒక్కముక్కయినా అర్థం కాలేదు. మోకాలికీ బట్టతలకీ ముడి పెట్టగల చతురుడు. పుస్తకాలు తెగ చదువుతాడు. అవన్నీ వల్లె వేసేస్తాడు.''

''లీల ప్రసక్తి ఏమైనా తెచ్చేడా?''

''తాను లీలని అర్థం చేసుకున్నాడు కానీ లీల తనని అర్థం చేసుకోలేదంటాడు.''

"మరి నువ్వేం చేస్తావు ఆపాత్రని?"

"ఆలోచించాలి," అన్నాను దిక్కులు చూస్తూ.

OOO

లీలకి తెలుసు పెద్దక్క సందేహం. ఎలా చెప్పాలో మాత్రం తెలీడంలేదు.

రెండు రోజులక్రితం లీలకి ఇండియానించి ఫోనొచ్చింది. "తాతగారిని డాక్టరుకి చూపిస్తున్నాం," అని చిట్టికమల ఫోను చేసింది.

ఉక్కుపిండంలాటి తాతగారికి వచ్చిన విపత్తు ఏమిటో లీలకి అర్థం కాలేదు. ఈమధ్య కొంతకాలంగా నీరసంగా ఉన్నారుట. డాక్టరుని చూడ్డానికి ఒకంతట ఒప్పుకోలేదుట. ఆఖరికి ఆరోజు ఉదయం పట్టుబట్టి తీసుకెళ్తే లివరులో ట్యుమరు లక్షణాలు కనిపిస్తున్నాయని, ఇంకా టెస్టులు చెయ్యాలనీ చెప్పేరుట.

తాతగారిసంసారం చిన్నదేమీ కాదు. ఆయనతండ్రి అంటే లీలముత్తాత మూడు పెళ్ళిళ్ళు చేసుకుని 9మంది సంతానాన్ని కన్నారు. మూడో అమ్మమ్మ దివంగతురాలయినతరవాత ఆయనకి తపన మొదలయింది వీళ్ళందర్నీ ఎలా పెంచి పెద్ద చేయడం, చదువులు, పెళ్ళిళ్ళు చేయడం ఎలా అని.

అప్పటికే పెద్దకొడుక్కి పెళ్ళయింది కానీ ఇంటికి పెద్దకొడుకుగా అతను బాధ్యతలు నెత్తికెత్తుకోడానికి అంగీకరించలేదు. తండ్రి చేసిన పెళ్ళి కాక మరో ఆడపిల్లని చేరదీసి ఆవిడతో సభలూ సమావేశాలూ అంటూ దేశాలు తిరుగుతూ, తండ్రికి సాయం చెయ్యడం మానేశాడు. ''నాకే రెండు పొయ్యిలు. ముగ్గురు పిల్లలు. నేను వీళ్ళసంగతి చూసుకోవాలి. అది నాధర్మం, మీకు చేసినన్నాళ్లు చేసేను. జీవితాంతం అంటే నావల్ల అవుతుందా?'' అంటూ ఎగిరి పడ్డాడు. పైగా ''స్తోమతు చూసుకోకుండా అంతమందిని కనడమేమిటి?'' అని కూడా సతాయించేడు.

పెద్దాయనకి నోట మాట రాలేదు. తాను మూడు పెళ్ళిళ్ళు చేసుకున్నాడంటే, ఈ కుంకల్ని సాకడానికే కదా అంటూ మండిపడ్డాడు. రెండోకొడుకు ఏదో వ్యాపారం పెడతానంటూ వేలకి వేలు తీసుకెళ్ళి బొంబాయిలోనూ, మద్రాసులోనూ తగలేసి, చిప్ప చేతికొచ్చేక తిరిగొచ్చీసేడు. అతడ్ని నమ్మినా ఒకటే వాకిట్లో తుమ్మచెట్టుని నమ్మినా ఒకటే.

మూడో గృహలక్ష్మి కూడా గతించేక, ఆయన బాగా కుంగిపోయేడు. ఎవరేనా చూస్తే ఆయనేనా ఈయన అనుకోవాలి. తనకి కళత్రయోగం లేదేమో అని అప్పుడనిపించిందాయనకి. ఆ సమయంలోనే ముత్తాతగారు మూడోకొడుకుని, అంటే లీలతాతగారిని అడిగేడు మిగతా పిల్లలకి ఓ దారి చూపమని.

తాతగారు "తప్పకుండా చూస్తాను" అంటూ భీష్మ ప్రతిజ్ఞ చేసేరు. ఆ ప్రతిజ్ఞమేరకు పెళ్ళి మానుకుని వీళ్ళే తనసంసారంగా వాళ్ళని సాకేరు. పాపం, తాతగారు. నిష్కామయోగి అంటే ఆయన్నే చెప్పుకోవాలి. ఈకాలంలో కుటుంబం అంటే మొగుడూపెళ్ళాం, ఒకరో ఇద్దరో పిల్లలు -- గంగాధరంకుటుంబం, గౌరిదేవికుటుంబం, చిట్టెమ్మకుటుంబం, పుట్టన్నకుటుంబం అంటూ ఎవరికి వారే కానీ తాతగారెప్పుడూ అలా అనుకోలేదు.

ఆయనకి కుటుంబం అంటే వీళ్ళంతాను. తనకున్నది ఒకరికి పెట్టేడు కానీ తనకి ఇది కావాలని ఎవరినీ ఎప్పుడూ కోరలేదు. తమ్ముళ్ళకీ, వాళ్ళపిల్లలకీ కూడా చదువులు చెప్పించేడు. ఆడపిల్లలకి పెళ్ళిళ్ళు చేసేడు. తల్లి లేని పిల్లలని చెల్లెళ్ళకి తానే తల్లీ, తండ్రీ కూడా అయి పురుళ్ళు పోసేడు. పండుగలకీ, పబ్బాలకీ పిలిచి నూతనవస్త్రాలు పెట్టేడు.

ఇన్ని చేసినా ఎవరికీ తృప్తి లేదు. సణుగుతూనే ఉంటారు. ఎవరింట్లో ఉంటే వాళ్ళు తాతగారిని "మేం పోషిస్తున్నాం" అనేవాళ్ళే కానీ తాతగారు మాకింత చేసేరు అనరు.

ప్రస్తుతం ఇప్పుడొచ్చిన ఫోను చిట్టికమల రెండో పెద్దక్క సావిత్రి దగ్గర్నుంచి.

"మాచెల్లి పదహారేళ్ళగా పోషిస్తోంది ఆయన్ని. చిన్నది, పాపం, అదెంతకాలం చేస్తుంది. మిగతావారికి మాత్రం బాధ్యత ఉండఖ్ఖర్లేదా?"

లీలకి ఒళ్లు భగ్గున మండింది. "పోషించడం ఏమిటి ఆయనేదో చిన్నపిల్లాడో, మంచం పట్టినవాడో అన్నట్టు. ఆయనేం ఊరికే తింటూ కూర్చోలేదు కదా. ఇంట్లో మనిషిలాగే పిల్లల్ని చూసుకోడం, ఇంటిపనులూ, బజారుపనులూ చెయ్యడం – ఇవన్నీ ఏమిటి?" అంది లీల నెమ్మదిగానే.

"ఆయనదగ్గర చిల్లికానీ లేదు. నేనూ, అక్కయ్యా పంపిస్తున్నాం. అసలు ఆయనెందుకు అడుక్కోవాలి? పెదబాబుకి అంత చేసేరు. పొలం అంతా వాళ్ళచదువులకే అయింది. వాళ్ళు తీసుకెళ్ళొచ్చు కదా."

ఆమాట వినేసరికి లీలకి మరింత కోపం వచ్చింది. తనమరిది ఆదాయం ఏమీ తక్కువ కాదు, అసలు అడుక్కోడం అన్నమాట ఎందుకొచ్చిందీ, అవతల ఎవర్నిగురించి అంటున్నాం అనైనా లేకుండా అదేం మాట?

"ఆయనా అడుక్కుంటున్నది? నీ చెల్లెలా?" అంది గట్టిగా.

“అది కాదు, సరేలే మాట పొరపాటు. ఏదో మాటవరసకి అన్నాను. ఆయన్ని మిగతావాళ్ళు కూడా కొన్నాళ్లపాటు ఉంచుకోవచ్చు కదా. మేం చెయ్యం అని కాదు. అసలు ఆయన్నే కాదు, మీక్కూడా చేస్తాం. రండి. మాచెల్లి ఎంత కష్టపడిందో మీకు తెలీదు.”

ఫెళఫెళార్భాటాలతో కరాళమేఘాలు పన్నెండు ఒక్కసారిగా ఉరిమినట్టు, మిన్ను మిరిగి మీద పడ్డట్టు అనిపించింది లీలకి. కిటికీదగ్గర నిలబడి మాటాడుతున్నది గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చి సోఫాలో కూలబడింది.

మరోపావుగంటకి పెదబాబు అనబడిన, తాతగారి మేనల్లుడు ఫోను చేసేడు. “సావిత్రీ, వాళ్లక్కయ్యా నాకు మెయిలిచ్చేరు. తాతగారిబాధ్యత నాక్కూడా ఉందని, వచ్చి తీసుకెళ్ళమనీను. నాకేం తోచడం లేదు. మాయింట్లో పదేళ్ళు పెట్టుకున్నాను కదా. ఆ తరవాతే వాళ్ళు రండి రండి అంటూ ఆయన్ని పిలిచి తీసుకెళ్ళేరు. ఇప్పుడు వాళ్ళ అవసరాలు తీరిపోయేయి కనక ఆయన్ని పొమ్మంటున్నారు.“

మరో ఇమెయిలు, “సావిత్త్రివదిన పిలిచి మమ్మల్ని నానా మాటలూ అంది. తాతగారికి ఆరోగ్యం బాగులేదంటే మాటాడకుండా ఊరుకుంటారా అని. పెద్దత్త కొడుకు తీసుకెళ్ళొచ్చు కదా. అమ్మమ్మ బంగారం అంతా దోచుకున్నారు. ఆవిడ పోయేవేళకి పది లక్షలబంగారం ఉంది వొంటిమీద. వాళ్ళింట్లో ఉండగానే కదా ఆవిడ పోయింది?”

మరో ఇమెయిలు, “అమ్మ పోగానే తాతగారొచ్చి మీమంచీ చెడ్డా నేను చూస్తాలే, ఏడవకు, అంటూ వచ్చి మాయింట్లో ఉంటే మేం ఒక్కమాట అన్నామా? పాతికేళ్ళు మాయింట్లో ఆయనకి రాజభోగాలు జరిపించేం. ఇప్పుడేమో మేం ఏమీ చెయ్యలేదన్నట్టు ఆ సావిత్త్రిపిన్ని మమ్మల్ని నానామాటలూ ఆడిపోస్తోంది.”

“లోకనాథంఅన్నయ్యింట్లో వదినవరస బాగులేదంటేనే మాయింటికి తీసుకొచ్చేం. వాళ్ళపిల్లల పెళ్ళిళ్ళకోసం పొలం అమ్మితే మేం అలాగే కానివ్వండి అన్నాం కానీ మావాటా ఏదీ అని అడగలేదు. ఇప్పుడేమో ...”

“సీతక్కఇంట్లో ఉన్నప్పుడు తాతగారు ఎంత అవస్థలు పడ్డారో తెలుసా? రాజు ఏదో పనిమీద బెజవాడ వెళ్లినప్పుడు చూసేడుట. తెల్లారగట్ల లేచి వీధి కొళాయిదగ్గర వరసలో నిలబడి నీళ్ళు తీసుకురావాలి, అమ్మగారు లేచేసరికి కాఫీ పెట్టాలి. బజారుకెళ్ళి కూరలూ, పళ్ళూ తేవాలి.

పిల్లల్ని స్కూలికి తీసుకెళ్ళాలి. ఆయనపాట్లు చూడలేక మాయింటికి తెచ్చుకున్నాం. మాయింట్లో పన్నెండేళ్ళున్నారు.''

లీలకి తల వాచిపోయింది ఈ అపవాదాలతో. వీళ్ళందరి లెఖ్ఖలూ చూస్తే, తాతగారికి ఈసరికి 150 ఏళ్ళుండాలి!

అంతలోనే మరో మెయిలు - సావిత్రి రాజుకి ఇచ్చిన మెయిలు తనకి కాపీ పెట్టింది. అందులో ఆయింట బుట్టిన ప్రతివారికీ ఉండవలసిన రక్తసంబంధమైన ధర్మాలగురించి ఉపన్యాసం. ''మేం అందరం ఇంతకాలం తాతగారిని చూసుకున్నాం. మీరు కూడా చెయ్యాలి. అది మీధర్మం. ఆయనకి కష్టకాలం వచ్చినప్పుడు మీరు కాక ఎవరు చేస్తారు?''

లీలకి దుఃఖం ముంచుకొచ్చింది. ప్రస్తుతం తాతగారు చిన్నతమ్ముడు కొడుకింట్లో ఉంటున్నారు. ఆయనభార్యే ఈ చిట్టికమల. ఇద్దరికీ ఉద్యోగాలున్నాయి. పసిపిల్లలని చూసుకునేవాళ్ళు కావాలి అన్నారుట వాళ్ళిద్దరూ. లేదా అంత చాదస్తంగా కాదనుకుంటే, ''పెద్దవారయిపోతున్నారు. మీరిలా ఇల్లిల్లూ తిరగడం బాగులేదు. వచ్చి మాదగ్గరుండండి. మీక్కూడా పిల్లలతో కాలక్షేపంగా అవుతుంది. మానాన్నగారెంతో మీరంత. మీరూ మేమూ బతికున్నంతకాలం పువ్వుల్లో పెట్టి పూజించుకుంటాం,'' అన్నారు.

ఇప్పుడు ఆయనకి ఆరోగ్యం చెడేసరికి, ''ఇంతకాలం చేసేం, మీరెందుకు చూసుకోరంటే మీరెందుకు చూసుకోరం''టూ మిగతావారిని సతాయిస్తున్నారు. ... we love him, we take care of him, but they also have parental duty గట్రా అంటూ వెధవ ఎంగిలీకమొకటీ. వీళ్ళకి తాతగారు చెప్పించిన చదువు అందుకు పనికొచ్చింది. ఈ డూటీలు తాతగారికి ఒంట్లో ఓపికా, చేతిలో డబ్బూ ఉన్నప్పుడు తోచలేదీ బుర్రలకి.

తాతగారు పాతకాలపు మనిషి. తెల్లనివన్నీ పాలని నమ్మేంత అమాయకుడు. వాళ్లు రమ్మంటున్నారు అని మురిసిపోయేరే కానీ ఎందుకు రమ్మంటున్నారో ఆలోచించలేదు. లీల అప్పట్లో అనలేదు కానీ తరవాత చూచాయగా చెప్పడానికి ప్రయత్నిస్తే, ''వాళ్ళనేం అనకు. వాళ్ళకి నేనంటే ఎంతో అభిమానం. మానాన్నగారొకటీ, మీరొకటీనా,'' అందిట చిట్టికమల. ఆ కబుర్లన్నీ నాలుకచివరినించి వచ్చినవే అని ఆయనకి ఎలా అర్థం అవుతుంది?

తాతగారు వెనకటితరానికి మచ్చు. ఆయనకి తనవారు పెరవారు అన్న బేధం లేదు. ఎవరికి అవసరమైతే వారికి సాయం చెయ్యడమే. ఎదటివారు ఏం చెప్తే అదే, ఆ మాటని అలా ఉన్నదున్నట్టు తీసుకోడమే కానీ అంతరార్థాలు ఉంటాయని తోచలేదాయనకి.

చిట్టికమల "మీరు మాయింట్లో ఉండడం మా అదృష్టం" అంటే నమ్మేరు కానీ ఆమాటలు మనసులోంచీ వచ్చినవి కావని ఆయనకి అర్థం కాలేదు. తాను సాయం చేస్తున్నాననే అనుకున్నారు కానీ "ఆయనకి ఎవరూ లేరు అని మేం మాఇంట్లో పెట్టుకున్నాం" అని వాళ్ళు ఊళ్ళో వాళ్లకి చెప్తున్నారని తెలీదు. తనదగ్గర డబ్బున్నన్నాళ్ళు వాళ్ళకి పెట్టేరు. తనదగ్గర లేకపోతే వాళ్ళని అడిగి తీసుకున్నారు. వెనకటి సంప్రదాయం అది. తనడబ్బు వాళ్ళడబ్బు అని పేరు పెట్టడాలు ఆయనకి తెలీలేదు.

చిట్టికమల, "మీరు ఇక్కడుండడం మాకు కష్టం కాదు కానీ మేమేదో మిమ్మల్ని ఇక్కడ ఉంచేసుకుని మిగతా వాళ్లందరికీ మిమ్మల్ని కాకుండా చేస్తున్నామని ఊళ్ళో అందరూ అనుకుంటున్నారు. అంచేత మీరు కొన్నాళ్ళు అక్కడ కూడా ఉంటే బాగుంటుంది" అంది.

తాతగారు, "ఊళ్లోవాళ్ళు ఏమనుకుంటే మనకేమి? నీకూ, నాకూ ఎలా బాగుంటే అలా చేస్తాం. నాకిక్కడ సదుపాయంగా ఉంది. పిల్లలు బాగా అలవాటయేరు. వాళ్ళు కూడా బెంగ పెట్టుకుంటారు నేనిప్పుడు వెళ్ళిపోతే. అంచేత నేనెక్కడికీ వెళ్లను. నువ్వేం బెంగ పెట్టుకోకు. వాళ్ళెవరేనా ఏమేనా అంటే నన్నడగమని చెప్పు. నేను వాళ్ళకి బుద్ధొచ్చేలా సమాధానం చెప్తాను," అన్నారు. చిట్టికమల ఇరుకున బడింది.

అలాటివే మరో నాలుగు సంఘటనలయేక, అక్కలదగ్గర తన కష్టాలు వెళ్ళబోసుకోడం మొదలు పెట్టింది. నిజానికి తాతగారివల్లే అని కాదు, అంతకుముందు కూడా తనకి నొప్పి కలిగినప్పుడల్లా వాళ్ళకి చెప్తూనే ఉంది. అయితే ఇప్పుడు తేడా ఏమిటంటే ఆయనవల్ల తనకి కలిగిన లాభాలు అంతగా తలపుకి రావడం లేదు. ఒకరోజు అబ్బాయి ఆలస్యంగా వచ్చేడని వాడిమీద అరిచేరుట. మరోరోజు ఆయన చెప్పిన చొక్కా తొడుక్కోలేదని విసుక్కున్నారుట. పిల్లాడు పెద్దవాడవుతున్నాడు, మరీ పసివాడిని కసిరినట్టు కసరడమేమిటి ... ఆమాట ఆయనతో అంటే "పదకొండే కదా అప్పుడే పెద్దవాడయిపోయేడా, మరీ చిత్రం కాకపోతే," అంటూ నవ్వేసేరుట ఆయన.

చిట్టికమలకి మాత్రం అది నవ్వుతాలువిషయంలా అనిపించలేదు. మరో రోజు తనూ పురందరం వాదించుకుంటుంటే ఆయన కలగజేసుకున్నారు. వెంటనే మొగుడూపెళ్ళాలకి ప్రైవేసీ లేకుండా

పోతోందని స్ఫురించింది. మరి గత పదేళ్ళలో అలాటి సందర్భాలు రాలేదా? మరి అప్పుడేం చేసేరంటే, అప్పట్లో అదేమంత పెద్ద విషయంగా తోచలేదు.

అవును మరి. "ఆయనకి అప్పట్లో చేతిలో డబ్బూ, వొంట్లో ఓపికా ఉన్నందున," అన్న మాట మనసులోకి వచ్చింది లీలకి. ఆమాట తనంటే వాళ్ళు ఒప్పుకుంటారా? అసలు ఊరుకుంటారా? ఎగిరిపడతారు తాను సంగతిసందర్భాలు పూర్తిగా అర్థం చేసుకోలేదని. ఈ లుకలుకలు ఆలోచిస్తుంటే నవ్వొస్తోంది కూడాను.

రాజు పైనెల వచ్చి తాతగారిని తీసుకెళ్తానని చిట్టి కమలకి చెప్పేడు. లీలకి అతన్నిగురించి అట్టే తెలీదు తాతగారు వాళ్ళింట్లో కూడా కొన్నాళ్ళుగా అక్కడున్నారు అన్నది తప్పిస్తే. అప్పటికి ఈ అబ్బాయి ఇంకా బియే మొదటి సంవత్సరం చదువుతున్నాడు. ఇప్పుడేదో మంచి ఉద్యోగంలోనే ఉన్నట్టుంది. మంచి తెలివైన కుర్రాడనీ, స్కాలర్షిప్పులతో చదువుకున్నాడనీ మాత్రం తెలుసు. బుద్ధిమంతుడు కూడా అయిఉండాలి లేకపోతే తాతగారిని తీసుకెళ్ళడానికి ఎందుకు ఒప్పుకుంటాడు ఆయనకి చేతిలో డబ్బూ, ఒంట్లో ఓపికా లేవని తెలిసీక?

ఈ వ్యక్తిత్వ స్టడీలు ఆలోచించుకుంటూ పోతుంటే సుందరం కూడా మనసులోకి వచ్చేడు. చిన్న నవ్వు కూడా వచ్చింది. ఆయనతో కాపురం చేస్తోంది 15 ఏళ్ళగా. అయినా ఆయన్నిగురించి ఏం తెలుసంటే చప్పున చెప్పడానికేం లేదనే అనిపిస్తోంది.

000

లీల పెద్దక్కకి ఈకథంతా చెప్పి, అంది, "వీళ్ళందరిపోరూ పడలేక ఓరోజు నేను తాతగారినే పిలిచి మాటాడేను. ఇప్పటికి రెండు వారాలయింది ఆయనకి బాగులేదని తెలిసి. ఆస్పత్రికి తీసుకెళ్ళడం, ఏవో టెస్టులూ, అవీ జరిగేయిట. సర్జరీ కూడా అయిందిట. ఆయన ఆరోజు నాతో బాగానే మాటాడేరు. మరో మూడు రోజులయేక మళ్ళీ ఫోనొచ్చింది పరిస్థితి మరీ దిగజారిపోయింది అని. దిగులుగా వెర్రిచూపులు చూస్తూ, ఏవేవో మాటలు తన్లో తనే మాటాడుకుంటూ ఇల్లంతా తిరుగుతున్నారుట కాలు కాలినపిల్లిలా. నేను వీళ్ళసంగతులు చెప్పి మరింత నొప్పించేనేమో ఆయన్ని అనిపిస్తోంది," అంది లీల దిగులు పడిపోతూ.

"అలా అనుకోకు. నువ్వు చెప్పకపోతే వాళ్ళే మరోవిధంగా ఆయనకి తెలియజేసి ఉండేవాళ్లు. అసలు ఇప్పుడు మాత్రం వాళ్ళు మరింత ఎత్తిపొడుపుమాటలు అనడం లేదన్న నమ్మకం ఏముంది? వాళ్ళేం మాటలంటున్నారో, ఏం చేస్తున్నారో నీకు తెలీదు. చూస్తుంటే ఆయన్ని

బయటికి పంపడం మాత్రమే వాళ్ళ ఏకైక ధ్యేయంలా ఉంది. అది సాధించడానికి ఏ గడ్డి కరవడానికేనా సిద్ధమే అలాటివాళ్లు," అంది పెద్దక్క.

లీలకి నిజమే అనిపించింది.

పెద్దక్కే మళ్ళీ అందుకుంది, "మానాన్నగారివిషయం కూడా ఇలాగే అయింది. ఆరోజుల్లో ఆలోచనలు అలాటివి. నాబొదో అంటూ అందరికీ సేవలు చేసేరు. తీరా చివరిరోజులు వచ్చేసరికి, ఆయనకి కాస్త మతి చలించేసరికి, మతిమాలిన ముండాకొడుకు అందిట మా పెద్దత్తయ్య ఆయన్ని. ఆ తరవాత ఆయన ఎంతో కాలం బతకలేదు. "బుచ్చి నన్ను మతిమాలిన ముండాకొడుకు' అంది అని తనలో తను గొణుక్కుంటూ తనగదిలోనే ప్రదక్షిణాలు చేస్తూ గడిపేరుట పదిరోజులు. పదకొండోరోజు స్నానం చేసి, మడిపంచె కట్టుకుని పెరట్లో తులసికోట దగ్గర సాష్టాంగపడి ప్రాణం వదిలేసేరు," అంది. ఆరోజు తలపుకి రావడంతో ఆవిడకళ్ళ నీళ్ళు తిరిగేయి.

మరికొంచెంసేపు కూర్చుని ఇంటికి వచ్చేసింది.

తరవాత, పీసీముందు కూర్చుని, మెయిలు టైపు చేసింది. "ఇప్పటికి మీ అందరి ఆలోచనలూ వినడం అయింది. తాతగారితో కూడా మాటాడేను. మీరు నాతో అన్నమాటలు చెప్తే ఆయన నమ్మలేదు. ఇంత దూరంలో ఉండి నేనేమీ చెయ్యలేను. మీరంతా తలొకమాటా అంటున్నారు కానీ నాకేమీ అర్థం కావడంలేదు. వీటన్నటిమధ్య అసలు నిజం ఎక్కడుందో నాకు తెలీదు. తాతగారు ఒకమాట మాత్రం అన్నారు. ఆయనా, చిట్టికమలా, అల్లుడుగారూ - వాళ్ళలో వాళ్లు మాటాడుకునే చేసుకుంటున్నారుట ఏ నిర్ణయమైనా. కనీసం ఆయననమ్మకం అదీ. ఇంక నేను మీకు చెప్పగలిగింది ఒక్కటే. మీరు ఆయనతోనూ, చిట్టికమలతోనూ, వాళ్ళాయనతోనూ మాటాడండి. ఇది మీరూ మీరూ తేల్చుకోవలసిందే."

ఆ మందమెయిలు పంపేసి నిట్టూర్చింది. తనకి తెలుసు ఇది ఇక్కడికి అయిపోలేదని. కానీ తను అంతకంటే చెయ్యగలిగిందేమిటో తెలీడం లేదు. ఒకటి స్పష్టంగా తెలుస్తోంది. ఆయనకి అర్థబలమూ, అంగబలమూ ఉన్నప్పుడు అందరికీ ఆప్తుడే. పరిస్థితి అటునించి ఇటయింది ఇప్పుడు. ఆయనదగ్గర డబ్బు లేదు. ఆపైన జబ్బు చేసింది. ఇప్పుడు ప్రతివారికీ మిగతావాళ్ళ బాధ్యతలు గుర్తు చేసే అవసరం అర్జంటుగా కనిపిస్తోంది.

లీల చాలాసేపు అలా కూర్చుండిపోయింది. ఆరోజుల్లో అభిమానాలూ, మనవాళ్ళు అన్నపదాలకి నిర్వచనం వేరు. అది తెలుస్తూనే ఉంది. అవే ఆలోచనలు పెట్టుకున్నవారికి ఇప్పుడు బతుకు లేదు. తాతగారికి ఇది కాలం కాదు. శారీరకంగా ఆయన ఇప్పుడు ఉన్నా, ఆత్మీయతలూ అభిమానాలపరంగా ఆయన రెండు తరాలు వెనకటి మనిషి. స్వయంకృషితో యం.కాం. చేసేరు. లక్షలు సంపాదించేరు. రక్తబంధువులే కాదు, ఎంతోమంది పరిచయస్తులకీ, స్నేహితులకీ నోట్లో నాలుకై వాళ్ల సమస్యలకి పరిష్కారాలు చూపించేరు. తనసంగతి మాత్రం చూసుకోలేదు. ఈకాలం మనుషుల తత్వాలు ఎంతగా మారిపోయేయో గ్రహించలేదు.

లీలకి తొలిసారిగా కళ్లలో నీళ్లు తిరిగేయి.

000

ప్రభాస్రావుగారింటికి వచ్చిన కవిగారు దేశాటన ముగించుకు తిరిగి వస్తూ మరొక కవిపండితుడు అనంతశర్మగారిని వెంట బెట్టుకు వచ్చేరు.  క్షుణ్ణంగా శాస్త్రాలూ ప్రబంధాలు చదువుకున్న పండితుడు ఆయన.

శర్మగారు కూడా ఇక్కడికొచ్చే ప్రముఖులందరిలాగే ఆధునిక సంప్రదాయసిద్ధమైన ఉత్తరఅమెరికా జైత్రయాత్ర ముగించుకుని వచ్చేరు. కనీసం పది తెలుగు కుటుంబాలున్న పట్టణాల్లో సభలలో వారు కప్పిన శాలువాలన్నీ మూటగట్టుకొచ్చేరు. వాటితో నిండిపోయింది ఒక సూట్కేసు.

అట్టహాసంగా జరిగిన సభలరభసలన్నీ వినడానికి ఉత్సాహపడుతున్న మరియు సభకి హాజరు కాలేకపోయినవారి సౌకర్యార్థం తమఇంట్లో సమావేశం ఏర్పాటు చేసేడు.

″నాకు మనసేం బాగులేదు.  మరోచోట పెట్టుకో, ″ అంది లీల.

సుందరం, ″అలాగే, ″ అన్నాడు.

ఆరోజు సాయంత్రం నాలుగు ఫోనుకాలులు వచ్చేయి లీలకి.

″అయ్యో తాతగారికి బాగులేదుట కదా.  పాపం, ధైర్యంగా ఉండండి. ″

″ఏమైనా కావలిస్తే చెప్పండి. ″

″మీకు మాట్లాడాలనిపిస్తే నన్ను పిలవండి.  ఏటైం అయినా ఫరవాలేదు. ″

లీలకి మహ చిరాకేసింది. సుందరంగదిలోకి వెళ్లి, ″ఏంటీ గోల.  స్థానిక టీవీయేనా national టీవీలో కూడా ప్రకటించేవా, ″ అంది విసుగ్గా.

″ఏమిటీ?″ అన్నాడు సుందరం అయోమయంగా చూస్తూ.

″తాతగారికి ఒంట్లో బాగులేదని నాకు ఓదార్పులు వినలేక ఛస్తున్నాను. ఓసంతాపసభ కూడా పెట్టేస్తావా? నాకోసం నువ్వెంత బాధ పడిపోతున్నావో జనాలకి తెలియాలి,″ అనేసి లీల విసవిస గదిలోంచి వెళ్లిపోతుంటే,

″నీకు మనసు బాగులేదని చెప్పాలి కదా సమావేశం స్థలం మారుస్తానని చెప్పేముందు. పైగా కొందరు పాట్లక్ ఎందుకు అని అడిగితే చెప్పేను,″ అన్నాడు సుందరం అమాయకంగా.

000

అట్టే ఆసక్తి లేకపోయినా సిరి రా రా అని పట్టు బట్టడంతో నేను కూడా వెళ్లేను. లీల రాలేదు. సమావేశంలో సంభాషణలు మామూలే ఇలాటి అన్ని సమావేశాల్లోలాగే.

“అయితే ప్రముఖులెవరెవరు వచ్చేరు?”

“మీరలా అడిగితే ఎలా అండి? వచ్చినవారందరూ ప్రముఖులే. ప్రముఖులు కాకపోతే ఎందుకు పిలుస్తారూ?”

“ ప్రముఖులు ఒక్కరే కాదు. మొత్తం కుటుంబం ఇప్పుడు. ప్రముఖకుటుంబం అనాలి. వెనకటికి వేదంవారూ, తుమ్మలవారూ అనేవాళ్ళం కానీ ఇప్పుడు ఓ మాధవో, ఓ అఖిలో పిలవబడితే. వారి పిల్లా మేకా అంతా కలిపి కనీసం నలుగురుంటారు. ”

“అంతేలెండి. అమెరికాపర్యటన మరి కుటుంబసమేతంగానే కదా. ఇంతకీ సత్కారాలు ఎందుకు చేస్తారూ?”

అబ్బో, చాలామందికే చేసేరండీ. అనేకరంగాల్లో ప్రముఖులు కదా. ఏదో సాహిత్యం, సంగీతం, నాటకం అంటూ రెండో మూడో అయితే చాలదు. ఇప్పుడు పుట్టగొడుగుల్లా ఎన్ని రంగాలో. అందులోనూ Interdisciplinary studies వచ్చేక ఈ రంగం ఆ రంగం రంగరించి మరో రంగం. తదనుగుణంగానే సత్కారాలు కూడాను, రచయితలతోపాటు వారి శిష్యపరమాణువులు సత్తెనకాయల్లా. ″

“హాహా, ఏ ఏరంగాలో మీకు తెలీదందురూ. ”

“రంగాలు తెలీనప్పుడు రంగాల్లో ప్రముఖులెవరో మాత్రం ఎలా తెలుస్తుందీవిడకి. మీరు ఈవిణ్ణి వదిలేయండి. ″

“హా, నన్నొదిలేస్తానంటారా? ఆ సత్కరింపబడినవారిలో నేనున్నా. ”

“ఓహో, మీకూ దుశ్శాలువలు కప్పేరన్నమాట. ”

“అయితే మీక్కూడా రెండిచ్చుకున్నారా?”

“లేదండీ. ప్రముఖఅతిథి ఆవిడకి మాత్రం ఆరుగురు పెద్దలు ఏవేవో పేర్లు చెప్పి దుశ్శాలువాలు కప్పేరు. పేరుకి దుశ్శాలువ కానీ రెండు కాదులెండి. ఆ శాలువాలబరువుకి పాపం ఆవిడ కుంగిపోయేరు. పైగా ఎండలొకటీ. పాపం, ఆవిణ్ణి చూస్తే నాకు తెగ జాలేసింది. ”

“మరి నీ శాలువా ఏదీ?”

“నాకు శాలువ వొద్దన్నాను కదా. బహు సుందరంగా నవ్వుతూ పేర్లు పిలిచేరు. మాపేర్లు వినిపించగానే లేచి స్టేజిమీదకెళ్ళి నించున్నాం ముఖ్య అతిథివెనక వరసలు తీరి. ”

“వేడుక చెలికత్తెలలాగా?”

“ఐదోక్లాసులో వెనకబెంచీలో కూర్చుని గోలచేసే కుర్రాళ్ళని వరసగా పిలుస్తారు చూడండి, అలాగే. ”

“బాగుందిలే. ఇంతకీ నువ్వేం మాటాడేవు. అసలు కార్యక్రమం ఏమిటి?”

“కార్యక్రమం అంటూ కాయితం లేదు. ఆరోజు ఆలా కార్యకలాపాలు జరుగుతుండగా కార్యక్రమం ఏర్పడింది. ”

“ఇంతకీ నువ్వేం మాటాడేవో చెప్పూ. ”

“మీరేంటి ఆవిణ్ణలా గొడవ పెట్టేస్తారు. ఇదసలు స్పీచీలసభ కాదండీ. సత్కారాలసభ మాత్రమే. అంచేత పెళ్ళిళ్ళలో సందర్భణవడ్డనలా ఒకొకరినే పిలిచేసి, ఏదో ఒకరంగం పేరు చెప్పో చెప్పకో పత్రాలో పలకలో ఇచ్చేసి పంపేసేరు. ఫొటోల్లో మాత్రం పకడ్బందీగా పలకలందుకుంటున్నవేళ చిరునవ్వుతో కెమేరావేపు చూడమని గట్టిగా చెప్పేరు. అంతే. ”

“పోన్లెండి. మీకు పలకలిచ్చి, కురోలేనా తీసేరు. వెనకోసారి నాసభలో ఏదో పుస్తకావిష్కరణ పెట్టినప్పుడు అధ్యక్షులవారిపుస్తకం పరిచయం అంటూ నలుగురు నాలుగుసార్లు మొత్తం పుస్తకం చదివేరు. అదయేవేళకి హోటలువారొచ్చి టైమయిపోయింది. ఖాళీ చెయ్యాలన్నారు. దాంతో నాఉపన్యాసం వాయిదా.. కార్యకర్తలేమో వచ్చినవారందరినీ మర్నాడు రమ్మని చెప్పేరు కానీ ఆహూతులకి అదేమంత పట్టినట్టు లేదేమో మర్నాడు ఎవరూ రాలేదు. ”

“పత్రికలవాళ్ళయినా రాలేదా?”

“ఒకాయన వచ్చేడు. ఆయన మిగతావారికి చెప్తాట్ట నేనేం మాటాడేనో. తమిళుడిలా ఉన్నాడు. ఆయనకి నాతెలుగు అర్థమయిందో లేదో అనుమానమే. ”

శ్రీదేవి చుట్టూ చూసింది ఇందుకోసమా ఇక్కడ చేరేం అన్నట్టు. నేను కూడా చుట్టూ చూస్తూ, ″అనంతశర్మగారేరీ, ఆయనపేరుమీద కదా ఈ సమావేశం, ″ అన్నాను.

మరోరెండు నిముషాలు వెతికితే వరండాలో నిలబడి వాకిట్లో వాలిన పిట్టల్ని చూస్తూ కనిపించేరు.

మేం ఇద్దరం ఆయనపక్కన చేరేం.

″ఏమండీ మావాళ్ల సాహిత్యచర్చలు నచ్చలేదా?″ అన్నాను నవ్వుతూ.

అనంతశర్మగారు, ″అయినవాళ్లకి ఆకుల్లోనూ కానివాళ్లకి కంచాల్లోనూ అన్నట్టుంది, ″ అన్నారు.

″మీకూ అలాగే అనిపించిందా?″ అంది శ్రీదేవి.

″వందేళ్లు కూడా కాలేదు. పురిపండా అప్పలస్వామి, చాగంటి సోమయాజులు, తల్లావఝ్ఝుల శివశంకరశాస్త్రివంటి పండితులు మరో పదిమంది కవులతో పండితులతో కలిస్తే సాహిత్యంగురించే మాట్లాడుకునేవారు. అప్పట్లో బహిరంగసభలు అట్టే లేవేమో. ఆ తరవాత సభలు వచ్చినప్పుడు కూడా సాహిత్యంలో ఏదో ఒక అంశంగురించే మాట్లాడేవారు. ఒకొకప్పుడు చర్చలు కూడా జరిగేవి. ఇప్పుడు శాలువాలు, పూలదండలూ, ఫొటోలతోనే సరిపోతోంది. ఎవరు ఏమి రాసేరు అన్నది ఎవరికీ తెలీనూ తెలీదు. అక్కరా లేదు. ″

″అన్ని సభల్లోనూ కాదేమోనండి. ఆమధ్య ఎవరో ఏదో సభలో ఒకాయన ఆధునిక తెలుగుకథమీద మంచి ఉపన్యాసమే ఇచ్చేరుట. ″

″అని పేపర్లో చదివేరు కాబోలు. ఏవిషయంమీద ఎవరు ఏమి మాట్లాడేరో చెప్పేరా?″

నాకు కొంచెం ఇరకాటం అయింది. ″ఎందుకలా అడుగుతున్నారు?″ అని అడిగేను.

″మీరు ఈమధ్య ఏసభలకీ వెళ్లలేదనుకుంటాను. ″

″లేదండి, ″ అన్నాను కొంచెం బెరుకుతో. ఎంత లేదన్నా ఆయన పండితుడు. ఆయనకి ఈదేశంలో చాలా సన్మానాలు జరిగేయి. నేనెందుకు సభలను తక్కువ చేసి మాట్లాడడం.

″ఫరవాలేదులెండి. మీరు చెప్పక్కర్లేదు. గంటలతరబడి ఉపన్యాసాలు ఇచ్చేరు చాలామందే. ఎటొచ్చీ ఏం మాట్లాడేరనేదే సమస్య. కథ అయితే గురజాడదగ్గర మొదలుపెట్టి, చలం, కుటుంబరావు, మహా అయితే చాసో అని నాలుగు ముక్కలు చెప్పి, అక్కడినించి చెహోవ్, మొపాసా, ఓహెన్రీ అంటూ

ప్రపంచసాహిత్యంలోకి వెళ్లిపోతారు. మధ్యమధ్యలో శిల్పం, చమత్కారం అని నాలుగు పొడిపొడి వాక్యాలు విసుర్తారు. ఆ శిల్పంపేరుతో కథంతా చెప్తారు. అలాగే కవిత్వం అయితే మరో వరస రొడ్డకొట్టు పదాలు. ఇంక వాదాలసంగతి మొదలుపెట్టేరంటే మరి పట్టలేం, ″అనంతశర్మగారు మిగతాది శిరఃకంపనంతో ముగించేసేరు.

″పోన్లెండి. మీరు మంచి ఉపన్యాసమే ఇచ్చేరనుకుంటా. మీరు ఏవిషయంమీద మాట్లాడేరు?″

అనంతశర్మగారు అసంతృప్తిగా తల ఊపేరు.

″ఏద్దైనా ఒకటే. మొదట సన్మానాలూ, పలకలూ అయేక, పుస్తకావిష్కరణ, ఆ సభాఅధ్యక్షులో వారిఆప్తులో ప్రచురించుకున్న పుస్తకాలు. తరవాత స్థానికరచయితలు తమ పుస్తకాలు పరిచయం చేస్తారు. లేదా మరేదో మాట్లాడతారు. అవన్నీ అయేసరికి రెండుగంటలు పైనే అవుతుంది. అప్పటికి సభికులకు 'ఎప్పుడు ముగుస్తుందా' ముఖాలు పడతాయి. సగంమంది లేచిపోతారు. అప్పుడు నేను ఏం మాట్లాడినా ఒకటే. ఒక్కరయినా మీరేం రాసేరని అడగలేదు. ఆ కావ్యానికి నేపథ్యం ఏమిటి, ఈకథలో సందేశం ఏమిటి అని అడుగుతారేమోనని చూసేను. కానీ ఎవరికీ ఆధ్యాసే లేదు. అసలు నేనెవరో, ఏమైనా రాసేనో లేదో కూడా ఎవరికీ పట్టలేదు. ఒకాయన నేనిప్పుడే కలం పట్టేను అనుకున్నాడేమో, వృద్ధిలోకి వస్తానని నన్ను దీవించేరు. మరొకబ్బాయి 'అయ్యో, మీకవిత్వం అంతా ఏకధారగా చదివేశాను' అంటూ గబగబ నాలుగు పద్యాలు చదివేశాడు. ″

"పోన్లెండి. కనీసం ఒక్కరైనా ఉన్నారు కదా మీకవిత్వం చదివినవారు. "

"లేదమ్మా. అది నారచన కాదు. అతనికి ఆమాత్రం నోటికొచ్చింది కదా అని సంతోషించేను. "

శ్రీదేవికి ఏం చెప్పాలో తోచలేదు.

"మీసాహిత్యకృషిగురించి ఏమీ తెలీకుండా మిమ్మల్ని పిలిచేరా?"

"నాసాహిత్యం అని కాదు, ప్రతివారూ సాహిత్యపిపాసువులే. మనం ఏం చేసేం అన్నదానికన్నా వారిరచనలు ప్రచారం చేసుకోడంతోనే సరిపోయింది. మీరేం చేసేరు అని మనం అడిగినప్పుడల్లా ఎంతో ఉత్సాహంతో ఆపకుండా గంటలతరబడి మాటాడతారు. వారిపుస్తకాలు సంతకాలు చేసి మరీ ఇస్తారు. "

"అది ఈ యుగధర్మమండి. కొత్తగా రంగప్రవేశం చేస్తున్నవారికి అదొక్కటే దారి వారిరచనలగురించి నలుగురికి తెలియడానికి. "

"నాకేమీ కొత్తా పాతా తేడా కనిపించలేదు. అందరూ అంతే. తమని తాము ప్రచారం చేసుకోడమే యుగధర్మం అయిపోయింది. కానీ కొంతకాలం సాహిత్యకృషి చేసినవారితో మాట్లాడాలనుకుంటే వారేం రాసేరో కాస్త చదివి దానిమీద ప్రశ్నలడిగితే చర్చకి అవకాశం ఉంటుంది కదా. "

"అంటే అక్కడెవరూ మీరచనలగురించి అడగలేదా?"

అనంతశర్మగారు నవ్వేరు, "మీరలా అడిగితే, నేను కూడా నారాతలగురించి మాత్రమే ఆలోచిస్తున్నానా అనిపిస్తోంది. "

నాలుక్కరుచుకున్నాను. "అయ్యో క్షమించండి. నాఅభిప్రాయం అది కాదండి. మీరు అర్ధశతాబ్దంగా ఎంతో కృషి చేసేరు. నాకు తెలుసు. పోనీ సాహిత్యసభలు ఎలా ఉంటే బాగుంటుందో చెప్పండి. "

"నువ్వు నోరి నరసింహశాస్త్రిగారి రుద్రమదేవి చదివేవా అమ్మా. "

"చాలాకాలం అయిందండీ చదివి. అట్టే గుర్తు లేదు. "

"ఆయన రాసిన చారిత్ర్యకనవలలన్నిటిలోనూ కవిపండితులచర్చలు వివరిస్తారు. ఉదాహరణకి రుద్రమదేవిలో ఒక అధ్యాయం ఉంది చూడు. పల్లవరాజు కొప్పెరుంజింగని ఆంధ్రదేశం ఆక్రమించుకోడానికి వచ్చి వశిష్ఠగోదావరితీరంలో స్థావరం ఏర్పరుచుకున్న సందర్భం. ఆయన సరసుడు, లలితకళలందు విశేషమైన ఆదరము గలవాడు. యుద్ధానికి వచ్చినప్పుడు తనతో వేదవేదాంగశాస్త్రపారంగతులైన విద్వాంసులనీ, నటులనీ, పండితులనీ తీసుకొచ్చి సాహిత్య, నాటక, గానకళావినోదాలు ఏర్పటు చేసి తాను ఆనందించి స్థానికులని ఆనందింపజేసేవాడు. ఒకసారి స్థానిక వేదపండితులని ఆహ్వానించి, వారిసమక్షంలో "ఊరుభంగం" నాటకం వేయించేరుట. ఆనాటకంలో అపాణీనీయాలూ, సంప్రదాయవిరుద్ధమయిన యుద్ధాలు ఉన్నాయని గోదావరితీరంలోని వైదికబ్రాహ్మణులు కృద్ధులయి, సభ విడిచి వెళ్ళిపోతే వారిచర్య రాజైన తమకి అవమానం అయినా సభ్యత పాటించి వారిని వారించక వదిలిపెట్టేడుట. ఆనాడు రాజులకి పండితులయందు గల గౌరవభావం అటువంటిది. "

"ఆకాలంలో పండితులూ. పాండిత్యాన్ని ఆస్వాదించేవారూ కూడా పరిమితసంఖ్యలో ఉండేవారు. ఇప్పుడు పాఠకులసంఖ్య పెరిగింది. వారి అవగాహనాసరళి మారింది. మీరన్నట్టు ఆ సంప్రదాయమే వేరు. ఇప్పుడు అలా జరగాలని మనం ఆశించవచ్చునా?" అన్నాను నెమ్మదిగా, సందేహిస్తూ.

"నిజమే. మనం ఆ వాతావరణం ఇప్పుడు కోరడం సమంజసం కాదు. నిన్నా మొన్నా జరిగిన సాహిత్యసమాలోచనలు చూసినా ఇంత అధ్వాన్నంగా అనిపించదు పరిస్థితి. సాధారణంగా విశేషమైన

కృషి చేసినవారో, అసామాన్యమైన ప్రతిభ చూపినవారో అయినప్పుడే జరిగేవి భారీఎత్తున సత్కారాలు. ఆసభలో వారికృషిగురించి విపులంగా ఒకరిద్దరు మాటాడేవారు. తరవాత ఆ సత్కారగ్రహీత కూడా సాహిత్యపరమైన తమ అనుభవాలు, సమకాలీనసాహిత్యంలో ఏదో ఒక అంశం తీసుకుని విపులంగా చర్చిస్తూ మాటాడేవారు. ఇలాటి ఉపన్యాసాలద్వారా సభాసదులకి సాహిత్యచరిత్రగురించి నాలుగు ముక్కలు వినే అవకాశం, తెలుసుకునే అవకాశం కలిగేది. ఇప్పుడు సభల్లో శాలువాలూ, పూలమాలలూ, ఫొటోలూ మాత్రమే కనిపిస్తున్నాయే తప్ప సరస్వతీసాక్షాత్కారం ఇసుమంతైనా లేదు. ”

“పూర్వం ఇన్ని పురస్కారాలు, ఎవార్డులు, బహుమతులూ లేవు మరి. ”

“ఇంకా కొన్ని చోట్ల అయితే చెట్టుపేరు చెప్పి కాయలమ్ముకోడం కూడా కనిపిస్తోంది. పెద్దపేరున్న ఒకరిని పిలవడం, కార్యక్రమం అంతా తమ ప్రచారాలకి వినియోగించుకోడం. ”

“ఇందాకా మీరన్నట్టు ఇప్పుడు ఇదే యుగధర్మం. మరి దీనివల్ల సాహిత్యానికి మేలు జరగదంటారా?”

“ఏమో మేలేమిటో ఎలా జరుగుతుందో నాకు తెలీడం లేదు. ధర్మప్రచారం, నీతిప్రచారం పోయి ఆత్మప్రచారమే ధ్యేయం అయిపోయింది. నీలాటి ఒకరో ఇద్దరో నేను చేస్తున్న కృషి గొప్పగా ఉందని నాతో అంటారు కానీ మరే సభల్లోనూ ఉపన్యాసాల్లోనూ, వ్యాసాల్లోనూ కనిపించదు. మరి నేను చేస్తున్న కృషి నిలవడానికి ఆస్కారం ఏదీ? అలాటి ఆస్కారం లేదు కనక అది చరిత్రలో నిలవదగినది కాదా అన్న అనుమానం కూడా వస్తోంది. అలా ఆలోచిస్తుంటే ఏ సాహిత్యం కాలానికి నిలుస్తుంది? ఎలా నిలుస్తుంది? ఇలా ప్రచారం చేసుకుంటే తప్ప నిలవదు అనుకుంటే ఈ ప్రచారాలు అలవాటు లేని నాతరం రచయితలకృషి అంతర్ధానం కావలసిందేనా? ఇవీ నాప్రశ్నలు. ఇవి ఒఖ్ఖ నారచనలగురించే నేను అడగడంలేదు. ఎంతో సాహిత్యం మరుగున పడిపోతోంది. ఎంతో వెనక్కి వెళ్ళఖ్ఖర్లేదు 1940, 50లనాటి రచయితలపేర్లు ఇప్పుడు చాలామందికి తెలీవు, ఏదో చలం, కుటుంబరావు, విశ్వనాథ సత్యనారాయణ వంటి ఓ నలుగురుపేర్లు తప్ప. అవైనా కొందరు సాహితీసారథులు పదే పదే సర్వదా మననం చేస్తుండడంచేత. ఇంకా ఎంతోమంది రచయితలున్నారు. ఆ రచయితలసాహిత్యం అందుబాటులో లేదు. ఇప్పుడు ఉన్న మా తరం గతించిపోయేక, వారిగురించి ఎవరికీ తెలీను కూడా తెలీదు. దాన్నిగురించి ఏం చెయ్యాలని అడుగుతున్నాను, ” అన్నారాయన ఆవేశంతో.

నేను శ్రీదేవివేపు చూసేను.

″నిజమేనండి. ఇప్పుడు ఇంగ్లీషుసాహిత్యంగురించి తెలిసినంతగా తెలుగువారికి తెలుగుసాహిత్యం గురించి తెలీదు. ఆంగ్లరచయితల పుస్తకాలగురించి గుక్క తిప్పుకోకుండా మాట్లాడగలరు. అలాటి కథలు తెలుగులో లేవేం అని ప్రశ్నిస్తారు. ఇంకా అనువాదాలు లేవని కూడా అరుస్తారు. ఉన్న అనువాదాలు చదవరు. వాటిగురించి మాట్లాడరు. ఎంతసేపూ ఇంకా ఇంకా ఏదో లేదనే కానీ ఉన్నదాన్ని నిలబెట్టుకునే ప్రయత్నం లేదు, ″ అంది శ్రీదేవి.

ఇంతలో సుందరం వచ్చేడు, ″ఇక్కడున్నారా? మీతో మాట్లాడడానికే వాళ్లంతా వచ్చేరండి. రండి రండి, ″ అంటూ.

″వీళ్లతో మాట్లాడుతున్నాను. వీళ్లు కూడా అందుకే వచ్చేరు కదా, ″ అన్నారు అనంతశర్మగారు నర్మగర్భంగా.

చాలాసేపయిందంటూ ఒక్కొక్కరే దూరంనుంచే శర్మగారివేపు చూసి చెయ్యూపి వెడలిపోసాగారు.

సమావేశం ముగిసింది.

000

లీల ఆలోచనలలో పడింది. సుందరంతో కాపురం కూడా నామమాత్రమే అనిపిస్తోంది. నెలకి పదిహేను రోజులు ఇంట్లో ఉంటే గొప్ప. ఉన్నప్పుడు కూడా తనూ, తనస్నేహితులూ, తనవ్యాపకాలూ – అంతే. అసలు ఇంట్లో మరోమనిషి ఉందన్న స్పృహ అతనికి లేదు. కంచంలో అన్నం పెట్టినప్పుడు తప్ప.

లేచి ఎట్టైనా వెళ్దాం కొంచెంసేపు అనుకుని తాళాలు తీసుకుని గడపవేపు నడుస్తుంటే ఫోనొచ్చింది. ఫోను మోగింది. లీల ఉలికిపడి, లేచి ఫోనందుకుంది, గుండెలు దడదడ కొట్టుకుంటున్నాయి.

″ నేనండీ, రాజుని. ″

″ ఆఁ?″

″ తాతగారు . . . పోయేరు . . . ″

లీల నిట్టూర్చింది. రెండువేపులా రెండు క్షణాలు నిశ్శబ్దం. తరవాత లీలే అడిగింది, ″ ఎప్పుడు పోయేరు?″

″ తొమ్మిదిగంటల యాభైనిముషాలకి. ″

లీల వాచీ చూసింది. నాలుగు గంటలక్రితం. రెండు నిముషాలు పట్టింది నోరు పెగలడానికి. రాజే కొనసాగించేడు, ″అమ్మ అన్నం, వంకాయ బజ్జీ చేసి తెచ్చింది. తిన్నారు, 'చాలాకాలం అయిందం' టూ. మరో పావుగంట కూర్చుని మేం వెళ్తాం అంటూ లేచేం. అమ్మ గిన్నెలు తీసుకుంది.

తాతగారు గొంతులో ఏదో అడ్డు పడ్డట్టు శబ్దం చేసేరు. చేత్తో ఉండుండు అన్నట్టు సంజ్ఞ చేసేరు. తిన్న అన్నం వాంతి అయిపోయింది. నేను డాక్టరుని పిలవడానికి బయటికి వెళ్ళేను. వెళ్ళిపోతున్నానన్నట్టు చేయి ఊపేరు. అంతే. ప్రాణం పోయింది.″

″సరే. ఏం చెయ్యాలో చూడు. నాలుగురోజులు పోయేక మాట్లాడుకుందాం,″ అని లీల ఫోను పెట్టేసింది.

తాతగారు పోయినందుకు ఏడుపు రాలేదు కానీ ఆయన చివరిక్షణాల్లో ఆయన ఆలోచనలేమిటో అన్న దుగ్ధ వదలడం లేదు. ″ నన్నుగురించి తలుచుకున్నారా? రాజు, వాళ్ళమ్మ, చెల్లెలు . . . ఎవరూ చెప్పలేదు. నాగురించి అడగలేదా అని తనకి తానై అడగలేదు. అక్కడికీ ″ ఎవరినైనా చూడాలనుంది″ అని అడిగేరా అని అడిగింది. ″ చివరిక్షణాల్లో మాట పడిపోయింది కదా. ఏదో చెప్పబోయేరు కానీ గొంతు పెగల్లేదు,″ అంది రాజు తల్లి. అసలు ఎప్పుడైనా నాగురించి ఏమైనా అన్నారా అని అడగాలంటే అహం అడ్డొస్తోంది. ″ఎంతసేపూ నీకు నీగురించే యావ″ అని ఎత్తిపొడవరా? ఇంకా ఆ చిట్టికమలతో పోల్చినా పోల్చొచ్చు, మరీ ఘోరం.

హఠాత్తుగా లీల లీలని రొకాయించి అడిగింది నీబతుకేమిటి అని.

లీలకి లీలమీద కోపం వచ్చింది.

లీల లీలమీద గట్టిగా అరిచింది అసలు నీకేమిటి కావాలో ఆలోచించుకున్నావా?

ఏదో జరిగిపోతోంది, ఏదయితే అదవుతుంది అనే గానీ అలా కాక మరోలా కావాలనీ, నువ్వు నీకు కావాల్సినట్టు చేసుకోవాలనీ ఆలోచించేవా?

నీకసలు అలాటిఆలోచనలు వచ్చేయా?

చెప్పుకు తిరగడానికి ఉంది సుందరంతో కాపురం చేస్తున్నావని. అదీ కాపురమేనా? మీరిద్దరూ ఒక కప్పుకింద ఉంటున్నారు. అంతేనా? అదైనా అతను ఊళ్ళో ఉన్నప్పుడే.

క్రమంగా అతను ఉన్న రోజులకన్నా లేని రోజులే ఎక్కువవుతున్నాయి. ఒకరోజు అర్ధరాత్రి లేచి కారు తీసుకుని పొరుగూరు వెళ్ళిపోయేడు. ఆసంగతి మర్నాడు పదిగంటలకి అతను ఫోను

చేసేవరకూ నీకు తెలీసే తెలీదు! ఏం చేసేవు? ఆతరవాత అది కూడా అలవాటయిపోయింది. ఇంట్లో ఉంటున్నాడో లేదో కనిపిస్తేనే తెలియడం. ఒకవేళ సుందరం ఊళ్లో లేకపోతే, నీకు ప్రాణంమీదకి వచ్చినా తెలీదు కదా.

లీల లీలని మరింత గట్టిగా అరిచింది అసలు మొదట్నించీ చూడు నీ అమెరికాసౌలభ్యం ఎంత హాయిగా ఉందో?

వెనక్కి తిరిగి చూస్తుంటే 30లనాటి నలుపూతెలుపూ సినిమా చూస్తున్నట్టుంది.

కొత్తలో ఏవో ఈ ఊరూ ఆ ఊరూ చూద్దాం అంటూ తిరిగేరు. కానీ వెళ్లిన ప్రతిచోటా అతనిస్నేహితులే. అతనికాలక్షేపం అంతా వాళ్ళతోనే. ఒకటి రెండు చోట్ల అమ్మమ్మలతోనూ, నాయనమ్మలతోనూ తనని వదిలేసి వాళ్లు బయటికి వెళ్లిపోయేరు. నీవయసుకి ఉన్నవాళ్లు కనిపించినప్పుడు కూడా మాట్లాడుకోడానికేమీ లేదు. వారిబతుకులకీ తనబతుక్కీ సామ్యం లేదు. మాటలు తోచవు. వాళ్ళేవో వాళ్ళ ఇంటిగొడవలో ఆస్తిగొడవలో మాట్లాడుకుంటారు. నీకేముంది మాట్లాడడానికి.

నాకు బాగులేదు, నేను రానంటే సుందరం ఏమన్నాడు? "ఇదీ బాగానే ఉంది," అంటూ నీకు "సంపూర్ణస్వాతంత్ర్యం" ఇచ్చేసేడు కదా. నిజంగా అతనిచ్చేడా నువ్వే తీసుకున్నావా? ఎందుకంటే ప్. నాకాలోచనలు చేసే ఓపిక లేదు, లీల లీలమీద విసుక్కుంది.

అలా విసుగూ, చిరాకూ, ఓపిక లేదూ అంటూనే గడుపుకొస్తున్నావు, లీల వెక్కిరించింది.

లీలకి మళ్లీ కోపం వచ్చింది. నిజంగా నీకు తెలీలేదా సుందరానికేం కావాలో?

ఎందుకు తెలీదూ బాగానే తెలుస్తోంది – మొదటిసారి నేను ఒక్కత్తినీ బయటికి వెళ్లినప్పుడు, "అలా ఒక్కదానివే ఎందుకు వెళ్లేవు? మనం ఇక్కడ చాలా జాగ్రత్తగా ఉండాలి," అన్నాడు. నాకు భయం లేదని అతనికి తెలిసింది మొదటిసారిగా అప్పుడే. నేను, నాకు భయంవండీ. మీరు కూడా రండి. లేదా, నేనింట్లో ఉంటాను. మీరెళ్ళి తీసుకురండి," అని ఉంటే అతనికి ఎక్కువ ఆనందంగా ఉండేది. నిజానికి తనకి అలా చెప్పడానికేమీ అభ్యంతరం లేదు కానీ అలా చెప్పేక, నిజంగా అతను ఎప్పుడు లేచి వెళ్ళి తనడిగిన వస్తువు తెస్తాడా అని ఆలోచించినప్పుడు మాత్రం అలా చెప్పాలనిపించదు. ఓసారి అలాగే పాతికమందిని భోజనానికి పిలిచేడు. అంతా వెళ్ళేసరికి అర్ధరాత్రి దాటింది. లీల గిన్నెలు తోలుస్తుంటే, "నేను చూస్తాలే. నువ్వెళ్ళి పడుకో," అన్నాడు. సరేనని లీల అవి వదిలేసి పడగ్గదిలోకి వెళ్లిపోయింది. తెల్లారి లేచి చూస్తే,

ఎక్కడివక్కడే ఉన్నాయి. సుందరం అప్పటికే ముస్తాబయి బయల్దేరబోతున్నాడు. మళ్ళీ "అవి నేను తిరిగొచ్చేక చూస్తాలే, అలాగే ఉండనియ్" అన్నాడు. లీలకి నవ్వొచ్చింది. తను నిజంగా అలా వదిలేసి ఉంటే ఏమయేది? అతను తిరిగొచ్చి, "అలా ఊరికే కూర్చోకపోతే, ఆ గిన్నెలు కడిగేసి ఉండొచ్చు కదా" అనకుండా ఉంటాడా? ఏమో తెలీదు. లీల ఆ తరవాతెప్పుడూ అతని "సాయం" కోసం ఎదురుచూడలేదు.

అదే మరి. నువ్వే సర్దుకుపోతున్నావు. నీక్కావలసినట్టు నువ్వు చేసుకుంటూనే ఉన్నావు. నీకు బాగానే అర్థం అయింది, అతని అభిరుచులు వేరు నీఅభిరుచులు వేరని. సంఘంలో సాటివారిలో తన ఘనతని నిరూపించుకోవాలన్న తాపత్రయం అతనికి. నువ్వేమో ఉన్నదానితో తృప్తి పడిపోతావు. అలా ప్రతిదీ తేలిగ్గా తీసుకోడం అతనికి అసహ్యం. కింద పడ్డా పైచెయ్యి నాదేనని వాదించి, అవతలివారు ఒప్పుకుసేవారకూ వదలడతను. నువ్వేమో సరేనండి, మీరే రైటు అనేసి ఊరుకుంటావు. అలా ఆలోచిస్తే మరి మీఇద్దరికీ సామరస్యం ఉన్నట్టే అంటూ లీల నవ్వింది.

. . .   . . .

లీల ఉలిక్కిపడి వాచీ చూసింది. సుందరం వచ్చేవేళయింది. వెంటనే గుర్తొచ్చింది అతను ఊళ్ళో లేడు. ప్చ్. ఆ విషయం కూడా మరోమారు ఆలోచిస్తే కానీ తోచలేదంటే ఇంకేమిటి అనుకోడం?! అరవింద, విషి, ప్రబాప్రావు, శివాని, ఒకొకరే గుర్తొచ్చేరు. వీళ్ళలో అరవింద ఒక్కర్తే తనకి దగ్గరయింది. మిగతావారందరూ అరవింద వాళ్లగురించి చెప్పినమాటలే తప్ప వారిగురించి మరేం తెలీదు.

అలాటి రోజుల్లో కాస్త పరిచయం ఉన్న కాత్యాయని ఎవరింట్లోనో భోజనాలవేళ కనిపించేరు. తనలాగే ఆవిడకి కూడా తీరిక ఎక్కువయి కాబోలు, "ఈఏడు దసరా నవరాత్రులు ఘనంగా చేద్దాంవండీ. ఇండియానించి పంచలోహాలతో చేసిన దుర్గవిగ్రహం తెప్పించేను. ఆవిడకి చీరెలూ, రవికెలూ ఎవరైనా కుట్టగలరేమో చూస్తున్నాను, " అంది మాటలసందర్భంలో.

పక్కనే ఉన్న లీల కొంచెం అనాలోచితంగానే, "మరీ అంత కుట్టుపనిమంతురాలని కాదు కానీ, నా చొక్కాలకి కాలర్లు తీసేయడం, పొడుగు చేతులు పొట్టి చేసేయడంలాటివి చేస్తుంటాను. కావలిస్తే మీఅమ్మవారికి నేను కుట్టిపెడతాను, " అంది.

“అయ్యో అంతకంటేనా. తప్పకుండా రేపు మీయింటికొచ్చి నేను తెచ్చిన గుడ్డముక్కలు ఇస్తాను, ” అంది కాత్యాయని ఉత్సాహంగా.

అప్పుడే తెలివొచ్చినట్టు, లీల అసలే విశాలమయిన కళ్ళు మరింత విశాలం చేసి, “ఏదో అనేసేను కానీ మీరిలా వెంటనే ఒప్పుకునేస్తారనుకోలేదు, ” అంది నవ్వుతూ.

“సరి, మరేం చేస్తాం, కుట్టడానికి మీరూ, కుట్టించుకోడానికి నేనూ ఒప్పందం అయిపోయింది. ఆడితప్పుతారా? హన్నా. చిన్నప్పుడు కాపీబుక్కల్లో రాసుకోలేదూ ఆడి తప్పరాదు అని”

“అది కాదండీ. నేను చీరెలెప్పుడూ కుట్టలేదు. మీ అమ్మవారేమో అరడుగు ఎత్తు కదా. అంత చిన్న చీరెలూ, రవికెలూ కుట్టగలనో లేనో అని. సరేలెండి. ముందు ఒకటి కుట్టి చూస్తాను. అవి చీరే, రవికలా ఁఁంటే మిగతావి చూద్దాం. ”

“అలాగే లెండి. ఎవరైనా ఒకటి తరవాత ఒకటే కదా కుడతారు, ” అంది కాత్యాయని.

ఆ తరవాతివారం కాత్యాయనిగారింటికి తాను కుట్టిన చీరె, రవిక చూపించడానికి వెళ్తే అక్కడ, కాత్యాయనీ సౌభాగ్య పువ్వులదండలు కడుతూ కనిపించేరు. లీల కూడా కూర్చుని ఓ చెయ్యి వేసింది. ముఖ్యంగా తనకి వైజయంతీమాల కట్టడం చాలా యిష్టం. తను కడుతున్న మాల చూసి వాళ్ళు ఎంతో మురిసిపోయి, బాగుందని మెచ్చుకుని, ఇకమీదట మాలలు కట్టడం మీవంతు అన్నారు. అలా లీల భక్తిపేర కాక రకరకాల మతవిషయైక వ్యాసంగంలో పడిపోయింది.

అహ్మద్ లోపలికి వస్తూ, ″మా చిన్నాయన ఆదీల్ ఆలీ. మీరేమీ అనుకోరని తీసుకొచ్చేను, ″ అన్నాడు లీలతో.

లీల చిన్నగా నవ్వి, ″అనుకోను, రండి, ″ అంది ఆదరపూర్వకంగా తలుపు పక్కన నిలబడి.

ఆదిలాలీ కెనడాలో ఉంటారుట. కంపెనీపనిమీద వచ్చేరుట. వారంరోజులు ఉంటారుట. లీల ఓహో, అలాగా అంటూ అహ్మద్ మాటాడుతుంటే వింటూ కూర్చుంది.

ఆవిడకి మాటాడ్డానికేమీ తోచలేదు.

వాళ్ళు మాటాడుకుంటుండగా సుందరం వచ్చేడు. అహ్మద్ నమస్కారాలు చెప్పి, మా చిన్నాయనండి అన్నాడు, సుందరంతో.

సుందరం ఓహ్, అని, హై అని అదిలాలీతో చెప్పి తన గదిలోకి వెళ్లిపోయేడు.

″కాఫీ తేనా″ అనడిగిన లీలతో ″లేదు. టైం లేదు,″ అంటూ లోపలికెళ్లి ఏవో కాయితాలు తీసుకుని, ″nice to meet you,″ అని అదీలాలీతో అని బయటకి వెళ్లిపోయేడు.

లీల ముభావంగా ఊరుకుంది.

అదీలాలీ కాఫీబల్లమీద కాయితాలమీద ″బాగున్నాయి. మీకు మంచి నేర్పుంది చిత్రకళలో,″ అన్నాడు.

″అయ్యో చిత్రకళలాటి పెద్దమాటలెందుకండి. ఏవో పిచ్చిగీతలు గీస్తుంటాను సరదాకి,″ అంది ఆ కాయితాలు తీసుకుని పక్కన పెట్టేస్తూ.

″లేదండి, నిజంగానే ఒక వింతైన ప్రత్యేకత కనిపిస్తోంది,″ అన్నాడు అదీల్.

కొంచెంసేపు కూర్చుని, ″వస్తాం. అవతల వేరే పన్లున్నాయి,″ అన్నాడు అదీల్ లేస్తూ. అహ్మద్ కూడా లేస్తూ, ″మళ్లీ వస్తాంలెండి,″ అన్నాడు.

లీల ″అలాగే,″ అంది తను కూడా లేస్తూ.

అదీలాలీ గుమ్మందాకా వెళ్లి, వెనక్కి తిరిగి, ″మా కంపెనీలో illustratorకోసం చూస్తున్నాం. మీకు ఇష్టమైతే,″ అన్నాడు.

లీల ఉలిక్కిపడింది హఠాత్తుగా వచ్చిన ఆమాటకి. అహ్మద్ ముఖంలో కూడా ఆశ్చర్యఛాయలు కనిపించేయి.

″నిజంగానే అడుగుతున్నాను. మీకేమైనా ఆసక్తి ఉందా?″

″నాకంత నైపుణ్యం లేదండి. పైగా నేనెప్పుడూ ఉద్యోగాలు చేయలేదు కూడాను,″ అంది లీల. అసమ్మతికంటే బెరుకు ధ్వనించింది ఆ జవాబులో.

అదీలాలీకి అది బాగానే అర్థమయింది. ″ఫరవాలేదండి. మాకంపెనీలో trainer మీకు నేర్పుతారు. కంప్యూటరు ఆర్టు. తేలిగ్గానే చేయొచ్చు. మీరు మీఇంట్లో ఉండే పని చేయొచ్చు. వేరే ఆఫీసూ అదీ ఏం లేదు,″ అన్నారాయన ధైర్యం చెప్తూ.

″ఆలోచించి చెప్తానండి,″ అంది లీల.

″అలాగే. ఆలోచించే చెప్పండి. మీకు ఎప్పుడు కావాలంటే అప్పుడే ప్రారంభించవచ్చు,″ అన్నాడు అదీలాలి.

వాళ్లిద్దరూ వెళ్లిపోయేక, లీల ఆలోచించసాగింది. జరిగినది తలుచుకున్నకొద్దీ మరింత వింతగా అనిపిస్తోంది. ఏమిటి ఈ హఠాత్ పరిమాణాలు? బట్టలు కుట్టమని ఒకరూ, బొమ్మలు గీయమని ఒకరూ, అయాచితంగా అప్రయత్నంగా వచ్చిన ఉద్యోగాలు. ఎవరో తనకి దారి చూపడానికి ప్రయత్నిస్తున్నారా?

కారెక్కేక అహ్మద్ చిన్నాయనవేపు చూస్తూ, ″నిజంగానే ఆవిడకి పనిప్పిస్తావా?″ అనడిగేడు.

అదీలాలీ చిన్నగా తలూపి, ″అతనో ఇడియట్,″ అన్నాడు.

చిన్నాయన ఎంత లోతుగా ఆలోచించాడో అహ్మదుకి అనిపించింది.

000

మరో నెలరోజులు గడిచేయి. లీల దినచర్యలో మార్పు లేదు. సుందరందినచర్యలో మార్పు లేదు. మళ్లీ ఆలోచిస్తే లీలదినచర్యలో చిన్నమార్పు వచ్చినట్టే కనిపిస్తోంది.

అరవింద మధ్యాహ్నం వస్తున్నానని ఫోన్ చేసి, ఆ మధ్యాహ్నం వచ్చింది. నేనూ అక్కడే ఉన్నాను.

లీల కాత్యాయనిగారికోసం బుల్లి బ్లౌజులు కుడుతోంది.

అరవింద మమ్మల్ని చూసి నవ్వుతూ గబగబా మావేపు వచ్చింది, ఆశ్చర్యమూ ఆనందమూ మొహంనిండా నింపుకుని. అరవింద వెనకే వచ్చినఅబ్బాయిని చూసి, కుర్చీలు ఇద్దరికీ చూపించేను కూచోమంటూ.

లీల అరవిందవేపు చూస్తూ కూచుంది మాటల్లేనట్టు.

"Apenimon" అని అతన్ని పరిచయం చేసింది. ఆ అబ్బాయి చెయ్యి చాపేడు. లీల చెయ్యందుకుని ఆనందం వెలిబుచ్చింది.

"ఎప్పుడొచ్చేవు?"

"మొన్న వచ్చేం ఇద్దరం. రాగానే నీకు మెయిలిచ్చేను."

"ఊ, ఎంతకాలం తరవాత, సరేలే ... చెప్పు సంగతులన్నీ. ఏఏ దేశాలు తిరిగేవు, ఏమేం చేసేవు..."

అరవింద ఇబ్బందిగా మొహం పెట్టి, “ఒకటే పని. ఊపిరాడ్డం లేదు. రోజూ అనుకుంటూనే ఉన్నా పిలుద్దాం అని. నువ్వు నమ్మకపోతే నేనేం చెయ్యలేను ఎప్పటికప్పుడు ఏదో ఓ పని, అన్నీ అప్పటికప్పుడు క్షణాలమీద పూర్తి చెయ్యాల్సినవే.” అంటూ అరవింద గబగబా ఇంగ్లీషులో చెప్పుకు పోతోంది.

“సరేలే. ఆ అబ్బాయిగురించి చెప్పు, ” అంది లీల తెలుగులో.

అప్నెమొన్ లేస్తూ నీకు కాఫీ తీసుకురానా అని అరవిందని అడిగేడు. సరేనని తలూపింది అరవింద.

అతను లేచి వెళ్ళేక, అతని విశేషాలు చెప్పింది. కెనడాలో కాన్ఫరెన్సుకి వెళ్ళినప్పుడు పరిచయం అయేడుట. అమెరికాకి వచ్చేక పరిచయం పెరిగి అతను కూడా ఆల్బుకిర్కీ మారిపోయేడు. ఇద్దరికీ ఒకే రంగంలో ఉద్యోగాలు. అతను చాలా మంచివాడు. నవాహో ఇండియను భాషలో అపెనిమోన్ అంటే అర్థం ఏమిటో తెలుసా? నమ్మదగ్గవాడు అని. వాళ్ళమ్మా నాన్నా ఆ పేరు పెట్టేం కదా అని అలా పెంచేరో, పెరిగి నమ్మదగ్గవాడు కాగలడని ముందే ఆ పేరు పెట్టేసేరో కానీ నమ్మకం అంటే అతన్నే చెప్పుకోవాలి. తనంటే ఎంతో ప్రేమ, అభిమానం, ఇష్టం, అరవింద ఉత్సాహంగా చెప్తుంటే లీల నవ్వుతూ వింటోంది. అరవింద రాకముందు లీల వేసుకున్న ప్రశ్నలకి సమాధానం దొరికినట్టుంది!!

అప్నెమొన్ రెండు కప్పుల కాఫీతో వచ్చేడు. అరవిందకి ఓ కప్పు ఇచ్చి తన కప్పు బల్లమీద పెట్టి ఎదురుగా కూర్చున్నాడు.

గంటా గంటన్నరసేపు అయేక అరవింద ఆలస్యమయిపోయిందనీ, వాళ్ళిద్దరూ ఆ అబ్బాయి చెల్లెలిఇంటికి భోజనానికి వెళ్తున్నారని చెప్పి లేచింది.

“మళ్ళీ కనిపిస్తావా?” అనడిగింది లీల.

“తప్పకుండాను. రేపు పిలిచి చెప్తాను ఎప్పుడు రావడానికి వీలవుతుందో, ” అని చెప్పేసి అతనితో వెళ్ళిపోయింది.

రెండు రోజులతరవాత అరవింద ఫోన్ చేసి, అప్పీ రావడంలేదని చెప్పింది. ఏం అంటే, “మనం స్వేచ్ఛగా మాటాడుకోవచ్చని, ” అని, అతనికి తెలుగు రాదు కదా, మనంపేమో తెలుగులో మాటాడుకుంటాం, ” అంది అపార్థాలకి తావు లేకుండా.

అరవింద వచ్చేవేళకి లీల గుళ్ళో కనిపించిన గౌరిదేవిగారు ఇండియానించి తెచ్చుకున్న కమీజులకి చేతులు పొట్టి చేసి కుట్టే పనిలో ఉంది.

"అదేంటి, మీరు కుట్టుపని మొదలు పెట్టేరా?" అంది అరవింద ఆశ్చర్యంగా. తను ఆల్బుకిర్కీనించి తెచ్చిన అమెరికనిండియనులు చేసిన చెక్క బొమ్మ లీలముందు బల్లమీద పెట్టింది, "మీకోసం," అంటూ. అమెరికనిండియనులలో storytellers బొమ్మలు మన తిరపతి చెక్కబొమ్మల్లాగే చాలా ప్రసిద్ధికెక్కినవి.

లీల ఆ బొమ్మ చేతిలోకి తీసుకుని పరీక్షగా చూస్తూ బాగుందని మెచ్చుకుంది.

"ఇంకేమిటి సంగతులు?" అంది.

అరవింద మతాబాలా వెలిగిపోతున్న మొహంతో అపన్ ఎంత మంచివాడో మరో మూడు సార్లు చెప్పి, "అమ్మని నాన్ననీ, నిన్నూ కలుసుకోడానికి వచ్చేడు. మీ అందరి దీవెనలు అందుకున్న తరవాత నన్ను అడుగుతాడు పెళ్ళి చేసుకోమని," అంది.

"ఏమన్నారు మీ అమ్మా నాన్నా?"

"మామూలే. మానాన్న విపిని చేసుకుని ఉంటే బాగుండనని మరోమారు గుర్తు చేసి, తరవాత ఈ అపెన్ పాటి అందగాళ్ళూ బుద్ధిమంతులూ అన్నివిధాల మెరుగయినవాళ్ళు మనవాళ్ళలో లేరా అంటూ విసుక్కున్నారు."

లీల చిన్నగా తలూపింది.

"అమ్మేమో ముందులాగే నాకేది నచ్చితే అదే మంచిదంది. వాళ్ళమ్మా నాన్నా ఏమన్నారని అడిగింది."

"నిజమే. మనలాగే వాళ్ళకీ ఉండొచ్చు కదా అభ్యంతరాలు. ఇంతకీ ఏమన్నారేమిటి వాళ్ళు?"

"వాళ్ళకి నచ్చేను. నేను కిందటినెల వాళ్ళింటికెళ్ళేను. వాళ్ళకి కూడామనలాగే కుటుంబ విలువలు కదా. వాళ్ళది పెద్ద కుటుంబమే. కొంతవరకూ వాళ్ళ ఆచారాలు కొన్ని ఇప్పటికీ పాటిస్తారుట."

"బావుంది. మీఇద్దరికీ నా శుభాకాంక్షలు," అంది లీల మనఃపూర్వకంగా.

"రా," అంటూ లీల వంటింట్లోకి దారి తీసింది. అరవింద వెనకే వెళ్తూ, "అక్కయ్యా, నిన్నో మాట అడుగుతాను నువ్వేం అనుకోకపోతే," అంది.

లీల నవ్వింది, "నువ్వేం అడుగుతావో తెలీకుండా నేను ఏమైనా అనుకుంటానో లేదో ఎలా చెప్తాను?"

″నువ్వు సంతోషంగా ఉన్నావా?″

″నిజం చెప్పమంటావా?″

″నిజం చెప్పకపోతే మళ్లీ అడగాల్సొస్తుంది.″

″సంతోషంగా ఉన్నానా?″ అంది నెమ్మదిగా లీల ఆలోచిస్తూ.

అరవింద తికమక అయినట్టు, ″అది కాదు. ఎవరిసంతోషాలు వారికుంటాయి. నాకు సంతోషం అయినది నీకు సంతోషం కాకపోవచ్చు. కానీ నీముఖంలో ఏదో నీడలా కనిపిస్తుంది. ఒకపక్క ఏమీ పట్టించుకోనట్టే ఉంటావు. మరొకపక్క ఏదో ఒక పెద్ద చిక్కుప్రశ్నతో కుస్తీ పడుతున్నట్టు కనిపిస్తావు,″ అంది.

లీల చిన్నగా నవ్వింది. ″చిన్నదానివి. నీకిప్పుడు ఈ ఆలోచనలెందుకూ. హాయిగా నీసంతోషం నువ్వు చూసుకో. నీమాటలు వింటుంటే అప్పీ నీకు చాలా నచ్చేడు. మీఇద్దరూ సుఖంగా, సంతోషంగా ఉంటారని నేను నమ్ముతున్నాను, ఉండాలని ఆశిస్తున్నాను, సరేనా.″

అరవింద తృప్తిగా నవ్వింది. ″ఆహ్, సరే సరే. నువ్వు కూడా అలా సంతోషంగా ఉండాలని నాకోరిక. మళ్ళీ నిన్ను ఎప్పుడు చూస్తానో తెలీదు. మేం ఇద్దరం కొంతకాలం ఆఫ్రికాలో గడుపుదాం అనుకుంటున్నాం. నువ్వు కూడా సంతోషంగా ఉన్నావనుకుంటే నాకు సంతోషంగా ఉంటుంది. నేనందర్నీ ఇలా అడుగుతాననుకోకు. నీగురించి మాత్రమే నాకీ ఆలోచనలు వస్తాయి.″

ఆమాటలకి లీల చలించిపోయింది. ఏనాటి బంధమో అని కూడా అనిపించింది. ఈ అమ్మాయి తన ఆలోచనలు స్పష్టం చేయడానికి వచ్చిందేమో అనిపించింది.

″పోస్లే చెప్పడం ఇష్టం లేకపోతే వద్దు,″ అంది అరు మూతి ముడుచుకుని.

లీల ఉలికిపడి, చిన్నగా నవ్వి, ″లేదు. ఎలా చెప్పాలి, ఎక్కడ మొదలు పెట్టాలి అని ఆలోచిస్తున్నా. పద. అలా నడుస్తూ మాటాడుకుందాం,″ అంది తను కూడా లేచి.

ఇద్దరూ ట్రినిటీ కాలువపక్క నడుస్తూఆగి ఆగి మాట్లాడుకోసాగారు.

″అందరూ happy, happy అంటారు కానీ అది నిజంగా ఎంతసేపు? మనసుకి తృప్తి కలిగించేది అంటారు ఓ పని అనుకున్నట్టు జరిగితే సంతోషం. కావలిసినవస్తువు దొరికితే సంతోషం. ఇష్టమైనవారు కనిపిస్తే సంతోషం. అందమైన పూవు చూస్తే ఆహ్లాదం. సరేలే. నువ్వు నా వైవాహికజీవితంగురించి అడుగుతున్నావు కాబోలు. ″

″అది కాదక్కా. వైవాహికజీవితం అనే కాదు. నేనూ అప్పీ సంతోషంగా ఉండాలని నువ్వు కోరుకున్నట్టుగానే నువ్వు సంతోషంగా ఉన్నావంటే నాకు సంతోషంగా ఉంటుంది. నువ్వు నీఇష్టప్రకారం సంతోషంగా ఉంది అంటే నేను ఒప్పేసుకుంటాను. ఎవరు ఏమనుకుంటున్నారన్నది నాకక్కర్లేదు. ″

″ఏమిటో అరూ, నాకూ అంతగా తెలీడంలేదు. ఎవరికి వారు తమకి ఏది సంతోషమో నిర్ణయించుకుంటారు. అది జరిగితే సంతోషం, లేకపోతే విచారం. అదైనా చెప్పేను కదా. ఓ రెండు నిముషాలు, రెండు గంటలు, మహా అయితే రెండు వారాలు. ఆ తరవాత మరో వస్తువుకోసమో, మనిషికోసమో, సన్నివేశంకోసమో మళ్లీ ఆరాటం. ఇక్కడ pursuit of happiness, I am happy, be happy మంత్రాలు నిత్యం జపిస్తారు. నాకు అవన్నీ పడికట్టు రాళ్లలా అనిపిస్తుంది. పనికిమాలిన పెదవిన్యాసాలే (lip service). అంతరాంతరాల్లోంచి ఊడిపడ్డవి కావు. కీ మీద వేలేస్తే పెడదనవ్వో కినుకమొఖమో తెరమీద పడ్డట్టే. ″

″అదే. ఎవరికి వారు ఏది సంతోషమో నిర్ణయించుకుంటారు. కానీ నేనసేది అది కాదు. అసలు నీజీవితం నీకు సంతృప్తికరంగా ఉందా అని. నిజమే. నువ్వన్నట్టు సంతోషానికి అసలు నిర్వచనం లేదేమో. ఎవరికి వారు ఎప్పటికప్పుడు సంతోషంగా ఉంది అనుకుంటారు. ఆ సంతోషం ఎంతోసేపు ఉండదు. కానీ ఎవరికి వారు ఏదో ఒక నమూనా పెట్టుకుని ఆ నమూనాప్రకారం సంతోషమో విచారమో అనుభవిస్తారని కూడా అనుకోవచ్చు కదా. అలా నీకు ఏదైనా నిర్వచనం ఉందా, దానిప్రకారం నీకు సంతోషంగా ఉందా అనే. ″

″నమూనా అని ఒకటి ఉండదేమో. ఎప్పుడు ఎవరికి ఏది సంతోషం కలిగిస్తుందో చెప్పలేం కదా. ఒకసారి నేను ఒక 15ఏళ్ల అమ్మాయిని నాకారులో ఎక్కడికో తీసుకెళ్తున్నాను. నా అలవాటుప్రకారం కెసెట్ పెట్టేను. వసంతకుమారి సొగసు జూడతరమా వస్తోంది. నాపెదవులమీద చిరునవ్వు వెలసింది. నేను కావాలని అనుకుని చేసింది కాదు. అలా చిరునవ్వొచ్చిందంతే. ఆ అమ్మాయి 'ఎందుకు నవ్వుతున్నారు?' అని అడిగింది. అది నవ్వు కాదు. ఆ ఆనందం, అనుభూతి మాటల్లో చెప్పలేం. ″

″అలాటివి తాత్కాలికం. నేనడుగుతున్నది మీకు జీవితం అంటే సంతృప్తిగా ఉందా? ఇంకా బాగుండు, ఇలా కాదు అలా ఉంటే బాగుండు అనిపించేవి ఏమైనా ఉన్నాయా?″

లీల నవ్వింది. ″ఇదేమిటి టీవీ ఇంటర్వ్యూలా ఉంది. ఏదైనా ప్రాజెక్టా?″

″అలాగే అనుకో. సోసియాలజీ చేస్తున్నాను కద. ఎగుడూ దిగుడూ ఉంటాయి కానీ మామూలుగా ఏదో ఒకదానితో అస్తమానం కుస్తీపట్లు పట్టకుండా రోజులు గడుపుకుంటే సంతోషంగా ఉన్నట్టే అని నాఅభిప్రాయం. నీకు తెలుసా Gross National Product కంటె Gross National Happiness ముఖ్యం అని మొదట ప్రతిపాదించింది భూటాన్ట. ప్రజల ఆదాయం కన్నా ఆరోగ్యం, ఆనందం ముఖ్యం అని కొన్ని కొలమానాలు తయారు చేసి ఏదో జాబితా తయారుచేసేరు 50ఏళ్లక్రితం. ఇప్పుడు ఇతరదేశాలు కూడా ఆ కొలమానాలని వాడుతున్నారు.″

″బాగుంది.″

″పోనీ నీసంగతి అనే కాదు. అసలు ఎవరైనా సంతోషంగా ఉన్నాం అంటే నీకేమనిపిస్తుంది? సంతోషంగా ఉండడమే ప్రధానం ఎందుకయింది?″

″సంతోషం అంటే మనసు ప్రశాంతంగా ఉండడం అని అందరం చెప్పుకుంటాం. ఇందాకా చెప్పినట్టు మంచి సంగీతం వింటే మనసుకి హాయిగా ఉంటుంది. అందమైన పూవు చూస్తే హాయిగా ఉంటుంది. అటు చూడు ఆ కొంగలు. కాలువలో ఎంత చెత్త. నీరంతా బురద. అంత బురదనీటిలోనూ ఆ కొంగలు తెల్లగా మెరిసిపడుతున్నాయి. నిశ్చింతగా ఈదులాడుతున్నాయి,″ అంది లీల ఆగి నీటిలో కొంగల్ని చూస్తూ.

అరు కూడా అటు తిరిగి, ″ఎంత హాయిగా నిశ్చింతగా ఉన్నాయో,″ అంది. అప్రయత్నంగానే పెదాలమీద చిరుహాసం వెలిసింది.

లీల అది చూసి, ″అదే సంతోషం ఈక్షణంలో,″ అంది.

కొంచెంసేపు ఇద్దరూ నిశ్శబ్దంగా నెమ్మదిగా నడక సాగించేరు.

మళ్ళీ లీలే మొదలుపెట్టింది, ″మనం ఎలా ఉన్నా ఏం చేసినా, చేయకపోయినా రోజు గడిచిపోక ఆగదు కదా. సూర్యుడు ఉదయించకా మానడు. ఉదయించిన సూర్యుడు అస్తమించకా మానడు. ఎందుకిలా అయింది అనుకుంటూనే 15 ఏళ్లు గడిపేను. నేను ఏమీ అనుకోకపోయినా అలాగే గడిచిపోయేవి కదా. ఇలా అయినా మరోలా అయినా మరో పదిహేనో ముప్ఫయో కూడా

గడిచిపోతాయి. ఈమధ్యలో నేను చేయగలిగింది ఏమైనా ఉందా? ఏమి ఉంది? ఏమి చేస్తే ఏమి లాభం? ఏమి నష్టం? అని తికమక పడుతూ కూడా గడిపేసుకోవచ్చు కదా.″

″అదీ నిజమే. ఆలోచిస్తూనే గడిపోయొచ్చు జీవితకాలం.″

″కొందరు మాత్రం జీవితానికి ఏదో ధ్యేయం, సార్థకత ఉండాలనుకుంటారు.″

అరు వింటోంది ఆలోచిస్తూ.

″అలా ధ్యేయంకోసం సార్థకతకోసం తాపత్రయపడేవారికి అది సాధించినప్పుడు సంతోషం. కానీ ఈలోపున సాధించేవరకూ ఆరాటమే తప్ప మనశ్శాంతి లేదు. అలాటప్పుడు అనిపిస్తుంది అంత ఆరాటపడి అదేదో సాధించకపోతేనేమి అని.″

″ఏదీ సాధించాలనుకోకపోవడమే ఆనందం అంటావేమిటి?″ అంది అరవింద.

″సాధించడంమాటకొస్తే మనకి మరో ఆనందం కూడా ఉంది, మతపరంగా ’అలౌకికానందం.’ జీవితాన్ని మొత్తంగా తీసుకున్నప్పుడు కలిగే, కలగగలిగే ఆనందాలు పారమార్థికంగా ఎనిమిది ఉన్నాయిట – 1. బ్రహ్మానందం, 2. విషయానందం, 3. ఆత్మానందం, 4. అద్వైతానందం, 5. నిత్యానందం, 6. యోగానందం, 7. సహజానందం, 8. పరమానందం (దివ్యానందం) – ఇవన్నీ మొత్తం జీవితం అంతా లెక్కలోకి తీసుకున్నప్పుడు కలుగగల మానసికస్థితిసే కాక జీవితపరమార్థాన్ని కూడా సూచిస్తాయి. నాసంశయం అదీ. నువ్వు సంతోషంగా ఉన్నావా అన్నప్పుడు స్థూలంగా ఏ విచారాలు లేకపోవడమేనా లేక ఒక ధ్యేయాన్ని కష్టపడి సాధించేక కలిగే ఆనందమా?″

″బుద్ధుడు వృద్ధాప్యం, చావు, దారిద్ర్యం దుఃఖాలనీ, వాటిని లేకుండా చేయాలనే ధ్యేయంతో బౌద్ధమతానికి రూపకల్పన చేసేడు. నిజానికి వీటిలో మొదటి రెండూ ఎవరూ అధిగమించలేరు. దారిద్ర్యం కూడా కొంతవరకే, కొంతమందికే సాధ్యం. కొందరు ఎంత కష్టపడ్డా దారిద్ర్యం వారిని వదలదు. అది నిత్యసత్యం.″

″బుద్ధుడు సాధించేడా, సాధించేనని సంతోషించేడా అంటే సందేహమే. మనకి తెలీదు. కొందరు సంతోషం సాధించడంకోసం అలా జన్మంతా కష్టాలతోనే గడుపుతారు. జీవితంలో నిజమైన విషాదం అదేనేమో.″

"కావచ్చు కాని అందరూ అలాగే ఉండరు కదా. కొందరు ఏదైనా పోనీద్దూ, ఫరవాలేదులెద్దూ, చూదాంలే అంటూ పొద్దు పుచ్చుకుంటూ పోతారు. వాళ్లూ నిజమైన నిరంజనులు," అంది లీల చిన్నగా నవ్వుతూ.

"మరే. ఈమధ్య మా ప్రొఫెసరు ఒకాయన ఇండియా వెళ్లి వచ్చేరు. అక్కడ 'మీరు గ్రహించింది ఏమిటి?' అంటే ఆయన 'పట్టించుకోకపోవడం' అన్నారు. అదేమిటంటే, 'ఏ మాట వచ్చినా పోనీద్దూ, చూదాం, అలాగే అనేసి ఊరుకుంటారు. అది మీ హైందవసంప్రదాయంలోనుంచి వచ్చిందనుకుంటాను' అన్నారు. అలాగే తీరిక కూడానుట," అంది అరు.

"తీరికా?"

"ఆయన వెళ్లొచ్చి పదేళ్లపైనే అయింది. ఇప్పుడిప్పుడు అందరికీ సాంఘికవిజయం యావ ఎక్కువయిపోతోంది. బహుశా అందులో మార్పు వచ్చిందనుకుంటాను."

"మనకి ధార్మికం అంటే లౌకికమూ హైందవమూ కూడా. అది ఇతరజాతివారికి అర్థం కాదు. ఇలా ఆలోచిస్తుంటే మరో విషయం కూడా. నాస్నేహితులని అడిగేను సంతోషం అంటే ఏమిటని. స్థూలంగా వాళ్లు చెప్పినవన్నీ సుఖకరమైనవే. కానీ కొందరికి ఇతరులని బాధించడం కూడా సంతోషాన్నిస్తుంది. పిల్లలకి చక్కిలిగింతలు పెట్టడంనుంచీ హేళనతో ఎత్తిపొడుపుమాటలతో బాధిండంవరకూ చేసి ఆనందించేవాళ్లు కూడా చాలామందే ఉన్నారు కద. ఇది కూడా కొత్తదేమీ కాదు. రోమనురాజులు బానిసలని తిండి పెట్టకుండా మాడ్చి గిరిలోకి వదిలేవారుట. వాళ్లు ముష్టియుద్ధంతో ఒకరినొకరు హింసించుకుంటుంటే చూపరులకి వినోదం. వినోదం ఒక్కటే కాదు ప్రజలని అదుపాజ్ఞలలో పెట్టే పరికరం కూడా."

నెమ్మదిగా చీకట్లు ముసురుకుంటున్నాయి. పశ్చిమదిశ రంగులు మార్చుకుంటోంది తీరిగ్గా. సూర్యుడు దొంగలా దిగంతాలలోకి దిగిపోతున్నాడు.

"చీకటి పడుతోంది, వెనక్కి వెళ్దామా?" అంది లీల.

ఇద్దరూ వెనుదిరిగి ఇంటికొచ్చేరు.

"భోంచేసి వెళ్లు," అంది లీల.

"లేదు. అపీనో ఎదురు చూస్తుంటాడు. ఇవాళేదో ప్రత్యేకంగా ఏదో చేస్తానన్నాడు," అంటూ అరవింద చుట్టూ చూసి, "అక్కా, నాకేం అనిపిస్తోందో చెప్పనా?" అంది.

"ఏమనిపిస్తోంది?"

″అరణ్యాలలో నివాసం ఏర్పర్చుకుని భార్యతోనూ శిష్యులతోనూ నివసించే తాపసులకూ నీకూ తేడా ఆవరణలోనే. ఈ ఇల్లు అలాటి అరణ్యమే. ఈ నాలుగ్గోడలమధ్యా నువ్వు నీదైన ఒక ప్రపంచం ఏర్పర్చుకుని నీ భావనాలోకంలో సంతోషంగానే ఉన్నావు. కనీసం నేనలా అనుకుంటూ వెళ్లిపోతాను. ″

అరవింద లీలని మరోమారు  కౌగలించుకుని వెళ్లిపోయింది.

అరవింద కారు వీధిమలుపు తిరిగేవరకూ చూస్తూ, ″ఈ అమ్మాయి ఎంత ఎదిగిపోయిందీ″ అనుకుంది అబ్బురపడుతూ లీల. సంతోషంగా కూడా అనిపించింది.

000

ఒక శుభవేళ నేనూ, లీలా పెద్దక్కఇంట్లో సమావేశమయేం. ఎలా మొదలయిందో తెలీదు కానీ దేవుడిమీదకి మళ్లింది చర్చ.

″దేవుడున్నాడా?"

"ఇప్పుడాయనసంగతి ఎందుకొచ్చిందీ?"

"ఏం? రాకూడదా?"

"అది కాదు. ఆయనలోకంలో ఆయనా మనలోకంలో మనం సుఖంగా ఉన్నాం కదా. తీరికూర్చుని ఎందుకీప్రశ్న అని."

"కొందర్ని చూస్తే, వీళ్లని దేవుడే పుట్టించేడా అని అనుమానం వస్తోంది. అందుకూ."

“ఓహో. ”

“ఉంటే చేతగాని ఇంజినీరు అయిఉండాలి అనుకుంటాను నేను. ”

“చేతకాని ఇంజినీరా?” అంది పెద్దక్క నవ్వుతూ.

“అంతే కదా మీరొక మరబొమ్మని తయారు చేసేరనుకోండి. దానికి రెండో మూడో బొత్తాయిలు పెడతారు. ఒకటి నొక్కితే నవ్వుతుంది. మరొకటి నొక్కితే బావున్నారా అంటుంది, మరొకటి నొక్కితే ఏడుస్తుంది. మీరు ఆ ఏడుపు బొత్తాయి లేకుండా తయారు చేస్తే ఏడుపు ప్రశ్న లేదు కదా. దేవుడు మనిషిని సృష్టించినప్పుడు అలా కేవలం సుఖప్రదమైన ఆలోచనలూ, అలవాట్లూ గల మనిషిని సృష్టించి ఉండవచ్చు కదా. ”

ఇద్దరూ నవ్వేరు.  “వితండవాదం అంటే ఇదే,” అంది పెద్దక్క.

"నీతో వాదించలేను కానీ నాకు ఏం అనిపిస్తోందంటే మనిషిని దేవుడు తన ప్రతిరూపంగా సృష్టించేడు, అంటే చిన్నసైజు దేవుడన్నమాట. తనలాగే నిర్ణయాలు చేసుకోగల సత్తా జోడించేడు. ఆయనధర్మం దుష్టశిక్షణ, శిష్టరక్షణా కదా. దుష్టులుంటేనే కదా శిష్టులని రక్షించవలసిన అవసరం వస్తుంది. అందుకన్నమాట దురూహలనీ, దుర్లక్షణాలనీ కూడా మనిషిలో పెట్టడం జరిగింది. "

"పోనీ మరోలా ఆలోచిద్దాం. మొట్టమొదట మనిషిని ఒక్కణ్ణే సృష్టించలేదన్నది స్పష్టం. ఒక అబ్బాయినీ ఒక అమ్మాయినీ అంటే రెండు జీవుల్ని సృష్టించేడు. వాళ్లకి ఆకలి కూడా పెట్టేడు. దాంతో తినవలసిన అవుసరం కలిగింది. ఆదిని ఇద్దరూ ఆకులూ అలములూ తిన్నారు. తరవాత బహుశా ఏ చచ్చినజంతువునో తిన్నాడేమో వేటాడ్డం నేర్చుకున్నాడు. అంటే రుచులు మరిగేడన్నమాట. ఎవరు వేటాడాలి, ఎవరు వండాలి అన్నది ఎలా నిర్ణయించుకున్నారో తెలీదు కానీ అతను బయటికెళ్ళి వేటాడి సరుకు తెస్తే, ఇంట్లో ఆడమనిషి వంట చేసి పెడితే, ఇద్దరూ తింటూ సుఖంగా కాలం వెళ్ళబుచ్చుకున్నారు. అప్పట్లో ఇది నా పనీ, అది నీ పనీ అంటూ వంతులేసుకోడాలూ కాదంటే కాదని అరుచుకోడాలూ లేవు. ఎవరు ఎక్కువ ఎవరు తక్కువ లాటి చర్చలూ లేవు. క్రమంగా మరి కొందరు ఆడమనుషులూ మగమనుషులూ పుట్టుకొచ్చేరు. వాళ్లలో ఒకడికి ఒక గొప్ప ఆలోచన వచ్చింది. కలిసి ఉంటే కలదు సుఖం అని. అందుకని చుట్టూ ఉన్న పదిమందిని పోగేసి, మనం ఒక గణం, ఈ గణంలో అందరం సమానమే. అందరం సుఖంగా ఉండడానికి అనుగుణంగా కొన్ని నియమాలు పెట్టుకుందాం అని చెప్పి, ఆ నియమాలు కూడా తానే రాసేసి, అలా చేసేనని వాళ్ళకి చెప్పేడు. అలా గణనాయకుడు పుట్టేడు.

అదుగో, అప్పుడన్నమాట ఎక్కువ తక్కువలు కూడా వచ్చేసేయి. మరి గణనాయకుడిమాట మిగతా వారంతా వినాలి కదా. అలా గణనాయకుడు 'ఎక్కువ' అయేడు. గుంపులో అంటే బయట సమాజంలో గణనాయకుడు ఎక్కువ అన్నతరవాత, ఇంట్లో కూడా ఎవరు ఎక్కువ అన్న ప్రశ్న తలెత్తింది. బువ్వ తెచ్చేది నేను కనక నేనే ఎక్కువ అన్నాడతను. నువ్వు తెచ్చింది సరిపోయిందో లేదో చూసుకుని, సరిపోకపోతే సరిపెట్టి అవన్నీ నేను కదా చేస్తాను, అంచేత నేనే ఎక్కువ అంది అమ్మాయి. ఆతరవాత పెద్ద పనీ, చిన్నపనీ, చేత్తో చేసే పనీ, తలతో చేసే పనీ, . . . వీటి ఎక్కువ తక్కువలూ నిర్ణయమవుతూ వచ్చేయి. ఈలోపున వాళ్ళలో

ఒకడికి ఈ రూల్సు నచ్చలేదు. మరోనలుగుర్ని చేర్చుకుని మరోగణం పెట్టేడు. అలా కొన్ని గణాలు కలిసి ఒక సమాజం అయింది," లీల చెప్పడం ఆపి వింటున్నారా అన్నట్టు చూసింది పెద్దక్కవేపు. పెద్దక్క కళ్ళు చికిలించి లీలని పరీక్షగా చూస్తూ ఏ స్వామివారో అమ్మగారో ఓ బ్రహ్మరహస్యం బోధిస్తుంటే వింటున్నంత శ్రద్ధగా వింటోంది. "తరవాతేమయింది?" అంది సీరియసుగా.

"ఏముంది. మనుషులకి కష్టాలు మొదలయేయి. అప్పుడు, బుద్ధుడూ, జినుడూ, ... ఇలా ఒకొకరూ పుట్టుకొచ్చి ఒకొక మతం సృష్టించడం మొదలు పెట్టేరు. వాళ్ళతో కక్షలు మొదలయేయి. మేం ఎక్కువంటే మేం ఎక్కువ అంటూ వాదించుకోడం మొదలు పెట్టేరు. అప్పుడే మొదలు యుద్ధాలు. "

"సరే, యుద్ధాలు ఇప్పటికీ సాగుతూనే ఉన్నాయి. అంచేత అదే నీకథకి ముగింపు. అసలింతకీ ఈ కథంతా ఎందుకొచ్చింది?"

ఇంతలో సిరి వచ్చింది.

"రా, రా. మంచి సమయానికే వచ్చేవు. దేవుడు ఉన్నాడా, ఉంటే ఏం చేస్తున్నాడు అని చర్చిస్తున్నాం."

"ఇప్పుడది ఎందుకొచ్చిందీ?" అంది సిరి లీలపక్కన కూర్చుంటూ.

"భగవంతుడు ఉన్నాడా? ఉంటే ఎందుకు లోకంలో ఇన్ని దురన్యాయాలు జరుగుతున్నాయి? మరి దుష్టశిక్షణా, శిష్టరక్షణ చెయ్యడానికి భగవంతుడు ఇంకా అవతరించలేదేం? లేదా, అవతరిస్తే, మనకి ఎలా తెలుస్తుంది? ఇదీ సూక్ష్మంగా. "

ఆ ఉపోద్ఘాతానికి లీల సిగ్గు పడుతూ, "అది కాదండీ. ఈమధ్య ఒకట్రెండు పుస్తకాలు చదివేను. అవి చదివింతరవాత నాకు సందేహాలు ఎక్కువయేయే కానీ తగ్గలేదు. ఒకరకంగా నిస్పృహ కూడా కలుగుతోంది. అది మరి నాలో లోపమేనేమో తెలీదు. "

"ఏమిటా సందేహాలు?"

"మానవనైజం ఏమిటి? ఎలా ఏర్పడింది? అని. "

"ఆహా, చాలా పెద్ద సందేహాలే. "

"అది కాదండీ. సందేహాలు కాదేమోలెండి. నాకు రాను రాను గందరగోళం ఎక్కవయిపోతోంది. మానవజాతి చరిత్ర ఇప్పుడున్న ఆకృతిలోనే తీసుకోండి. అంటే రాగద్వేషాలూ, ఇష్టాయిష్టాలూ,

కోపతాపాలూ, కక్షలూ, కార్పణ్యాలూ, దురాశలూ, దురూహలూ – ఇవన్నీ ఎప్పుడు ఎలా పుట్టేయా అని ఆలోచిస్తున్నాను. ఈ మధ్య చదివిన పుస్తకాలు చూస్తే ఇవన్నీ క్రీస్తుపూర్వంనించీ అంటే దాదాపు ఏడు వేల సంవత్సరాలకి పూర్వమే ఉన్నట్టుంది కదా. ”

“అలా ఎందుకనుకుంటున్నావు?”

“వేదాలూ, మతాలూ – బౌద్ధమతం, జైనమతం – ఇవన్నీ పుట్టి ఏడువేల ఏళ్ళయిందంటున్నారు కదా. అది కూడా మనకి తెలిసినంతవరకే. నిజానికి అంతకు పూర్వమే ఉండి ఉండాలి. వాటిలో ఏం చెప్తున్నారు? మనోనిగ్రహం, ధర్మచింతన, మోక్షసాధన ప్రధానంగా చెప్తున్నారు. ఆ తరవాత సంఘం. సాటిమనిషికి సేవ కానీ సాయం కానీ చెయ్యడం మానవధర్మం అని. ”

“అందులో తప్పేముంది?”

“తప్పనడం లేదు. అవి ఎప్పుడు చెప్పవలసివస్తుంది అంటే అవి లేనప్పుడే కదా. మీకు మనోనిగ్రహం ఉంటే, నేను పని గట్టుకుని మీరు మనసుని నిగ్రహించుకోవాలి అని చెప్పనవసరం లేదు కదా. అంచేత ఈ విరుద్ధబావాలు కానీ విపరీతస్వభావాలు కానీ అంతకు పూర్వమే ఉండాలి. ”

“ఉండొచ్చు. అందుకే వాటిని అదుపులో పెట్టుకోమని శాస్త్రాలూ, పురాణాలూ ఘోషిస్తున్నాయి. ”

“హా. బాగా చెప్పేరు. ఘోషిస్తున్నాయి. నిజానికి నా ఘోష కూడా అదే. ”

“అంటే?”

“అంటే ఇన్నివేల సంవత్సరాలుగా బుద్ధి తెచ్చుకోండి బాబో అని శాస్త్రాలూ, పురాణాలూ ఘోషిస్తున్నా, మనుషులు అట్టే మారినట్టు కనిపించడంలేదు. మార్పు వచ్చింది కానీ అత్యంత ప్రధానమైన విషయంలో కనిపించడం లేదు. స్వార్థం, స్వోత్కర్ష ఎక్కువయినట్టే కనిపిస్తున్నాయి కానీ తగ్గుతున్న జాడల్లేవు. కోరికలు దుఃఖహేతువు. అంచేత కోరికలు చంపుకోవాలి. కర్మ ఆచరించాలి, అది నిస్సంగత్వంతో ఆచరించాలి ఇలా దాదాపు అన్ని మతాలు చెప్తున్నాయి. హింస చేయరాదు అంటారు జైనులు. బౌద్ధులు తాము ప్రాణహింస చేయరు కానీ మరొకరు జంతువులని చంపి తెచ్చిన మాంసం తినడానికి వారికి అభ్యంతరం లేదు. శైవులు వర్ణాశ్రమాలు అంగీకరించరు. వేదాలు అపౌరుషేయాలు అంటున్నారనుకోండి. కానీ ఎవరో ఒకరు వాటిని

ప్రచారంలోకి తెచ్చేరు కదా. ఆ మీదట మిగతా మతాలకి నాయకులున్నారు. బుద్ధుడూ, మహావీరుడూ, మహమ్మదూ, క్రైస్ట్ . . . ఇలా. వాళ్లు కూడా నిజానికి మానవజన్మ ఎత్తేరు కనక మానవులే. ఎటొచ్చీ నాయకత్వం వహించగల 'కొంచెం ఎక్కువ' మానవులు. వాళ్లు ఆచార్యపీఠం అధిష్టించి బోధలు చేస్తే మిగతావారు అంగీకరిస్తున్నారు. ఎందుకంగీకరించాలో నాకు అర్థం కాదు. ఎంచేతంటే మనిషి అనగానే మానవులందరికీ ఉండే వికారాలు కొన్నయినా కొంతవరకైనా వారికి కూడా ఉంటాయనే నానమ్మకం. వాళ్ళెవరూ దేవుళ్లు కారు. వాళ్ళని దేవుళ్లగా పూజించడం న్యాయం కాదు. ఇలాటి ఆలోచనలు ఒక బాధ. రెండోది, ఈ ధర్మాలన్నిటిలోనూ ఏం చెప్పేరు? వేదాలనాటికే సమాజం అంటూ ఏర్పడింది. ప్రతివారికీ ఓ ధర్మం, కర్తవ్యం – నువ్విలా చెయ్యాలి, ఇలా చెయ్యకూడదు అంటూ ఉన్నాయి. దానికి ప్రతిగా, అలా చెయ్యకపోతే ఏమవుతుంది? అది నేరం అవుతుంది. దానికి శిక్ష అనుభవించాలి. అది నేరం అని ధర్మనిర్ణయం చేసేవాడు, శిక్ష విధించేవాడు, దాన్ని అమలు పరిచేవాడు – ఇలా తరగతులు ఏర్పడ్డాయి. హెచ్చుతగ్గులకది ఆస్కారమే కదా. అలా ఒకరిమీద మరొకరు అధికారం చెలాయించడం, ఒకరిని మరొకరు హింసించడం కూడా సామాజిక ధర్మం అయిపోయింది. అసలు హింస అన్న పదం ఉంది చూడండి. దానికి వ్యతిరేకం అహింస, హింస కానిది. అంతే గానీ అహింసకి వేరే పదం లేదు. సాహిత్య ఎకాడమీవారి నిఘంటువులో హింస చేయమి అని ఉంది. అంటే హింస అన్నదే మూలధాతువు, అదే సహజం అనిపించడం లేదూ?"

పెద్దక్క, శ్రీదేవి నవ్వేరు, " నువ్వు చాలా గందరగోళంగా మాటాడుతున్నావు, " అంది శ్రీదేవి.

లీల కూడా నవ్వేసి, "ఏం చెయ్యను మరి, నాకు ఆలోచనలు గందరగోళంగానే వస్తున్నాయి. నాది తలతిక్కవాదనే అనుకుందాం. ఇంతకీ ఈ మతాలన్నిటిలోనూ సామ్యాలు ఉన్నాయి. కొన్ని ప్రతివాదనలున్నాయి. మొత్తంమీద చూస్తే మాత్రం అందరు కోరేది – శాంతియుత సహజీవనం. అసలు హిందూమతం అంటూ ఒక్కటి లేదు, అది అనేక మతాల సమాహారం అంటారు వీరభద్రరావుగారు. "

"ఆయనెవరు?"

"ముదివేడు వీరభద్రరావుగారని. ఆయన రాసిన పుస్తకం భారతీయ సంప్రదాయ భూమిక. భిన్నత్వంలో ఏకత్వం అని. లీల ఆమధ్య చదివిందిలే. "

"మీరెందుకు నవ్వుతున్నారో నాకు తెలీదు కానీ నిజంగానే ఆపుస్తకం నాకు చాలా నచ్చింది. ఆయన వేదాలదగ్గర మొదలు పెట్టి, ప్రతిమతంలోనూ మూలసూత్రాలూ, వాటి అంతర్భావాలూ,

వాటికీ ఇతరమతాల్లో భావాలకీ సమన్వయం చక్కగా వివరించేరు. భారతీయ సంప్రదాయాలన్నీ, ఇతర దేశాల్లో మతాలు – జొరాస్ట్రియన్, జూయిష్, క్రిష్టియానిటీ ... కూడా స్థాలీపులాకన్యాయంగా ప్రస్తావించారు. పీఠం అన్నపదమే వాటికన్ అయిఉండగలదు అంటారు. ఇంతకీ అసలు విషయం, నేనంటున్నది లేదా నాకు కలుగుతున్న ధర్మచింతన – ఇలా కొన్ని వేల సంవత్సరాలుగా అనేకమంది ఆచార్యులో మతప్రవక్తలో ధర్మనిర్ణయాలు చేసి, మానవులంతా ఆచరించాలని చెప్తున్నారు. ప్రతి ఆచార్యుడికీ, ప్రతి ప్రవక్తకీ లక్షలసంఖ్యలో అనుయాయులు తయారవుతున్నారు తామరతంపరగా. కానీ ధర్మం ప్రతిష్ఠాపనమయిందా? అన్యాయాలూ, అక్రమాలూ, దురంతాలూ ఆగిపోయేయా? కనీసం తగ్గేయా? గణాంకాలు సరి చూసేవారు ఏదో ఒక ఊళ్ళో ఏదో ఓ నెల లేదా ఓ వారం – ఇంత శాతంలో హత్యలు తగ్గేయి, దొంగతనాలు తగ్గేయి అని చూపవచ్చు కానీ, నిజంగా గట్టిగా తరిచి చూస్తే మానవాళిలో, అంతరాంతరాల ఏమార్పూ రాలేదనే అనిపిస్తోంది నాకు. చాలామంది నిత్యా వల్లించే ధర్మపన్నాలన్నీ పై పై మైపూతలే కానీ మానసికప్రవర్తన మాత్రం ఎక్కడ వేసిన గొంగళీ అక్కడే అన్నట్టుంది. అందులో మార్పు లేదు. ఇంకా చెప్పాలంటే హీనం అయిందేమో కూడా. పూర్వం మతంపేరున ఎన్ని దురాగతాలు జరిగేయో ఇప్పుడు చట్టంపేరునా, వ్యక్తిగతవిజయంపేరునా అంతకి పదిరెట్లు అన్యాయాలూ, అక్రమాలూ, దౌ ర్జన్యాలూ, హింసలూ సాగుతున్నాయి.″

″నీవాదనలో కొంచెం నిజం ఉన్నట్టే ఉంది."

″ఆఖరికి ఆ హింసలో కూడా పురోభివృద్ధే సాధించేం అంటారు నాగరీకులు. పూర్వం విల్లంబులతో కత్తులూ కఠారులతో యుద్ధం చేస్తే, ఇప్పుడు అణుబాంబులు, కెమికల్ అస్త్రాలు."

రెండునిముషాలపాటు ఎవరూ మాట్లాడలేదు. ఇలాటి ప్రశ్నలకి సమాధానాలు అంత తేలిగ్గా దొరకవు.

ఆఖరికి పెద్దక్క అంది, "పైకి కనిపించకపోవచ్చు కానీ ఇలా ఆలోచించేవారు కూడా ఉన్నారు. బహుశా తెరవెనుక నిశ్శబ్దంగా వారు పని చేస్తూండవచ్చు."

" ప్రధానంగా మనసంస్కృతిలో ద్వంద్వాలు అంగీకరించడం ఉంది. సుఖదుఃఖాలు, కష్టసుఖాలు, మంచీ చెడూ, కోపతాపాలూ చీకటివెలుగులాగే అని అంగీకరిస్తాం. అంచేత దేవుడు ఉన్నాడో లేడో అన్నది కూడా ఆ సందిగ్ధంలో భాగమే అనుకుంటాను," అంది సిరి.

"సరే వస్తాను. అధీరాలీకి ఇవాళ కొన్ని స్కెచెస్ పంపిస్తానని చెప్పేను," అంది లీల లేస్తూ.

"కనిపిస్తూండండి. మీఆలోచనలు ఇంకా వినాలనుంది," అన్నాను తనతో.

అలాగేనండి అంటూ వీధిగుమ్మంవేపు నడిచింది.

000

శుభమస్తు, సర్వేజనాస్సుఖినోభవంతు.

---

ముక్తాయింపుగా నామాట –

ఈనవలలో ప్రధానాంశం మార్పు. మన పరిసరాల్లో, ఆలోచనల్లో, మనలో, ఆశల్లో, ఆశయాల్లో సమాజంలో మార్పు ఎలా వస్తుంది, ఎందుకు వస్తుంది అన్న ప్రశ్నకి సమాధానం వెతుక్కుంటూ మొదలు పెట్టేను ఈనవల.

మార్పు అనంతంగా కొనసాగుతూనే ఉంటుంది. ఇక్కడ ప్రస్తావించిన రంగాలే కాక సినిమా, రాజకీయాలు, సంగీతకచేరీలవంటి రంగాలలో కూడా మార్పులు కనిపిస్తూనే ఉన్నాయి. అవన్నీ ప్రస్తావించగల శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం నాకు లేదు.

ఈనవలలో సుమారుగా 1930–90ల మధ్యకాలంలో నేను గమనించిన మార్పులు చిత్రించడానికి ప్రయత్నించేను. నాభావాలు వాచ్యం చేయడానికి ముగ్గురు స్త్రీలని – పెద్దక్క, లీల, అరవింద, ముగ్గురు పురుషులని – ప్రభాకరరావు, సుందరం, విషి – పాత్రలు సృష్టించేను. ఆలోచనలే ప్రధానంగా తీసుకున్నాను కానీ పాత్రలజీవితాలు కాదు కనక అట్టే పొడిగించకుండా ముగిస్తున్నాను. నేను తీసుకున్న కాలపరిమితిలో మరికొన్ని సంఘటనలు చేర్చినా మూలతత్వంలో మార్పు కనిపించదన్న అభిప్రాయంతో ముగిస్తున్నాను.

శిల్పందృష్ట్యా లోపలున్నాయి. 2010లో కేవలం ఊసుపోకగా ప్రారంభించి, 2014లో నవలగా మలిచి ప్రచురించేను. మళ్లీ 2021లో తిరిగి చూసుకుంటే చాలా అవకతవకలు కనిపించేయి. మళ్లీ సరిదిద్దే ప్రయత్నంలో 358 పేజీలని 222కి తగ్గించి, పటిష్టం చేయడానికి యథాశక్తి ప్రయత్నించేను.

ఎన్నిమార్లు సరి చూసుకున్నా మళ్లీ ఎక్కడోఅక్కడ పొరపాట్లు కనిపిస్తున్నాయి. ముఖ్యంగా ఏకాలం అన్నవిషయంలో. వీలయినంతవరకూ సరి చేసేను. ఇంకా పొరపాట్లు ఉంటే మన్నించగలరు.

ఈ నవలలో నేను ప్రస్తావించిన పుస్తకాలకి లింకులు చాలా మటుకు నాబ్లాగు తెలుగు తూలికలో ఉన్నాయి.

ముఖపుస్తకంలో ధారావాహికగా ప్రచురించినప్పుడు, చదివి స్పందించిన మిత్రులకు ధన్యవాదాలు.

శుభమస్తు,  సర్వేజనాస్సుఖినోభవంతు.

-- నిడదవోలు మాలతి

జనవరి 1, 2022

---

[i] Telugu Women Writers, 1950-1975, An Analytical Study లో ఈ విషయం విపులంగా ఉంది.